ఓం

శ్రీ సద్గురుభ్యో నమః

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు - శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు - శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు - ధర్మవరం ఆంధ్రప్రదేశ్ - భావార్థ బోధ కర్తలు

శ్రీ మద్ బృహద్వాశిష్ట అచల సిద్ధాంత సాంప్రదాయ గ్రంథము

# " శ్రీ భద్రాద్రిరామ శతక బోధామృతం"



శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు,
భావార్థ బోధ కర్త

# ఓం

శ్రీ సద్గురుభ్యో నమః

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు - శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు - శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు - ధర్మవరం ఆంధ్రప్రదేశ్ - భావార్థ బోధ కర్తలు

శ్రీ మద్ బృహద్వాశిష్ఠ అచల సిద్ధాంత సాంప్రదాయ గ్రంథము

## " శ్రీ భద్రాద్రిరామ శతక బోధామృతం"



శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు,
భావార్థ బోధ కర్త

# ఓం

## "శ్రీ సద్గురుభ్యో నమః"

గురువే సర్వలోకానాం । బిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం । శ్రీ దక్షిణామూర్తియే నమః ॥

శ్రీ బ్రహ్మవిద్యా సిద్ధాంతం । అచల తత్వోపదేశిక ।
శ్రీ నాగయ్యార్య యోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

ద్వయాత్మరహిత సిద్ధాంతం । పరమ పురుష ప్రబోధక ।
శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య । సద్గురుభ్యో నమో నమః ॥

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు - శ్రీమద్ అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు - శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు - ధర్మవరం ఆంధ్రప్రదేశ్ - భావార్థ బోధ కర్తలు

శ్రీ మద్ బృహద్వాశిష్ట అచల సిద్ధాంత సాంప్రదాయ గ్రంథము

# " శ్రీ భద్రాద్రిరామ శతక బోధామృతం"


**సంగ్రహకారులు మరియు ప్రకాశకులు:**

ఎన్.వి. వీరభద్రయ్య,
ఎక్స్ మండల్ పంచాయిత్ మెంబర్ - నారాయణకెరె,
కల్కుంటె పోస్ట్ - వైట్ఫీల్డ్, హోసకోటె తాల్లూక్,
బెంగళూరు - **560 067**

# క ర్నా ట క.

ఓం

"శ్రీ గురుభ్యో నమః"

భావార్థ బోధ కర్త : సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు,
శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు.

కాపీ రిజిష్టర్డ్.

ప్రథమ ముద్రణ : **1000** కాపీలు.

శ్రీ సర్వజిత్ సంవత్సరం – శు. దశమి, ధనిష్ఠ నక్షత్ర
**21-10-2007.**

వెల : రూ. **270/-**

<u>సంగ్రహకారులు మరియు ప్రకాశకులు:</u>
ఎన్.వి. వీరభద్రయ్య, ఎక్స్. మండల్ పంచాయిత్ మెంబర్,
నారాయణకెరె, కల్కుంటె పోస్ట్, హొసకోటె తాల్లూక్, వైట్ ఫీల్డ్,
బెంగళూరు – **560 067** - క ర్నా ట క.
ఫోన్. నం. **27902367 &** సెల్ నం. **9902958697**

<u>టైప్ సెట్టింగ్/గ్రాఫిక్స్</u> :
ఎన్.వి. వీరభద్రయ్య, ఎన్.వి. నవీన్ కుమార్, ఎన్. భువనేశ్వర్,
నారాయణకెరె, కల్కుంటె పోస్ట్, హొసకోటె తాల్లూక్, వైట్ ఫీల్డ్,
బెంగళూరు – **560 067** - క ర్నా ట క.

ముద్రణ :
కె. ఆర్. చంద్రశేఖర్
**అరవింద్ గ్రాఫిక్స్,**
కోడిహళ్ళిగేట్, లక్కూరు పోస్ట్
మాలూరు తాల్లూకు, కోలారు జిల్లా
ఫోన్ 08151-239400, సెల్ - 9972027069,
9449528769, 9448320420, 9448687125

ఓం

"శ్రీ గురుభ్యో నమః"

## NOTICE [ గమనిక ]

ఇందువలన సకలజనులకు – గురుభక్తమండలికి తెలియజేయునదేమనగా, ఈ గ్రంథము నిజవ్రాత ప్రతి మావద్ద వున్నది. ఈ గ్రంథమును కర్నాటక గవర్నమెంట్ వారి శాసనానుసారము లోగడ రిజిష్టర్ చేయబడి వున్నది. కనుక ఇట్టి గ్రంథము ఎవ్వరు స్వార్థం కొరకు అచ్చు వేయరాదు. మా అనుమతిలేకుండా అచ్చు ఆఫీసువారును అచ్చువేయుకూడదు. అట్లు చట్టమును ఉల్లంఘించినవారిపై చట్టప్రకారముగా తగిన చర్యలు తీసికొనబడను.

ఈ గ్రంథమును అచల సిద్ధాంత సాంప్రదాయకులైన గురుభక్తులకు – గురూపదేశము గలవారికే ఇవ్వవలెను ఇతరులకివ్వరాదు. గురుపుత్రులు ప్రార్థించితే తాత్పర్యము దెలియుటకు బోధించవలెను. అచల సిద్ధాంతపరులు ఎవరైనకాని, ఈ గ్రంథమును తీసుకొని చదివి – తెలియనివారికి, చదువురానివారికి అసూయపడక బోధించవలెను. ఈ గ్రంథ వాక్యములు అహంకారము లేనివారలకు అమూల్యమైన రత్నమణి మాణిక్యములు – యితరులకు నల్లబొగ్గులు, చిల్లపెంకులు. ఎవరైన గురూపదేశమై, ఈ వాక్యములు వినుచు మనస్సునకందక చపలచిత్తమొందువారిని లెస్సగా వినుమని బోధచేయవలెగాని; చదువు వచ్చేవారికి వ్రాసి ఈయ్యవలనేగాని, అసూయ పడరాదు. "ఎందరో మహానుభావులు అందరికీ వందనములు" "ఏ పుట్టలో ఏ పాము వున్నదో ఎవరికి తెలుసును" వయస్సులో చిన్న వారుకాని, పెద్దవారు కాని, విద్యావంతులు కాని, అవిద్యావంతులుకాని – శ్రద్ధాభక్తి, వినయ విధేయత, ఆచరణ, ఇహమూత్రార్థ ఫలభోగవిరాగము; నిత్యానిత్య వస్తువివేకము కలిగినటువంటివారే దీనిలోవుండే మర్మము తెలిసినవారు – నేను అంతా

తెలిసినవాడను, నేను ఎన్నోసంవత్సరములు గురుసేవ జేసినాను; అభ్యసించినాను - వీరు నిన్న కాదు మొన్న వచ్చినవాళ్ళు; నేనే గొప్ప వారు తక్కువ అని క్రింద స్థాయిలో అంజనముపేయక; భేదభావాలు లేక; సమన్వయ భావము కలిగివుండిన - అచల సిద్ధాంతపరులందరూ చక్కగా; క్రమబద్ధముగా అభ్యసించి; ఆచరణగావించుకొని; స్వానుభవమును పొంది; గురుకృపాకటాక్షమునకు పాత్రులయ్యి - అశరీరులయ్యే అచల సిద్ధాంతము ఇది - ఈ సిద్ధాంతమున పునాదిని ఎవరూ, ఎప్పుడూ, ఏ వేళలోను మరువరాదు మరియు అవహేళనానికి గురిచేయరాదు. అసూయపడువారే అహంకారులు - వారికి అహము వదలనే లేదు అని తీర్మానము.

ఇట్లు,

గ్రంథ భావార్థ బోధ కర్తలు
సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు,
శ్రీమద్ అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య -
అఖిల భారత అధ్యక్షులు
శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు.

సంగ్రహకారులు మరియు ప్రకాశకులు.
ఎస్.వి. వీరభద్రయ్య, ఎక్స్. మండల్ పంచాయిత్ మెంబర్.

ఓం

"శ్రీ సద్గురుభ్యో నమః"

## విషయ సూచిక

*************

ఓం

"శ్రీ సద్గురువే నమః"

"శ్రీ నిర్మలానంద నాగయ్యార్య సద్గురువే నమః"

## గ్రంథ పరిచయము

శ్రీ దక్షిణామూర్తి మొదలు - శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపరా ఆచార్యులగు - శ్రీమత్ కంబలూరి అప్పబ్రహ్మగారి ప్రియ శిష్యులగు, శ్రీమత్ పరుశురామ నరసింహదాసు స్వాములవారిచె రచియింపుబడిన భద్రాద్రి రామ శతకము వ్రాయబడి - దాదాపు **200** వందల సంవత్సరములు అయినది. అప్పటినుండి అనేక మంది పెద్దలు – ఈ సాంప్రదాయ భక్తజనులకు సవివరముగా, వారి అనుభవాలు జోడించి చెప్పుతూ వచ్చినారు. దాదాపు **100** సంవత్సరాలు క్రితమ్, శ్రీ సచ్చిదానంద శ్రీ వెంకటేశ అవధూత స్వాములవారు భావార్థములు వ్రాసివుండిరి. ఇంక మధ్య కాలములో - నేత్ర సాంఖ్యము; పిండాండ బ్రహ్మాండ విచారణము; సాధన చతుష్టయము; మహావాక్యముల నిరశన - ఇటువంటి భావాలన్ని కూడ కల్పించి వ్రాసినారు. ఇట్లు అనేక మంది వారి వారి అనుభవాలను గ్రంథములో చేర్చుతూ వ్రాసినారు.

తేది **25-1-2005** సంవత్సరములో - ముంబయి వర్లిడిడిశాల్, మార్కండేయ్య దేవాలయమునందు **7** రోజులు – ఈ భద్రాద్రి రామ శతకము మీదనే ఉపన్యాసాలు జరిగినవి. **2006** సంవత్సరము – క్రిష్ణా జిల్లా, కైకలూరు మండలము, చటాకాయలంక, శ్రీ అచలానంద కపిల మహాముని ఆశ్రమమునందు చివరి భాగమైనటువంటి పద్యాలు

మీద ఉపనిసంచడము జరిగినది. ఈ విషయములన్ని గమనించినటువంటి ధర్మవరం భక్తులు కూడ, ఈ భద్రాద్రి రామ శతకము ఆసాంతము మాకు తెలుపవలెనని కోరగా – మొదట సృష్టికి పూర్వము – నిర్గుణ పరబ్రహ్మము ఎలావున్నది? అట్టి నిర్గుణ బ్రహ్మమునుండి ప్రపంచోత్పత్తి ఎలా జరిగినది? నరప్రమాణము; **96** తత్వములు; బ్రహ్మాండ సృష్టి; పిండాండ సృష్టి; బ్రహ్మాండమందు ఈశ్వరుని అవస్థలు; పిండాండమందు జీవుని అవస్థలు; గుణత్రయాలు; ఈషణత్రయాలు; మలత్రయాలు; వాసన త్రయాలు; బంధత్రయాలు; అవస్థత్రయాలు; మొదలుగునటువంటి అవస్థలను చెంది – తన పూర్వ స్వరూపమైన నిర్గుణ బ్రహ్మ తత్వమును పొందుటకుగాను – పంచకోశ వివేచన; షట్చక్ర వివరణ; మాయా ఆరోపిత లక్షణాలు తెలుసుకొని – సాధన చతుష్టయ సంపత్తికలిగి; గురువు దగ్గర; పెద్దల దగ్గర – బ్రహ్మవిచారణ చేస్తూ – ఆత్మజ్యోతి స్థానమును గుర్తెరిగి – బ్రహ్మమందు ఆరోపితమైన మాయను విడిచే పద్ధతి క్రమముగా ఎరిగి – మహావాక్యముల విచారణ చేత అఖండచైతన్య పరమాత్మను నేను అని గుర్తెరిగె – ఈ చైతన్య బ్రహ్మమునకే – జనన–మరణ ఘోర సంసారము కలదని గ్రహించి – అచలగురు కరుణవల్ల పరిపూర్ణ బోధను గ్రహించి, చైతన్య బ్రహ్మమును సమూలముగా విడుచేటువంటి పద్ధతిని ఎరిగి – జనన–మరణ భ్రాంతి రహితుడై, నిస్సందేహ పరుడయ్యి – శేషజీవితమును నిస్సంకోచముగా గడుపుటకు – నిత్య తృప్తుడై, శాంతి నెమ్మదియును పొంది – నిత్య సంతోషపరుడై – పరమానందభరితముగా, సర్వమానవులు వర్ధిల్లాలని – ఈ గ్రంథకర్త అభిప్రాయము. ఈయన అభిప్రాయమును అనుసరించి – ఈ బోధను క్రమపద్ధతిగా చెప్పడము జరిగినది.

ఈ బోధను కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, హెూసకోటె తాల్లూక; వైట్ ఫీల్డ్, నారాయణకెరె గ్రామ వాస్తవ్యులైన శ్రీమతి వెంకటమ్మ శ్రీ వెంకటప్పగారి మధ్యమ కుమారుడైన, మా ప్రియ శిష్యులగు – ఎన్.వి. వీరభద్రయ్యగారు, నేను క్యాసెట్లు ద్వార చెప్పబడిన భద్రాద్రి రామ శతకమును వినుకుంటూ – ఈ గ్రంథమును తన మాతృ భాషైన కన్నడానికి అనువదించి మరి కన్నడ – తెలుగు భాషలులో గ్రంథములుగా – కంప్యూటరులో – తన కొడకు మరి తోడు కొడకు సహాయముతో స్వయంబుగా – ఈ గ్రంథములను కృషిజేసి భక్తకోటికి అందించినారు. ఈయన కృషి ఫలితమే భక్తులకు కరకమలములందు - ఈ గ్రంథ పుష్పము వెలసినది.

పాఠక మహాశయులగు; గురువులు; గురుభక్తులు – ఇందలి యథార్థమును గ్రహించి, గురు కృపాకటాక్షమునకు పాత్రులవుదురని అని విశ్వస్తున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు – శ్రీ నిర్మలానంద గురుపద సేవకుడు,
శ్రీమతి లక్ష్మీసమేత శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య
రాజయోగి – రాజయోగాశ్రమ సేవా సమాఖ్య,
సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి – అఖిల భారత అధ్యక్షులు

ధర్మవరం; జిల్లా : అనంతపురం,
ఆ ం ధ్ర ప్ర దే శ్.

తేది॥ **01-04-2007.**
ధర్మవరం.

ఓం

"శ్రీ సద్గురువే నమః"

# పరిపూర్ణ బోధస్తోత్రం

శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యే । నహికరచరణం । న నామగోత్రం । నసూత్రం
నోజాతిర్నైవవర్ణో నభవతి పురుషో । నా నపుంసో నచస్త్రీ।
నాకారంనైవికారం నహిజననమరణం । నాస్తిపుణ్యాం నపాపం ।
నోతత్వం తత్వమేకం సహజసమరసం । సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ ఆత్మానాత్మ వినాశోహేతు మనిశం । సర్వాతిరిక్తం శుభం ।
పూర్ణాత్పూర్ణమ నామయం సుఖతరం । సర్వాపదధ్వంసకం ।
సర్వజ్ఞానవినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం ।
సర్వభ్రాంతివివర్జితం గుణహరం । సంపూర్ణబోధం నమః ॥

శ్లో॥ నజ్ఞాతం పరవస్తునిత్య మచలం । సత్యంస్థితం శాశ్వితం ।
నిత్యానిత్యవివేక భేదరహితం । నిర్నామనిర్లేపకం ।
సర్వప్రత్యయహినకంచ సతతం । సర్వత్రసంస్థంపరం ।
వందేహం పరిపూర్ణబోధమనిశం । సందేహనాశం ప్రభుం ॥

శ్లో॥ నాహం మనుష్యో నచ దేవయక్షో । న బ్రాహ్మణ క్షత్రియ న వైశ్య శూద్రః ।
న బ్రహ్మచారి న గృహిన వనస్థో । బిక్షుర్న చాహం నిజబోధ రూపం ॥

ఓం

"శ్రీ సద్గురువే నమః"

## శ్రీ శివరామదీక్షిత చూర్ణిక

1. శ్రీమద్గురు కరుణాకటాక్ష వీక్షణ । విచక్షణ సంపూర్ణ ఋగ్యజుస్సామధర్వణ । తర్కవ్యాకరణ । మీమాంస భాట్టప్రభాకర । వేద వేదాంత శాస్త్రాగమ । అష్టా దశపురాణేతిహాస పరిశీలనం । శిష్యజన పరిపాలనం ॥

2. నిత్యానిత్య వస్తువివేక । ఇహాముత్రార్థఫలభోగవిరాగ । శమదమ శాంతితితీక్షా శ్రద్ధోపరతి । ముముక్షత్వ । స్వస్తికారోహణస్పర్శ । త్రివిధ దీక్షా పరం భక్తజన వశీకరం ॥

3. యమనియమమానస ప్రాణాయామ । ప్రత్యాహార ధ్యానధారణ సమాధ్యష్టాంగ యోగ । మంత్రలయ హఠరాజ యోగ । నిష్టాగరిష్టాత్మ ధ్యాన రాధాయంత్ర షణ్ముఖీ శాంభవీ ఖేచరి ముద్రాభ్యాస । ఆధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశుద్ధాజ్ఞేయ సహస్రార చక్రపరిశోధకం ఆత్మబోధకం ॥

4. ఆకాశవాయు రగ్నిజలపృథ్వి । శబ్దస్పర్శ రూపరసగంధ । శోత్ర త్వక్చక్షు జిహ్వా ఘ్రాణ । వాక్పాణిపాదపాయూపస్థ । వచన దానగమన విసర్జనానంద । మనోబుద్ధి చిత్తాహంకార । ప్రాణాపాన వ్యానోదాన సమానాన్నమయ ప్రాణామయ మనోమయ విజ్ఞానమయా నందమయ పంచకోశ విశేష విమర్శ సచ్చిదానందం । వందితముని బృందం ॥

5. స్థూలసూక్ష్మ కారణ మహాకారణ విశ్వతైజసప్రాజ్ఞ ప్రత్యగాత్మ సత్వరజస్తమశ్శుద్ధ సాత్వీక । జాగ్రత్స్వప్నసుషుప్తి తూర్యావస్థల – కారోకామకార ఓంకారమాతృకా చతుష్టయవిచారణీయం । తను చతుష్ట యాతిశయం ॥

6. ఈశ్వరతనుచతుష్టయ । విరాట్ హిరణ్యాగర్భ అవ్యాకృత ఈశ్వర । సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశాన పంచబ్రహ్మ । శరీరనివృత్తి ప్రతిష్టావిద్యా శాంతి శాంత్యాతీత పంచవిషయ । క్రియాశక్తి జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి ఆధిశక్తి పరాశక్తి పంచకళా । బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వరసదాశివ పంచకర్త్రోత్పత్తి । స్థితిప్రళయ

సర్వసాక్షి । సూర్యచంద్రాగ్ని బ్రహ్మానందాతిశయస్థాన । సర్వకర్తృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వ సర్వనియంతృత్వ సర్వభోక్తృత్వ । సర్వేశ్వరత్వాది షడ్గుణైశ్వర్య భోగానుభవం మహానుభావం ।

7. ఇడాపింగళ సుషుమ్నాంతర్గత । బంధత్రయ । రేచకపూరక కుంభక । మూలాంధర జాలాంధర వుడ్యాణబంధ విమోచన । శ్రవణమనననిధి ధ్యానవర్ణాశ్రమకులగోత్ర నామరూప షడ్భ్రమ । క్షుత్పిపాస జరామరణ సుఖదుఃఖ షడూర్మిరహితం ।ముక్తి కాంతసహితం ॥

8. తత్వమస్యాది మహావాక్యార్థ లక్ష్యార్థ ఆత్మైక్యానుసం । ధానవాదబిందుకళాతీత అద్వయావాచ్య అచింత్య అవ్యయ నిత్యశుద్ధబుద్ధ ప్రజ్ఞానఘన। నిర్వికల్ప నిర్వచన నిర్వికార నిరాకార నిశ్శబ్ధ నిరతిశయ నిరుపమాన నిర్మల నిర్గుణ నిరవయవ । నీరంధ్ర నిర్విశేష నిరుపద్రవ నిషిద్ధ నిష్కర్మ నిష్కళంక । నిష్ప్రపంచ నిరంజన నిరాభాస సర్వవికార శూన్య సహజామనస్క । రాజయోగ సమాధ్యాధ్యక్షం । శ్రీ శివరామదీక్షం ॥

9. తచ్చరణ సరసీరుహ యుగళసంజనిత । మకరంద బిందుసందోహాస్వాద మత్త భృంగాయమాన । శ్రీమత్కంబాలూరి అప్పబ్రహ్మ ప్రియశిష్యరత్న పరశురామాస్య యాంబోధి । శరద్రాకాపూర్ణ సుధాకర శ్రీమత్కౌండిన్య మౌనిగోత్రోద్భవ కోటేశ్వర నామధేయ । తత్పత్ని సుబ్బమాంబాగర్భ సంజాత । వెంకటనారసింహ దాసోహం సంతతం భజామి ॥

"ఇతి శ్రీ మత్పరశురామ నరసింహదాసకృత శ్రీ శివరామదీక్షిత చూర్ణిక సంపూర్ణం"

ఓం

"శ్రీ సద్గురుపే నమః"

# జ్ఞానాష్టకం

## ॥ యిదినిర్వేదనాష్టకం ॥

క ॥ అర్థంబనర్థమూలం । బర్థము మాయాసహాయ మంతటికన్నా ।
దుర్ధరముగామ శత్రువు వ్యర్థంబని విడువుశాయనుమూన్నాళ్లది
యెరుగ రాదు । క్షేత్రమిత్రదారగృహధనాదులనెంత । విపులవైభ
వంబువే గగలుగా ॥

క ॥ యెందెందు తృష్ణగలిగిన । నందందజెనింపుచుండు నదిసంసారం
బందుకు దృఢ వైరాగ్యము । లాంది మదిన్ తృష్ణమానిపూనుము
సుఖమున్ ॥

క ॥ మొదలను తృష్ణయుబంధము । నదియణగుట సుమ్ముమోక్షమని
చెప్పబడున్ । మదినాసక్తిదొలంగిన । యదియెసంతుష్టిదలప యాత్మ
జ్ఞానకున్ ॥

గీ ॥ చూడసత్తువీవుశుద్ధ చేతనుడువు । జగమసత్తుమిగుల జడము
దలప । నీకవిద్యలేదు నీకు భుభుక్షయు । లేదు నిర్మలుండవీవగుటనూ ॥

క ॥ రాజ్యము సతులును సుతులును । ప్రాజ్యంబగు సుఖము మేనుబాయ
కనవిదా । పూజ్యములని యెడిసంగికి । భాజ్యములై దుఃఖమొసగు
ప్రతిజన్మమునన్ ॥

గీ ॥ చాలునథనంబుగామంబుచాలు బొమ్ముౕ । సుకృతకర్మంబులిక చాలు
చొప్పు దెలశె । వీటివలననె సంసార విషయతాపమే నశించియుండక విశ్రాంతి
యగునె మదికీ ॥

క ॥ భావాభావము లెడలిస్వ । భావంబున పెల్గునంచు పరమార్ధనం మటం ।
చేపెరపునేవికారము । సేపెంటనబెరయకాతడిల సుఖియించున్ ॥

గీ ॥ ఈశ్వరుడే సర్వ నిర్మాతయన్ని చూడ । నతనికంటె మరేమిలేదది
నిజంబు । అనుచులోపలసెలకొన్న ఆశలుడిగి । పరమశాంతుండు గైకోడు
బంధనంబూ ॥

క ॥ ఆపదలను సంపద అను । యేపట్టున దైవకృతములేయనితృప్తం ।
దైవరగెడి విమలేంద్రియు । దపాటిసుఖంబుగోరడెరుగడు వగపున్ ॥

గీ ॥ తొడరిసుఖదుఃఖ జన్మమృత్యువులు దోప । దైవకృతములటంచు తథ్య
ముగ దెలశి । నాతడె కర్మములనిరాయా సుడగచు । చేశిననుతత్ఫలంబుల
జెందడెపుడూ ॥

గీ ॥ చింతనొందినదుఃఖంబు జెందుచుండు । పేరె దుఃఖంబునకు నొండు విధ
ములేదు । చింతసెడబాసికానల చిక్కుబడక । శాంతుడగువాడు
శాశ్విత సౌఖ్యమొందూ ॥

గీ ॥ యేనుదేహంబుగాను మరెంచిచూడ । దేహమునునాకు లేదని తెలియు
వాడు । చేసినప్రయోజనంబును శాయనదియు । తలపకుండిన కేవల
తత్వమొందూ ॥

గీ ॥ బ్రహ్మ మొదలు స్తంబపర్యంతముగసెన । యసెడి నిశ్చయాత్ముడైన
వాడు । నిర్వికల్పుడగుచు సెగడు ప్రాప్తాప్రాప్త । ఫలములందు తగులు
బడక యుండూ ॥

గీ ॥ బహువిధాశ్చర్యమీ ప్రపంచంబుజూడ । పట్టపసలేదనుచు శంక
పడనతండు । వాసనలనొందకను చిదాభాసశుద్ధ । బోధమాత్రుండగు
శాంతి బొందకున్నె ॥

॥ యిది జ్ఞానాష్టకం ॥

ఓం

"శ్రీ సద్గురువే నమః"

# " శ్రీ సద్గురు పాదుకాస్తవము "

1. శ్లో ॥ శ్రీ సమంచిత మవ్యయం । పరమ ప్రకాశమగోచరం ।
బేధవర్జిత మప్రమేయ । మనంత మాధ్యమ కల్మషం ।
నిర్మలం నిగమాంత మద్వయ । మప్రతర్క్యమ బోధకం ।
ప్రాతః రేవహి మానసాంతర్భావయేద్గురు పాదుకాం ॥

2. శ్లో ॥ నాదబిందు కళాత్మకం । దశనాదబేధ వినోదకం ।
మంత్రరాజ విరాజితం । నిజమండలాంతర్భాసితం ।
పంచవర్ణమఖండ మద్భుత । మాదికారణ మచ్యుతం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయే సద్గురు పాదుకాం ॥

3. శ్లో ॥ వ్యోమమద్భహిరంతరస్థిత । మక్షరం నిఖిలాత్మకం ।
కేవలం పరిశుద్ధమేక । మజన్మహి ప్రతిరూపకం ।
బ్రహ్మతత్వ వినిశ్చయం । నిరతాను మోక్షసుబోధకం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

4. శ్లో ॥ బుద్ధిరూప మబుద్ధితం । త్రితయైక కూట నివాసనం ।
నిశ్చలం నిరతప్రకాశక । నిర్మలం నిజమూలకం ।
పశ్చిమాంతర ఖేలనం । నిజశుద్ధ సంయమి గోచరం।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

5. శ్లో ॥ హృద్గతం విమలం । మనోజ్ఞవిభాసితం పరమాణుకం ।
నీలమధ్య సునీల సన్నిభ । మాదిబిందు నిజాంశకం ।

సూక్ష్మకర్ణిక మధ్యమస్తిత । విద్యుదాది విభాసితం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

6. శ్లో ॥ పంచ పంచ హృషీక । దేహమనశ్చతుష్క పరస్పరం ।
పంచభూత సకామ । షట్క సమీర శబ్ద ముఖేతరం ।
పంచకోశ గుణత్రయాది । సమస్తధర్మ విలక్షణం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

7. శ్లో ॥ పంచముద్ర సులక్ష్యదర్శన । భావమాత్ర నిరూపణం ।
విద్యుదాది ధగధగత్వ । రుచిర్వినోద వివర్ధనం ।
చిన్ముఖాంతర వర్తినం । విలసద్విలా సమమాయకం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

8. శ్లో ॥ పంచవర్ణ సుచిర్విచిత్ర । విశుద్ధతత్వ విచారణం ।
చంద్రసూర్య చిదగ్ని । మండల మండితం ఘనచిన్మయం ।
చిత్కళా పరిపూర్ణమంతర । చిత్ప్రమాది నిరీక్షణ ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

9. శ్లో ॥ హంసచార ముఖండనాద । మనేకవర్ణమ రూపకం ।
శబ్ధజాలమయం చరాచర । జంతు దేహ నివాసినం ।
చక్రరాజ మనాహతోద్భవ । మేకవర్ణమతః పరం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ।

10. శ్లో ॥ జన్మకర్మ విలీనకారణ । హేతుభూతమ భూతకం ।
జన్మకర్మ నివారకం । రుచిపూరకం భవతారకం ।
నామరూప వివర్జితం । నిజనాయకం శుభదాయకం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

11. శ్లో ॥ తప్తకాంచన దీప్యమాన । మహాణు మాత్రమ రూపకం ।
చంద్రికాంతర తారకైరవ । ముజ్వలం పరమాస్పదం ।
నీల నీరద మధ్యమస్థిత । విద్యుదాది విభాసితం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

12. శ్లో ॥ స్థూల సూక్ష్మ సకారణాంతర । ఖేలనం పరిపాలనం ।
విశ్వతైజస ప్రాజ్ఞచేతన । మంతరాత్మ నిజాంశకం ।
సర్వకారణ మీశ్వరం । నిటలాంతరాళ విహారకం ।
ప్రాతః రేవహిమాన । సాంతర్భావయేద్గురు పాదుకాం ॥

" శ్రీ సద్గురు పాదుకాస్తవం సంపూర్ణం "

## కొన్ని ముఖ్యమైన కందార్థములు

కం ॥ దేశికుని చరణతీర్థము కాశిగంగయని । గురునిగనుగొన్నను విశ్వేశురుడని । యతడు తనకుపదేశంబొనరించి నట్టిదే తారకమని । మనసందుతాని తీరునగనీ । ఏ సీమయందున్న కాశిప్రయాగ రామేశుని పురమై । ప్రకాశించు నాసీమ । అదే తారకమని మనసందు తానీ తీరునగనీ ॥

కం ॥ గురుచరణజలము గోదావరియని । గురుమూర్తి రామభద్రుండని । తత్పురమును భద్రాచలమని । గురుమంత్రమే తారకమని గురిగలిగినట్టె । తిరిగిరాని మరుగెరిగినట్టె । నరుడున్న చోటే సుందర శేషగిరి । భద్రగిరి రంగనాయకా పురమనదగియుండు । గురిగలిగినట్టే తిరిగిరాని మరుగెరిగినట్టే ॥

కం ॥ వినసేర్చి చెప్పసేర్చిన మనుజులకే । దీనిలోని మర్మము దెలుసున్ । వినజెప్పసేరకుండిన మనుజులు యీ బోధలోని మర్మమెరిగేరా । దీనందుండే ధర్మమెరిగేరా । జనులే కొబ్బరికాయ తినసేర్పుగలవారు । తినసేర్చునా కోతి తనకాకాయబ్బిన మర్మమెరిగేరా । దీనందుడే ధర్మమెరిగేరా ॥

కం॥ పదిరెండుక్షరములుగల సదమల మంత్రార్థమెరిగి । సద్గురు కృపచే పదియారక్షరములుగల । యదియెట్టిదో తెలసినేనియతడే సద్గురుడూ । ఇవిరెండెరుగని అతడేటి గురుడూ ॥ మొదటిది పరిపూర్ణమునుదెల్పు । నెరుకాను తదనంతరపుది । బోధను జేయునివి దెలిసినతడే సద్గురుడూ । ఇవిరెండెరుగని అతడేటి గురుడూ ॥

కం॥ తొర్రలు తొమ్మిది గల మేన్మర్రికి యొకరెంటిలోన మర్రలు । నాల్గుండెర్రది తెల్లది నల్లది కర్రెది । దానాగ్రమందు కలదొక్క తూటూ । అది యెరుకానె పులుగుండె చోటూ । కుర్రా గురు బోధనె గొడ్డలి చేబూని । మర్రిపులు గల రెంట్ని మలచి కొట్టర పోని । కలదొక్క తూటూ । అది యెరుకానె పులుగుండె చోటూ ॥

************

ఓం

"శ్రీ సద్గురువే నమః"

## శ్రీ బృహద్వాశిష్ఠ
## గురుశిష్య ప్రభావ ప్రకరణము

1. అహంకారము వదలవలెను.
2. అభిమానము విడువవలెను.
3. గురునింద వినరాదు.
4. గురుద్రోహము చేయరాదు.
5. కుల త్యాగము చేయరాదు.
6. ఆచార త్యాగము చేయరాదు.
7. కుల దూషణ చేయరాదు.
8. కుల గురువుల నిందించరాదు.
9. పరస్త్రీలను తల్లిగా భావించవలెను.
10. పరద్రవ్యమును మట్టిపెళ్ళవలె చూడవలెను.
11. సకల భూతములను తనవలనే భావించవలెను.
12. దేహార్థప్రాణములు గురువునకు సమర్పించవలెను.
13. అహంకారము లేనివారికి జనన మరణములు లేదనే సిద్ధాంతము.
14. సత్యమునే పలుకువలెను. అసత్యం పలుకరాదు.
15. అహంకారము వదిలినవాడు త్రిమూర్తులకన్నను అతిశయుడు.

ఈ ధర్మమును ఆచరించువారే పరిపూర్ణులు.

ఓం

## శ్రీ గురుమాలా మంత్రం

ఓం న మః శ్రీ గురుదేవాయ । పరమ పురుషాయ ।
సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ట వినాశాయ ।
సర్వమంత్రచ్ఛేదనాయ । త్రైలోక్యం వశమానాయ స్వాహా ॥

## ద్వాదశాక్షరి మహామంత్రం

ఏతన్మిధ్యా శుద్ధవియత్ కించిన్నాస్తి
ఈ వుత్త బట్టబయలు ఏమి లేదు.

## షోడషాక్షరి మహామంత్రం

నిర్మూలమే తదా జ్ఞానశ్చరీరం నాస్తి కేవలం
మూలం లేని యీ గుర్తెరిగే శరీరం ఏమి లేదు.

## పంచదశి దృష్టద్రాష్టాంతం

స్వప్నేప్రతీయ మానాని రూపాణి యథా తథా
కలదోచిన శరీరాలు ఏలాగో అలాగే

కర్పూర దీప సంయోగం జ్యోతిరూపం యథా తథా
కర్పూరం కళిక కూడితె ఏలాగో అలాగే

# శ్రీ దక్షిణామూర్తి పరబ్రహ్మమౌనసాంజ్ఞ




నిర్మ్కాల మేతదా జ్ఞానశ్వరిరం, నాస్తికేవలం

# శ్రీ యాజ్ఞవల్క్య మహర్షి




## శ్రీ జనకమహారాజుకు బ్రహ్మోపదేశముచేయుట

# శ్రీ జనక మహారాజు




శ్రీ జనకరాజర్షి శ్రీ శుక మహర్షికి బ్రహ్మోపదేశముచేయుట

# శ్రీ సాందీప మహర్షి




శ్రీ కృష్ణమూర్తికి పరిపూర్ణ బయలు సూచించుట

# శ్రీ కృష్ణ పర బ్రహ్మ




## శ్రీ ఉద్ధవులకు గురుసూచన ఆశిర్వచనము

# అచలగురు శ్రీ శ్రీ శ్రీ స్వాములవారి ప్రియ శిష్యులు




శ్రీ మద్రామడుగు శ్రీ శివరామ దీక్షితులువారు

శ్రీ మత్కంబాలూరి అప్పయ్య మంత్రివారి ప్రియ శిష్యులు




శ్రీ మత్పరశురామ సీతారామస్వాములవారు

శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయకులగు



శ్రీ వేమల రామయ్యార్య యోగీంద్రులవారు




సభాసామ్రాట్ అచలభోద వాచస్పతి

శ్రీ వివేకానంద బండారు సుబ్బాయార్యులు

## శ్రీ నిర్మలానంద గట్టు నాగయార్య యోగీంద్రుల వారి ప్రియ శిష్యులు



"సభాసామ్రాట్ మరియు అచలబోధ వాచస్పతి" బిరుదాంకితులు

**శ్రీ శ్రీశ్రీ లక్ష్మీసమేత వివేకానంద బండారు సుబ్బయార్యులు.**

ఓం
"శ్రీ గురుభ్యో నమః "



శ్రీ దయానంద నాగుల వెంకటేశం,
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత ఉపాధ్యాక్షులు.

## అభినందనలు

శ్రీ అచల సిద్ధాంత భావజ్ఞులార! పరమ పూజ్యులార! మీకు నా నమస్కారము.

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ పరంపరావాసులు - శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు - సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములువారు - ముముక్షజనులందరిని గమనించి, వారికియున్నటువంటి అచల బోధలోని సూక్ష్మమైన విషయములను గ్రహించి, దయగల హృదయులై - పరిపూర్ణబోధ తెలియజేసి, అచల బోధను తెలియాలంటె - అచలబోధకు అధికారి అయితేనే కాని - పౌండెషన్ కుదరదు అని అభిప్రాయపడి, అచల సిద్ధాంతములో ప్రార్థమిక వార్తికమైనటివంటి బోధను

అందించిన, శ్రీ పరుశురామ నరసింహదాసుగారు రచించిన భద్రాద్రి రామ శతకమును ముందువుంచి – ఏకాంతముగా దీక్షవహించి, ఒక పద్యమునకు, ఎన్నో ఉపమానములు తెలియజేస్తూ – ఆడియో వీడియో క్యాసెట్లు జేసి సర్వులకూ అందించినారు – ఇది సామాన్యులకు సాధ్యపడే పని కాదు.

శ్రీ సుబ్బయ్యార్య స్వాములవారికి, గురుడు అనుగ్రహించిన వరము. ఇక వీరి ప్రియ శిష్యులైన కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, హొసకోటె తాల్లూక, వైట్ పీల్డ్, నారాయణకెరె గ్రామ వాస్తవ్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు, తెలుగులోను మరియు తన మాతృ భాషయందు అనగా – కన్నడ భాషలో మా గురువుగారు చెప్పిన – ఆడియో క్యాసెట్లలో వున్న బోధను, కర్నాటక భక్తకోటికి అందిస్తే బాగుండును అని సంకల్పము జేసి – తన గురువులైన శ్రీ సుబ్బయ్యార్య స్వాములవారిని హృదయమందు నిలుపుకొని, క్యాసెట్లలో వున్నటువంటి భద్రాద్రి రామ శతకము బోధను వినుకుంటూ – కన్నడములో అనువదించి కంప్యూటరులో కృషిజేసి, మంచి గ్రంథమును తయారు జేసినారు. వీరి గురుభక్తి, వీరిలోవున్న శ్రద్ధ, విశ్వాసము – ఎంతో అమోఘమైనది అని విజ్ఞులు గ్రహించవలెను. నాయనలారా!

శ్లో॥ మూకం కరోతి వాచలం । పంఘుంలంగయతె గిరిం ।
యత్ కృపాత మహం వందే । పరమానంద మాధవం ॥

అన్నారు పెద్దలు. ఓ గురుదేవా! మీ కృప మాయందువుంటే – మూగవాడు మాట్లాడగలడు; కుంటివాడు కొండలు ఎక్కగలడు అని పెద్దలు అన్నట్లుగా – మన వీరభద్రయ్యగారు చాల గొప్పనైన గురు సేవ జేసినారు – ఇది అందరికి సాధ్యము కాదు.

జిజ్ఞాసులు; ఆర్తులు – ఈ గ్రంథమును శ్రద్ధతో చదివి – దీనిలో వున్నటువంటి సంపూర్ణమైన బోధను తెలుసుకొని – ఇతరలకు తెలుపగలరు. శ్రీ భద్రాద్రి రామ శతకము – అచల బోధలో నిఘంటువులాంటిది. ఆదియునుగాక, మానవడు భ్రాంతి హేతువై; భ్రాంతికి బానిస అయ్యుండి – నానా వికారములు; ప్రేమలు; అనురాగములు; ఆప్యాయతలు తగిలించుకోని – అందులో చిక్కుకొని – చచ్చుట మరల పుట్టుచున్నాడు. అది గ్రహించిన శ్రీ నరసింహదాసుగారు భ్రాంతి రహిత స్థితి కుదురుటకు కొరకు,

ఎన్నో పద్యాలు చెప్పినారు. **36** పద్యమునుండి **43** నంబరగల పద్యాలు చదివి, భ్రాంతి రహిత స్థితిని పొందాలని ఆశిస్తాను. ఇంత శ్రేయోదాయకమైన సేవ జేసి – మనందరికి అందించిన, శ్రీ వీరభద్రయ్యగారిని సద్గురుమూర్తి – ఎల్ల వేళల కాపాడి, ఆశీర్వదించాలని కోరుతూ, అభినందనలు తెలుపుచున్నాను.

నమస్కారములు,

ఇట్లు

భక్తజన పాదదూళి – శ్రీ దయానంద నాగుల వెంకటేశం,
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య
అఖిల భారత ఉపాధ్యాక్షులు,
శ్రీ సాంధీప అచల ఋషి పరిపూర్ణ గురు మందిరము,
గ్రామం : గొల్లగూడేం – పోస్టు : కమ్మేటు;
మండలం : చేవెళ్ళ – జిల్లా : రంగారెడ్డి జిల్లా.
ఫోన్ నం. : **08417 - 224239.**

తేది **: 28-03-2007.**

ఓం

"శ్రీ సద్గురువే నమః"



శ్రీ అ॥ ప॥ భూమానంద గుత్తికొండ దామోదర రెడ్డియార్యులు,
రాష్ట్రాధ్యక్షులు - ఆంధ్రప్రదేశ్.

# ఆశీస్సులు

అచల పరిపూర్ణ సంప్రదాయ - సభా సామ్రాట్ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వామి - అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు [ధర్మవరం] వారు - శ్రీ శివరామ దీక్షిత ప్రభులవారి ప్రియ శిష్యులు, శ్రీమత్ కంబాలూరు అప్పబ్రహ్మం వారి శిష్యులు - శ్రీమత్ భద్రాద్రి రామ శతకమునకు - మన సంప్రదాయ పెద్దలు చాలా మంది భావార్థములు వ్రాసియుండిరి మరియు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వామిచే భావార్థములు విపులముగా వ్రాయబడినవి.

అట్టి భద్రాద్రిరామ శతకమును క్యాసెట్లు రూపముగా మరియు సి.డి. ల **[C.D.]** ద్వార సూచన వర పడిలో - ఈ కాలంవారు వాటి భావార్థములు సాంఖ్య; తారక; అమనస్క; మహావాక్యములుగా - మరియు స్థూల; సూక్ష్మ; కారణ; మహాకారణ

శరీరములు – జాగ్రత; స్వప్న; సుషుప్తి – సత్వ; రజో; తమో గుణముల గూర్చి – దశనాడుల గూర్చి – బ్రహ్మరంధ్ర స్థానము – అష్టదిక్పాలకులపై నిర్ణయము – షడూర్మ్మలు – మలత్రయముల గూర్చి – తాపత్రయములు – ఈషణ త్రయములు – వాసన త్రయములు – వ్యాధి త్రయములు – ప్రపంచ భ్రాంతి లక్షణములు – సాధన చతుష్టయము సంపత్తి మరియు గురుడు బోధించే క్రమము – ముద్రలగురించి – ఆప్పజ్యోతి స్థానము గురించి – కేవలాత్మ లక్షణము మరియు పరిపూర్ణ బోధను సంపూర్ణముగా; సవివరముగా క్యాసెట్లు రూపమున మేము వినియుంటిమి. అచల బోధపరులకు, ఈ విధానము ఎంతయో మేలు చేకూరుస్తుంది.

శ్రీ సుబ్బరాయ స్వాముల గురించి నేను యిరవై సంవత్సరములుగా ఎరుగుదును. వీరి వాక్కు చతురత అమోఘము; అసామాన్యము. ఎంతటి క్లిష్టమైన సమస్యనైనా – ఈ అచల బోధ రూపములో సులభముగా బోధించడములో బహునేర్పరి. అట్టి క్యాసెట్లు రూపములోవుండబడిన భావార్థమును – తెలుగు భాషలో మరియు కన్నడ భాషలోకి అనువదించి కంప్యూటరులో కృషి జేసిన కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, నారాయణకెరె వాస్తవ్యలు – శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు ఎంతో అభినందనీయులు. మరి ఈ గ్రంథరూపముగా చేయదలచినారని తెలిసి ఆనందభరితమై – ఇట్టి గ్రంథమును సర్వులు ప్రతినిత్యము చూచి, చుదువుకొని – పూర్ణస్థితిని – రహితస్థితిని పొందగలరని ఆశిస్తాను.

ధన్యవాదములు,


ఇట్లు
శ్రీ భూమానంద గుత్తికొండ దామోదర రెడ్డియార్యులు,
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య రాష్ట్రాధ్యక్షులు –
ఆంధ్రప్రదేశ్ – గ్రా: పొట్ల పహాడు.
సెల్ నం. **9440226564**


తేది: **23-03-2007.**

ఓం
"శ్రీ సద్గురుభ్యో నమః"

శ్రీ అ॥ ప॥ సుగణాంబ ఖామందుల లక్ష్మినారాయణమ్మ,
అవధూత ఆశ్రమము - విజయవాడ

# అభినందములు

శ్రీ పరశురామ నరసింహదాసుగారు రచించినటువంటి, శ్రీ భద్రాద్రి రామ శతకమునకు, మా బాబు శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయులు - మా సమక్షముననె, ఈ భద్రాద్రి రామ శతకానికి భావార్థములు చెప్పినారు. నేను స్వయుంబుగా దగ్గరవుండి విన్నాను - ఎంతో చక్కటి ఉత్కృష్టమైన ఉపమానాలు; ఉపమేయాలతో హృదయ కమలకర్ణంబులకు అమృతస్వాదము జేపించిన మహా వాగ్మి, మహా వేదాంత పుంగువుడు.

ఈ భద్రాద్రి రామ శతకమును విని, చదివి - దీంట్లో చెప్పిన ప్రతియొక్క పద్యమునకూ - కందార్థములతో; శ్లోకాలతో; చక్కటి భావార్థములను, తాత్పర్యమును సామాన్య మానవకులకోటియంత సులభముగా అర్థముచేసుకొని; ఆచరణగావించుకొని కైవల్యమును పొందె సులభమార్గము, ఈ భావార్థ బోధ గ్రంథములోవుంది. సృష్టికి పూర్వము - ఈ సృష్టికి ఆధారభూతమైనటువంటి, ఆ చైతన్య స్వరూపమైన గురుపరమాత్మ ఎట్ల వున్నది? మల్ల ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే, బ్రహ్మమందు మాయ ఆరోపితమై - ఎట్ల బ్రహ్మాండ పిండాండములు ఆవిర్భవించినాయి? అంటె:

"బ్రహ్మణోర్వ్యక్తాః; అవ్యక్తాన్ మహత్; మహతో మహదాంకారాః;
మహదాంకారాత్పంచతన్మాత్రాణి; పంచతన్మాత్రభ్యో పంచమహాభూతాని;
పంచమహాభూతేభ్యో అఖిలం జగత్ "

ఈ స్వయంభూ బ్రహ్మము తనకు తానే కలవలే తోచి, అనేక కష్టనష్టాలకు; సుఖ దుఃఖాలకు లోనై, ఈ బాధ పడలేక – తన స్వరూపము ఏమి అని తెలిసికొనిన తర్వాత మల్లా మోక్షాపేక్ష గలిగినప్పుడు – తిరోగమన పద్ధతిగా అన్ని వదలుకూంటూ, తన స్వరూపమువరకూ ఎలా ప్రయాణము చేయవలనో మరియు ఈ జనన మరణ ప్రవాహరూపమైన సృష్టిని దాటియటువంటి పరిపూర్ణ బోధవరకూ సంపూర్ణముగా సవిమర్శమైన పద్ధతిలో ఆడియో – వీడియో క్యాసెట్లు ద్వార వినిపించి భక్తకోటికి అందించినారు.

ఇట్టి అతి అమూల్యమైన అచల సింద్ధాంత బోధను, వీరి ప్రియ శిష్యులైన కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, నారాయణకెరె గ్రామ వాస్తవ్యులైన మన వీరభద్రయ్య బాబు – క్యాసెట్లు ద్వార వినిపించిన, ఈ మహాబోధను శ్రమవహించి వారి మాతృ భాషైన కన్నడానికి అనువదించి మరియు తెలుగు భాషలోను కంప్యూటరలో తానే స్వయుంబుగా కృషిజేసి – సాంప్రదాయపరులకూ మరియు రాబోవు తరమువార్లకూ ఎంతో మేలు జేసినారు. మానవకోటికి; విశ్వశాంతికొరకు – ఇటువంటి మహొన్నతమైన సేవజేస్తూవుండే అతీంద్రియ దృష్టికలిగిన, మన సుబ్బరాయ బాబుకు మరియు వీరభద్రయ్య బాబుకు హృదయపూర్వక ఆశీర్వాదములను – అభినందనములను తెలియజేస్తున్నాను. ఈ అతి అమూల్యమైన గ్రంథమును, అచల సిద్ధాంత సాంప్రదాయపరులందరూ తీసుకొని చదివి, యదార్థమును తెలుసుకొని – గురుకృపాకటాక్షమునకు పాత్రులై మోక్షమును పొంది కృతార్థులైతారు అని ఆశీస్తున్నాను.

వందనములు,

ఇట్లు,

శ్రీ అ॥ ప॥ నిర్మలాంబ నరసమాంబగారి ప్రియ శిష్యులు,
కుమార్తైన శ్రీ సుగణాంబ ఖామందుల లక్ష్మినారాయణమ్మ,
అవధూత ఆశ్రమము, విజయవాడ – ఆంధ్ర ప్రదేశ్.

తేది ॥ **12-04-2007.**

ఓం

"శ్రీ గురుభ్యో నమః"



శ్రీ అద్వయానంద వెంకటరమణాచార్యులు



శ్రీ నిజగురు గోప్యానంద శ్రీనివాసాచార్యులు

## అభినందనలు

శ్రీశ్రీశ్రీ శ్రీధర శివరామదీక్షిత అశరీర నిజగురు శిష్య జనులందరికీ నా మనవి.

శ్రీ దక్షిణామూర్తి మొదలు మన స్వగురువులవరకూ – అవిచ్ఛిన్నముగ సాగిన మన గురు పరంపరలో, ఎందరో మహానుబావులు ఆధ్యాత్మిక చింతన చేసి, ఎన్నో గ్రంథాలు అనుభవ రూపకముగా వ్రాసినారు. అందులో ఒక గ్రంథము శ్రీమత్పరుశురామ నరసింహదాసుగారి రచనలగు " శ్రీ భద్రాద్రి రామ శతకము" " పరుశురామ సీతారామ శతకము" తెలుగులోవుంది కాబట్టి, కర్నాటక రాష్ట్రములో కన్నడ మాతృ భాష కాబట్టి – సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు, శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య – అఖిల భారత అధ్యక్షులు, శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాముల ప్రియ శిష్యులైన ఎన్.వి. విరభద్రయ్యగారు – నారయణకెరె గ్రామ, హొసకోటె తాల్లూక్, బెంగళూరు గ్రామాంతర జిల్లా వాస్తవ్యులు – కర్నాటక గురుపుత్రులకి తెలుగు చదివేదానికి

కష్టము అని – గురువుగారు అందించిన క్యాసెట్లులో బోధించిన "శ్రీ భద్రాద్రి రామ శతకమును" వినుకుంటూ తెలుగు భాషలో మరియు కన్నడ భాషలోకి అనువదించి [కన్నడ అక్షరాలు – తెలుగు ఉచ్చారణ] కంప్యూటరులో కృషిజేసి గ్రంథములను తయారు జేసినారు. వీరభద్రయ్యగారు తేది **27-01-2006** యందు గురువు ద్వార ఉపదేశము పొంది – ఇంత తక్కువ కాలములో – త్రికర్ణ శుద్ధి ప్రవర్తన గలిగి, నాల్గు విధముల శుశ్రూష సేవలు గురువుగారికి చేసి – గ్రంథమును ముద్ర చేసేదానికి ఇంత ఆసక్తి కలిగినందుకు, గురు పరమాత్మ అఖండ జ్ఞానాన్ని ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.

నాకు పరమ గురువులైన సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి – అఖిల భారత అధ్యక్షులు, శ్రీ వివేకానంద బంఢారు సుబ్బయార్య స్వాములు, భారతములో వుండే అచల బోధ సాంప్రదాయ గురుపుత్రులందరికి తెలిసినవార్లై – శ్రీ భద్రాద్రిరామ శతకములోని పద్యములకు – గురుభక్తులందరికీ సులభముగా అర్థమయ్యేనట్లు భావర్థము చెప్పి, సముద్రములో ఆణిముత్యాలు వెలకి తీసినట్లు – విద్యావంతులకు, విద్యేలేనివాళ్ళకూ – అరచేతిలో ఉసిరికాయ చూపించినట్లుగా – ఆడియో వీడియో సీ.డి.లు చేసి, గురుపుత్రులందరికి వినిపించి భుజింపజేసినారు. కందార్థాలు, కందపద్యములకు లోతైనటువంటి తాత్పర్యము; భావార్థములు చెప్పి – కర్నాటక రాష్ట్రములో, శ్రీ శివరామ దీక్షిత సింద్ధాంతాన్ని ఎంతో ప్రచారపరచి లోక కల్యాణము చేస్తూన్నారు.

వీరు ప్రియ శిష్యులైన మా గురువుగారు, శ్రీ అద్వయానంద వెంకటరమణార్య స్వాములవారు – **15** వయసునించే, ఆధ్యాత్మిక చింతనలో పయనించి – ద్వైతము, అద్వైతము విచారణ చేసి – వారికి తృప్తి కలుగక, చివరి గురువుగారు – శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాముల చేత ఉపదేశము తీసుకోని, త్రికర్ణ శుద్ధి ప్రవర్తన ఆచరించి – నాలుగు విధముల శుశ్రూష సేవలు జేసి – పేదరికములో వున్నప్పటికీ కూడ, కలిగినవాళ్ళకంట – ఎక్కువ భయభక్తితో సేవ జేసి – గురువుగారి
ఆజ్ఞ మీరకుండా, సర్వవిధాలుగా గురువును మెప్పించి తృప్తిపరచినటువంటివారు. అచల సాంప్రదాయ గ్రంథాలు కొనే కొరకు డబ్బు లేక – ఫ్యామిలి ప్లానింగ్ ఆపరేషన్ చేపించుకొని, ఆ డబ్బుతో గ్రంథాలు కొన్నారు. వారికి భార్య,

ఓం

శ్రీ సద్గురవే నమః



శ్రీ అద్వయానంద వెంకటరమణాచార్యులు



శ్రీ, గుణరూప రహితానంద బండారు హనుమంతాచార్యులు.

# తొలిపలుకులు

శ్రీమత్ బృహద్వాశిష్ట అచల సిద్ధాంత ప్రతిస్థాపనాచార్యులు, శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షిత అచలగురు పరంపరాచార్యులగు శ్రీమత్ పరుశురామ నరసింహ దాసుగారిచే రచింపబడిన – శ్రీ భద్రాద్రిరామ శతకమును గురుపుత్రులందరు కూడా సాంప్రదాయములో చేరిన తరవాత మొట్టమొదటి సారిగ చదువవలసిన గ్రంథము.

శ్రీ వేదవ్యాస మహాఋషి, శ్రీ జనకమహారాజు, శ్రీ సాందిప మహామునివంటి వారి వరుసలో చేర్చదగిన నవీన కాలములో జన్మించిన మహామేధావి, బ్రహ్మజ్ఞాని, పరిపూర్ణ బోధ ప్రచారకులు అయిన, మా పరమ సద్గురు దేవులు " సభా సామ్రాట్ మరియు అచల బోధవాచస్పతి" బిరుదాంకితులు, శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య కేంద్ర అధ్యక్షులు, పూజ్యనీయులైన శ్రీ లక్ష్మి సమేత వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములు, ధర్మవరం వాస్తవ్యులు.

ఈ మహానుభావునిచె విశ్లేషింపబడిన " భద్రాద్రి రామ శతకము " సమస్త గురుభక్తాదులకు కష్టము గాకుండ అతి సులభమైన శైలిలో పదజాలాలు,

భావము చెప్పినారు. వారు చెప్పిన సాంప్రదాయ భావాలు చదువుకున్న వారికిని, చదువులేని వారికిని, వయస్సులో ఉన్న వారికి మరియు వయస్సు మళ్ళిన వారికి కూడా చక్కగా అర్థమయ్యే రీతిలో చెప్పినారు. వీరు విశ్లేషించిన భావనలో ఎవరికి ఏ సంశయములు ఉండవు. ఎందుకంటె, సాంప్రదాయక గురు భక్తుల సంశయాలు నివృత్తి చేయడమే వారి ఆశయము.

శ్రీ ఎన్.వి. వీరభద్రయ్య [ఎక్స్ మండల్ పంచాయితి మెంబర్] నారాయణకెరె వాస్తవ్యులు, **కర్నాటక** – వీరి సంకల్పము చాలా గొప్పది. స్వాముల వారు విశ్లేషించిన భద్రాద్రి రామశతకమును కన్నడ భాషలో అనువదించి మరియు తెలుగు భాషలందు ముద్రించుచున్నారు. వీరు ముందు ముందు మరి ఎన్నో సాంప్రదాయక గ్రంథాలు తెలుగునుండి కన్నడ భాషలో అనువాధించి కర్నాటక గురుభక్తాదులకు అందించగలరని ఆశిస్తున్నాను. కాబట్టి సద్గురు దేవులు వారికి సకల ఆయురారోగ్య భాగ్యములు ఇవ్వాలను ప్రార్థిస్తూ, నా శుభాభివందనములను అందజేస్తున్నాను.

ధన్యవాదములు,

ఇట్లు
శ్రీ అ॥ ప॥ అద్వయానంద వెంకటరమణార్యుల పాద సేవకుడు,
శ్రీ అ॥ ప॥ గుణరూప రహితానంద బండారు హనుమంతార్యులు,
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య,
సెంట్రల్ ఆర్గనైసింగ్ సెక్రెటరి,
బళ్ళారి – కర్నాటక.

తేది॥ **05-04-2007.**
బళ్ళారి.

ఓం

"శ్రీ గురుభ్యో నమః"



శ్రీ అ॥ ప॥ నిర్మలానంద కాడిగె నారాయణ,
హైదరాబాద్.

## పెద్దల అభిప్రాయములు

శ్రీ శివరామ దీక్షిత అచల గురుపీఠ సాంప్రదాయకులలో – శ్రీమత్ పరశురామ నరసింహదాస స్వామి ముఖ్యులలో ముఖ్యులనబడుట అతిశయోక్తికాదు. ఏలయనగా, పరిపూర్ణ బోధ ప్రచారము గావించుటలో, శ్రీ శివరామదీక్షితులవారు ఎట్లు ప్రముఖులో అటులనే వేదములలో చెప్పబడిన పరిపూర్ణబోధ సంస్కృతమునందుండుటచే పండితులకు తప్ప, సామాన్యులకు అందుబాటులో లేకుండుట – తెలియక పోవుట ఒక కారణముగా యుండెను. అట్టి కొరత తీర్చుటకై, వేదములలో చివరదని తెల్పె ఉపనిషద్భావములను, తేట తెల్లముగా తెలుగులో పండిత పామరులకు అర్థమయ్యేటట్లు వ్రాసి పరిపూర్ణబోధాది గురువులకు – గురుభక్తాదులకు ఎంతో మేలుచేసినారు.

ఈ గ్రంథములో మొట్టమొదట ఐదు పద్యములను తన ఇష్టదైవమగు ఆత్మారాముడు లేదా భద్రాద్రి రామునకంకితమొసంగినట్లు వ్రాసినవి. ఆరో పద్యము నిర్గుణ పరమాత్మ శుద్ధ చైతన్యమును గురించి వ్యక్తపరిచినారు. తర్వాత, సృష్టి ప్రవృత్తి మార్గమును; స్థితి మార్గమును; నివృత్తి మార్గమును; ఆత్మస్వస్థాన స్వరూప స్వభావములను తెలియజేస్తు, గురువులు–శిష్యులకు బోధించు క్రమపద్ధతి వివరించినారు.

తరువాత భ్రాంతి రహిత స్థితిని పొందుటకు పరిపూర్ణ బోధను సవివరముగా ఎరుక నిర్ణయము; ఎరుక నిరసన పద్ధతి సులభోపాయముగా అర్థమయ్యే విధముగా, పద్యభాగమును రచించి లోకోపకారమును జేసినారు. భద్రాద్రి రామశతక గ్రంథము, పరిపూర్ణ బోధకు ప్రమాణిక గ్రంథమనవచ్చును. కావున, ఈ భద్రాద్రి రామ శతకమును శ్రీ వివేకానంద సుబ్బరాయస్వామి - ధర్మవరం వారు, భద్రాద్రిరామ శతకము పద్యములకు భావార్థములు చెప్పి క్యాసెట్లు - సి.డీలు తయారు చెసినారు. ఈ క్యాసెట్లు - సి.డీలు వరంగల్ వాస్తవ్యులైన శ్రీ చక్రపాణిగారు చేయించి, అందరికి వినుటకు యోగ్యముగాయున్నది. మన గురువులు ఎదుట ఉన్నట్లు, వారు వివరంగా తెలిపినట్లు అనుభూతి కలుగుతుంది. మీరు తీసుకొని ఆనందించి - ఆనందిపచేస్తారని మనవి. కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, నారాయణకెరె వాస్తవ్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు - క్యాసెట్లు రూపముగ తెలుగులోయున్న భావార్థములను సంపూర్ణముగా ఆలకించి భద్రాద్రిరామ శతకము మొత్తము తెలుగు భాషలో మరియు కన్నడ భాషలో అనువాదము గావించినారు. గురుభక్తాదులెల్లరు కన్నడ మాతృ భాషగాయున్నవారు చదువితే తెలుస్తుంది, మన బోధలోయున్న గొప్ప తనము; వారు ఈ బోధకై ఎంత శ్రమచేసినారో తెలుస్తుంది. అట్టి పనిని శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యగారు పూనుకొని కన్నడములో అనువాదము చేయుట సంతోషించదగిన విషయము. కావున గురుభక్తాదులెల్లరు ఆదరించి - ఆనందించి ఇతరులను ఆనందింప జేయగలరని ఆశిస్తూ, ఎన్. వి. వీరభద్రయ్యగారు ఇంకా ఇటువంటి అనువాదములు ఎన్నో చేయగలరని, చేయుటకు సద్గురు మూర్తి కృపా కటాక్షములు ప్రసాదించి - ఆశిర్వదించపసెనని కోరుతూ, సెలవు తీసుకుంటాను.

వందనములు,

ఇట్లు


అ॥ ప॥ నిర్మలానంద కాడిగె నారాయణ

**13-4-757/1B** కార్వాన్,

పోన్ నం. **24822582**

హైదరాబాద్ - **500067**

ఆంధ్ర ప్రదేశ్


తేది॥ **28-03-2007.**

హైదరాబాద్.

ఓం

"శ్రీ సద్గురవే నమః"

శ్రీ అ॥ ప॥ నిర్మల నిజానంద రౌతు రామకృష్ణస్వామి,
తోండ్రంగి పదాధ్యక్షులు.

## అభినందనలు

పాఠక మహాశయులారా! ఈ ప్రపంచంలో ఎందరెందరో కవులు; ఎన్నెన్నో గ్రంథాలు. అనగా, కర్మకాండ; ఉపాసనాకాండ; జ్ఞానకాండలననుసరించి ఎన్నో రచించారు. అవి లోక కల్యాణముననుసరించి – శాస్త్రోక్తముగాను; ఆత్మజ్ఞానాంశములతోను కూడియున్నవి. అవి యట్లుండగా, శ్రీ మదచల ఋషి శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకులైన – శ్రీమత్ కంభాలూరి అప్పబ్రహ్మము స్వాములవారి ప్రియ శిష్యులైన శ్రీమత్పరశురామ నరసింహదాసుగారు – వీరితో రచింపబడిన శ్రీ భద్రాద్రి రామ శతకం – **108** సీస పద్యములు – అందుగల ఆధ్యాత్మిక అంశములు అనగా – శృతి॥ "బ్రహ్మణోరవ్యాక్తాన్; అవ్యక్తాన్ మహత్; మహతో మహదాంకారన్" అన్న శ్లోకార్థ శృతి ప్రమాణ అనుభవ అథార్టిలతో కూడుకొని మరియు అతీతాచల పరిపూర్ణ బోధ లక్షణములతో సంపూర్ణముగా తేజరిల్లిన – ఈ భద్రాద్రి రామ శతకం గ్రంథకర్తయగు నరసింహదాసుగారియొక్క విద్యావిధానం, వారియొక్క మృదు మధురమైన కవిధారణామృతము వర్ణనాతీతమని కవులందరికీ తెలిసిన విషయము.

అదిగాక, లోగడ శ్రీ సచ్చిదానంద పగడాల వెంకటేశ్వరవధూత స్వాములవారు – ఈ భద్రాద్రి రామ శతకమునకు భావార్థములు వ్రాసియున్నారు. అవి విద్యావిధానంగల గురువులకు; భక్తులకు గ్రాహ్యామగును. తక్కినవారికి గ్రహించుటకు కష్టముగా నుండెడివి. ఇలా వుండంగా, శ్రీ శివరామదీక్షిత సాంప్రద్రాయకులు – శ్రీ॥ అ॥ ప॥ లు॥
శ్రీ గట్టు నాగన్నాచార్యుల వారి ప్రియ శిష్యరత్న శ్రేష్టమైన – శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య కేంద్రాధ్యక్షులు – అచల బోధ వాచస్పతి శ్రీ

వివేకానంద బండారు సుబ్బరాయస్వాములవారు పైనుదహరించిన భద్రాద్రి రామ శతకంలోగల సీస పద్యాలకు భావార్థములు - వారి స్వానుభవములోగల ఉహాగానమైన యుక్తులతోను, సూక్తులను గుప్పి - వస్తునిశ్చయముగా చక్కని ఉపమాన ఉపమేయములు పెట్టి, బోధను క్యాసెట్లకు యిచ్చినారు. ఇందులో ఆత్మమొదలుకొని, పంచభూతేంద్రియ పరిణామము; పిండ బ్రహ్మాండ జీవేశ్వరతనువావస్థల చతుష్టయ పరిణామము; మరియు - షట్చక్రాది శక్తి బీజములాదిదేవతల పరిణామము; మరియు - స్వస్తికాసాన; సాంఖ్యాతారకమవన్ని; మహావాక్య విచారణాంశములు - ఇవి శ్రీమద్భాగవత కృష్ణదేశికులవారి కందార్థ భావాలకు సరిపోల్చి, సులభముగా అందరికీ అర్థమయ్యేనట్లు, ఆకర్షించగలిగినట్లు - మృదు మధురమైన మాటలతో మన వివేకానంద సుబ్బరాయస్వాములవారు బోధించియున్నారు. ఈ క్యాసెట్లు ఆలకించిన గురుభక్తాదులందరూ పరమానందభరితమై - ఈ శతక భావార్థ బోధ అంశములు, గ్రంథములు రూపముగా అచ్చువేయించి - భక్తకోటికి అందజేయాలని కోరగా - ఈ గ్రంథమును తెలుగు భాషలోను మరి కన్నడ భాషలోకి కూడ అనువదించి కంప్యూటరులో కృషిజేసి - అచ్చు చేయించిన కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, నారాయణకెరె వాస్తవ్యులు - శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాముల ప్రియ శిష్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు ఎంతో అభినందనీయులు. అదిగాక శ్రీ వివేకానంద **B.** సుబ్బరాయ స్వాములవారు, నాకు చిరకాల పరిచితులు. మరియు వీరి బోధామృత వాక్యములు విని ఆనందించని భక్తులు లోకమందు మరిలేరు. ఇది యదార్థము.

ధన్యవాదములు,

ఇట్లు

బుధజన విధేయుడు

శ్రీ అ॥ ప॥ నిర్మల నిజానంద రౌతు రామకృష్ణస్వామి,

తోండ్రంగి పదాధ్యక్షులు, శ్రీకాకుళం జిల్లా,

ఆంధ్ర ప్రదేశ్.

ఓం
"శ్రీ సద్గురవే నమః"



శ్రీ అ॥ ప॥ బోధానంద గోపాలార్యులు



శ్రీ అ॥ ప॥ సత్యానంద రామరెడ్డియార్యులు

# అభినందనలు

అచల సిద్ధాంత పరిపూర్ణ సాంప్రదాయ - సభా సామ్రాట్ వివేకానంద బంఢారు సుబ్బయ్యార్య స్వాములు, శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, ధర్మవరం - వీరు ప్రియశిష్యులైన శ్రీ నిరంజానంద సత్యనారాయణార్యులు, గడ్డూరు, ముళుబాగల్ తాల్లూక్, కోలార జిల్లా - మహత్ గురు భక్తికలిగినటివంటివారు. వీరు నాలగు విధముల శుశ్రూషలు - స్థాన, అంగ, భావ, ఆత్మ సేవలను బాహ్యాంతర్యముగా - కాయ, వాచ, మనసా - త్రికర్ణ శుద్ధిగా ఆచరించి - ఈ అచల బోధ సింద్ధాంతమును లెస్సగా స్వానుభవము పొంది, కోలారు జిల్లా మరియు మాలూరు తాల్లుకులో - భక్తులకు ఉపదేశించి - అనేక మంది శిష్యులును పొంది, బోధజేసి గురు కృపాకటాక్షమునకు పాత్రులైనటువంటివారు. మా గురువుగార్లైన - శ్రీ బోధానంద గోపాలార్యులవారు, వుడదెవల్లి, మాలూరు తాల్లూక్, కోలార జిల్లా - వీరు మొదలు అద్వైత సిద్ధాంతములో **10** సంవత్సరములు సేవ జేసి - తర్వాత వారికి తృప్తి కలుగక - పూజ్య శ్రీ నిరంజానంద సత్యనారాయణార్యుల చరణకమలములో చేరి - ఉపదేశము పొంది - ఈ అచల సిద్ధాంత పరిపూర్ణ బోధను బాగ అభ్యసించి - అనేక మంది శిష్యులను పొంది - ఈ సిద్ధాంతమును ప్రచురించినారు. వీరు తెలుగులోవున్న పూజా విధానము మరియు తత్వా రూపముగా వున్నటివంటి కొన్ని పుస్తకములను - శ్రీ సద్గురు గట్టు నిర్మలానంద నాగాయ్యార్యుల కృపాకటాక్షముతో - కన్నడ

భాషలోకి అనువదించి; ముద్రించి గురుపుత్రులకూ; భక్తకోటికి సులభముగా అర్థమయ్యేనట్లు శ్రమ వహించి మేలు జేసినటువంటివారు.

వీరి ప్రియ శిష్యులైన – శ్రీ సత్యానంద రామరెడ్డియార్యులైన నేను – పూజ్య సద్గురుమూర్తులైన సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు – అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, అఖిల భారత అధ్యక్షులు, ధర్మవరం – వీరు శ్రీ భద్రాద్రి రామ శతకమును ఆడియో–వీడియో సీ.డి.లులో ద్వార వినిపించిన బోధను విని, ఆనందభరితముగా, వీరి అమృత వాక్యములను ఆస్వాదించినాను. వీరు చాల చక్కగా – అతి సామాన్య గురుభక్తులందరకూ కూడ సులభముగా అర్థమయ్యేనట్లు, అచల సిద్ధాంత భక్తకోటికి వినిపించి – అనేక అర్థగర్భిత ఉపమానములతో; ఉపమేయాలతో – కర్ణానందకరమైన; రసమాధుర్యామృతమైన; మహోన్నతమైన బోధను – పానము జేపించిన మహా వేదాంతవేద్యులు – బ్రహ్మవేత్త్యలు. వీరు/పెద్దలు చెప్పిన అమృత వాక్యములు "ఇది భ్రాంతి రహితము"; "ఇది స్థిరం"; "ఇది అనాయాసం" – ఏ బాధ లేకుండ, ఏ సాధన లేకుండ తెలుసుకొనేది – దీన్ని నమ్మినవారికి " జనన మరణాలు లేవని" చెప్పి తీర్మానము జేసినారు – ఇది నిజం ; ముమ్మాటికీ నిజం అని – నా అభిప్రాయము. వీరికి నా కృతజ్ఞత భావములను అర్పిస్తున్నాను.ఈ క్యాసెట్లు రూపముగా వుండబడిన/చెప్పబడిన శ్రీ భద్రాద్రి రామ శతకమును వీరు ప్రియ శిష్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు – నారాయణకెరె గ్రామ, హొసకోటె తాల్లూక్, వైట్ ఫీల్డ్, బెంగళూరు గ్రామాంతర జిల్లా, కర్నాటక రాష్ట్ర వాస్తవ్యులు గురువుగారు వినిపించిన క్యాసెట్లును వినుకుంటూ – తన కర్నాటక మాతృ భాషలోనికి అనువదించి మరియు తెలుగు భాషలోను గ్రంథములను కంప్యూటరులో కృషిజేసి తయారుజేసి కన్నడ అచల సాంప్రదాయ గురుభక్త జనులందరికీ ఎంతో మేలు జేసినారు. శ్రీ సద్గురుమూర్తి వీరిని సకల విధములగా అనుగ్రహించి – ఆశీర్వదించాల అని ప్రార్థిస్తూ, అభినందములను తెలుపుచున్నాను.

ధన్యవాదములు,

ఇట్లు,
శ్రీ అ॥ ప॥ బోధానంద గోపాలార్యుల పాద సేవకడు,
శ్రీ అ॥ ప॥ సత్యానంద రామరెడ్డియార్యులు,
మాలూరు తాల్లూకు అచల గురుపీఠ సేవా సమాఖ్య అధ్యక్షులు,
ఎచ్. హొసకోటె; మాలూరు తాల్లూక; కోలార జిల్లా, కర్నాటక.

ఓం

"శ్రీ గురుభ్యో నమః"

శ్రీ అ|| ప|| నిత్యానంద కూర్మాచల ప్రభు చరణ దాసుడు,
సమరసానంద తిరుపతయ్య,

# ఆ శీ స్సు లు

శ్రీమత్ బృహత్ ద్వాశిష్ట సిద్ధాంత – శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షిత గురుపీఠ పరంపర – శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, అఖిల భారత అధ్యక్షులు, సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు – శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములు, ధర్మవరం వాస్తవ్యులు. పూర్వజన్మ సుకృత పుణ్యాత్ముల విశేషమెమొ కాని, మానవ కర్తవ్యాన్ని అర్థం జేసుకొని, సద్గురువులను ఆశ్రయించి – తన నిజ తత్వాన్ని గ్రహించి, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తెలియజేసె, సర్వ గ్రంథములను పరిశోదన జేసి – నిజ అర్థములను గ్రహించి, ఆత్మ విద్య – పరిపూర్ణ విద్యలో నిష్ఠావంతులు; నిపుణులు – శిష్యులకు ఎటువంటి సంశయములు వచ్చిన తీర్చేవారు.

వైజ్ఞానిక వేదాంత సభలకు అధ్యక్షులుగా వుండి – గురువులు; భక్తులు చెప్పిన విషయములను/బోధను విపులీకరణజేసి శ్రోత్రలకు, చక్కగా అర్థమయ్యేటట్లు వక్కాణించగ – అట్టి విషయములన్ని గ్రంథ రూపముగా వ్రాస్తే చాల బాగుండునని; అంతేగాక క్రమబద్దంగా బోధను అర్థముజేసుకోవచ్చునని కోరుకొనగా – దయామయులు, కరుణాకటాక్ష హృదయులు – శిక్షణ తరగతులుగా గురుగీతను మరియు భద్రాద్రి రామ శతకమును, భావార్థ రూపముగా విశ్లేషించి చెప్పిన ఆడియో–వీడియో క్యాసెట్లుగా తయారుజేసి భక్తకోటికి అందించినారు.

అట్లు తయారు జేసిన గ్రంథరూపము దాల్చుటకు – స్వామివారి ప్రియ శిష్యులైన కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా, హొసకోటె తాల్లూక,

వైట్ ఫీల్డ్, నారాయణకెరె గ్రామ వాస్తవ్యులైన ఎన్.వి. వీరభద్రయ్యగారు – క్యాసెట్లలో, బోధను వినుకుంటూ – కంప్యూటరులో ఎంతో కృషి జేసి, కన్నడ భాషలో మరియు తెలుగు భాషలో గ్రంథ రూపముగా తయారు జేసినారు. ఈ గ్రంథములోని అంశములు – సృష్టి క్రమము మొదలుకొని – పరిపూర్ణ బోధవరకు చక్కగా తెలియజేసినారు. కావున ఆధ్యాత్మ జిజ్ఞాసపరులకు ఎంతో మేలుజేసిన శాశ్వితాతీంద్రసాంద్రులు అయిన, శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వామిగారికి గ్రంథ తయారునకు మరియు ముద్రణకు కృషీవలురైన శ్రీ వీరభద్రయ్యగారికి కృతజ్ఞత భావాలు తెలియజేస్తున్నాను.

ధన్యవాదములు.

ఇట్లు
శ్రీ నిత్యానంద కూర్మాచల ప్రభు చరణ దాసుడు,
సమరసానంద తిరుపతయ్య,
గ్రామం : కుస్మ సముద్రం – మండలం : కుల్కచర్ల.
జిల్లా : రంగారెడ్డి జిల్లా.
ఆంధ్ర ప్రదేశ్.

తేది॥ **12-04-2007.**

శ్రీ అ॥ ప॥ బోధానంద కంబాల గురుమూర్తి రాజయోగి,
అచల విద్యావిశారద – శ్రీ సత్యప్రబోధన రాజయోగాశ్రమం,
విజయనగరం జిల్లా,

## గ్రంథ ప్రశంస

సీ॥ శ్రీమించు భద్రాద్రి। రామ శతకమంత
రచియించు నర్సింహా। దాస గురుడు
ప్రథమమ్న జీవాత్మ। పరమాత్మ తానుగా
దర్శించు యోగ్యుడె। ధరణియందు
ఆవల పరిపూర్ణ। మచలంబు దర్శించ
భ్రాంతి యా ప్రజ్ఞాన। భావమంత
యెరుకగాకను పడి। గుర్తుగా మరుజన్మ
కారణమగు నని। నెరగియున్న॥

తే॥ నన్ను స్వప్నము రీతిగా। సున్ననుచు
పూర్ణబోధను మేల్కలో। జూడ నీదు
తత్వమంతయు యెటుబోయె। తాను లేని
ద్వైవస్థితియందు। పరమ కైవల్యముక్తి
అనుచు బోధించువారని। యచల ఋషులు॥

సీ॥ వసుధలో అశరీర। మార్గంబు యేదన ?
శ్రీ బృహద్వాశిష్ట। సిద్ధాంతమగును
అందులో నెరుకగ। అయమాత్మ బ్రహ్మమే
తానను దర్శించు। తత్వవిదుడు
పరిపూర్ణ మెరుకల। వస్తు నిశ్చయముగ
దర్శించి యెరుకను। దక్కకుండ
భ్రాంతికి లోనవ్వ। పరిపూర్ణ స్థితితోడ
నిలుచుండు యోగ్యుండె। నిజగురుండు॥

తే॥ అనుచు బోధింప శ్రీ సుబ్బా। రాయ స్వామి
అచల బోధ వాచస్పతి। నార్యులంత
బిరుదుతో మిమ్ము కొనియాడ। ప్రేమమీర
మీదు జన్మంబు సార్థకం। క్షితిలో జూడ॥

అచల ఋశి శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ గురుపడి మార్గమందు, పరిపూర్ణ సిద్ధాంతులు; పరమనిష్టగ శిష్యులు అచల గురువులు, శ్రీ పరశురామ నర్శింహదాసవరేణ్యులు – అచల బోధ సిద్ధాంతములోనున్న పరమ ధర్మములు గుహ్యాతి గుహ్యములు గ్రహించి, పరిపూర్ణ బోధ ఆరూఢ పురుషుడై, శ్రీ శివరామ దీక్షితులవారి అడగుజాడలలో ఆచరించి, శ్రీ బృహద్వాశిష్ట శివరామ దీక్షితీయం, పరిపూర్ణ బోధ సిద్ధాంతాన్ని ఆపోసనపట్టిన మహనీయుండు. అందుచేత రాబోవు తరమువారగు; అచల భావజ్ఞులకు విహంగ మార్గముగనున్న – ద్వాదశి; షోడశి; పంచదశి మంత్రనిర్ణయమును, దృష్ఠ ద్రాష్ఠంత బయలెరుక కల, ఈ మూడు ముక్కలుగా – గురుసూచన ద్వారా బోధింప పూర్వజన్మ సంస్కార పుణ్యపురుషులుగానున్న – యెరుకరాహిత్య పరిపూర్ణ పరబాహ్య సమాధి స్థితి చేకూరదని గ్రహించినవారై, నిజమైన పరిపూర్ణ మార్గమును గ్రహించిన వారలచే – సాంప్రదాయక గురువుల ద్వార గ్రహించి, దీక్షితులవారు శలవిచ్చునట్లుగా "క్షరా క్షరోపాధి ద్వయరహితం । పరమ తత్వవిచారణశ్య ఫలం" అన్న సూక్తిని ఆధారముగా, శ్రీ భద్రాద్రి రామ శతకము ద్వారా – పిపీలికా మార్గముగా యెరుక పరుస్తూ నిశ్శయముగా అనగా, అఖండాత్మను తానుగా గ్రహించునప్పుడే, పరిపూర్ణత చెందగలరని – మిడిమిడి జ్ఞానముచేత సర్వము తెల్సునని అహంకారము గలిగి, సాంప్రదాయమునకు కళంకముతేగలరని, సర్వవిజ్ఞాన స్వరూపుడైన, శ్రీ నరసింహదాసుగారు పరిపూర్ణబోధకు లక్షణయుతుడుయై – నే నెవ్వరు అని విచారించు నిర్ణయమున – అది పరమాత్మ; ప్రకృతి; జీవాత్మ దర్శన విధానమును, సమస్త సృష్టి ధర్మమర్మములు దెల్సుతూ – తాను అఖండ పరమాత్మగా అనుభవ ఆరూఢత చెందుతూ పరిపూర్ణ బోధ నిర్ణయమున:

శృ ॥ శాస్త్రదృశ్యం గురుర్ వాక్యం । తృతీయం
ఆత్మ నిశ్చయం । చతుర్థం సంశయచ్ఛేధం ।
పంచమం ముక్తిదాయకం ॥

అనిన శృత్యానుసారముగా పరిపూర్ణం దర్శింపచేయు విధానము సూచించియున్నారు, శ్రీ నరసింహదాసు సద్గురువులు గాన. మా ఆత్మీయులు; మిత్రులు – శ్రీ అచల బోధ వాచస్పతి శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ స్వాములువారు, శ్రీ భద్రాద్రి రామ శతకమును – అందులో భావర్ధమును, విశేషార్ధమును విమర్శన పూర్వకముగా నేటి సాంప్రదాయకమునకు – పరిపూర్ణ బోధస్థితికి మొదటి మెట్టుగా – పరమాత్మ తత్వవిచారణ అవసరము గ్రహించినవారై, క్యాసెట్లు ద్వారా; సి.డీ.లు ద్వారా; సాంప్రదాయకము కొరకు ఉపన్యాస రీతిలో అందించినారు. ఎట్లంటే – ఆ పరమాత్మ

నిర్ణయము దర్శించు విధానం; తరువాత ఆయనకు సంకల్పం ఎట్లుగలిగినది? ఆ సంకల్పములో మాయ ఏ విధము గావచ్చినది? మాయనుండి పంచభూతములు ఎట్లు ఏర్పడినవి? తద్వారా ఎనుబదినాల్గు లక్షలు జీవరాశులు – అందున ఆయన అనుప్రవేశము ఎట్లు జరిగినది? జ్ఞానదశ తానే పరమాత్మనని – ఆత్మ నిశ్చయవస్తు జ్ఞానమున ఏకముయగుట తదుపరి పరిపూర్ణబోధ గ్రహించుటలో పరిపూర్ణత జెందుట (జన్మరాహిత్యము) అచల ఋషి సాంప్రదాయమున, సంపూర్ణముగా తత్వము ద్వారా గ్రహించి, సంపూర్ణతచెందుచున్న విధానమంతము, శ్రీ వివేకానంద బండారు సుబ్బారాయ స్వాములవారు గురుకృపచే గ్రహించి ప్రచారము చేస్తున్నారు.

వారు మాయందు ప్రేమచే; పెద్దల అభిప్రాయముచే రచియింపబడిన బృహత్ గ్రంథము, శ్రీ భద్రాద్రి రామ శతకము – సాంప్రదాయ గ్రంథ రచియింపుగాన – తమ శిష్యులు, ఎన్. వి. వీరభద్రయ్యగారు సాంప్రదాయమును – కన్నడ భాషలో మరియు తెలుగు భాషలో – కర్నాటకలో ప్రింటుచేయించ సమర్థతగలిగి – భారత దేశము నలు మూలలా సాంప్రదాయపరులకు అందించబడుటలో చాలాగొప్ప విషయము – మాకెంతో ఆనందమైనది. ఇతర భాషలలోకి, అచల సిద్ధాంత ధర్మము వ్యాపింపచేయుట గొప్ప విషయముగా భావించుచున్నాము.

శ్రీ సుబ్బరాయ స్వాములవారు, శ్రీ భద్రాద్రిరామ శతకమునుండి గ్రహించిన సాంప్రదాయ ధర్మమర్మములు, తన స్వస్వరూప తత్వజ్ఞానము – తాను స్వానుభవములో చెప్పిన ఆత్మ బోధ సారాంశమంత, ఈ నాటి సాంప్రదాయ భక్తకోటికి అవసరము గాన – తత్ గ్రంథ సారాంశము, ఆసాంతముగా చదివి సాంప్రదాయకులు ఇహ–పరముల సుఖించి; పరమసుఖదమైన భావముతో, పరమకైవల్య పరిపూర్ణత చెంది, లోక కళ్యాణమునకు; సర్వమానవ సౌభ్రాతృత్వమునకు; విశ్వశాంతికి మార్గదర్శులై వర్ధిల్లు గలరని ఆశిస్తున్నాను.

వందనములు,

ఇట్లు
బుధజన విధేయుడు,

శ్రీ అ॥ ప॥ బోధానంద కంబాల గురుమూర్తి రాజయోగి,
అచల విద్యావిశారద – శ్రీ సత్యప్రబోధన రాజయోగాశ్రమం,
**c/o** టీచర్స్ కాలోని – ఓల్డ్ ఎమ్. ఆర్. ఓ. ఆఫీసు ఎదురు,
గరివిడి మండలం, **P.O.** శ్రీరాంనగర్ – విజయనగరం జిల్లా,
Pin - **535101,** Phone No. . **08952 - 282438.**
ఆంధ్ర ప్రదేశ్.

ఓం

"శ్రీ సద్గురువే నమః"



శ్రీ అ॥ పరిపూర్ణానంద గౌడు చెర్వు బ్రహ్మానంద పరం.
అరవమండ్ల పల్లి; ఆంధ్ర ప్రదేశ్.

## అభినందనలు

పుణ్యోదయ పాఠకోత్తములారా !

ప్రపంచ చరిత్రను పరిశీలిస్తే - అనేక మంది మహనీయులు ధర్మార్థకామ ములందు శాశ్వతానందం లేదని, "మోక్షము" నందు మాత్రమే శాశ్వతానందం కలదని - అట్టి మోక్ష సాధనకు అనేక మార్గాలను ఏర్పరిచినారు. ఇవి అన్నియు కేవలము భ్రాంతితో కూడినవె. వీటికి అతీతముగా భ్రాంతి రహిత మార్గమును, మోక్షాతీత మార్గమును, వస్తునిశ్చయ మార్గమును ఏర్పరచి - నిజ నిర్ధారణ చేసిన సద్గురు పరంపర సాంప్రదాయకులు శ్రీ శివరామదీక్షిత ప్రభువులు. ఈ పరంపరలోని వారే, శ్రీ పరశురామ నరసింహదాసు ప్రభువులు. శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువులు అన్నట్లు "సకల నిగమాగమాది ప్రకర మహానారికేళ ఫలసారము దీసోక । గ్రంథము జేసితి లౌకిక జనులొక పేళ గొన్న కీడు దొలంగున్" శ్రీ మత్పరశురామ నరసింహదాసు ప్రభువులు అనేక గ్రంథాలను పరిశీలించి సర్వజనులు ఏలాంటి కఠినాభ్యాసములు లేకుండా అర్థము చేసుకొని, సత్ప్రవృత్తి పరులై - మతకుల వివాద హద్దులు లేకుండా, సాంగోపాంగముగా బోధను తెలుసుకొని పరమశాంతిని పొంది, భ్రాంతిరహితులు కావడానికి "శ్రీ భద్రాద్రి రామ శతకము" అనే సీసపద్యములు గల శతకమును రచించగా - ఈ పద్యాలుకు క్లుప్తముగా భావార్థములును, శ్రీ సచ్చిదానంద పగడాల వెంకటేశ్వర అవధూత ప్రభువులు రచించి సాంప్రదాయకులకు అందించినారు.

శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములువారు, బాల్యమునుంచి అనేక మంది పెద్దల సేవ చేసి, సర్వమతాలలోని సారమును గ్రహించి – చివరికి సద్గురు పరంపర సాంప్రదాయకగురువులైన శ్రీ నిర్మలానంద గట్టు నాగయ్యార్య ప్రభువుల వద్దకు చేరి – ఇరుతర భక్తి కల్గి, చతుర్విధ శుశ్రూషలు చేయుచూ – గురువుగారిని తన ఇంటి వద్దనే నిలుపుకొని వేదాలను; వేదాంగాలను; ఉపనిషత్తులను; బ్రహ్మసూత్రములను; భగవద్గీతను; భారత; భాగవత; రామాయణ గ్రంధాలను; అష్టాదశ పురాణాలను – సాంఖ్య; తారక; అమనస్క; మహావాక్యములను – ఇతర మత గ్రంధాలను; సాంప్రదాయక గ్రంధాలైన గురు గీతలు; దీక్షితీయము; భద్రాద్రిరామ శతకము; కృష్ణదేశిక ప్రభువుల కందార్థ దరువులు; కంద పద్యాలు; అవధూత గారి కందార్థ దరువులు; పరిపూర్ణ బోధ సిద్ధాంత శిరోమణి; శిఖామణి; భూమానంద వద్ది నారాయణదాసు గారి తత్వాలను – ప్రశ్నలను, ఇంకా – పెద్దల రచనలను తెలుసుకొని – గురుకరుణ పొంది, గురువాక్యాన్ని ఆరూఢ పరచుకొని, గురుసేవ జేస్తూ – గురు ధర్మంలో మెలగుతూ, నిరంతరం అనేక ప్రాంతాలను తిరుగుతూ – తరతమ భేద భావములు లేకుండా – సర్వజనుల సుఖశాంతులను కోరి – సులభోపాయముగా బోధచేయుచున్న – పరమదయాంత కరణులు; నిస్వార్థ పరులు; ఆదర్శమూర్తులు; త్రికరణ శుద్ధిగలవారు; విశ్వమానవ సౌభ్రాతృత్త్వము; మానవాళి ఐహికాముష్మిక సుఖశాంతుల కోసం – తమ జీవిత కాలమంత కృషిసల్పుతున్న పుణ్యపురుషులు – శ్రీ లక్ష్మిసమేత శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములువారు. వీరు, కృష్ణ ప్రభువులు అన్నట్లు – "ఎన్నో గ్రంధ జలధులను తిన్నగ మధియించి చూస్తే తేలెను సారం" – అన్నట్లు సర్వ గ్రంధాలలోని ధర్మమర్మములను; విషయములను ఉపమాన ఉపమేయములుగా తీసుకొని – అందరికి అర్థమయ్యే విధముగా సాంప్రదాయక ప్రబోధను, అతి విస్తారముగా "శ్రీ భద్రాద్రి రామ శతకమునకు" భావార్థమును భక్తులకు తెల్పగా – దీనికి కన్నడ అనువాదము చేసి, కన్నడ భక్తకోటి ప్రజలంత తెలుసుకొని – భ్రాంతిరహితులు కావడానికి సత్సంకల్పము చేసిన మహనీయులు – శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులైన శ్రీ అ॥ ప॥ ఎన్.వి. వీరభద్రయ్యస్వామిగారు – కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రామాంతర జిల్లా; హొసకోటె తాల్లూక్; వైట్ ఫీల్డ్; నారాయణకెరె గ్రామ వాస్తవ్యులు – వీరు చేసిన కృషి అమోఘము; అద్బుతము. అందరు వీరి పరోపకారతత్త్వమును అర్థము చేసుకొని – ఈ గ్రంధమును ప్రతియొక్క అచల సిద్ధాంత సాంప్రదాయపరులందరూ తీసుకొని – చదివి, ఇతరుల చేత చదివించి, యదార్థమును గ్రహించి/తెలిసి – మననము చేసుకొని; ఆచరణకు గావించుగొని – సద్గురు కరుణకు పాత్రులై; భ్రాంతి రహితులు కావాలని కోరువాడను. శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యస్వామిగారు – సాంప్రదాయక గ్రంధములను కన్నడ భాషలోకి అనువాదము చేసి మరియు తెలుగు భాషలోను గ్రంధములను ముద్రించి

– కన్నడ ప్రజలందరికి అచల సిద్ధాంత సాంప్రదాయక ప్రభోదను అందించి – సద్గురు కరుణాకటాక్ష వీక్షణ సంభాషణలకు పాత్రులై – ఆయురారోగ్యములతో; సకల సంపదలతో వర్ధిల్లుతూ – భ్రాంతిరహితులై వుండాలని సద్గురు దేవుని ప్రార్థించువాడను.

పూర్ణానంద గౌడు చెర్వు బ్రహ్మానంద రెడ్డి అయిన నేను, శ్రీ శివరామ దీక్షితాచల గురు పరంపర గురువులైన శ్రీ సీతాసమేత శ్రీ అమలానంద వెంకటస్వామి రెడ్డి ఆర్యుల దంపతులకు **1971** సంవత్సరం, అక్టోబర్ నెల **26**వ తేదీన – అనంతపురం జిల్లా, నంబుల పూలకుంట మండలం, పి. కొత్తపల్లె గ్రామము దిగువూరు పల్లెలో జన్మించి – ఎమ్.ఎ., బి.ఇడి., చదివి ప్రభుత్వ ఉపాధ్యాయ వృత్తి చేయుచున్నాను. బాల్యము నుంచి దైవభక్తి కలిగి – తల్లిదండ్రులను; పెద్దలను గౌరవిస్తూ, వారు చెప్పిన విధముగా నడుచుచూ – రామాయణ; భారత; భాగవత గ్రంధాలను చదువుతూ దైవ ప్రీతితో జీవిస్తూవుండగా – నేను ఇంటర్మీడియట్ చదువుచుండగా, పుట్టపర్తి వెళ్ళి సాయిబాబా స్వామి వారిని దర్శించి – వారి ఉపన్యాసములకు, అక్కడ గల క్రమశిక్షణకు ఆకర్షితుడనై, స్వామిగారి రచనలైన – ప్రేమవాహిని; విద్యావాహిని; సందేశవాహిని; భాగవతవాహిని; గీతావాహిని; ఉపనిషత్ వాహిని; రామాయణ వాహిని; ప్రశ్నోత్తర వాహిని మొదలగు గ్రంధాలను చదువుతూ, అక్కడ జరిగే ఉత్సవాలకు వెళ్ళుచూ – స్వామిగారిని సాక్షాత్ దైవ స్వరూపముగా భావించి, ఆరాధించే వానిని. స్వామివారు ప్రతి మానవుడు తోటివారిని ప్రేమించాలని; భూతదయకల్గి; నిత్యతృప్తి కలిగి; సత్యవ్రతము కల్గి – ధర్మము తప్పక జీవిస్తూ, దయ; జాలి; కరుణలను కల్గి – ఎవ్వరికి హాని చేయుకుండా అహింసవ్రతము కల్గి – కోపము; అసూయ; స్వార్థము లేకుండా జీవించాలని – వీటికి అనుకూలముగా అనేక ఉపకథలను తెల్పేవారు. అక్కడికి వచ్చే దేశ విదేశాలవారు – స్వామివారు చెప్పినట్లే ఆచరిస్తూ జీవించె వారు. నేను కూడా వారివలే ఆచరిస్తూ – స్వామి ఉన్నప్పుడే నేను పుట్టడం, స్వామిగారిని దర్శించడం; స్వామి బోధనలను వినడం – నా అదృష్టముగా భావించేవాడను.

ఇటువంటి సందర్భములో – మా నాన్నగారి శిష్యులైన ఎద్దులవారి కోట శిష్య బృందము, నా వద్దకు వచ్చి – నాన్న వయస్సు మీరినదని, నీవు అన్ని బోధలకన్నా గొప్పదైవ గురు ఉపదేశం తెలుసుకోవాలని – ఇది తెలుసుకొన్న వారికి మాత్రమే జన్మరహితము; భ్రాంతి రహితము కల్గునని కావున – నీవు తప్పక తెల్సుకోవాలని నన్ను వారి పల్లెకు తీసుకు వెళ్ళి – **1999** సంవత్సరం డిసెంబర్ నెల **27**వ తేదీన, మా నాన్నగారి వద్ద ఉపదేశము తెలియజేసినారు. మా తండ్రి వద్ద ఉపదేశము పొంది బోదాధికారము పొందిన శ్రీ నిర్మలానంద వెంకటరమణస్వామి ద్వారా, శ్రీ వివేకానంద బంఢారు సుబ్బరాయార్యుల పరిచయ భాగ్యము నాకు కల్గడము, **2005** సంవత్సరం గొల్లగూడెంలో

జరిగిన గురుపూజా కార్యక్రమములో నేను పాల్గొని, తిరుగు ప్రయాణంలో శ్రీ వివేకానంద స్వామితో కలిసి రైలులో వచ్చునప్పుడు – స్వామిగారు మీకు బోధ సాంప్రదాయకముగా అర్థమయినదా అని అనగా – మేము "వున్నది పరిపూర్ణము"; "లేనిది ఎరుక" అనగా – స్వామి ఇంత తేలికగా బోధ అనుభవానికి రాదు, బోధ మొత్తము సాంగోపాంగముగా అర్థము కావాలంటే – ముందు శ్రీ భద్రాద్రి రామ శతకములోని పద్యాలకు భావార్థము తెలుసుకోవాలని తెల్పి – మా పై కరుణించి; మా పల్లెకు వచ్చి – శ్రీ భద్రాద్రి రామ శతకమునకు పూర్తి భావార్థము తెల్పగా, అది విన్న నాకు ఎంతో ఆనందము కల్గినది. శ్రీ కృష్ణ ప్రభు అన్నట్లు "ధారుణి కొంత జరించి విచారించితి గాని యీ విచారణము నేనెవ్వారలు జెప్పగ । వినలేదారయ మీ నోట విన్నదయ్యా గురుమూర్తి" – స్వామిగారి బోధ విన్న తరువాత మన పెద్దల గొప్ప తనము వారు చేసిన నిస్వార్థ సేవ ఎడల నాకు ఎంతో భక్తి విశ్వాసములు కలిగినవి. శ్రీ వివేకానంద స్వామిగారు భద్రాద్రి రామ శతకమునకు భావార్థమును తెల్పుతూ, అనేక గ్రంధాలలోని విషయాలను సందర్భానుసరముగా – ఉపమాన ఉపమేయాలతో సర్వజనులకు అర్థమయ్యే విధానములో చెప్పినారు. స్వామి మొదుట ప్రపంచము ఎలా ఉత్పత్తి అయినది; ప్రపంచమనగా పంచభూతములతో కూడినదని – ఈ పంచ భూతముల వర్ణ; గుణ; బీజ; శక్తులు; అధి దేవతలను తెల్పుతూ – వీనిచే ఉద్బీజములు; అండజములు; స్వేదజములు; జరాయువుల ద్వారా **84** లక్షల జీవులు ఎట్లు ఏర్పడుచున్నవో తెల్పుతూ – వీనితో మానవ జన్మ విశిష్టతను తెల్పుతూ, నరప్రమాణమును తెల్పి – **96** తత్వాలను వివరిస్తూ, బ్రహ్మాండము వలన పిండాండము ఎలా ఏర్పడినది? పంచీకరణను – పిండాండమందు పంచ భూతములను; పంచ భూతాంశగుణములను; పంచకోశములను; **14** వాయువులను; సప్త ధాతువులను – వీని పరిణామ క్రమమును – స్థూల; సూక్ష్మ; కారణ; మహాకారణ; కైవల్య దేహాల పంచీకరణను తెల్పి – జాగ్రత; స్వప్న; సుషుప్త్య; తుర్య; తుర్యాతీత అవస్థలను – **25** ఇంద్రియాలు; వీని అధిదేవతలను తెల్పుతూ – ఇవి అనాత్మలని వీటిని ఎరిగే "ఆత్మ నీ స్వరూపమని" తెల్పి – బ్రహ్మాండమును చూపిస్తూ, విచారించి షోడశకళలను విచారించగా – నా ఆనందమునకు అవధులు లేవు. ఎందుకనగా మునుపు నేనెన్నడు విన్నది; కన్నది ప్రత్యక్షముగా – ఈ శరీరములోనే సకల దేవతలను – వారి వారి పనులను విచారించగా – నాకు బయటగల దేవతా భ్రాంతి; పరలోక భ్రాంతి నశించి "నేను" అనేదే అన్నింటికి అధిష్టానమున వున్నదని – అది "నా స్వరూపమైయున్నదని" – నా నిజస్థితి; నా స్వరూపము స్వామి ద్వార – నాకు తెలియబడి, ఇదే "ఎరుకగా"; "తెలివిగా"; "అహంకారముగా"; "ద్రష్టగా"; "జ్ఞాతగా"; "చైతన్యముగా" అనేక పేర్లతో వున్నదని తెలియబడి, బయట ఇతరులు చూసే మహత్తులు – ఈ శరీరములో గల మహాత్తులముందు ఎందుకు పనికి రాకుండా

పోవడమే గాక, శ్రీ వివేకానంద స్వామిగారి గొప్పతనము తెలియబడినది. తర్వాత స్వామిగారు మానవుడి ఆకారములో మానవునిగా వుండటం కాదు, గుణాలతో మానవుడు మానవునిగా జీవించాలని తెల్పుతూ, మానవుడు – సత్వ; రజో; తమో; గుణాలలో "సత్వ గుణాన్ని" కలిగి – గురువును చేరి, దశనాడులను – అందు ముఖ్యమైన ఇడా; పింగళ; సుషుమ్న నాడులను గూర్చి తెలుసుకోవాలని, వాటిని గూర్చి తెల్పుతూ – ఈ దేహములోనే **14** లోకాలను; పాలకులను గుర్తించి – గ్రహించి, వీరి స్థానములను తెల్పుతూ – సకల జీవులకు ఆకలి దప్పికలు – ప్రాణధర్మములని; సుఖ దుఃఖములును – మనోధర్మములని; చావు పుట్టుకలు – దేహధర్మములని తెల్పుతూ, ప్రతి మానవుడు "జ్ఞాని" కావాలన్న – నిరంతరమూ "శాంతితో"; "నెమ్మదితో"; "త్యాగముతో"; "ధర్మముతో"; "తృప్తితో" – నిర్భయముగా జీవిచాలన్నా! అందరిచే గౌరవింపబడలన్నా! సకల సుఖాలు పొందాలన్నా! – సత్య; న్యాయ; నీతి ధర్మములతో – నిష్కామ; నిస్వార్థ బుద్ధితో – కపటకుటిలమోసరహితుడై – మానవుని అధోగతికి దిగిజారు చేసేటువంటి – ఈ అష్టమదములు, అష్టపాశములు; మలత్రయ, తాపత్రయ, ఈషణత్రయ, వాసనాత్రయలు; అష్ట రాగాదులైన – రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరములు లేకుండా జీవించాలని తెల్పి, స్త్రీ– పురుష; మత – కుల; పేద – ధనిక – భేదభావాలు వుండరాదని, "వసుధైక కుటుంబ భావన కల్గి జీవించాలని"; నిరంతరం "బ్రహ్మానంద సుఖాన్ని అనుభవించాలని" తెల్పుతూ – "పరిపూర్ణ బోధకు" సాధన సంపత్తి కల్గినవాడు; సత్యాసత్యములును నిర్ణయించేవాడు; గురువుగారికి త్రికరణ శుద్ధితో – తను, మన, ధన, ప్రాణముల్ సమర్పించి – ప్రపంచములో "గురువును" వినః – ఇక ఏది గొప్పది కాదని; "గురువు గారిపైన"; "గురువాక్యములపైన" – అచంచల విశ్వాసము; ఇరుతర భక్తి కల్గి – స్థాన, అంగ, భావ, ఆత్మ చతుర్విధ శుశ్రూషలు – బాహ్యాంతరములలో ఆచరించేవారు అర్హులని; "గురువులు" కూడా – సకల తేజోమయమనటువంటి, అమృతమయమైనటువంటి విద్యను/విషయములను బోధించి/తెల్పి – ఆచరణపరులైన వారు అర్హులని తెల్పినారు.

అధికారి అయిన శిష్యునికి తర్వాత – "గురువు" అష్టాంగ యోగములు; మంత్రలయ; హఠరాజ యోగములు; – సాంఖ్య; తారక; అమనస్కములు పంచముద్రలు; మహావాక్యములను తెల్పుతాడని – ఇవన్నియూ తెల్పితూ – జీవేశ్వరైక్య సంధానము; పూర్ణ భావము; సప్త చక్రాలను ప్రత్యక్షముగా తెల్పుతూ – ఆత్మజ్యోతి స్థానము; పరమాత్మ స్థానము – ప్రకృతి; క్షర; అక్షర స్వరూప లక్షణం – ఆత్మ సర్వగత లక్షణం; ఇంద్రియాలకు విలక్షణం – ఎరుక నిర్ణయం; సర్వం ఖల్విదం బ్రహ్మ; పంచ

భూతైక్య నిర్ణయం; జ్ఞానియయ్యే లక్షణం; మహావాక్యాల నిరసన; అంటి అంటని లక్షణం; పరిపూర్ణ బోధ; కేవలాత్మ లక్షణం; ఇంద్రియాతీత లక్షణం; ఎరుకనిరసన లక్షణం; దృష్టాంత లక్షణం; ప్రకృతి ద్వయ సృష్టి రహితము; మాయా నామములు; కాలాతీత లక్షణం; హేతృత్వ రహితము; విషయ రహిత లక్షణం; బోధ స్థితి లక్షణం – తెల్పి భ్రాంతిరహితము చేసినారు. ఈ గ్రంధములో – "వేద వేదాంత సారము అతి విస్తారము"; "ఇది అమృత కలశము"; "వేదాంత క్షీర మహార్ణవము". శ్రీ వివేకానంద స్వామిగారు పై విధముగా శ్రీ భద్రాద్రి రామ శతకమునకు సవిస్తారముగా – సర్వులకు అర్థమగునట్లుగా భావార్థములును తెల్పి, సాంప్రదాయక ప్రబోధ నేడు – అనేక "రాష్ట్రాలలో వ్యాప్తి కావడానికి"; "సకల జాతికులమతధర్మాలువారు బేధభావాలు లేకుండా ఏకత్వభావము పొంది – సమన్వయభావము ఏర్పరుచుకొని – "స్వర్ణ యుగము ఉదయించేకి" మార్గము చూపిన; కృషి జేసిన "అతీంద్రియ దృష్టి కలిగిన మాహాత్ములు". ఈ మాహాత్ముల ప్రబోధను సర్వజన సమ్మతమై – శ్రీ కృష్ణ ప్రభువులు అన్నట్లు "ఘటమెదుటబెట్టి చూసిన యటువలె బయలుండ జూపి" – వస్తు దర్శన పద్ధతిలో యుండును. కావననే సర్వులు స్వామిగారిని "సభా సామ్రాట్"; "అచల బోధ వాచస్పతి" అని సంభోదిస్తూయున్నారు.

నా సర్వ సంశయములు తీర్చిన నా ప్రభువు, మనందరి ప్రభువులు "మన కోరకు; మానవకులకోటికంత శ్రమవహించి సాంప్రదాయక మర్మధర్మాలును తెల్పి, మానవులు అశరీరలైయ్యే మార్గమును జూపించిన మార్గదర్శుకులు; ధరణియందు అవతరించిన మహాత్ములు – శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ్యార్యుల వారి – దర్శన; స్పర్శన; వీక్షణ; సంభాషణలను" నిరంతరమూ కోరుతూ, అభినందనములను తెలుపుతున్నాను.

నమస్కారములు,

ఇట్లు,
అనుక్షణం గురు సెవలో,
శ్రీ అII పరిపూర్ణానంద గౌడు చెర్వు బ్రహ్మానందరెడ్డి,
అరవవాండ్లపల్లే; నంబుల పూలకుంట మండలం;
అనంతపురం జిల్లా; ఆంధ్ర ప్రదేశ్.




శ్రీ అ|| ప|| గురు సేవానంద నంజుండార్యులు,
అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య – కర్నాటక ఉపాధ్యక్షులు

## అభినందనలు

శ్రీ శ్రీధర శివరామ దీక్షిత అచల గురు పరంపర – అఖిల భారత రాజయోగాశ్రమ సేవా సమాఖ్య అధ్యక్షులైన అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు – శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల వాచ్యార్థ బోధ విని, సులభసూత్రప్రాయముగా – అందరికీ అర్థమయ్యే రీతిలో, తెలుగు భాషలో శ్రీ భద్రాద్రి రామ శతకములోని పద్యములకు భావార్థము చెప్పినారు. విద్యావంతులు; అవిద్యావంతులకు కూడా కరతలామలకముగా, సరళముగా – కందార్థములకు; కందపద్యములకును; వేదోపనిషత్సారాంసములు అన్వయించి, ఆడియో వీడియో సీ.డీలు చేసి – అచల పీఠమునకు ఎనలేని సేవ, కృషి చేసి – ఆంధ్ర రాష్ట్రమునకే పరిమితం చేయక, భారతములో అన్ని రాష్ట్రములకు వ్యాపింపచేసినారు – అందులకు, మేము ఆయనకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

కర్నాటక రాష్ట్రములో మాకు తెలుగు భాషలో సమగ్ర అవగాహన లేనందున, శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యగారు **27-1-2006** యందు గురువు ద్వారా ఉపదేశము పొంది, అటు తెలుగు – ఇటు కన్నడ గ్రంథములను, తనవంతు కృషి చేసి తోడ్పడినందుకు – తెలుగు భాష ఆడియోలో విని, దాన్ని కన్నడ భాషలోనికి

అనువాదము చేసి, కంప్యూటర్లో స్వయముగా అవిరళముగా; అవిశ్రాంతముగా అటు తెలుగు – ఇటు కన్నడ భాషలో గ్రంథాల ముద్రణకు తోడ్పాటునంద చేసినందులకు, మా రాష్ట్ర సాంప్రదాయ అచల గురుపుత్రులందరూ అతనికి మా హృదయ అభినందనలు తెలియజేస్తున్నాము. సకల మానవులకూ అనుసరించదగ్గది, ఈ అచల సిద్ధాంతము. మా అనుభవములో వేమనగారు చెప్పినట్లుగా: "నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు । తళుకుబెళుకురాలు తట్టెడేల? చదువ పద్యమరయ చాలదా ఒక్కటి!" అన్నట్లు: విలువకలిగినట్టి ఒక్క రత్నము చాలు. తళుకుబెళుకు కలిగిన గంపెడు గాజురాళ్ళు ఉన్నా విలువలేనివి. ఆ విధముగా వందల వేల పద్యముల కంఠస్తముచేయనక్కరలేదు, ఒకే పద్యము నిజ భావార్థము తెలిసి ఆచరించితే చాలు; అన్నట్లు వేన వేల గ్రంథములను శోధించనక్కరలేదు. ఈ అచల బోధ గ్రంథము ఒక్కటి చదివి అర్థముచేసుకొని ఆచరించి జీవితములో, ఏ సాధనములు లేకుండ సుఖము, శాంతులతో మోక్షమును కూడా సులభముగా పొందవచ్చునని నా మనవి.

ఇటువంటి గ్రంథమును భారత దేశమునకు అందించి అఖండ కీర్తిని సంపాదించుకొన్న శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య స్వాములవారికి మరియు వారి శిష్యుడు ఎన్.వి. వీరభద్రయ్యగారిని, ఆ సద్గురు పరమాత్మ మాకు ఇచ్చిన వరము. ఈ అచల పీఠమునకు వారి సేవలు ఇంకా అందించాలని కోరుతూ, అందరూ ఈ గురుసాంప్రదాయమును ఏకాభిప్రాయముతో గౌరవించి – ఒకే మాట ఒకే బాటగా బేధాభిప్రాయములకు తావు లేకుండ తోడ్పాటును అందివ్వాలని, వీరు ఇర్వురికి మా అభినందనలను తెలుపుతూ, గురుకృపాకటాక్షమునకు పాత్రులగుదురని సద్గురుని ప్రార్థిస్తున్నాను.

నమస్కారములు,

ఇట్లు,
శ్రీ అ॥ ప॥ గురు సేవానంద నంజుండార్యులు,
అచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య కర్నాటక
ఉపాధ్యక్షులు, బుసనపల్లి, కోలార జిల్లా – కర్నాటక.

ఓం

"శ్రీ సద్గురవే నమః"



శ్రీ అ॥ ప॥ నజీర్ అహమద్,

నంజంపేట గ్రామం, సోమల మండలం – చిత్తూరు జిల్లా – ఆంధ్ర ప్రదేశ్.

## అభ్యర్థన అభినందనాశిస్సులు

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు, శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య అఖిల భారత అధ్యక్షులు, శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు శ్రీ అ॥ ప॥ నజీర్ అహమద్ చేసుకొన్న విన్నపములు:

అఖిల భారత అచల సనాతన సాంప్రదాయ గురువులకు, వారి శిష్యులకు ద్వాదశి నమస్కారములు. ప్రస్తుత సమాజంలో, ఆధ్యాత్మికముగా దిగజారి పలుసాంకేతిక విషయములందు మునిగి తేలుతున్న సమయంలో, ఈ అచల పీఠ సాంప్రదాయమును పరంపరగా సాగించుకొనివస్తూ – అందులో వున్న లోటుపాట్లను సరిదిద్దుతూ, ఎంతో కృషి చేసి భద్రాద్రి రామ శతకమునకు వేద ఉపనిషత్ సారాంశము జోడించి – ఉపమాన. ఉపమేయదృష్ట ద్రాష్టాంతకములను సులభ శైలిలో వ్యాఖ్యానించి వీడియో–సి.డీ. క్యాసెట్లు రూపములో అందించారు. మన గురువులు సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు, శ్రీశ్రీశ్రీ వివేకానంద సుబ్బయ్యార్యులు – వీరి కృషి అమోఘము, అభినందనీయము. వీరికి భారత ప్రజలెల్లరూ ఋణపడి వున్నారు. అలాగే, వారి శిష్యులు ఎన్.వి. వీరభద్రయ్యగారు, కర్నాటక రాష్ట్ర, బెంగళూరు గ్రా.జి. నారాయణకెరె, వాస్తవ్యులు – వీరి మాతృ భాష కన్నడమైనను, శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల క్యాసెట్లలో ఉన్న తెలుగు

వాచ్యమునకు కంప్యూటర్లో ఇంగ్లీష్ లిపికి అందించి, దాన్ని కన్నడ తెలుగు భాషలోనికి మార్చడానికి ఎంతో శ్రమపడవలసి వచ్చింది. అందుకు కారణము ఆయన మాతృ భాష కన్నడ. తెలుగు వ్యాకరణములో పదములను సరిచేయుటకు వీలుకాక పలుమార్లు ప్రయత్నం చేసి మూడు ప్రతులు విఫలమై నాల్గవ ప్రతిని కష్టసాధ్యముగా మనముందుకు తెచ్చిన వీరి ఘనత అమోఘము. వీరి ధైర్యము, సాహసము, కార్యదీక్షత, పట్టుదల – గురుభక్తి మరియు ధర్మముపై వీరికున్న నమ్మకం, సహనము ఎంతో శ్లాఘనీయం, అభినందనీయం. వీరిలాగే ప్రతి ఒక్కరూ సనాతన సాంప్రదాయమును దృఢధీక్షత కలిగి ఆచరిస్తే, విశ్వమానవ కల్యాణమునకు తోడ్పడినవారౌతారు.

భగవద్గీతలో "నహి కల్యాణ కృత్ కశ్చిద్ । దుర్గతిం తాత గచ్ఛతి" – మంచి కొరకు తలపెట్టిన ఏ కార్యమైన వృథా కాదు అన్నట్లుగా – మనము చేస్తున్న ఈ ప్రయత్నము లోక కల్యాణానికి దారి తీస్తుంది అనటములో సందేహము లేదు. మంచి ప్రయత్నము అంటే, పవిత్ర ఖురాన్ ప్రబోధం ఇలా వుంది: " కానన్నాసు ఉమ్మతన్, వాహిదతన్ – ఫబఅసల్లాహున్నబియ్యీన । ముబష్షిరీన, వమున్‌జరీన, వఅన్‌జల – మఅహుముల్ కితాబ । బిల్ హఖ్ఖి, లియహ్కుమ, బైనన్నాసి – ఫీమఖ్తలఫూపీహి ।"

కాబట్టి ఓ! మానవులారా! ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి ద్వారా సృష్టించాడు. అదే ప్రాణినుండి దాని జతను కూడ సృష్టించాడు. తిరిగి వారిరువురినుండి కోటాను కోట్లమంది స్త్రీ పురుషులను ప్రపంచములో విస్తరింప చేసాడు. మీరు ఒకరి ద్వారా మరొకరు తమ అవసరాలను గడుపుకోవడానికి దేవుని పేరును ఒక సాధనముగా చేసుకుంటారు. అన్నట్లుగా, మనం అందరం కుల, మత, వర్ణ, వర్గ, జాతి, పేద, ధనిక అన్న భేదములకు తావివ్వక ఒకరికొకరు తోడ్పడుతూ సంఘసేవ, సమాజసంస్కరణ, దేశసేవలో మనవంతు కృషిని అందించి మనం సుఖపడుతూ ఇతరులకు సుఖశాంతుల నందిస్తూ – కృతకృత్యులు కావాలని ఆశిస్తున్నాను.

శ్లో॥ పృథ్వీశాన్తి రంతరిక్షంశాన్తి శాన్తిర్ద్యౌః । శాన్తిరాపః శాన్తిరుషోదయః । శాన్తిర్వవనస్పతయః । శాన్తిర్విశ్వేమే దేవాః । శాన్తి సర్వేమే దేవాః । శాన్తిః శాన్తిః శాన్తిః । శాన్తిభిః తాభిః శాన్తిభిః సర్వశాన్తిభిః । శమయో మోహం యదిహఘోరం । యదిహక్రూరం తచ్ఛచ్ఛాన్తః । తచ్ఛినం సర్వమేవ స్వస్తు నః ॥

"పృథ్వీ శాన్తి" – ఈ ధరణిలో ధర్మమును స్థాపించి, వసుంధరా అన్న నామమును సార్థకం చేయమని శాంతిని ప్రసాదించమని – పరమాత్ముడవైన నిన్ను ప్రార్థిస్తున్నాను."అంతరిక్షం శాన్తి"– అంతరిక్షములోని గ్రహములలో శాంతి, ఉల్కలు, తోకచుక్కలు, ఉరుములు, పిడుగులవంటి భయోత్పాతములు జరిగి మానవులకు నష్టము కలిగించక శాంతిని ప్రసాదించు. "శాన్తి ర్వ్యాః" – ఇంకను అగ్నివలన కలుగు ఉపద్రవములు, మానవులు అగ్నిని తమ స్వార్థానికి వినియోగించుకొని బాంబులు రకరకాల ఆయుధాలతో మానవులను సాధు సజ్జనుల, దీనుల జీవనమునకు అంతరాయము కలగజేస్తున్నారు. కావున అగ్నిలో శాంతిని కలుగచేయమని ప్రార్థన. "శాన్తి రాపః" – సముద్రములలో తుఫానులు; ఉప్పెనలు; సునామిల వలన జనులు బాధలకు గురవుతున్నారు. నిన్ను మరచినందుకు ఇటువంటి శిక్షలు కల్పిస్తూ నీవైపుకు మరల్చుకొనే ప్రయత్నం చేస్తూన్నావు. అటువంటి వరదలు, ధన ప్రాణ, పంటల నష్టములు జరగకుండ మమ్ము కాపాడి శాంతిని ప్రసాదించమని ప్రార్థన. "శాంతి రుషోదయః " – ప్రతి ఉదయము లేవగానే ఎటువంటి వార్తలు వినవలసి వస్తుందోనన్న భయం మాలో కలుగుతున్నది – కారణం, ప్రతిరోజు ఎన్నో భ్రూణ హత్యలు, అత్యాచారాలు, హత్యలు, దోపిడిలు, దొంగతనాలు – ఇంకా ఘోరకిరాతకములు పత్రికలలో, టీ.వీ.లలో – వార్తల్లో చూసి మా హృదయాలు బాధతో క్షోభిల్లుతున్నాయి. కావున, ఓ పరమాత్మ! ప్రతి సూర్యోదయం మాకు శాంతిని ఇవ్వాలని ప్రార్థన. "శాంతిర్వనస్పతయః" – వనస్పతులు, మూలికలు, పళ్ళలో ఔషధ గుణాలు పుష్కలముగా కలిగివుండేలా చేయి! క్రొంగొత్తవ్యాధులైన బర్డ్ ఫ్లూ, ఆంథ్రాక్స్, డెంగ్యూ, చికన్ గున్య విష జ్వరాలు, బీ.పి, షుగర్, క్యాన్సర్, ఎయిడ్స్ లాంటి భయానక వ్యాధులనుండి కాపాడడానికి మూలికలు తినే ఆహార పదార్థములలో నిజ ఔషధ గుణాలు వాటికి ప్రసాదించమని వేడుకుంటున్నాము. "శాంతిర్విశ్వేమే దేవాః" – ఈ విశ్వమంతా శాంతిని విశ్వరింప చేయి!. "శాంతి సర్వేమే దేవాః" – మేము కోరుకొన్నవే కాక – మేము మరచిపోయి వుంటాము కనుక సకలసర్వములందు వాయువు విజృంభించి చెట్లు చేమలు, ఇల్లు వగైరాలు నాశనం కాకుండ సూర్యుని వేడిని సమతుల్యముగా వుండేటట్లు సర్వములో శాంతిని కోరుతున్నాము ప్రభూ!. "శాన్తి శాన్తి శాన్తిః" – శాంతి... శాంతి... శాంతి అని మా హృదయాలు తల్లడిల్లుతున్నాయి. మా వేదనను మాన్పమని దీనులై నిన్ను వేడుకుంటున్నాము ప్రభూ!. "శాంతిభిః తాభిః " – ఆ శాంతి నీ దగ్గర వున్నది – దాన్ని మాకు ప్రసాదించమని ప్రార్థన. "శాన్తిభిః సర్వ శాన్తిభిః" – ఆ శాంతిని

ప్రసాదించే శక్తి నీకు తప్ప ఎవ్వరికీ లేదు. సకల దేశములలో కలతలు యుద్ధాలు రాకుండ - మత కలహాలతో కల్లోలాలు ఏర్పడకుండ - వర్ణవివక్షలకు తావివ్వక జాతికులాల చిచ్చులతో రగిలి, ఈ సమాజం కుళ్ళి దుర్గంధభూయిష్టం కాకుండ మాకు సర్వదా శాంతిని ప్రసాదించుము ప్రభూ! "శమయో మోహం" - విపరీతమైనటువంటి కోరికలతో మానవలందరూ ధన దాహం; అధికార దాహంతో ఒకరినొకరు హింసించుకుంటూ, లంచగొండి తనం, అధిక వడ్డీ వ్యాపారం, మోసం, దగా, కుట్ర, వంచన, అకృత్య, అనాచారాలు జరిగి నానా చండాలముగా వున్నది. " ఇదిహ క్రౌరం; ఇదిహ ఘోరం" - ఈ క్రూరమైనటువంటి ఈ పరిస్థితి చాల ఘోరముగా, అసహ్యాకరముగా వున్నది. " తచ్ఛ చ్ఛాన్తః; తచ్ఛనం సర్వమేవ స్వస్తినః" - ఈ ఘోర పరిస్థితినుండి తక్షణమే రక్షించు; తక్షణమే ఈ విపత్కర పరిస్థితులు రాకుండ వుండాలంటే నీవు తప్ప మాకు దిక్కెవరు? దయామయుడవు; కరుణాసాగరుడవు - అనంత కృపాసాగరుడవైన మమ్మ ఈ దుష్కృతులనుండి తక్షణమే విముక్తి కలిగించమని పదే పదే నిన్ను వేడుకుంటున్నాము ప్రభూ!

శ్లో॥ రాజా రాక్షస రూపేణ। వ్యాఘ్ర రూపేణ మంత్రిణః।
సేవకా రూపేణ యథా రాజ। తథా ప్రజాః॥

శ్లో॥ ప్రకృతి క్షోభ మహదా ద్యుత్పాదనమ్ । దుష్టవిమర్ధనేన దేవాదీనం।
సుఖవివర్ధనమ్। సముత్కంఠితానాం। సాధకానాం ప్రేమానంద విస్తారణాం।
అన్యథా శరణం నాస్తి। త్వమేవ శరణం మమ। తస్మాత్ కారుణ్యా భావేన।
రక్ష రక్ష భగవాన్॥

ప్రజా రక్షకులు ప్రజా భక్షకులై - మంత్రులు, అధికారులు - మృగప్రాయముగా స్త్రీల ధనమాన రక్షణ కరువై, సాధు సజ్జనులు, దీనులందరూ బాధలకు గురౌతున్నారు ప్రకృతి క్షోభిల్లుతున్నది, ధర్మము నశించి - సమయమునకు వర్షములేక, సకాలమునకు పంటలు పండక ప్రజలు, సామాన్యులు తల్లడిల్లుతునారు. దీనుల ఆకలికేకలు; ఆర్తత్రాణుల హృదయాలను శాంతి సుఖము లేకుండ చేస్తున్నవి. ఈ ప్రపంచములోనున్న మేమందరం ఏకకంఠముతో. సాధనతో నిన్ను కన్నీటితో వేడుకుంటూన్నాము ప్రభూ! నీకంటే అన్యథా మాకు వేరు దిక్కులేదు - నీ పాదచరణములు తప్ప మాకు వేరు శరణ్యము లేదు. కరుణా, కృపా, దయ అపారముగా, కురిపించి - ఈ విశ్వమును

రక్షించమని వేడుకుంటున్నాము.

అచల సాంప్రదాయ గురువులు, గురుపుత్రులు, భగవత్ భక్తులైన ఎల్లరూ, ఈ అమృత వాక్యములను మరియు ఈ అమూల్య గ్రంథముననుసరించి, ఆచరించి, అనుభవములోనికి తెచ్చుకొని, అచల పీఠ సాంప్రదాయమును కొనసాగిస్తూ ధర్మపరిరక్షణ కొరకు అందరూ శాయశక్తులా ప్రయత్నించి విశ్వకల్యాణం కొరకు వసుధైక కుటుంబంగా ఏర్పడి, లోకకల్యాణం కావించుదరని - సద్గురువు ఆశిస్సులు కోరుతూ, సకల మానవకోటికి, ఈ అచల పీఠ ప్రబోధను మరియు ధర్మాలను అందించి మోక్షాన్ని పొందాలని, ఆ సద్గురు మూర్తిని ప్రార్థిస్తూ - విశ్వమానవ కల్యాణము కొరకు మనమందరమూ - మనసా, వాచా, కర్మణా - త్రికరణ శుద్ధిగా పాటు పడాలని అభ్యర్థిస్తూ, అభినందనాశిస్సులు కోరుతున్నాను.

"సర్వే జనాః సుఖినో భవతు"

ధన్యవాదములు,

ఇట్లు,

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు, శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, అఖిల భారత అధ్యక్షులు, శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల, ప్రియ శిష్యులు,

శ్రీ అ॥ ప॥ నజీర్ అహమద్,

నంజంపేట గ్రామం, సోమల మండలం,

చిత్తూరు జిల్లా - ఆంధ్ర ప్రదేశ్

ఓం

"శ్రీ సద్గురుపే నమః"



## హృదయాభినందనములు

శ్రీజగద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు – సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు, శ్రీమదచల గురు పీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, అఖిల భారత అధ్యక్షుల వారి ప్రియ శిష్యులు – శ్రీ బోధానంద సపార్ రామ మోహనార్యులు వారి సతీమణి సపార్ శ్రీమతి లక్ష్మీబాయి నమస్కరించి విన్నవించుకొన్నది.

ప్రియమైన శ్రీ అచల సాంప్రదాయ గురు పీఠాధిపతులకు వారి ప్రియ శిష్యులకు పాదాభివందనములు – ద్వాదశి నమస్కారములు: అనగా ఏమి? అని కొంత మందికి సందేహము. "గురువు సాక్షాత్ పరిపూర్ణ స్వరూపమే" – " గుకారశ్చ గుణాతీతం। రుకారో రూపవర్జితం" – అటువంటి గురుస్వరూపం ఎలా వున్నదంటే!

పూర్ణమేవ నిరాలంబం। ఆగ్నేయే నిర్గుణం తథా।<br>
దక్షిణత్యే నిత్య శుద్ధంచ। నైరుత్యే నిరుపద్రవం॥<br>
పశ్చిమే నిష్కళం చైవ। వాయువ్యేచ నిరంజనం।<br>
ఉత్తరేచ నిరాకాశ। మీశాన్యే నిర్మలో భవేత్॥<br>
ఊర్ధ్వమేవ నిరాకారం। అధశ్చ నిర్వికారకం।<br>
అంతర్బహిశ్చ సర్వత్రా। అచలోయం సనాతనః॥

ఈ విధముగా, ద్వాదశి స్వరూపమైన "పరిపూర్ణమే గురుస్వరూపం". అన్ని దిక్కులవున్న పరిపూర్ణమునకు త్రికరణ శుద్ధిగా నమస్కరించుచున్నాను అని అర్థము.

బోధానంద సపారు రామ మోహన్ అను నేను వంశతః వేదాంత వంశము. శ్రీ నరశింహ రావు పుల్లమాంబ దంపతులకు జన్మించిన రెండు సంవత్సరాలకే, పంచాక్షరి మంత్రోపదేశం జరిగి – అనేక ఆసనములు అభ్యాసము చేసి, అనేక గురువులను ఆశ్రయించి వేదాంతమును తెలుసుకున్నా కూడా – అది అసంపూర్ణముగానే అనిపించేది. ఒకే ఊరిలోఉన్న శ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల కరుణ దయాకటాక్షము **1969** వ సంవత్సరమున లభించినది. గురువుగారు దయతో వేదాంత సారమును గ్రహించితిని. ఈ వేదాంత ధర్మమర్మములు అందరికి గ్రంథరూపముగా చేసి అందించమని గురువుగారిని అభ్యర్థించినాను. అందుకు గురువుగారు, పెద్దలు అనేక గ్రంథములను వ్రాసినారు – వాటిని చక్కగా అధ్యయనము చేసిన చాలునని చెప్పేవారు. అనంతమైన బ్రహ్మవిద్యారహస్యములు కాలగర్భములో కలవకుండ ఎలా గ్రంథాన్ని ఆవిష్కరించాలో అన్న ఆలోచనలో వుండగనే **30** సంవత్సరాలు అవలీలగా గడిచిపోయాయి. సద్గురు కృపవలన నా సంకల్పము ఫలించి, శ్రీ భద్రాద్రి రామ శతకమునకు విశేషార్థములు వేదాంతములను కలిపి, ఏ సంశయము లేకుండ **2006** వ సంవత్సరము బుధజనులకు, సామాన్యులకు, సర్వజ్ఞులకు, సకలమానవాళికి జన్మరాహిత్యము కొరకు చేసిన ఉపన్యాసములు క్యాసెట్ల రూపములో చెప్పినారు. వీటిని వీరి ప్రియ శిష్యులు శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యగారు, బెంగళూరు గ్రాం.జి., నారాయణకెరె గ్రామ నివాసి అయిన మహనీయుడు – కంప్యూటరులో, కన్నడ మరియు తెలుగు భాషలో గ్రంథ రూపముగా అందించినారు – ఈ గ్రంథము చదివి ఆచరించిన జన్మరాహిత్యము తప్పక కలుగుతుందని ఆశించి అందులో సఫలీకృతులైనారు. వారి జన్మ ధన్యమైనది అని ఆశిస్తూ హృదయాభినందనములు తెలుపుతూ, అచల సాంప్రదాయపరులందరికీ – ఆ సద్గురు మూర్తి దివ్య కృపాకటాక్షములు కలిగి;
కరుణాపాత్రులయ్యి జన్మరాహిత్యము పొందాలని ఆశిస్తూ గురువుగారైన శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యులవారికి పాదాభివందనములు చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

నమస్కారములు,

ఇట్లు
సభా సామ్రాట అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు,
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య, అఖిల భారత
అధ్యక్షులు, శ్రీ జగద్గురు వివేకానంద బండారు
సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు,
శ్రీ బోధానంద సపార్ రామ మోహన్ శ్రీమతి లక్ష్మిబాయి
ఎ.ఆర్.టి. స్ట్రీట్, ధర్మవరం – అనంతపురం జిల్లా,

ఓం

"శ్రీ సద్గురుభ్యో నమ "

## సంగ్రహకారుల విన్నపము

గురు బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబహ్మ । తస్మైశ్రీ గురువే నమః ॥

గురువే సర్వలోకానాం । భిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం । శ్రీ దక్షిణామూర్తియే నమః ।

శ్రీ బ్రహ్మవిద్యాసిద్ధాంతం । అచల తత్త్వోపదేశిక ॥
శ్రీ నాగయ్యార్యయోగీంద్రం । సద్గురుభ్యో నమో నమ ॥

ద్వయాత్మరహిత సిద్ధాంతం । పరమపురుష ప్రభోదకం ॥
శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య । సద్గురుభ్యో నమో నమః ॥

"జై సద్గురు ప్రభు మహారాజుకు జై"

మా గురువులైనటివంటి సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి బిరుదాంకితులు - శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు, శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల శిష్యుడైన - ఎన్.వి. వీరభద్రయ్య అనే పేరుతో పిలవబడిన నేను - గురువుగారి పాదకమలములకు అనంతకోటి సాష్టాంగ నమస్కారములను అర్పిస్తున్నాను. మరి ప్రాచీన సనాతన ఋషిమునియోగీంద్రులకూ మరి ఇప్పుడు మానవుని నిజ స్వరూపమును తెలియజేసి - మానవుడు ఇక్కడే, ఇప్పుడే - సత్య ధర్మములను ఆచరించుకొని, సుఖ, శాంతి, తృప్తినిపొంది - అమరత్వమును పొందే - కైవల్య మార్గమును జూపే నిమిత్తమై - నిస్వార్థ; నిష్కామ; కుటిలకపటమోస రహిత -సత్య; న్యాయ; ధర్మ మార్గములో శ్రమపడుతూవుండే, గురువులకు, పెద్దలకు, మహాత్ములందరకూ, నా అనంతకోటి సాష్టాంగ నమస్కారాలను సమర్పించి - కృతజ్ఞతలను అర్పిస్తున్నాను.

మానవుడు **84** లక్షల జీవరాశులలో అత్యున్నతమైన; మహోన్నతమైన; శ్రేష్ఠమైనవాడు

అని ప్రాచీన సనాతన ఋషిమునియోగీంద్రులు – వేదోపనిషత్తులు తెలియజేస్తున్నవి. కాని, ఈ నాడు మానవుడు తన స్వార్థ – దురాశ బుద్ధితో అత్యంత హీనాయమానముగాను; క్రూరముగాను; కఠనముగాను [**un-expectable; un-believable cruelty with desires and greeds - than animals]** – జంతువులకన్నను క్రింద స్థాయిలో ప్రవర్తిస్తున్నాడు. కారణము, తనను తాను యెరుగక – తన స్వరూపము ఏదో ? తన స్థితి గతి ఏమిటో? – ఏది శాశ్వతమో? ఏది అశాశ్వతమో? అనే దాన్ని వివేకజ్ఞానముతో గుర్తించక – భగవంతుడు కరుణించి ఇచ్చినదానిని సంతోషముగా అనుభవించక– దేవుడు అంటే, ఆ గురుపరమాత్మ ఒకడేగాని వేరెలేదు అనే జ్ఞానము కొల్పోయి; చరిత్రార్హమైన గుడి గోపురాలు; మసీదులు; చర్చులు; ఆశ్రమాలు; ప్రార్థనా మందిరాలు; ఉత్సవాలు; పండుగలు; – మన పూర్వీక పెద్దలు ఎందుకు నిర్మితము చేసినారు? దాంట్లో ఏమి నిగూఢ రహస్యము దాగివుంది? అనే దృఢమైన; స్థిరమైన; సరియైన; సత్యాసత్యాలను సరిగ పరిశోధన చేయక – ఈ నాడు, ఒక్కొక్కరు; ఒక్కొక్క దారిలో; వారి వారికి అనుకూలమయ్యే విధంగా నిర్మించుకొని/చేసుకొని – తన స్వార్థము కొరకు అక్రమ ధన సంపాదన; అధికార దాహము; పేరు ప్రతిష్టలు కొరకు మత కేంద్రాలుగా మార్పుజేసి/నిర్మించికొని; అర్థాలు కల్పించినారు కాబట్టి, ఇంత – అనాహుతాలకూ: ఆగడాలకూ; అల్లకల్లోలాలకూ కారణమవుతున్నాడు మానవుడు.

ఈ నాడు మానవుడు – నిత్య శుద్ధ బుద్ధ ముక్త సిద్ధ సత్యమైన జ్ఞానముతో యోచన చేసె వివేచన జ్ఞానము కొల్పోయి – నా నా ధర్మాలు; నా నా మతాలు; నా నా కులములు – జాతులు; (హిందు, ముస్లిమ్, బౌద్ధ, క్రైస్తవ, జైన, సిఖ్.........); నా నా దేవుడు దేవతల నామాలతో [ఉదర నిమిత్తం బహుకృత వేషం] తన స్వార్థముకోసరము నిర్మించికొని/కల్పించుకొని; మా మతము గొప్ప – మీ మతము తక్కువ; మా కులము – జాతి గొప్ప – మీ కులము జాతి తక్కువ ; మా దేవుడు – మీ దేవుడు; మా గురువులు – మీ గురువులు; అని క్రింద స్థాయిలో అంజనమువేసుకొంటూ, అన్నిటిని – చెప్పేకి/వివరించేకి కూడ వీలు లేని స్థాయికి దిగిజారినాడు. తన స్వార్థముకోసమే అరాచకాలు పుట్టించి, వాదులాడుకొంటూ – సమన్వయ భావము కొల్పోయి; వసుధైకకుటుంబం అనే దివ్య పదానికి సరియైన అర్థము తెలియక – తప్పటడుగులలో – ఈ నాడు నా నా దుష్కృత్యములుతో [దగా, వంచన, మోసము; ద్వేషము; అసూయ; హింస; భయోత్పాదన; భ్రష్టాచారముగా.........] ప్రవర్తించుట, అనేక కష్ట నష్టాలకు గురవుతూ దుఃఖాల పాలవుతున్నాడు (**shortcut will cut you short**). పెద్దలమాట : "సాసవ

సవిస్తారముగా సామాన్య తెలుగు భాషలో – భావార్థము; తాత్పర్యము; కందార్థమును సామాన్యులకు కూడ అర్థమయ్యేటువంటి పద్ధతిలో తెలియజేసినారు. కాబట్టి, ఆ గురుపరమాత్మ మానవునికి అన్ని సౌకర్యాలు; సౌలభ్యాలు; కనకాదివస్త్రద్రవ్యాలంత ఇచ్చి "శాంతి" అనే మంత్రమును తనలో పెట్టికొనివున్నాడు. అందువల్ల, అందరు ఈ శాంతిని పొంది – అమరులు అయ్యేదాని కొరకే, ఈ గ్రంథము సవివరముగా తెలియజేస్తున్నది – దీన్ని బాగుగా చదివి మననము చేయాలి:

1. practice makes man perfect.

2. Start the day with love/laugh;
Spent the day with love/laugh;
End the day with love/laugh;

3. Money comes and goes;
Morality comes and grows;

卐 Money is lost - nothing is lost;
Health is lost - something is lost;
But character is lost - everything is lost.

5. Love All - Serve All.

6. The greatest tragedy of this world is " I "
The greatest comedy of this world is " you "
The greatest remedy of this world is " WE "

7. Help ever - Hurt never.

8. D`not Eat to live - But live to Eat.

9. Fill in the mind every time only
Positive thoughts;
But not negative thoughts;

10. Feel good and Promote good;

11. simple living and highly thinking is

most helpful;

12. The modern man can only lead the most comfortable life; But not the peaceful and happy life at all;

13. While comming naked !
While going naked !
Then what you are ?
What do you brought - while coming ?
to weap/sweep!

14. Though the mills of God grind slowly;
yet they grind exceeding small;

Though with patience, he stands waiting;
with exactness griends he ALL.

15. Nothing is Permanent in this World
Except GOD - i.e.GURU.

16. Mine - Minus = GOD - i.e. GURU.

ఇప్పుడు, ఈ గ్రంథమును కంప్యూటర్లో తయారుచేసేదానికి - మా భారత దేశమున సాఫ్ట్ వేర్ ఇంజినియర్ అయిన శ్రీ శేషాద్రి వాసు వారికి కృతజ్ఞతలను అర్పిస్తున్నాను. వీళ్ళు భారత దేశమున అన్ని భాషలకూ మరి బ్రెయిలీ లిపిలో కూడ సాఫ్ట్ వేర్ ఆవిష్కారము జేసి, మా అంధ సహోదర సహోదరిమణులకు కూడ అనుకూలమయ్యే లాగ జేసి, భారత రాష్ట్రములో మహ వ్యక్తియై వెలసినారు. ఇది ఒక ఆశ్చర్యకరమైన ఘటన! నేను ఈ గ్రంథమును ఆఖరు ప్రూఫ్ చేయడానికి, అందులోనున్న తప్పొప్పులను సరిచేసుకొనుటకు మా గురువుగారు ఆజ్ఞవలన - చిత్తూరు జిల్లా, నిమ్మనపల్లె మండలం, తవళం గ్రామానికి వెళ్ళాను. మా గురువుగారు నేలమల్లేశ్వర దేవాలయములో ఉపన్యాసములు చేయుచుండిరి. ఆ సమయంలో పరిచయం కాకతాళీయముగా జరిగినది. ఆ తర్వాత నాపాటికి నేను నా ఊరికి వచ్చేశాను. కాని, శ్రీ నజీర్ అహమద్గారు నేను వచ్చిన ఒక వారము తర్వాత మా గ్రామమైన నారాయణకెరెకు విచ్చేసి నన్ను కలిసినారు. ఈ గ్రంథమునందలి వ్యాకరణ తప్పొప్పులను, తీర్చిదిద్దేదానికి సయాయపడినారు. వీరు మహమ్మదీయులు; మాతృ భాష ఉర్దూ అయినను - వీరి తెలుగు భాష ఉచ్చారణ; వ్యాకరణ అనుభవము

శ్లాఘనీయము. మా సహోదరుడు అయిన శ్రీ నజీర్ అహమద్‌గారికి, నా హృదయపూర్వక కృతజ్ఞతులు అర్పిస్తున్నాను.

ఇప్పుడు - ఎన్.వి. వీరభద్రయ్య అనే పేరుతో పిలవబడిన నేను - శ్రీమతి వెంకటమ్మ శ్రీ వెంకటప్ప వారి మధ్యమ కుమారుడై - ప్రపంచములోనే సనాతన ధర్మమునకు కేంద్రబిందువుగావుండే మరి సనాతన ధర్మమును; దివ్య జ్ఞానమును అంతర్గతము చేసుకోని - ఆ దివ్య తత్వాలను **[spirutial Theries/ Science]** [ఆ తత్వాలే ఈ నాడు మానవులు ప్రయోగము చేస్తావుండే **Science/ Modern Science** అంత కూడ] **[without spirutial theory/Science - there is no Science/ practical at all]** - మానవకోటికి సమర్పించిన/తెలియజేసిన ఋషిమునియోగీంద్రులు; మహాత్ములు; పుణ్యపురుషులు జన్మించిన పుణ్యభూమిలో "అఖండ సంపద్భరితమైన భారతదేశమున", కర్నాటక రాష్ట్ర బెంగళూరు గ్రామాంతర జిల్లా, హొసకోటె తాల్లూక, వైట్‌ఫీల్డ్ నారాయణకెరె గ్రామములో వెలసిల్లి - మా గురువుగారి కృప చేత క్యాసెట్లు ద్వారా వినిపించిన, శ్రీ భద్రాద్రిరామ శతకమును విని - గ్రహించి, వేదాంత గ్రంథములను లెస్సగా పరిశీలించి, సంగ్రహించి - గురువుగారి ద్వారా తీర్చిదిద్దిన - మరి మా కొడుకు మరి తోడు కొడుకైన - కు. ఎన్.వి. నవీన కుమార్ (బి.కాం. కంప్యూటర్), కు. ఎన్. భువనేశ్వర్ - బి.బి.ఎమ్. కంప్యూటర్ - వీళ్ళ సహకారము చేత, గురుకరుణవల్ల - కంప్యూటర్లో, ఈ గ్రంథమును కృషిచేసి మీకు సమర్పిస్తున్నాను.

## భగవద్గీత

ఓం పూర్ణామదః పూర్ణమిదం । పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ । పూర్ణమేవావ శిష్యతే ॥

అది - ఇది - సృష్టి అవశిష్టమంత, ఆ "దివ్య చైతన్యమైన పరిపూర్ణ పరబ్రహ్మమే" అని తెలియువలయును. తెలుసుకోవలిసిన అవసరము: **"First purify your Heart and mind" automatically you will relize the God: i.e. "GuRu".**

సకల మానవకోటి, ఈ గ్రంథమును బాగా అభ్యసించి - అవగాహన చేసుకొని [అన్ని మతాలలో; అన్ని వేదోపనిషత్శాస్త్రగ్రంథములలో వుండే సారమంతా, ఈ గ్రంథములో చక్కగా తెలియజేసినారు] - పాఠము మాదిరి కాని; కథమాదిరి కాని;

కంఠపాఠముగా ఒక్కటే చేయక - అనుభవానికి; ఆచరణలోనికి తెచ్చుకొని - మా గురువుగారు సవిస్తారముగా నిజార్థమును సామాన్యులకు కూడా బాగ అర్థమయ్యేనట్లు బోధించినారు - నాకు వీలయినంతవరకూ నా కృషిని అందించినాను. మీకు బాగ అర్థమయ్యేనట్లు - నిజార్థాలు అర్థమయ్యేలాగ కృషిజేసినాను. మీరు - చదువే వారు ప్రతి పదము; శ్లోకాలు; కందార్థాలు; ఉపమానాలు; ఉపమేయాలు; తత్వములు; విచారణను - బాగ మననము చేసుకొని, నిజార్థమును తెలిసి గురుకృపాకటాక్షం పొందుతారు అనే ఆశతో కష్టపడ్డాను - మీరు కృతార్థులైతే నన్ను రక్షించినవారవుతారు అని ప్రార్థన. ఈ గ్రంథములను తయారుజేసెదానికి ప్రత్యక్షముగా, పరోక్షముగా సహకరించిన మరియు తప్పొప్పులను తీర్చిదిద్దిన మహనీయులందరికీ, నా కృతజ్ఞతలను అర్పిస్తున్నాను. నాకు తెలుగు భాషాజ్ఞానము అంతగా లేదు కాబట్టి - పెద్దలు, పండితులు, వేదాంతవేద్యులు, గురువులు - ఈ గ్రంథములో తప్పొప్పులను తీర్చిదిద్ది మన్నించాలని విన్నపము.

## <u>గురు సందేశము - **SUPREME MESSAGE**</u>

అన్ని యుగాలుకన్న "శ్రేష్టమైన యుగము - ఈ కలియుగము" - మానవుడు అన్ని స్వర్గసుఖాలన్ని ఇక్కడే అనుభవించి - తక్కువ కాలములోనే కైవల్యము పొందే యుగము ఇది - దానివల్ల మానవుడు జాగ్రతగా మేల్కొనాలి -"ఆలస్యం అమృతం విషం". **[you are the king of your mind + you are the king of your life]**"శరీరములో అన్ని

అవయవాలు బాగవున్నపుడే - బుద్ధి క్షీణించక ముందే, చెవులు వినిపించక పోయేకి మునుపే; చర్మము ముడుతలు పడక ముందే; దృష్టిహీనముకాక ముందే ; నాలుక రుచి కొల్పోక మునుపే; పండ్లు రాలిపోకనే; మాటలు నిల్చి పోయే ముందే; ముక్కు వాసన గ్రహించె శక్తి కొల్పోక ముందే; శరీరము వంగక మునుపే; రక్తము తక్కువకాక ముందే ;

శరీరము రోగభూయిష్టమై కృశించక ముందే............................ శరీరములో చైతన్యం వున్నప్పుడే" - కైవల్యమును పొందాలని పెద్ధల/నా కోరిక - వయసయ్యాక [ముసిలితనము వచ్చిన తర్వాత]; ప్రాణము పోయిన తర్వాత పొందేది కాదు సుమా !! మోక్షం బ్రతికున్నప్పుడే!!!

ఇప్పుడు ఈ ప్రపంచము బాగుపడాలంటే - మఠాధీశులు, ఆశ్రమ వాసులు;

మహాత్ములు; జ్ఞానులు;బుద్ధిమంతులందరూ– భీష్మ ద్రోణాచార్యులు కాగా – "శ్రీ కృష్ణపరమాత్మనిలాగ; అర్జునునిలాగ; శ్రీ రామునిలాగ; మారుతిలాగ; విశ్వామిత్రునిలాగ; వశిష్ట మహర్షివారిలాగ................ మనం మార్పు చెందితేసే – ఈ ప్రపంచము బాగుపడుతుంది. ఆ భగవంతుడు పుట్టుతాడు – దుష్కృత్యాలను/దుర్మార్గులను శిక్షిస్తాడు! ధ్వంసము చేస్తాడు! "దుష్ట శిక్షణ శిష్ట రక్షణ" చేస్తాడు! సత్యకాలము వస్తుంది! అని మనం కూర్చుంటే! – ఇది అయ్యే పని కాదు – అందరూ ఏకమై కలిసి కట్టుగా ఆచరించి చైతన్యం వస్తేనే, ఈ ప్రపంచం బాగుపడుతుంది. కావున, గ్రంథాలలోవుండే వేదాంతమే కాని! మాటలతో చెప్పె వట్టి వేదాంత/ఉపన్యాసములు పనికిరావు – అనగా, ఎట్లు పుస్తకములో వుండే వంకాయి కూరకు పనికిరాదో అట్లు!

"ఆ భగవంతుడు నిత్య; శుద్ధ ; సిద్ధ; బుద్ధ ; ముక్త; సత్యమై ఎల్లప్పుడూ వున్నాడు సుమా"!

"సత్యమేవ జయతినానృతమ్"

కృతజ్ఞతలు,

ఇట్లు
శ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల శిష్యుడు,
ఎన్.వి. వీరభద్రయ్య

తేది॥ **16-02-2007/ 30 - 07 - 2007**
నారాయణకెరె.

"ఓం శాంతి శాంతి శాంతిః"

"జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకు జై"

"జై శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్య ప్రభు మహారాజుకు జై "

ఓం

" శ్రీ సద్గురువే నమః "

# శ్రీ గురు రహస్యం

## ఏతదుత్తమం నిత్యానుష్ఠానం శిష్యశుద్ధిః

# ఓం

## " శ్రీ సద్గురువే నమః "

## శ్రీ గురు రహస్యం ఏతదుత్తమం నిత్యానుష్ఠానం శిష్యశుద్ధిః

### అఖండ గురుస్తుతి

గురు బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబహ్మ । తస్మైశ్రీ గురువే నమః ॥

అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించిత్ చరాచరం ।
త్వం పదం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

అఖండమండలాకారం । వ్యాప్తం ఏన చరాచరం ।
తత్పదం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యంస చరాచరం ।
అసిత్వం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

చైతన్యం శాశ్వతం శాంతం । వ్యోమాతీతం నిరంజనం ॥
నాద బిందు కళాతీతం । తస్మైశ్రీ గురువే నమః

త్వంపితా త్వంచమే మాతా । త్వంబంధు త్వంచదేవతా ।
సంసార ప్రీతి భంగాయ । తస్మైశ్రీ గురువే నమః ॥

ఆనందమానందకరం ప్రసన్నం । జ్ఞాన స్వరూపం । నిజబోధయుక్తం ।
యోగీంద్రమీడ్యం । భవరోగవైద్యం । శ్రీ మహద్గురుం । నిత్యమహం నమామి ॥

మన్నాథా శ్రీ జగన్నాథా । మద్గురో శ్రీ జగద్గురో ।
మమాత్మా సర్వభూతాత్మా । తస్మైశ్రీ గురువే నమః ॥

హృత్పుండరీక మధ్యస్థ్యం । సకలామ్నాయ సంస్తుతం ।
ధ్యాయామహ్యం సదాభక్త్యా । సకలాభీష్టదాయకం ॥

నిరంతరం సర్వసందేహాలా । ఏకీ కృత్య సుదర్శనం ।
రహస్యయో దర్శయతి । భజామి గురుమీశ్వరం ॥

" జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై "

## శ్రీ గురుమాలా మంత్రం

ఓం నమః శ్రీ గురుదేవాయ । పరమ పురుషాయ । సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ట వినాశాయ । సర్వమంత్రచ్ఛేదనాయ । త్రైలోక్యం వశమానాయ స్వాహః ॥

శ్లో ॥ ఓం అస్య శ్రీ గురుగీతామాలా మంత్రస్య । భగవాన్ శ్రీసదాశివ ఋషిః । విరాట్ గాయిత్రి చన్దః । శ్రీగురు పరమాత్మా దేవతా । హం బీజం । సః శక్తిః । సోహం కీలకం । మమశ్రీ నిజగురుకృపా ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

## అథ కరన్యాసః

" ఓం హాం సాం సూర్యాత్మనే అంగుష్ఠాభ్యాం నమః"
" ఓం హాం సీం సోమాత్మనే తర్జనీభ్యాం నమః "
" ఓం హాం సూం నిరంజనాత్మనే మధ్యమాభ్యాం నమః"
" ఓం హాం సైం నిరాభాసాత్మనే అనామికాభ్యాం నమః"
" ఓం హాం సౌం అతను సూక్ష్మాత్మనే కనిష్ఠకాభ్యాం నమః"
" ఓం హాం సః అవ్యక్తాత్మనే కరతలకర పృష్ఠాభ్యాం నమః"

## అథ హృదయ విన్యాసః

" ఓం హాం సాం సూర్యాత్మనే హృదయాయ నమః "
" ఓం హాం సీం సోమాత్మనే శిరసేస్వాహా "
" ఓం హాం సూం నిరంజనాత్మనే శిఖాయైవషట్"
" ఓం హాం సైం నిరాభాసాత్మనే కవచాయహుం "
" ఓం హాం సౌం అతను సూక్ష్మాత్మనే నేత్రత్రయాయ వౌషట్ "
" ఓం హాం సః అవ్యక్తాత్మనే హస్త్రాయ ఫట్ "

## అథ ధ్యానం

శ్లో ॥ హాం క్షాభ్యాం పరివృత్తపత్ర । కమలైర్ద్విపైర్జగత్కారణాం ।
విశ్వోత్తీర్ణ మనేక దేహనిలయం । స్వచ్ఛందమానందకం ।
ఆద్యంతైక మఖండ చిద్ఘనరసం । పూర్ణం హ్యనంతం శుభం ।
ప్రత్యక్షాక్షర విగ్రహం గురుపదం । ధ్యాయేద్విభుం శాశ్వతం ॥

శ్లో ॥ విశ్వవ్యాపి నమాది దేవమమలం । నిత్యం పరం నిష్కళం ।
నిత్యోద్బుద్ధ సహస్ర పత్రకమలే । లుప్తాక్షరే మంటపే ।
నిత్యానందమయం సుఖైకనిలయం । నిత్యం శివం స్వప్రభం ।
ధ్యాయేద్దం సపరం పరాత్పరతరం । స్వచ్ఛంద తస్సర్వదా ॥

శ్లో ॥ ఊర్ధ్వామ్నాయ గురోః పదం । త్రిభువనోంకారఖ్య సింహాసనం ।
సిద్ధాచార సమస్తవేదపఠితం । షట్చక్ర సంచారిణం ।
అద్వైతస్ఫురదగ్నిమేకమమలం । పూర్ణప్రభాశోభితం ।
శాంతం శ్రీ గురు పంకజం భజమనశ్చైతన్య చంద్రోదయం ॥

శ్లో ॥ నమామి సద్గురుం శాంతం । ప్రత్యక్షం శివరూపిణం ।
శిరసాయోగ పీఠస్థం । ముక్తికామార్థ సిద్ధిదం ॥

శ్లో ॥ ప్రాతః శిరసి శుక్లాబ్జం । ద్వినేత్రం ద్విభుజం గురుం ।
వరాభయకరం శాంతం । స్మరేత్తన్నామ పూర్వకం ॥

శ్లో ॥ ప్రసన్నవదనాక్షంచ । సర్వదేవతా స్వరూపిణం ।
త్వత్పాదోదక జాధారా । నిపతంతీ స్వమూర్ధని ॥

శ్లో ॥ తయా సంక్షళయే । దేహ్యాంతర్బాహ్యగతం మలం ।
తక్షణా ద్విరజోభూత్వా । జాయతే స్ఫటికోపమః ॥

శ్లో ॥ తీర్థాని దక్షిణేపాదే । వేదాస్తన్ముఖ మాశ్రితాః ।
పూజయే దర్పితం తంతు । తదభిధ్యాన పూర్వకం ॥

శ్లో ॥ సహస్రదళ పంకజే । సకల శీతరస్మి ప్రభం ।
వరాభయకరాంబుజం । విమలగంధ పుష్పాంబరం ।
ప్రసన్నవదనేక్షణం । సకలదేవతా రూపిణం ।
స్మరేచ్ఛిరసి హంసగం । తదభిధ్యాన పూర్వం గురుం ॥

## మనస్సులోచేసే పంచ పూజలు

శ్లో॥ 'లం' - పృథివ్యాత్మనే గంధతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । పృథివ్యాత్మకం గంధం సమర్పయామి ॥

'హం' - ఆకాశాత్మనే శబ్దతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । ఆకాశాత్మకం పుష్పం సమర్పయామి ॥

'యం' - వాయ్వాత్మనే స్పర్శతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । వాయ్వాత్మకం ధూపం సమర్పయామి ॥

'రం' - తేజసాత్మనే రూపతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । తేజాత్మకం దీపం సమర్పయామి ॥

'వం' - అంబాత్మనే రసతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । అంబాత్మకం అమృతనైవేద్యం సమర్పయామి ॥

'సం' - సర్వాత్మనే సర్వతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే । శ్రీ గురుదేవాయ నమః । సర్వాత్మకాన్ సర్వోపచార పూజాం సమర్పయామి । సర్వ మంగళ నీరాజనం సమర్పయామి ॥

# శ్రీ నిజగురు అచల సద్గురు పరంపర స్తోత్రం

## శ్రీ నిజగురు పరంపర ధ్యానం

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యా సాంప్రదాయ ।
కర్తృభ్యో । వంశ ఋషిభ్యో । మహద్భ్యో నమో గురుభ్యః ॥

సర్వోప ప్లవరహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో ।
బ్రహ్మైవాహమస్మి । అహం పదార్థ రహితః ॥

గురువే సర్వలోకానాం । బిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం । శ్రీ దక్షిణామూర్తియే నమః ॥

1. ఓంకార పీఠసిద్ధాంతం । బ్రహ్మవిద్యోపదేశిక ।
శ్రీమన్నారాయణం సూర్యం । సద్గురుభ్యో నమో నమః ॥

2. యాజ్ఞవల్క్యంచ జనకం । శుకసాందీపమీశ్వరం ।
కృష్ణమర్జున సంయుక్తం । ఉద్దవంచ నమో నమః ॥

3. బ్రహ్మనంద యోగీంద్రం । రామానంద జ్ఞానీశ్వరః ।
సహజానంద యోగీశ । రామావధూత గురుం భజామి ॥

4. అంబికా శివయోగీంద్రం । వేమనయోగి సద్గురుం ।
నిరంజన వెంకయార్య । తిరువెంగళ గురుం భజే ॥

5. శ్రీధర స్వామియోగీంద్రం । శివరామాఖ్య దీక్షితం ।
కంభాలూరి అప్పు బ్రహ్మాం । సద్గురుభ్యో నమో నమః ॥

6. పరుశురామ సీతారామ । భాగవత కృష్ణయోగినః ।
పీలుఖానా లక్ష్మణార్య । సద్గురుభ్యో నమో నమః ॥

7. బృహద్వాశిష్ట సిద్ధాంతం । పూర్ణబోధోపదేశిక ।
శ్రీ వెంకటేశ్వర యోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

8. ఆత్మానాత్మ అతీతమనిశం । కేవలాత్మోపదేశిక ।
వేముల రామార్యయోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

9. ప్రణవాతీతమగమ్యం । పరాప్రకృతి రహితం ।
పరమచలోపదేశిక । శ్రీ రాజయాఖ్య గురుం భజే ॥

10. శ్రీ బ్రహ్మవిద్యాసిద్ధాంతం । అచల తత్వోపదేశిక ।
శ్రీ నాగయార్య యోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

11. ద్వయాత్మరహిత సిద్ధాంతం । పరమపురుష ప్రబోధక ।
శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య । సద్గురుభ్యో నమో నమః ॥

12. అస్మద్గురు సమారంభం । కృష్ణసాందీప మధ్యమాం ।
ఓంకారపీఠ పర్యంతాం । వందే గురు పరం పరం ॥

## లఘు పూజ

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగనసదృశం । తత్వమస్యాదిలక్ష్యం ॥
ఏకం నిత్యం విమలమచలం । సర్వధీ సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుం తం నమామి ॥

శ్లో॥ ధ్యానమావాహనం సింహాసనం । పాద్యంత ద్దైవచ ।
అర్ఘ్యమాచ మనీయంచ స్నానం । పంచామృత్తైస్సహ ॥

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రం విభూషణం ।
విలేపనం చాక్షతాంశ్చ । పుష్పం స్వర్ణవినిర్మితం ॥

శ్లో॥ ధూపం దీపంచ నైవేద్యం । పానీయం ఫలమేవచ ।
తాంబూలం దక్షిణార్తిక్యం । మంత్రపుష్పం ప్రదక్షిణం ॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదయేత్ ।
కృపయా గృహ్యతాం స్వామిన్ । న్యూనాధిక్యం నచింతయా ॥

శ్లో॥ లఘు పూజావిధిం భాగవత కృష్ణద్విజన్మనా ।
రచితం శ్రోతృవక్తృణా । మిదం మోక్షకరం పదం ॥

# పరిపూర్ణ అచల ధ్యానం

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం । ఆగ్నేయ నిర్గుణం తథా ।
దక్షిణే నిత్యశుద్ధంచ । నైఋత్యే నిరుపద్రవం ॥

శ్లో॥ పశ్చిమే నిష్కళంచైవ । వాయువ్యేచ నిరంజనం ।
ఉత్తరేచ నిరాకాశ । మీశాన్యే నిర్మలోభవేత్ ॥

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః ।
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః ॥

# పరా పూజ

శ్లో॥ పూర్ణస్యావాహనం కుత్ర । సర్వాధారస్య చాసనం ।
స్వచ్ఛస్యపాద్యమర్ఘ్యంచ । శుద్ధస్యాచమనం కుతః ॥

నిర్మలస్య కుత స్నానం । వస్త్రం విశ్వోధరస్యచ ।
నిరాలంబస్యోపవీతం । రామస్యాభరణం కుతః ॥

నిర్లేపస్య కుతోగంధః । పుష్పం నిర్వాసనస్యచ ।
నిర్గంధస్య కుతోధూపః । స్వప్రకాశస్య దీపకం ॥

నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్యఫలం కుతః ।
తాంబూలంచ విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణా ॥

స్వయం ప్రకాశమానస్య । కుతో నీరాజనాధికం ।
ప్రదక్షిణ మనంతస్య । అద్వితీయస్య కాస్తుతిః ॥

అంతర్బహిశ్చపూర్ణస్య । కథముద్వాసనం భవేత్ ।
ఇయమేవ పరాపూజా । సర్వావస్థాసు సర్వదా ॥

ప్రేమబుద్ధ్యాతు సర్వేసో । మనోదేవో నివేశయేత్ ।
ఏషామజ్ఞాన జీవానాం । సమస్తారిష్ట శాంతయే ।
యద్యబోద్ధవ్యమఖిలం । తద్భక్త్యా బ్రవీమ్యహం ॥

## శ్రీ గురుమాలా మంత్రం

ఓం నమః శ్రీ గురుదేవాయ । పరమ పురుషాయ । సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ట వినాశాయ । సర్వమంత్రచ్ఛేదనాయ । త్రైలోక్యం వశమానాయ స్వాహా ॥

బిందు మధ్యే గురోర్శిష్యం । దృష్ట ద్రాష్టాంత బోధకం ।
ద్వాదశీ షోడశీ మంత్రం । జపతే జన్మరహితః ॥

## ద్వాదశాక్షరి మహామంత్రం

అస్యశ్రీ ద్వాదశాక్షరి మహామంత్రస్య । అచల ఋషిః అవినాశశ్ఛందః । అభవోదేవతా । అమృతం బీజం అప్రమేయా శక్తిః । అయమాత్మా తత్వమస్యాది జ్ఞానరహితం కీలకం । అఖిలకాలేషు పరిపూర్ణమస్తి । మాయాసహిత మేతత్ప్రపంచాదికం । నాస్తితి నిశ్చయ సిద్ధ్యర్థం । ద్వాదశాక్షరి మహామంత్ర జపం కరిష్యే ॥

## అథ కరన్యాసః

| | | |
|---|---|---|
| ఏతన్మిథ్యా | = | అంగుష్ఠాభ్యాం నమః |
| శుద్ధవియత్ | = | తర్జనీభ్యాం నమః |
| కించిన్నాస్తి | = | మధ్యమాభ్యాం నమః |
| ఏతన్మిథ్యా | = | అనామికాభ్యాం నమః |
| శుద్ధవియత్ | = | కనిష్ఠకాభ్యాం నమః |
| కించిన్నాస్తి | = | కరతలకర పృష్టాభ్యాం నమః |

## అథ హృదయ విన్యాసః

| | | |
|---|---|---|
| ఏతన్మిథ్యా | = | హృదయాయ నమః |
| శుద్ధవియత్ | = | శిరసే స్వాహా |
| కించిన్నాస్తి | = | శిఖాయైవషట్ |
| ఏతన్మిథ్యా | = | కవచాయహుం |
| శుద్ధవియత్ | = | నేత్రత్రయాయ వౌషట్ |
| కించిన్నాస్తి | = | హస్త్రాయఫట్ |

ద్రష్టదర్శన దృశ్యాదిసహిత అహంపదార్థ రహితః ।
భూర్భువస్సువరోమితి దశదిగ్బంధః ॥

## అథ ధ్యానం

శ్లో ॥ అచలమఖిలంచాద్యం । సర్వలోకేషు పూర్ణం ।
సర్వాతీతం । స్వానుభూతావగమ్యం ।
సర్వాబాధ్యం । సర్వకర్తృత్వ శూన్యం ।
సర్వాపేద్యం । సర్వరహితం నమామి ॥

శ్లో ॥ అవాచ్యం ప్యాఖండం ప్యాలక్ష్యం ప్యాబాధ్యం
ప్యాసంగం ప్యావేద్యం ప్యాచింత్యం ప్యారూపం
ప్యాసాధ్యం ప్యానాద్యం ప్యాతీతం ప్యానంతం
ప్యాశుద్ధం ప్యాబుద్ధం ప్యానామం నమామి ॥

శ్లో ॥ మృత్యుజన్మ భయదుఃఖవర్జితం । సర్వదృశ్య దృక్ద్రష్ట నాశనం ।
అప్రతర్క్యమమలం నిరామయం । అనుపమానమచలం నమామ్యహం ॥

శ్లో ॥ నిత్యపూర్ణాయ సత్యాయ । నిశ్చలాయ నిరీహ్యతే ।
నిర్మలాత్మ స్వరూపాయ । నిర్గుణాయ నమో నమః ॥

శ్లో ॥ ఏతన్మిథ్యా శుద్ధవియత్ । కించిన్నాస్తి తితేమయా ।
కృపయా పరమం ప్రోక్తం । భజాగ్రేద్వాదశాక్షరం ॥

## అథ మనుః

| ఏతన్ | మిథ్యా | శుద్ధ | వియత్ | కించి | నాస్తి |
|---|---|---|---|---|---|
| ఈ | వుత్త | బట్ట | బయలు | ఏమీ | లేదు |

## షోడశాక్షరి మహామంత్రం

అస్యశ్రీ నిరూపమాన షోడశాక్షరి మహామంత్రస్య । నిరంజన ఋషిః । నిరహంకార నిశ్చందః । నిరామయ నిరాకాశో దేవతా । నిరావరణ బీజం । నిస్త్రిగుణ్యాశక్తిః । నిర్గుణ ప్రజ్ఞానరహిత కీలకం । నిఖిలకాలేషు మాయాసహిత । షడ్భూతరహిత దశేంద్రియ పంచప్రాణమనోబుద్ధి సహిత సూక్ష్మశరీర । మహాకారణశరీర రహిత సిద్ధ్యర్థం । షోడశాక్షరీమహామంత్ర జపం కరిష్యే ॥

## అథ కరన్యాసః

| | | |
|---|---|---|
| నిర్మ్మలం | = | అంగుష్ఠాభ్యాం నమః |
| ఏతత్ | = | తర్జనీభ్యాం నమః |
| జ్ఞానశ్చరీరం | = | మధ్యమాభ్యాం నమః |
| నాస్తి | = | అనామికాభ్యాం నమః |
| కేవలం | = | కనిష్ఠికాభ్యాం నమః |

నిర్మ్మలమే తదా జ్ఞానశ్చరీరం నాస్తి కేవలం ।
కరతలకర పృష్ఠాభ్యాం నమః ॥

## అథ హృదయవిన్యాసః

| | | |
|---|---|---|
| నిర్మ్మలం | = | హృదయాయ నమః |
| ఏతత్ | = | శిరసే స్వాహా |
| జ్ఞానశ్చరీరం | = | శిఖాయై వషట్ |
| నాస్తి | = | కవచాయహుం |
| కేవలం | = | నేత్రత్రయాయ వౌషట్ |

నిర్మ్మలమే తదా జ్ఞానశ్చరీరం నాస్తి కేవలం
హస్త్రాయఫట్.

సమస్త నిర్మోహాయ త్రైకాలేషు మద్రహిత ।
నిశ్చయో భూర్భువస్సువరోమితి దశదిగ్బంధః ॥

## అథ ధ్యానం

శ్లో ॥ సర్వనిగమగుహ్యం । శాశ్వతం సర్వకాలం ।
సకల దివిజవంధ్యం । సర్వదిక్పూర్ణమచలం ।
సకలభయ నివారణం । సర్వలోకాంతరస్థం ।
సకలమునిహృదిస్థం । సర్వదేశ ప్రశస్తం ॥

శ్లో ॥ నజ్ఞాతం పరవస్తురూపరహితం । నిస్తేజమమృతం సదా ।
నిశ్శబ్దం నిరుపాసనం నిరూపమం నిర్దేశపూర్ణస్థితం ।
నిత్యాభ్యాస వివర్జితం విహితన । ధ్యాపారశూన్యం సదా ।
నిస్సంగం నిరుపాధికం నిరవయం । నిత్యంహృదిం భావయత్ ॥

శ్లో ॥ ఆనందరహితోస్మి నిత్యమచలం । నిర్ఘాత నిర్ఘోత నిరీంద్రియత్వం ।
నిర్మోహ నిర్ద్వంద్వ నిరూపసత్యం । శ్రీమహద్గురుం నిత్యమహం నమామి ॥

శ్లో ॥ నిరాలంబాయ నిత్యాయ । నిర్మలాయ నిరంజన ।
నిత్యశుద్ధాయ బుద్ధాయ । వస్తుమద్రహితం నమః ॥

## అథ మనుః

శ్లో ॥ నిర్మూలమే తదా జ్ఞాన । శ్చరీరం నాస్తి కేవలం ।
షోడశాక్షరి తత్ సిద్ధ । మిమవ వ్యనిశం భజే ॥

నిర్మూలమే తదా జ్ఞాన శ్చరీరం నాస్తి కేవలం
మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు

## పంచదశి – దృష్ట ద్రాష్టాంతం

శ్లో ॥ స్వప్నే ప్రతీయ మానానిణి రూపా యథా తథా ।
కర్పూర దీప సంయోగం జ్యోతి రూపం యథా తథా ॥

దృ ॥ కలదోచిన శరీరాలు ఏలాగో అలాగే ।
ద్రా ॥ కర్పూరం కళిక కూడితె ఏలాగొ అలాగే ॥

శ్లో ॥ ఇతి మంత్రసమానైవ । సాందీప గుర్వగ్రణి ।
కృష్ణస్యమస్త కేనస్య । హస్తం తూష్ణీంబభూవహ ॥

" శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు "

## పరిపూర్ణబోధ స్తోత్రం

1. శ్లో ॥ యస్యాంతర్నాదిమధ్యే । నహికరచరణం । న నామగోత్రం । నసూత్రం
నోజాతిర్నైవవర్ణో నభవతి । పురుషోనా నపుంసో నచస్త్రీ ।
నాకారం నైవికారం నహిజననమరణం । నాస్తిపుణ్యాం నపాపం ।
నోతత్వం । తత్వమేకం సహజసమరసం । సద్గురుం తం నమామి ॥

2. శ్లో ॥ ఆత్మానాత్మ వినాశహేతు మనిశం । సర్వాతిరిక్తం శుభం ।
పూర్ణాత్పూర్ణమనామయం సుఖతరం । సర్వాపదధ్వంసకం ।
సర్వజ్ఞానవినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం ।
సర్వభ్రాంతివివర్జితం గుణహరం । సంపూర్ణబోధం నమః ॥

3. శ్లో ॥ నజ్ఞాతం పరవస్తునిత్య మచలం । సత్యంస్థితం శాశ్వితం ।
నిత్యానిత్యవివేక భేదరహితం । నిర్నామనిర్లేపకం ।

సర్వప్రత్యయహీనకంచ సతతం । సర్వత్రసంస్థంపరం ।
వందేహం పరిపూర్ణబోధమనిశం । సందేహనాశం ప్రభుం ॥

4. శ్లో ॥ నాహం మనుష్యో నచదేవ యక్షా । నబ్రాహ్మణ క్షత్రియ నవైశ్య శూద్రః ।
నబ్రహ్మచారి నగృహీ వనస్థో । భిక్షుర్న చాహం నిజ బోధరూపం ॥

## గురువాక్యోపనిషత్ పంచ శాంతిః

శ్లో ॥ ఖం వాయుర్జ్యోతిరాపః । పృథ్వీ విశ్వస్యధారణీ ।
యత్ పరం బ్రహ్మసర్వత్ర విశ్వాస్యాయతనం మహత్ ॥

సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం । తత్వమేవ త్వమేవతత్ ।
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది । ప్రపంచం యత్ప్రకాశతే ॥

తద్బ్రహ్మ మితిజ్ఞాత్వా । సర్వబంధైః ప్రముచ్యతే ।
యోవేదాదౌ సర్వప్రోక్తో । వేదాంతేచ ప్రతిష్ఠితః ॥

తస్యప్రకృతి లీనస్యయః । పరః స్వమహేశ్వరః ।
ద్రష్టదర్శన దృశ్యానాం । విరామోయత్రవా లభేత్ ॥

దృష్టిస్త త్రైవ కర్తవ్యా । ననాసాగ్రావలోకనే ।
అంతః పూర్ణం బహిః పూర్ణం । పూర్ణ కుంభమివాంభసే ।
అంతః శూన్యం బహిః శూన్యం । శూన్యకుంభ మివాంబరే ॥

శ్లో ॥ ఈశానాం సర్వ విద్యానాం । ఈశ్వర సర్వభూతానాం ।
బ్రహ్మాది పతిర్ । బ్రహ్మణోది పతిర్ ।
బ్రహ్మశివోమే । అస్తు సదాశివోం ॥

ఎంకున్నర్ణ సహనాప్యాయం । భద్రం కర్ణేభిరేవచ ।
పంచ శాంతిః । పఠేద్యాధో పఠే ద్వాక్యాన నంతరం ॥

"<u>ఇతి గురు వాక్యోపనిషత్ సమాప్తః</u>"

శ్లో ॥ అన్యవిద్యా పరిజ్ఞాన । మనవశ్యం నశ్వరంభవేత్ ।
బ్రహ్మవిద్యా పరిజ్ఞానం । బ్రహ్మప్రాప్తి కరం స్థితం ॥

<u>తాత్పర్యము</u> :- ఎవడు సద్గురునికి శరణుజొచ్చియున్నవాడో; ఎవడు వారి చేతియందున్న కర్రవల ఎక్కడంటే అక్కడవుంచితె అట్లనేయుంటాడో - మరి సాష్టాంగ దండ ప్రణామమును జేసి, సద్గురునకు తనను అర్పించికొనియున్నాడో; ఎవడు వారిని నీడవలవంటునంటి సేవజేస్తూ - పరి ప్రశ్నజేయుట నేర్చియున్నాడో వాడు ధన్యుడు. గురుని ఉదరమందు జేరియుండుటవలన - ఇంక వారి ఉపదేశ బలమునుండి వాడు గురుపుత్రుడైయుండట సత్యము. మన హృదయమునకు - గురుని హృదయమునకు సంబంధమైనచో మనకు కొత్తగా ఒక జన్మమే వచ్చినట్లువుంటుంది. పూర్ణ జ్ఞానము అలవడుట ఇట్లనేకాని - వేరోక ప్రకారమునుండి కాదు. ఈ రకముగా సద్గురుని కను గొని పూర్ణజ్ఞానమును బడసి సకల యజ్ఞములను మీరిన పూర్ణ బోధను పొంది, భ్రాంతిరూపమైన యెరుకను రహిత పరచుకొని, కర్మబంధమును త్రెంచుకొని (తగద్రెంచి) కృతకృత్యుడు గావలయును.

శ్లో ॥ గురోన్ముఖేన జ్ఞాతవ్యం । నాన్యదా గ్రంథకోటిభిః ।
అన్యదాలభితం నాస్తి । సత్యం సత్యం పునః పునః ॥

<u>తాత్పర్యము</u> :- ఈ పరమ రహస్యమైన గురుబోధ యుక్తులవల్లగాని; శృతులవల్లగాని; స్మృతులవల్లగాని; మరిదేనివల్లగాని తెలియబడజాలదు. "గురుర్వినా నశిష్యతి". అంటే సద్గురు కరుణాకటాక్షము లేకుండా సంభవింపజాలదు. "గురుదేవుడు మాకు ఉపాస్యదేవత." గురునితోనే మాకు పరమార్థమున్నది. "అతడే

సమర్థులందరికంటెను సమర్థుడు." దేవతల సైతము ముక్తులగాఁవించును. "అతనిముందు త్రిమూర్తులు సైతము - చేతులు జోడించుకొని సేవించుచుందురు - ఆ సద్గురు మూర్తికి సమమైనవారెవ్వరును లేరు." "మనమందరము సద్గురు పరమాత్మకు సేవకులము. అతని చరణ సేవవలననే మనకు పరమార్థము సిద్ధించుచున్నది." అట్టి సద్గురునికడ మనము భక్తితో మెలగకున్నయెడల - తప్పక పతనమొందెదము. "సమర్థుడైన దేశికుని అనుగ్రహమునకు దూరమైన మానవుడు దౌర్భాగ్యుడు. రాజ్యపదవినుండి చ్యుతుడైనవాని దశయెట్లుండునో, గురుని అనుగ్రహమునకు దూరమైనవాని స్థితి అట్లుండును."

నల చక్రవర్తి రాజ్యమును పోగొట్టుకొన్నమీదట - తినుటకు అన్నములేక మలమల మాడినాడు; కట్టుకొన్న బట్టలను సహితము పోగొట్టుకొన్నాడు; భార్య బిడ్డలను విడచినాడు; పాముచేత కరవబడి వికృతరూపుడై మారినాడు; ఇతర రాజ్యములో బానిసగా సేవజేస్తూ జీవించియుండెను; "ఆతడుపడిన దుఃఖమును వర్ణించుటకు ఎవరికిను సాధ్యముగాదు - అటులనే గురుకృప లేకపోతేయని తెలియుము".

"జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకు జై"

"జై శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్య ప్రభు మహారాజుకి జై "

***********

ఓం

"శ్రీ గురుభ్యో నమః"

# శ్రీ సద్గురు పూజా విధానము

# ఓం

## "శ్రీ గురుభ్యో నమః"

### శ్రీ సద్గురు పూజా విధానము

### గురు ప్రార్థన

గురు బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబ్రహ్మ । తస్మైశ్రీగురువే నమః ॥

అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించిత్ చరాచరం ।
త్వం పదం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

అఖండమండలాకారం । వ్యాప్తం ఏన చరాచరం ।
తత్పదం దర్శితం ఏన । తస్మైశ్రీగురువే నమః ॥

చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యంస చరాచరం ।
అసిత్వం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

చైతన్యం శాశ్వతం శాంతం । వ్యోమాతీతం నిరంజనం ।
నాద బిందు కళాతీతం । తస్మైశ్రీగురువే నమః ॥

త్వం పితా త్వంచమే మాతా । త్వం బంధు త్వంచ దేవతా ।
సంసార ప్రీతి భంగాయ । తస్మైశ్రీ గురువే నమః ॥

ఆనందమానందకరం ప్రసన్నం । జ్ఞాన స్వరూపం । నిజబోధయుక్తం ।
యోగీంద్రమీడ్యం । భవరోగవైద్యం । శ్రీమహద్గురుం । నిత్యమహం నమామి ॥

మన్నాథా శ్రీజగన్నాథా । మద్గురో శ్రీ జగద్గురో ।
మమాత్మా సర్వభూతాత్మా । తస్మైశ్రీగురువే నమః ॥

హృత్పుండరీకా మధ్యస్థ్యం । సకలామ్నాయ సంస్తుతం ।
ధ్యాయామ్యహ్యం సదాభక్త్యా । సకలా భీష్టధాయకం ॥

నిరంతరం సర్వసందేహో । ఏకీ కృత్య సుదర్శనం ।
రహస్యయో దర్శయతీ । భజామి గురుమీశ్వరం ॥

" జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై "

## శ్రీ నిజగురు – అచల సద్గురు పరంపరా స్తోత్రము

### శ్రీ నిజగురు పరం పరా ధ్యానం

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మావిద్యా సాంప్రదాయ ।
కర్తృభ్యో । వంశ ఋషిభ్యో । మహద్భ్య నమోగురుభ్యః ॥

శ్లో॥ సర్వోపప్లవరహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో ।
బ్రహ్మైవాహమస్మి । అహం పదార్థ రహితః ॥

శ్లో॥ గురువే సర్వలోకానాం । బిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం । శ్రీ దక్షిణామూర్తియే నమః ॥

1. ఓంకార పీఠసిద్ధాంతం । బ్రహ్మవిద్యోపదేశికం ।
శ్రీమన్నారాయణం సూర్యం । సద్గురుభ్యో నమో నమః ॥

2. యాజ్ఞవల్క్యంచ జనకం । శుకసాందీపమీశ్వరం ।
కృష్ణ అర్జున సంయుక్తం । ఉద్ధవంచ నమో నమః ॥

3. బ్రహ్మానంద యోగీంద్రం । రామానంద జ్ఞానేశ్వరః ।
సహజానంద యోగీశ । రామావధూత గురుం భజామి ॥

4. అంబికా శివయోగీంద్రం । వేమనయోగి సద్గురుం ।
నిరంజన వెంకయ్యార్య । తిరువెంగళ గురుం భజే ॥

5. శ్రీధర స్వామియోగీంద్రం । శివరామాఖ్య దీక్షితం ।
కంభాలూరి అప్ప బ్రహ్మం । సద్గురుభ్యో నమో నమః ॥

6. పరుశురామ సీతారామ । భాగవత కృష్ణయోగినః ।
ఫీలుఖాన లక్ష్మణార్య । సద్గురుభ్యో నమో నమః ॥

7. బృహద్వాశిష్ట సిద్ధాంతం । పూర్ణబోధోపదేశిక ।
శ్రీ వెంకటేశ్వర యోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

8. ఆత్మానాత్మ అతీతమనిశం । కేవలాత్మోపదేశిక ।
వేముల రామయ్యార్య యోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

9. ప్రణవాతీతమగమ్యం । పరాప్రకృతి రహితం ।
పరమచలోపదేశిక । శ్రీ రాజయాఖ్య గురుం భజే ॥

10. శ్రీ బ్రహ్మవిద్యాసిద్ధాంతం । అచల తత్వోపదేశిక ।
శ్రీ నాగయ్యార్యయోగీంద్రం । సద్గురుభ్యో నమో నమః ॥

11. ద్వయాత్మరహిత సిద్ధాంతం । పరమపురుష ప్రబోధకం ।
శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య । సద్గురుభ్యో నమో నమః ॥

12. అస్మద్గురు సమారంభాం । కృష్ణసాందీప మధ్యమాం ।
ఓంకారపీఠ పర్యంతాం । వందే గురు పరం పరం ॥

*************

# శ్రీ సద్గురు పూజా

శ్లో॥ గురు బ్రహ్మ గురువిష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబ్రహ్మ । తస్మై శ్రీ గురువే నమః ॥

శ్లో॥ గంగేచ యమునేచైవ । గోదావరీ సరస్వతి ।
నర్మదే సింధుకావేరి । జలేస్మిన్ సన్నిధింకురు ॥

కావేరీ తుంగభద్రాచ । కృష్ణవేణీచ గౌతమి ।
భాగీరథీచ విఖ్యాతా । పంచగంగా ప్రకీర్తితః ॥

## అస్మద్గురు చరణారవిందోదకం స్నానం కురు పవానం శుభం

[ ఉదకం శిరముపైన చల్లుకోవలెను ]

## మానసిక స్నానం – నాశికము వ్రేళ్ళతో తాకవలెను

శ్లో॥ ఇడా భాగీరథీగంగా । పింగళాయమునానది ।
తయోర్మధ్యేగతనాడి । సుషుమ్నాచ సరస్వతి ॥

శ్లో॥ ఏవం జ్ఞాన ప్రదేతీర్థే । రాగద్వేషమలాపహేయ ।
స్నాతి మానసేతీర్థే । సయాతి పరమాం గతిం ॥

## ఘంటానాదము చేయవలెను

శ్లో॥ ఆగమార్థంతు దేవానం । గమనార్థంతు రక్షసాం ।
కురుఘంటారవం । తత్ర దేవతాహ్వాన లాంచనం ॥

## జ్యోతి దర్శనం

శ్లో ॥ దీపం జ్యోతి పరబ్రహ్మ । దీపం సర్వతమోపహరం ।
దీపేన సాధ్యతే సర్వం । సదా దీపం నమోస్తుతే ॥

## పీఠ శుద్ధిః

శ్లో ॥ అపవిత్ర పవిత్రోవ । సర్వావస్థాంగ తోపివా ।
యః స్మరేత్పుండరీకాక్షం । సబాహ్యాభ్యంతర శుచిః ॥

[సభాసదులపై పుష్పాలతో జలము ప్రోక్షించవలెను]

## భూ శుద్ధిః

శ్లో ॥ పృథ్వీత్వయా ధృతాలోకాన్ । దేవిత్వం విష్ణునాసహా ।
త్వంచధారయ మాం దేవి । పవిత్రం కురు చాసనం ॥

[జలము అష్టదిక్కులకు ప్రోక్షించవలెను]

## ఆసనం శుద్ధిః

శ్లో ॥ భూత ప్రేత పిశాచాది । విఘ్నకర్తృ నివారణాం ।
సంకృన్మంత్ర సముచ్చార్యా । ఆసనం పరికల్పితాం ॥

[ తాను కూర్చున్న ఆసనమున ఎడమకాలిక్రింద నీళ్ళు చల్లుకొనవలమును ]

## విభూతి ధారణం

శ్లో ॥ ఓంకార వదనాదేవి । హాయాకార భుజద్వయీ ।
శికార దేహమధ్యేచ । నమకార పదద్వయి ॥

శ్లో ॥ భూతిర్ భూతికరీ । పవిత్రజననీ మహాఘవిధ్వంశిని ।
సర్వోప ద్రవనాశినీ । శుభకరీ సర్వార్ధసంపత్కరి ॥

శ్లో ॥ భూతప్రేత పిశాచ రాక్షస । గణారిష్టాదా సంహారిణీ ।
తేజోరాశి విశేష మోక్షణికరీ । భూతిస్సదా ధార్యతాం ॥

శ్లో ॥ శ్రీకరంచ పవిత్రంచ । రోగదోష నివారణం ।
లోకవశ్యకరం పుణ్యాం భస్మం । త్రైలోక్య పావనం ॥

[ భస్మధారణ చేయవలెను ]

శ్లో ॥ శాంతం పద్మాసనస్థం । శశిధరమకుటం ।
పంచవక్త్రం త్రినేత్రం । శూలం వజ్రంచ ఖడ్గం ।
పరశుమభదయం । దక్షభాగే వహంతం ।
నాగంపాశంచ ఘంటాం । ప్రళయహుత హంసాంకుశం ।
వామభాగే నానాలంకారయుక్తం । స్పటికమణినిభం
పార్వతీశం నమామి ॥

[ సకల్పం - ఇతి మంత్రేణ భస్మధారణ కరిష్యేత్ ]

## ఆచమనీయం

శ్లో ॥ ఓం నమః శ్రీ గురుదేవాయ స్వాహాః ।
పరమ పురుషాయా స్వాహాః ।
సర్వదేవతా వశీకరాయ స్వాహాః ।
సర్వారిష్ట వినాశాయ స్వాహాః ।
సర్వమంత్రచ్ఛేదనాయ స్వాహాః ।
త్రైలోక్యం వశమానాయ స్వాహాః ॥

## ప్రాణాయామః

శ్లో ॥ ఓం భూః । ఓం భువః । ఓం సువః । ఓం మహః । ఓం జనః । ఓం తపః ।
ఓం సత్యం । ఓం తత్సవితుర్వరేణ్యాం । భర్గోదేవస్యధీమహీ । ధియోయోనః

ప్రచోదయాత్ ॥

శ్లో ॥ ఓం ఆపోజ్యోతి రసోమృతం । బ్రహ్మ భూర్భువస్సురోం । ఏవం గుణ విశేషణ విశిష్టాయాం । శుభతిథౌమమ । జనన మరణ భ్రాంతి । రహితద్వార శ్రీ సద్గురు దేవతాప్రీత్యర్థం । ధ్యానమావాహనాది షోడశోపచారా పూజావిధానం అహంకరిష్యే ॥

## శాప విమోచనం

శ్లో ॥ 'ఓం' 'ఐం' 'యోం' పరమేవచ । పంచశద్దోష నివర్తనంచ ।
శాప విమోచనం । కురు కురు స్వాహః ॥

## మహాసంకల్పం

పంచదశి ; మహామంత్రాంతర్గత; జగత్ సృష్టిమధ్యే; అశరీర గురుపద శాంతి స్నానమహం కరిష్యే; శ్రీ ఖండాఖండ విరహితాయ; మద్గురు పాద సన్నిదౌ; శ్రీ నిజగురు దర్శన స్పర్శన కరుణాకటాక్ష వీక్షణ సిధ్యర్థం; శ్రీ నిజగురు లఘు పరాపూజా మంత్రానుష్టాన విధాన మహంకరిష్యే;

అస్మిన్ గురుపదశ్చాంతి; స్నాన సమయే; మద్బ్రమసృష్ట్యారాభ్యాం; బ్రహ్మానందనామ సంవత్సరే; తుర్యాతీత అవ్యక్తానామ ఋతౌ; జ్ఞానాజ్ఞానా; శూన్యమాసే; కేవలాత్మ పక్షే; జన్మాంతర మర్మపుణ్యాతిథౌ; నిష్కళావాసరే; ప్రకృతిద్వయ; దోషరహిత నక్షత్రే; స్వప్నావరణ గోత్రస్య; శ్రీ మద్గురు; శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య సద్గురు; రాజయోగి నామధేయస్య; అవినాశ భందాయ; అభవోదేవాయ; అమృతబీజాయభ్రమౌ; బ్రహ్మైవాహమస్మి; అహంపదార్థరాహిత్య; అప్రమేయ శక్త్యాయ; మమవ్యావహారిక; స్వప్నోద్యోగానాం; బాల్యకౌమార యౌవన వార్ధిక్యకాలే; విద్యావిద్యకర్మ జన్మవాసన

రహితాయం; నిస్తరంగ నిజగురు పదశ్శాంతి స్థానసిద్ధ్యర్థం; షోడశోపచార పూజావిధాన మహంకరిష్యే.

## కలశపూజ

శ్లో ॥ కలశస్య ముఖే విష్ణుః । కంఠే రుద్ర సామాశ్రితాః । మూలేతత్రస్థితో బ్రహ్మ ।
మధ్యేమాతృగణాస్మృతాః । కుక్షౌతుసాగరసర్వే । సప్తద్వీప వసుంధరా ।
ఋగ్వేదో యజుర్వేదో । స్సామవేదోయథర్వణః । అంగైశ్చ సహితాస్సర్వే ।
కలశాంబు సమాశ్రితాః । ఆయాంతు గురు పూజార్థం । దురితక్షయ కారకః ॥

శ్లో॥ గంగేచ యమునేచైవ । గోదావరీ సరస్వతి ।
నర్మదే సింధుకావేరి । జలేస్మిన్ సన్నిధింకురు ॥

కావేరీ తుంగభద్రాచ । కృష్ణవేణీచ గౌతమి ।
భాగీరథీచ విఖ్యాతా । పంచగంగా ప్రకీర్తితః ॥

శ్లో॥ కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష ।
దేవానాం సంప్రోక్ష । ఆత్మానాం సంప్రోక్ష ॥

శ్లో॥ వందేహం గురుపాద పద్మములకున్ । వందే సుబోధోకికన్ ।
వందేహం గురుచరిత సంగ్రహమునకున్ । వాగ్మానస సుశ్రేణికిన్ ।
వందేహం గురునామధేయమునకున్ । వందేగురుస్థలమునకున్ ।
వందేహం గురుభక్త బృందమునకున్ । వందే సమజ్ఞాతకున్ ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగనసదృశం । తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమలమచలం । సర్వధీ సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం । సద్గురు త్వం నమామి ॥

గీ ॥ వసుధలో పుణ్యుడొకడు గురువరునిజేరి । నాల్గు విధముల శుశ్రూషలాచరించి ।
దేశికుని కరణచేతనుపదేశమొంది । పూర్ణబోధనువడసి సంపూర్ణుడయ్యె ॥

దరువు : ఎంతో మోదంబునా । పూజింప బహిరంతరంగంబునా । సంతతముగా గురుని చరణకమలంబుల మంతానమున నిలిపి । మనోవాక్కాయపు శుద్ధి ॥ ఎంతో మోదంబునా ॥

శ్లో॥ హృత్పుండరీక మధ్యస్థం । సకలామ్నాయ సంస్తుతం ।
ధ్యాయామ్యహం సదాభక్త్యా । సకలాభీష్టదాయకం ॥

గీ ॥ శ్రీ నిరంజన నిర్గుణ స్థిరనివాస । సచ్చిదానందరహిత నిశ్చబ్దపూర్ణం । బట్టబయలైన బ్రహ్మంబు నిట్టిదనుచు । దలపు సద్గురు మూర్తిని దలచియిపుడు ॥

దరువు : ధ్యానాము జేసేదా । చలనములేని దాన్నీనుతియించేదా । మానితముగా గురుపే । నాద్వైపమటంచు । పూనిజేసదనార్య పూజాకోసరమయ్యా ॥ ధ్యానాము ॥

అచల సద్గురు శ్రీ వివేకానంద సుబ్బయ్యార్యా – రాజయోగి; స్వగురు; పరమగురు; పరమేష్టిగురు; సద్గురు; నిజగురు; పరిపూర్ణగురు; పరబ్రహ్మణే నమః ॥

" శ్రీ సద్గురునకు ధ్యాయామి ధ్యానం సమర్పయామి "

శ్లో॥ ఆగచ్ఛానంతదేవేశ । భోగమోక్ష ప్రదాయక ।
నాకేశ ముఖలోకేశ । వందితాంఘ్రిద్వయాంబుజ ॥

గీ ॥ లేనియీ జన్మమిపుడు । నాకట్లుగలిగననుచు । చింతించి సత్కర్మను నుసరించి । తపమునర్చుచుండ । నాదగు సుకృతముపలన । సరుదంచి కడతేర్చ వస్తిరిపుడు ॥

దరువు : ఆవాహనమునీకు । నొసగెదనన్ను దేహవిడిచిపోకు । నీవల్లనేకాదా
రా జన్మ । కడతేరా భావంబు దలిపిన పరమ సద్గురు మూర్తి
॥ ఆవాహనమునీకు ॥

" <u>శ్రీ మద్గురునకు ఆవాహనం సమర్పయామి</u>"

శ్లో॥ రత్నసింహాసనం వందే । సంగృహాణ మయార్పితం ।
చంద్రమండల సంకాశ । సంస్మితానన పంకజ ॥

గీ ॥ దేహమేనేనను కొన్న దేహి యెరుక । బింబ ప్రతికరణములనునా ।
డంబమనేటి పీటకును । కోళ్ళుగా జేసి ప్రియముతోడ । ఆసనంబిదే
గొనుమయానంద మూర్తి ॥

దరవు : స్వామికూర్చుండుమా । మణిసింహాసనము ఇదియే సుమా । ఈ మహా
నిజబోధ నెరుగాని స్వజనాల । క్షేమంబుతో బ్రోచి ధామంబులను మాన్ప ।
॥ స్వామికూర్చుండుమా ॥

శ్లో॥ పాద్యం గృహాణభ్యో స్వామిన్ । మయానీతం శుభప్రదం ।
కృష్ణవేణీ జలంభక్త్యా । తీర్థపాదౌ జగద్గురో ॥

గీ ॥ నేను మరియేది గోరక నిండియున్న । సచ్చిదానందరహితమౌ స్వచ్ఛ
పదము । గోరి యానందమొందు నాకోర్కె మీకు । జలములివి
పాదపాద్యప్రజ్జలమువల్ల ॥

దరవు : పాదార్చనా జేసెదా । యికనాజన్మ పావనముగాంచేదా । సాధు సేవితగురు
సాంప్రదాయకమైన । బోధావడసియు సంపూర్ణ భక్తివహించి ॥ పాదార్చనా
జేసెదా ॥

" <u>శ్రీ మద్గురునకు పాదయోపాద్యం సమర్పయామి</u>"

శ్లో॥ అర్ఘ్యందాస్యామ్యహం భక్త్యా । తవపాణీతలేవిభో ।
గోదావరీజలం హేమ । కలశస్థం సువాసితం ॥

గీ ॥ నాకొరకుగాదే మీరుజన్మంబుదాల్చి । బోధపడజేసి సంపూర్ణబోధయందు । నిక్క మిదిగాదు తనుపరుక నిల్పసేటి । నిశ్చయంబనే జలమును నీకుయిపుడు ॥

దరవు : నొసెగెదనూ అర్ఘ్యమూ । తనుపెరుకలు వినకేయీ మార్గము । కృశియించె ఎాచాట । రసముమీకృపవల్ల । నశియించే తనుపెరుక । ననులేకుండగాజేయు ॥ నొసగెదనూ ॥

"శ్రీ మద్గురునకు హస్తయో అర్ఘ్యం సమర్పయామి "

శ్లో॥ ఆచమ్యతాం మయాదత్తం । హే గురూయమునాజలం ।
త్వదర్థం కృపయా భావ । భవబాధా నకృంత్తన ॥

గీ ॥ తత్వమసి బ్రహ్మసెడి తత్వంబుదెలిసి । నదియసేనను యెరుకగా నదియు యెడ । లేసేలేదను నిశ్చయంబును జేసి । యుంచినాడను దేశికానుచితమైన ॥

దరవు : ఆచమానంబును । అర్పించితి దోషహరణంబునూ । పాచితీగకు మొదలు దోచి నట్టులదీని । జూజినప్పటి చూపినాచై జారిడచిన ॥ ఆచమానంబునూ ॥

" శ్రీ మద్గురునకు ముఖే ఆచనీయం సమర్పయామి "

శ్లో॥ శర్కరాదధిమధ్వాజ్య । క్షీరమిశ్రమిదం విభో ।
పంచామృతం మయాదత్తం । స్నానం కురు జగత్పతే ॥

గీ ॥ నారికేళంబుయను భ్రాంతి నరయగొట్టి । యందులో జలము క్షీరదధియందు ఘృతము । బోధరసశర్కరసేడి । సద్బుద్ధిగలిపి తిదియే । పంచామృతముల స్నానము ఇప్పుడు జేయవలయూ । నిదిగోతండ్రి పంచామృతముల స్నానము జేయండీ ఫలమేమిలేనట్టి । భ్రమవిశ్వమును జూడ కలవంటిజగమునిక్కము గాదుయని తెలుప ॥ వలయూ నిదిగోతండ్రి పంచామృతములస్నానము జేయండీ ॥

" శ్రీ మద్గురునకు పంచామృత స్నానం సమర్పయామి "

శ్లో॥ తప్తకాంచన కుంభస్తం । కించిదూష్ణ సువాసితం ।
మయానీతం జహ్నుకంన్యా । జలం స్నానం కురుప్రభో ॥

గీ॥ ఎపుడు మీసన్నిధికి జేరినపుడే । సర్వశాస్త్రముల వాసనలు నన్నుజతయు జేర్చి । లేనివాడును నేనుననులేక । చూడమనిన నదిబేధ శూన్యమానసేటి శుద్ధోదకములను దెచ్చితీ । జలకములాడు మికనీ ॥

దరవు : కృపగాంచితీ । అకలంకరూపా వేడుకబుట్టనీ । స్నానోదకము జేయుమూ । పుణ్యోదకముల్లైన । శుద్ధోదకములను దచ్చితీ ॥ జలకములాడు ఇక మీ కృపగాంచితీ ॥

"శ్రీ మద్గురునకు శుద్ధోదక స్నానం సమర్పయామి"

శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం । త్వదర్థం స్వర్ణతంతునా ।
నిర్మితం నిర్మలం స్వామిన్ । నిత్యకల్యాణ పావనా ॥

గీ ॥ గంగయమునల నడుమను పొంగుచుండు । నదియే జ్యోతి సరస్వతి యనేటి కూట । బ్రహ్మచైతన్యమగును తద్బ్రహ్మనిష్టయందు । స్ఫటికంబు శ్వేతవర్ణంబునున్న ॥

దరవు : వస్త్రాముధరియింపుమా । మలినములేని గాత్రమును దాల్చుమా । చిత్రా చిత్రముల్లైన జగముదానిలోదోచి । చిత్రంబులను జేయుచిన్మయంబున శ్వేత । వస్త్రాముధరియించుమా ॥ మలినములేని గాత్రమును దాల్చుమా ॥

" శ్రీ మద్గురునకు వస్త్రయుగ్మం సమర్పయామి "

శ్లో॥ కార్పాస తంతునాశుభ్రం । రచితం తేర్పితంమయా ।
సంగృహాణమిదం యజ్ఞ । సూత్రంపాత్రం దయానిధే ॥

గీ ॥ సప్తచక్రంబులకుమీద గుప్తమయ్యు । నడచుచుహంసోహంమను
సూత్రమందు । మూడు మాతృకల దొక్కటిగను గాయిత్రికొరకు ।
బ్రహ్మముడిపట్టితిది మూలభ్రాంతియనేటి ॥

దరువు: జంధ్యాము ధరియింపుమా । నేనీవనె సంధ్యాభ్రమ దీర్చుమా । వంధ్యాసూనుని
భ్రాంతివల దోచుయరుకాలో సంధ్యాలన్నియుదోచు । స్వానుభవమే భ్రాంతి ।
॥ జంధ్యాము ధరియింపుమా ॥

"శ్రీ మద్గురునకు యజ్ఞోపవీతం సమర్పయామి"

శ్లో॥ కిరీటం కుండలం రత్న । కంకణాదీని తేమయో ।
సంగృహ్యాతాం భూషణాని । అర్పితాని నిరంజన ॥

గీ ॥ పెద్దలను జూచి మ్రొక్కూటే నిద్ధమైన । ముత్యములహారమగు
కంఠమునసుమెరయు । రత్నముల కిరీటమంటే । విరక్త శుద్ధనిందలను
పారదోలుటే అందలనగ ॥

దరవు: జేసీతి ధరియింపుమా । ఆభరణాముల్ దేశికుడా గాంచుమా ।
ఆశాగుణములనల్లా గోసీమీమెడనిండా । భూషణంబులు బెట్టి
నా సుగుణములుగూర్చి ॥ జేసితి ధరియింపుమా ॥

"శ్రీ మద్గురునకు సర్వాభరణభూషణాన్ సమర్పయామి"

శ్లో॥ మలయాచల సంభూతం । కర్పూర కళితం విభో ।
విలేపనం త్వదర్థంభో । గృహ్యాతామర్పితం మయా ॥

గీ ॥ జ్ఞానమనియేటి తెలివిని సానపైన । చక్కయనే కోరికనుయందు దక్క
కుండ । రాచి తీసిన శ్రీగంధరసమునిదియు । మేనునకు బూతు మదికి
సన్మానమొదవ ॥

దరవు : పరిమళ పుగంధమూ । ధరియింపుమీ మెరుపుగల తిలకమూ । సరసంబు గను సువాసన ద్రవ్యములనెల్ల । నరసింపుమిగవీటి యానందమునుగలుగ । పరిమళపుగంధమూ ॥ ధరియింపుమీ మెరుపుగల తిలకమూ ॥

"శ్రీ మద్గురునకు శ్రీగంధం సమర్పయామి"

శ్లో॥ తండులాన్ దవళాకారాన్ । హరిద్రాచూర్ణ మిశ్రితాన్ ॥
గృహ్యతామక్షతాన్ దేవా । మయాదత్తాన్ మనోహరాన్ ॥

గీ ॥ చూపురూపుల రెంటిలో । చూపునిలిపినప్పుడు । చిత్కళయై వెలుగునదియు । నాదబిందు కళలకు మధ్యముయందు । శ్వేత తండులంబులగూర్చితి దగును పుణ్యా

దరువు: చరితానర్పింతునూ । అక్షంతాలు గురుపై పూజింతునూ । ఎరుకే నాదము బిందు ఎరుకే చిత్కళటంచు । సరిగించి పరిపూర్ణమరుగూ దలిపిన పుణ్యా ॥ చరితానర్పింతునూ ॥

" శ్రీ మద్గురునకు అక్షతాన్ సమర్పయామి "

శ్లో॥ పుష్పాణ్యానేకాని సుపల్లవాని । సుగంధయుక్తాని మనోహరాణి । త్వం గృహ్యతాం । దేవమయార్పితాని । జలాశయా స్థాని జపాదికాని ॥

గి ॥ రేచకము పూరక । కుంభక సూచనలను । పుష్పములునివి సంపెంగ పొగడమల్లే। కురువకంబులు గన్నేరు కుసుమములును । కుందనపుతర మొగ్గలు ॥

దరవు : అందమైన పారిజాతంబులూ । చామంతులింపారమగు పువ్వులూ । మారేడు తులసియు మాచపత్రిదళంబు । కోరి అర్పించితి గురుమూర్తి పరిమళ ॥ పారిజతంబులూ ॥

"శ్రీ మద్గురునకు నానావిధ పరిమళ పత్రపుష్పం సమర్పయామి"

# అథ అంగ పూజ

1. తీర్థపాదాయ నమః – పాదౌ పూజయామి;
2. నిగమ మంజీరాయ నమః – గుల్ఫౌ పూజయామి;
3. స్మరతూణీర జంఘాయ నమః – జంఘౌ పూజయామి;
4. ముక్తికాంత సేవితాయ నమః – జానునీం పూజయామి;
5. రత్నస్థంభోరుయుగళాయ నమః – ఊరుం పూజయామి;
6. పులినతల జఘనాయ నమః – జఘనౌ పూజయామి;
7. మణికాంచితకలాప శోభితాయ నమః – కటిం పూజయామి;
8. గంభీర నాభి మండలాయ నమః – నాభిం పూజయామి;
9. విశ్వోధరాయ నమః – ఉదరం పూజయామి;
10. దయార్ద్ర హృదయాయ నమః – హృదయం పూజయామి;
11. విశాల వక్షాయ నమః – వక్షస్థలం పూజయామి;
12. కంబుగ్రీవాయ నమః – కంఠం పూజయామి;
13. వరదానదురినాయ నమః – హస్తౌ పూజయామి;
14. ఉన్నత స్కందాయ నమః – భుజౌ పూజయామి;
15. స్మితవక్త్రాయ నమః – వక్త్రం పూజయామి;
16. చంపకనాసాయ నమః – నాసికం పూజయామి;
17. పల్లవధరాయ నమః – అధరం పూజయామి:

18. పుండ్రేక్షు కార్ముకభృపే నమః – భ్రూయుగ్మం పూజయామి;

19. కరుణాకటాక్ష వీక్షణాయ నమః – నేత్రౌ పూజయామి

20. పుష్ట కర్ణాయ నమః – కర్ణౌ పూజయామి ;

21. శాఖాసుధాంశు వదనాయ నమః – ముఖం పూజయామి;

22. సు లలాటాయ నమః – లలాటం పూజయామి;

23. నీలకుంచిత మూర్తిజాయ నమః – కేశాన్ పూజయామి;

24. సువృత్త శిరస్కాయ నమః – శిరః పూజయామి;

25. సర్వాత్మనే నమః – సర్వాంగాని పూజయామి;

గీ ॥ పాదములు గుల్ఫజానులిరుపార్శ్వములును । కటియు జఠరంబువక్షంబు కంఠములును । భుజములస్తముల్ నాసిక కపోలములును । నయన శ్రవణ నొసలు మస్తకము అంగసర్వ ॥

దరువు: పూజాగావించేదా । మీమృదమీను తేజామునుతియించేదా । రః జన్మ మరణాములిక నాకు లేవాని । భూజనులకు మిమ్ముపొగడవశముగాని । ॥ పూజాగావించేదా ॥

"శ్రీ మద్గురునకు అథ అంగ పూజాన్ సమర్పయామి"

## అథ పత్ర పూజా

1. అచింత్యాయ నమః – బిల్వపత్రం సమర్పయామి;

2. బృందారక వందితాయ నమః – తులసీదళం సమర్పయామి;

3. భువన రక్షణ తత్పరాయ నమః – వకుళ పుష్పం సమర్పయామి;

4. భూరి విభవాయ నమః – పున్నాగ పుష్పం సమర్పయామి;

5. జగజ్జనన కారణాయ నమః – కేతకీ పత్రం సమర్పయామి;

6. చంచర గురువే నమః – చామంతికా పుష్పం సమర్పయామి;

7. సుప్రభావాయ నమః – చంపక పుష్పం సమర్పయామి;

8. సుప్రసన్నాయ నమః – పాటలి పుష్పం సమర్పయామి;

9. అపవర్గ ప్రదాయ నమః – శత పత్ర పుష్పం సమర్పయామి;

10. అనంతాయ నమః – జాజి పుష్పం సమర్పయామి;

11. మోహవర్జితాయ నమః – కరవీర పుష్పం సమర్పయామి;

12. ముకుందాయ నమః – రసాల పుష్పం సమర్పయామి;

13. ప్రకృతి పురుష విలక్షణాయ నమః – మందార పుష్పం సమర్పయామి;

14. నిత్యాయ నమః – కల్హార పుష్పం సమర్పయామి;

15. ఆగ్నేయ చక్రనిలయాయ నమః – అతసీ పుష్పం సమర్పయామి;

16. నాదబిందు కళాతీతాయ నమః – పారిజాత పుష్పం సమర్పయామి;

17. భూతాత్మనే నమః – అశోక పుష్పం సమర్పయామి;

18. మండలత్రయాతీతాయ నమః – నీలోత్పల పుష్పం సమర్పయామి;

19. అచ్యుతాయ నమః – మల్లిక పుష్పం సమర్పయామి;

20. అవ్యక్తాయ నమః – మాలతి పుష్పం సమర్పయామి;

"శ్రీ మద్గురునకు నానావిధపరిమళ పత్ర పుష్పాన్ సమర్పయామి"

# 108 - అథ అష్టోత్తర శతనామావళి

1. సద్గురువే నమః
2. పూర్ణాయ నమః
3. సంబోధాయ నమః
4. స్వచ్ఛాయ నమః
5. శుద్ధాయ నమః
6. నిర్మలాయ నమః
7. విశ్వోదరాయ నమః
8. నిరాలంబాయ నమః
9. రమ్యాయ నమః
10. నిర్లేపాయ నమః
11. నిర్వాసనాయ నమః
12. నిర్గ్రంథాయ నమః
13. స్వప్రకాశాయ నమః
14. నిత్య తృప్తాయ నమః
15. అనంతాయ నమః
16. అద్వితీయాయ నమః
17. వేదవాచామ వేద్యాయనమః
18. పరంజ్యోతిషే నమః
19. ప్రణవాతీతాయ నమః
20. అచలాయ నమః
21. అపరిమితాయ నమః
22. అప్రమేయాయ నమః
23. అవ్యయాయ నమః
24. అచ్యుతాయ నమః
25. అహంకార వివర్జితాయ నమః
26. విశ్వాత్మనే నమః
27. ప్రపంచాతీతాయ నమః
28. మాననీయాయ నమః
29. క్షరాక్షర విలక్షణాయ నమః
30. దృగ్ దృశ్యాతీతాయ నమః
31. ద్వైతాద్వైత నిర్ముక్తాయ నమః
32. అఖండాయ నమః
33. ఖండాఖండ విరహితాయ నమః
34. ఆది మధ్యాంత శూన్యాయనమః
35. నిరంజనాయ నమః
36. నిర్వికల్పాయ నమః
37. నిరాకారాయ నమః
38. నిరాఖ్యాతాయ నమః
39. పరమానంద స్వరూపాయ నమః
40. సగుణనిర్గుణాతీతాయ నమః
41. సర్వసాక్షిణే నమః
42. సాక్ష్యాతీతాయ నమః
43. త్రిగుణ తీతాయ నమః
44. సర్వభూతాంతర స్థాయ నమః

45. సుఖదుఃఖ విరహితాయ నమః
46. జన్మజరామరణవర్జితాయనమః
47. క్షేత్రజ్ఞాయ నమః
48. సర్వోపనిషత్సారాయ నమః
49. నిష్కళంకాయ నమః
50. నిరాభాసాయ నమః
51. స్వచ్ఛందాయ నమః
52. సృష్టిస్థిత్యంత కారణాయ నమః
53. కర్తృత్వరహితాయ నమః
54. సచ్చిదానందాతీతాయ నమః
55. అపరోక్షాయ నమః
56. సకలమంత్ర స్వరూపాయ నమః
57. ఆకాశతమసే నమః
58. నిరాధారాయ నమః
59. నిస్తేజసే నమః
60. అవికారాయ నమః
61. అమలాయ నమః
62. పరత్పరాయ నమః
63. పరంధామ్నే నమః
64. అజాయ నమః
65. అగమ్యాయ నమః
66. షడ్గుణైశ్వర్య సంపన్నాయ నమః
67. సనాతనాయ నమః
68. త్రిమూర్త్యాత్మనే నమః
69. అనాద్యంతాయ నమః
70. సర్వోపాధి వినిర్ముక్తాయ నమః
71. భక్తాభీష్టఫల ప్రదాయ నమః
72. భవరోగ భేషజాయ నమః
73. సహస్రార చక్రమధ్యస్థాయ నమః
74. సనకాదిమునివందితాయ నమః
75. కామక్రోధాది శత్రునికృంతనాయ నమః
76. కరుణా రసార్ద్ర హృదయాయ నమః
77. బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతాయ నమః
78. బ్రహ్మాండ జనకాయ నమః
79. పరమ పావనాయ నమః
80. దీన జనానుగ్రహాయ నమః
81. దివ్యపురుషాయ నమః
82. ప్రసన్న పారిజాతాయ నమః
83. పురాణ పురుషాయ నమః
84. నిరుపద్రవాయ నమః
85. నిత్యకల్యాణాయ నమః
86. సర్వోపనిషత్ పంజరకీరాయ నమః
87. శబ్దాతీతాయ నమః
88. జగన్నాథాయ నమః
89. జగద్గురవే నమః
90. విష్ణవే నమః
91. సర్వతో భద్రాయ నమః
92. నిగమార్థ ప్రతిపాదకాయ నమః
93. నిస్సంగాయ నమః
94. సహజానందాయ నమః
95. చిన్మయాయ నమః
96. శ్రీమతే నమః
97. సాయుజ్య ప్రదాయ నమః
98. సహజా మనస్కాయ నమః
99. పంచ బ్రహ్మమయాయ నమః
100. అజడాయ నమః

101. జడాజడ విలక్షణాయ నమః
102. భావాభావ మధ్యాస్తాయ నమః
103. అమనస్కాయ నమః
104. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకాయ నమః
105. సర్వోదయే నమః
106. అస్తినాస్తి మధ్యాయ నమః
107. లక్ష్యాతీతాయ నమః
**108.** మనోవాగఅగోచరాయ నమః

"శ్రీమద్గురునకు నానావిధ పరిమళ పత్ర పుష్పాన్ సమర్పయామి"

*************

శ్లో ॥ చందనాగరు కర్పూర । శర్కరాద్య సమన్వితం ।
ధూపోయం గృహ్యతాం స్వామిన్ । త్వమిదంతే మయార్పితం ॥

॥ గి ॥ పాపపుణ్యములకు మూల ప్రకృతి యెరుక । భ్రమలగల్పించి
బహువిధ శ్రమలబడును । అట్టియింద్రియ విషయముల్ నంటగూర్చి ।
గురునిమంత్రాగ్ని జ్వాలలో గూల్చియిపుడు ॥

దరువు : ధూపముగా వేసితీ । ఇంక నా పుణ్యపాపములు బాసితీ । రః పునర్జన్మంబు
సెగరగొట్టియు కంటి । పాపాలోపలనున్న ప్రకృతీ నేననే భ్రాంతి । ధూప
ముగా వేసితీ ॥

" శ్రీమద్గురునకు ధూపమాఘ్రా సమర్పయామి "

శ్లో ॥ వహ్నినాయోజితం సాజ్యం । దీపం వర్తిత్రయాన్వితం ।
గృహాణాజ్ఞాన తిమిర । హార జ్ఞానప్రవర్ధనం ॥

॥ గీ ॥ దేహమాణిక్యమందున సోహమనేటి । వత్తిగావించిమను త్రైల పొత్తుగూర్చి । ప్రత్యగాత్మను వెలుగు ప్రకాశమైన । దీపమును యుంచి నాడ మద్దేశికేంద్ర ॥ దీపమును ॥

దరువు: దర్శనముజేయుమా । నామదినింపోహాంధ్యపడిచుండుమా । స్పర్శసోకిన ఇనుము స్వర్ణంబుగను మారు । స్వర్ణపేదిగానన్ను పాలించుటకు । దీపదర్శనము జేయుమా ॥

" శ్రీమద్గురనకు దీపం దర్శయామి "

శ్లో ॥ శాల్యంన్నం షడ్రసోపేతం । పంచభక్ష్యాది సంయుతం ।
నైవేద్యం దేవదథ్యాజ్య । సమ్మిశ్రం ప్రతిగృహ్యాతాం ॥

గీ ॥ సకల భూతములయందు సమస్తమైన వస్తువులయందు । ద్వేషంబు పదలిబెట్టియుండుటయు మీకు । బక్వాన్నముప్పితమగు । పక్వములు నీవియే వడ్డింపబరగినాడ ॥

దరువు : స్వామి భోంచేయుమా । యి మహానైవేద్యము దయచేయుమా । నా మీద దయయుంచు నలేకుండగజేయు । యీ మాయ మేనునింక మాయనో తెలియ ॥ స్వామీ భోంచేయుమా ॥

" శ్రీమద్గురునకు మహానైవేద్యం సమర్పయామి "

శ్లో ॥ పానీయం శీతలం స్వచ్ఛం । మధ్యే మధ్యే మయార్పితం ।
సుగంధయుక్తం మధురం । పీబత్వం పురుషోత్తమ ॥

॥ గీ ॥ కులముగోత్ర వర్ణాశ్రమ కుటిలములను । నేను నీవను బేధంబు దీనిలోనే । నిమిడియున్నవి గనుక వీట్నగరగొట్టి । జలములను దచ్చినాడ చంచలములేని ॥

దరవు: ఉదకముల పానమూ । జేయుము తండ్రి ముదముగల నీరమూ ।
వదలజాలని భ్రాంతివచ్చి హెచ్చినదెట్లో । తుదకులేకనేపోయుగదా
పరిపూర్ణములోన ॥ ఉదకమూల పానమూ జేయూమూ తండ్రి ॥

" శ్రీ మద్గురునకు మధ్యే మధ్యే ఉదక పానీయం సమర్పయామి "

శ్లో ॥ సుపక్వాన్యనేకాని । రంభాబ్రజంబూ । సఖర్జూర నారింగ ద్రాక్షా-
దికాని త్వయేతాని । సంగృహ్యాతాం । స్వప్రకాశ ఫలాని ప్రదేయాని
సర్వాణీతేజ్య ॥

॥ గీ ॥ నిదియు సత్యమసత్యంబునిదియటంచు । నెరుగుచుండినదే జ్ఞానం
యరుకనేను । యనుచుదెలిసిన తెలివిలేదనేటి ఫలము । నారికేళంబు
ద్రాక్షఖర్జూర పనసా ॥

దరవు : ఫలములనూ నీడితిగా । భుజియించు మీ ఫలహారము తృప్తిగా ।
చలనంబులేని నిశ్చలమైన పరిపూర్ణములో లేని యరుక । నిర్మలమైన
రసగూడ ॥ ఫలములనూ ॥

"శ్రీ మద్గురునకు ఫలోపహార నైవేద్యం సమర్పయామి"

శ్లో ॥ తాంబూలం గృహ్యాతాం పూగీ । ఫలకర్పూర సంయుతం ।
నాగవల్లిదళాద్యంతం । గురోతుభ్యం మయార్పితం ॥

॥ గి ॥ సంకులంబనయూకులో సర్వజగము । వస్తువులను జీవ భేదముల్ వరుసుదోచు ।
నట్టి జాపత్రియూలకుల్ బెట్టి । కాసు సున్నములనుంచి మడచిన జూడు
మిదియే ॥

దరువు: గొనుమూ విడియంబునూ । భయభ్రాంతూలదునుమూ జననంబునూ ।
మునుయేమిలేకనేడను మాత్రములోదోచు । తనువెరుకలును లేనివని దెలిపి
కడతేర్చ ॥ గొనుమూ ॥

" శ్రీ మద్గురునకు తాంబూలం సమర్పయామి "

శ్లో ॥ సువర్ణోదర గర్భస్తం । స్వర్ణబీజం మయార్పితం ।
అనంత పుణ్యాదం స్వామిన్ । తేగృహాణత్వ మచ్యుతం ॥

|| గి ||   పున్నదే పరిపూర్ణము ఎన్నటికినీ । లేనిది యెరుక దానిలోలేక దోచుచున్నదే । ఇది నేనయ్యి భిన్నములుగ । తనుపెరుకలు రెండొక్కటనయునన్నీ ||

దరువు:   దక్షిణముగనిస్తిగా । ఇతరంబేమి వీక్షించుటలేదుగా । సాక్షిజ్ఞానము ముదలే సమకూర్చి పెడితిమి । దాపేక్షించినను నేననుటే సున్నాయెరుక || దక్షిణముగానిస్తిగా ||

"శ్రీ మద్గురునకు దివ్య సువర్ణపుష్పదక్షిణం సమర్పయామి"

శ్లో ||   నీరాజనం మయాదత్తం । రాజరాజేశ పూజితం ।
గృహాణ జగదుత్పత్తి । హేతుభూతాఘునాశనా ||

|| గి ||   దృక్కవను పళ్ళెరంబులో । దృశ్యమనేటి । కర్పూరము నేను । అగ్నివిధము మీరు । నిట్టి కర్పూరములను బోధంగలముకు ముట్టజేసియు । మీయదుట బట్టియిపుడు ||

దరవు:   హారతియు నొసగేదా । దేశిక మంగళారతి ఇదే । పేడదా ఈ రీతి బోధవిచారించు గురుశిష్య । లేరియగేటి యెరుకే ఎారిపోయినవెనుక || హారతియు నొసగేదా ||

"శ్రీ మద్గురునకు మంగళ నీరాజనం సమర్పయామి"

శ్లో || సుకేతకీ పాటిల పారిజాత । చాంపేయకంజాత రసాల మల్లికా ।
చామంతికా సంయుత మంత్రపుష్పం । గృహ్ణాణ విష్ణో ।
శివశంకరాచ్యుతా ||

|| గి ||   ద్వాదశిదిదప్ప ప్రతియేమిలేదటంచు । బలుకుచుండను । షోడశి భావమూల । మరుగు ఈ గుర్తు నాస్తీయింకేమి లేదు । యనిననిది మంత్ర పుష్పము యనుచుదలిచి ||

దరవు:   పట్టితినీ గాంచుమి । యరిగిన యెరుక వట్టిదాయే సుమీ । పొట్టి పొడుగులులేని । బట్టబయలును దెలిసి । నట్టి గోప్యముగుండ నగు బాట్టెపా యెరుక || పెట్టితినీ గాంచుమి ||

## " శ్రీ మద్గురునకు సువర్ణమంత్ర పుష్పం సమర్పయామి "

శ్లో ॥ జన్మాంతర కృతాన్యాని । యాని పాపాని మేప్రభో ।
నశ్వంతుతేతానితాని । ప్రదక్షిణ పదే పదే ॥

॥ గి ॥ పున్నదే పరిపూర్ణమం చన్న యరుక । పుట్టుటయులేదు । లేనిది గిట్టబోదు ।
ఆదియంత్యములను లేనియచలముకటిదప్ప।మరి యేమిలేదని దలచుటదియ ॥

దరువు: నమ్మకమూ నీకునూ । ప్రదక్షిణా సుమ్మియిదే జీతునూ । నమ్మివచ్చిన
వేళా నాటినుండియుదెలుప । సుమ్మీపోయేను భ్రాంతి చూచేదేమియులేని
॥ నమ్మకమూ ॥

## " శ్రీ మద్గురునకు ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి "

శ్లో ॥ యస్యస్మృత్యాచనా మోక్త్యా । తపః పూజాక్రియాదీషు ।
న్యూన్యం సంపూర్ణతాం యాంన్తి । సద్యోపం దేవమచ్యుతం ॥

॥ గి ॥ ధరలో మీనుతిజేయుటకు । హరిహరులకు తరముగాకుండ । మావంటి
దాసులంత । అచల సద్గురు శ్రీ వివేకానంద సుబ్బయ్యార్య । పూజగావించి
వందనంబిద గోనము తండ్రి ॥

దరువు: ఏ రీతిగానైననూ । క్షమియింపుమా నేరములుగన్ననూ । రః భవసాగర
మిపుడు దాటగజేయు । భక్తులందరు ఎన్నో విధములు పూజించిరి ॥ ఏ
రీతిగానైననూ ॥

## " శ్రీ మద్గురునకు సర్వోపచార పూజాన్ సమర్పయామి "

శ్లో ॥ మంత్రహీనం క్రియాహీనం । భక్తిహీనం జనార్ధన ।
యత్పూజితం మయాదేవ । పరిపూర్ణం తదస్తుమే ॥

॥ గి ॥ ఆత్మానాత్మల కవ్వలిద చలబోధ । కాన నిజగురు పూజా విధానమందు ।
సాంగముగ వ్రాసితిది మీరు చదివినుచు నిజగురుకిట్లు గావించుటదియు

ముఖ్య । మనుచూ భ్రమరహితులూ । యి గురుబోధవిసేటి గుణవంతులూ । అనుమానరహితమౌఘునమైన యీ త్రోవా । గనితానహామటులేనిదగును దృష్టాంతమి । దనుచూ భ్రమరహితులూ ॥

## జై బోలో శ్రీ సద్గురు ప్రభు మహారాజుకి జై

## శ్రీ శివరామదీక్షిత గురుపీఠ పరంపరా మంగళారతి

**జయమంగళం నిత్యశుభమంగళం । జయతు జయమంగళం । మహోత్సవ మంగళం ॥**

1. శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున । ప్రాకటంబుగహారికి భానునకును । ఏకముగా ఎల్లేటి యాజ్ఞవల్కికి । మరియు జోకతో రాజఋషి జనకపతికి ॥ **జయమంగళం నిత్యశుభమంగళం ॥**

2. శుద్ధ తత్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య । సద్ధర్మమార్గుడౌ నాందీపునకునూ । సిద్ధముగా పూర్ణుడౌ శ్రీ కృష్ణమూర్తికిని వద్ధికతో । అర్జున – ఉద్ధవులకూ **॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥**

3. శ్రీమించిపెలిగేటి శ్రీధరస్వామికిని । ధిమించు శివరామ దీక్షితులకూ । కామితార్థమునిచ్చు ఘన అప్పబ్రహ్మముకు । పేమారు శ్రీ సీతారాములకునూ **॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥**

4. పరిపూర్ణబోధనూ ప్రకటపరచినయట్టి । వరభాగవత కృష్ణ గురునికిపుడూ । నిరతంబు పరతత్వమెరిగించు । పీల్కాన వరలక్ష్మణా ప్రభుచరణములకూ **॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥**

5. గురుతుగా ఓంకార గురుపీఠసిద్ధాంత । పరమ తత్వార్థమూ భక్తులకునూ । కరుణతో బోధించి కడతేర్చునటువంటి వరవెంకటేశ్వరా గురునికిపుడూ **॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥**

6. భూమ అచలంబాని భువిలోన బోధించి । పామరత్వము జిమ్మి ప్రేమసేలి । కామితార్థ మునిచ్చి కడతేర్చునటువంటి పేమారు పేముల రామయ్యకూ **॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥**

7. యాడజూచినగాని యెడతెగని బ్రహ్మంబు । జాడగనుమని శిష్యుజడుపు మాన్పి । వేడుకతో బోధించి వేడుమని యెరుకను జూడించే ఆడేపు రాజయ్యాకు
॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥

8. చట్టువలెనున్నట్టి పరిపూర్ణబ్రహ్మను । దిట్టముగా శిష్యులకు దెలియజేసి । పుట్టిగిట్టేటి యెరుక పుడమిలో విడిపించు వరఘట్ట శ్రీ నాగయ్యార్యులకునూ
॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥

9. ఖండాఖండముగాక నిండుపరిపూర్ణమును । దండిగా శిష్యులకు బోధజేసి । అండబాయకనున్న మొండియెరుకను బాపు శ్రీ వివేకానంద బండారు శ్రీ సుబ్బయ్యార్యులకునూ ॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥

10. నీకు మూలముగాక । నాకుమూలములేక లోకా లోకములన్ని ఏకముగనూ । ప్రకటంబైనట్టి పరిపూర్ణ బ్రహ్మమును జోకతో తెల్పు గురుపీఠమునకూ ॥
జయమంగళం నిత్యశుభమంగళం ॥

************

<u>తీర్థము తీసుకొనేటపుడు చెప్పే మంత్రములు</u>

శ్లో ॥ అజ్ఞాన మూలహరణం । జన్మకర్మ నివారణం ।
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం । గురుపాదోదకం పిబేత్ ॥

శ్లో ॥ గురుపాదోద్ధితం తీర్థం । పీత్వాత్రిపుటి నాశనం ।
సర్వద్వంద్వ వినాశంచ । విద్యతే నపునర్భవం ॥

శ్లో ॥ గచ్ఛాద్యపునరాగచ్ఛ । మామకాభీష్ట సిద్ధయే ।
గురోశ్వః కృపయా వీక్ష్య । పూజాం స్వీకరుమత్కృతం ॥
భాగవత కృష్ణభూసుర రచితమిదం దేశికస్య పూజార్థం పూజవిధానం
శమతులంవ్యక్తు । శ్రోత్యద్వయోశ్చ మోక్షకరం ॥

శ్రీమద్భాగవత కృష్ణ విరచిత గురుపూజా విధానం । నిజానంద పోలోజు వీరయ్యార్యా విరచిత గీతార్థదర్వులు సమాప్తం ॥

శ్లో ॥ మంగళం శ్రీ గురుదేవాయ । మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ । సాధు రూపాయ మంగళం ॥

1. శ్రీ శ్రీధరేంద్ర సద్గురు ప్రభు మహారాజుకీ జై.
2. శ్రీ శివరామదీక్షిత సద్గురు ప్రభు మహారాజుకీ జై.
3. శ్రీ అప్పబ్రహ్మ సద్గురు ప్రభుమహారాజుకీ జై.
4. శ్రీ పరశురామ సీతారామ సద్గురు ప్రభు మహారాజుకీ జై.
5. శ్రీ భాగవత కృష్ణదేశిక సద్గురు ప్రభు మహారాజుకీ జై.
6. శ్రీఫీల్ఖాన లక్ష్మణార్య సద్గురు ప్రభు మహారాజుకీ జై.
7. శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర సద్గురు ప్రభు మహారాజుకీ జై.
8. శ్రీ వేమల రామాయ్యార్య సద్గురు ప్రభు మహారాజుకీ జై.
9. శ్రీ ఆడేపు రాజయాఖ్య సద్గురు ప్రభు మహారాజుకీ జై.
10. శ్రీ నిర్మలానంద నాగాయ్యార్య సద్గురు ప్రభు మహారాజుకీ జై.
11. జై శ్రీశ్రీశ్రీ పరమగురు శ్రీ వివేకానంద బండారు సుబ్బయ్యార్య ప్రభు మహారాజుకి జై.

12. శ్రీ మధ్వహద్యాశిష్ట అచల సిద్ధాంత గురుపీఠమునకు జై.

13. భక్తమండలికీ జై.

14. కార్యాధిపతికీ జై.

************

# ఓం
శ్రీ గురుభ్యో నమః

# శ్రీ భద్రాద్రిరామ శతక బోధామృతం

# ఓం

## శ్రీ గురుభ్యో నమః

జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై
జై శ్రీధర సద్గురు దీక్షిత ప్రభు మహారాజుకీ జై
శ్రీ నిర్మలానంద నాగాయ్యార్య సద్గురు ప్రభు మహారాజుకీ జై
బృహద్వాశిష్ట సిద్ధాంత గురుపీఠమునకు జై

## శ్రీ బ్రహ్మవిద్యా సిద్ధాంతం – అచల తత్వోపదేశిక శ్రీ నాగాయ్యార్య సద్గురు యోగీంద్రం సద్గురుభ్యో నమః

## గురు ప్రార్థన

గురు బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబహ్మ । తస్మైశ్రీ గురువే నమః ॥

అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించిత్ చరాచరం ।
త్వం పదం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

అఖండమండలాకారం । వ్యాప్తం ఏన చరాచరం ।
తత్పదం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యంస చరాచరం ।
అసిత్వం దర్శితం ఏన । తస్మైశ్రీ గురువే నమః ॥

చైతన్యం శాశ్వతం శాంతం । వ్యోమాతీతం నిరంజనం ॥
నాద బిందు కళాతీతం । తస్మైశ్రీ గురువే నమః

త్వం పితా త్వంచమే మాతా । త్వం బంధు త్వంచ దేవతా ।
సంసార ప్రీతి భంగాయ । తస్మైశ్రీ గురువే నమః ॥

ఆనందమానందకరం ప్రసన్నం । జ్ఞాన స్వరూపం । నిజబోధయుక్తం ।
యోగీంద్రమీడ్యం । భవరోగవైద్యం । శ్రీ మహద్గురుం । నిత్యమహం నమామి ॥

మన్నాథా శ్రీ జగన్నాథా । మద్గురో శ్రీ జగద్గురో ॥
మమాత్మా సర్వభూతాత్మా । తస్మైశ్రీ గురువే నమః

హృత్పుండరీక మధ్యస్థ్యం । సకలామ్నాయ సంస్తుతం ।
ధ్యాయామహ్యం సదాభక్త్యా । సకలాబీష్టధాయకం ॥

నిరంతరం సర్వసందేహో । యేకీ కృత్య సుదర్శనం ।
రహస్యయో దర్శయతీ । భజామి గురుమీస్వరం ॥

# " జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై "

మన సాంప్రదాయ పెద్దలు, సృష్టి విధానమును సృష్టియైన తరవాత జీవుడు ఏ ఏ విషయములు చేత బంధిపపడుతూ వుంటాడో, ఆ విషయాలన్నిట్నీ ప్రస్తావించి, తిరిగి మోక్షాపేక్ష గలిగినప్పుడు – ఇవన్ని తిరోగమన పద్ధతిగా, అన్ని వదలుకుంటూ, తన స్వరూపమువరకూ – ఎలా ప్రయాణము చేయవలనో, తరవాత – ఈ జనన మరణ ప్రవాహరూపమైన సృష్టిని దాటియటివంటి – "పరిపూర్ణ బోధనగా ఏమో", ఇవన్ని కూడ మనకు, ఈ శతకములో సవిమర్శకమైన పద్ధతిలో చెప్పివుండారు. ఈ ఒక్క

భద్రాద్రిరామ శతకాన్ని క్రమ పద్ధతిగా, వారు ఏ ఉద్దేశముచేత వ్రాసినారో (రచించి వుండిరో), ఆ ఉద్దేశమును మనము చక్కగా అర్థము చెసుకొనదానికి ప్రయత్నము చేస్తాము.

## మొట్టమొదట పద్యము – సీస పద్యము – దైవస్తుతి

1. సీ ॥ శ్రీ గణాధీశుని సేవించి వినుతించి భారతీనాథుని ప్రస్తుతించి । శ్రీపతి పాదముల్ చిత్తంబులో నుంచి సాంబమూర్తిని సదా సంస్మరించి । వాసవాద్యఖిల దేవతలను బ్రార్థించి సనకాది మౌనులసన్నుతించి । గురుపదాంభోజములో గొనియాడిపూజించి వేదాంతవేద్యుల విన్నవించి ॥ గి ॥ యాంధ్రగీర్వాణ కవులసేనాశ్రయించి చేయబూనితి శతకంబు చిత్తగించు । రమ్యగుణ ధామ భద్రాద్రిరామ పరుశు । రామ నరసింహదాస సంరక్షితాహ్వ ॥

శ్రీ గణపతిని భక్తితో స్మరియించి, స్తోత్రముజేసి, బ్రహ్మమునుస్తుతియించి, శ్రీహరిచరణములను చిత్తమందున నిలిపి, ఈశ్వరుని సదాసేవించి, ఇంద్రాది సమస్తదేవతలను యాచించి, సనకాది మునులను స్తుతియించి, గురుపాదపద్మములను స్తోత్రముజేసి, షోడశోపచారములతో పూజసలిపి, బ్రహ్మవేత్తలను విజ్ఞాపనజేసి, తెనుగు సంస్కృతకవులను వేడుకొని, ప్రారంభించిన శతకమును అంగీకరించుమా. మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలముననుండు శ్రీరామా, పరుశురామ నరసింహదాసుని రక్షించు నామము గలవాడా.

2. సీ ॥ శ్రీ జానకీరామ సేవకసూత్రామ రఘుకులాంబుధిసోమ యఘువి రామ । పతిత పావననామ భవ్యపరంధామ కరుణాలలామ సంగ్రామభీమ వారివాహశ్యామ వరతులసీధామ యమితవిక్రమ త్రిలోకాభిరామ । విజితభార్గవరామ వినుతమానీస్తోమ సంపూర్ణకామ సత్సార్వభౌమ ॥ గీ ॥ భక్తమందార నగధీర భయవిధూర । ధనుజసంహార విమల వేదాంతసార రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశు । రామ నరసింహదాస సంరక్షితాహ్వ ॥

లక్ష్మిస్వరూపులైన సీతాదేవికి మనోహరుడైనవాడా, దేవతలచే సేవింపబడినవాడా, రఘువంశమనే సముద్రమునకు చంద్రుడైనవాడా, పాపములను పోగొట్టెడువాడా,

పామరులను పవిత్రము జేసెడి పేరు గలవాడా, రమ్యమైన యుత్కృష్ట స్థానము గలవాడా, దయచేత సుందరమైనవాడా, యుద్ధమునందు భీకరస్వరూపము గలవాడా, మేఘమువలె నల్లనిరూపు గలవాడా, శ్రేష్ఠమైన తులసి మాలగలవాడా, అతిశయమైన బలముచేత మూడులోకములకి మనోహరమైనవాడా, పరశురాముని జయించినట్టివాడా, మునిబృందముచే స్తుతింపబడినవాడా, నిండు కోరిక గలవాడా, సత్పురుషశ్రేష్ఠుడా, భక్తులకు కల్పవృక్షమువంటివాడా, మేరువుతో సమానమైన ధైర్యముగలవాడా, భయమును పోగొట్టేడివాడా, రాక్షసులను సంహరించినవాడా, పరిశుద్ధమైన యుపనిషద్వాక్యముల యుక్క సారమును గలవాడా, మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భధ్రాచలమునందు వుండెడి శ్రీరామా, పరశురామ నరసింహదాసుని రక్షించెడి నామముగలవాడా.

**3.** సీ ॥ వేదముల్ వివరించి వినసేర్చుకోలేదు । శాస్త్రపురాణముల్ చదువలేదు । యాంధ్రగీర్వాణంబు లభ్యసింపగలేదు । వేదాంత మార్గముల్ వెదుకలేదు । చూచి ఛందంబులు శోధింపగాలేదు । సాధుజనులపొందు సలుపలేదు । విలసత్తలంకార విధము చూడగలేదు । కావ్యనాటకములు గానలేదు ॥ గీ ॥ నీ కటాక్షంబు నామీదమిగులగలుగ । జేయబూనితి నీమీద సీసశతకము । తప్పులేకుండ దయచేసి ధరణియందు । కవిజనంబులు మెచ్చవిఖ్యాతిజేయు । రమ్యగుణధామ భధ్రాద్రి రామ పరశు । రామ నరసింహదాస సంరక్షితాంఘ్రా ॥

వేదములను విచారించి శ్రవణముజేయ నభ్యసించలేదు, శాస్త్రములను – పురాణములను చదువుకోలేదు, తెనుగును, సంస్కృతమును సేర్చుకోలేదు, ఉపనిషత్తుల ధర్మములను విచారించలేదు, లక్షణ గ్రంధములను చూడలేదు, పెద్దల సాంగత్యమును జేయలేదు. అలంకార గ్రంధములను, కావ్యములను – నాటకములను జూడలేదు, మీ యొక్క అనుగ్రహము నాయందు విశేషముగా నుండుటచేత మీ పేరిట సీస శతకమును కృతిచేయ ప్రారంభించితిని గనుక తప్పులేకుండ అనుగ్రహించి, ఈ భూమియందు కవీశ్వరులు మెచ్చునట్లుచేయుము. మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునందుండెడి శ్రీ రామా, పరుశురామ నరసింహ దాసుని రక్షించు నామముగలవాడా.

**4.** సీ ॥ నీలమేఘముతీరు నీ శరీరంబును । పద్మరాగచ్ఛాయ పదయుగములు । పన్నగేంద్రుని సమ బాహుదండంబులు । సింహమధ్యమును హసించునడుము । తిలపుష్పమునుబోలు తీరైన నాసికం । బొప్పు విద్రుమ కాంతి యోష్ఠములను । కమలంబులనుమించు విమలనేత్రంబులు । పున్నమ చంద్రునిబోలుమోము ॥ గీ ॥ మదనశతకోటి సుందరమైన చక్క । దనము వర్ణింప బ్రహ్మకుదరముగాదు । రమ్యగుణధామా భధ్రాద్రి రామ పరశు । రామ నరసింహదాస సంరక్షితాహ్వా ॥

నీలమేఘమువంటి నీదేహమును, పద్మరాగ మణియొక్క కాంతిగలిగిన చరణకమలములు రెండును, ఆదిశేషునితో సమానమైన భుజములును, సింహముయొక్క నడుమును పరిహాసముచేసెడి నడుమును, నువ్వుపువ్వువంటి ముక్కును, పగడముయొక్క కాంతిగల పెదవులును, కమలములను మించు పరిశుద్ధమగు నేత్రములును, పున్నమి నాటిచంద్రునితో సమానమైన ముఖమును, నూరుకోట్ల మన్మధులయొక్క సౌందర్యమును, గల యట్టి స్వరూపమును బ్రహ్మకైనను వర్ణనజేయ నలవిగాదు. మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలముననుండు శ్రీ రామా । పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా.

**5.** సీ ॥ కేశవ గోవింద కృష్ణ దామోదర నారాయణాచ్యుత నారసింహ । మధుసూదన త్రివిక్రమ జనార్దన ముకుంద వైకుంఠ వామన వాసుదేవ । పుండరీకదళాక్ష పురుషోత్త మోపేంద్ర పరమాత్మ పరమేశ పద్మనాభ మాధవాధోక్షజమధువైరి । శ్రీహరి విష్ణు విశ్వంభర విశ్వనాథ ॥ గీ ॥ శ్రీధరానంతఛిద్రూప శ్రీనివాస । పుణ్యాచారిత్ర శుకనుత పుణ్యపురుష రమ్యగుణధామ భధ్రాద్రిరామ పరుశు । రామ నరసింహదాస సంరక్షితాహ్వా ॥

కేశవ, గోవింద, కృష్ణ, దామోదర, నారాయణ, అచ్యుత, నరసింహ, మధుసూదన, త్రివిక్రమ, జనార్ధన, ముకుంద, వైకుంఠ వామన, వాసుదేవ, పుండరీకదళాక్ష, పురుషోత్తమ, ఉపేంద్ర, పరమాత్మ పరమేశ, పద్మనాభ, మాధవ, అధోక్షజ, మధువైరి, శ్రీహరి, విష్ణు, విశ్వంభర, విశ్వనాథ, శ్రీధర, అనంత, ఛిద్రూప, శ్రీనివాస, పుణ్యాచరిత్రములు గలవాడా, దేవతలచే స్తుతింపబడినవాడా, పురుషోత్తముడా –

మనోహరమైన గుణములతో ప్రకాశించుచు శ్రీ భద్రాచలమునందుండు శ్రీ రామా, పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా.

ఈ సృష్టికి పూర్వము - ఈ సృష్టికి ఆధారభూతమైనటివంటి పరమాత్మ స్వరూపము ఎట్లవున్నది? **"ఆ పరమాత్మ స్వరూపమును"** ఎవరికీ కూడ వర్ణించేకి సాధ్యముకాదని, **"సదేవ సౌమ్య యదమగ్రాసీత్".** ఈ సృష్టికి పూర్వము సత్ పదార్థము వున్నదని ఒకరు, అసత్ పదార్థమే వున్నదని ఒకరు నిరీశ్వర వాదము చేసినటివంటి సాంఖ్యమతములలో, వాళ్ళు అంతా తత్వాలు కలియకె జన్మము అని ఒక పద్ధతి. ఇవన్ని విడిచిపెట్టి, తనద్దైన మధ్య మార్గములో, ఆ **"చైతన్య రూపమైనటివంటి గురుపరమాత్మ"** సృష్టికి పూర్వము ఎట్లవున్నదని వర్ణించి, తరవాత సవివిస్తారముగా తెలియజేయబడును:

6. **సీ ॥ నిత్యనిరాకార । నిరుపద్రవాఖండ । నిర్మల నిర్గుణ నిష్కళంక । నిష్కర్మ నిష్క్రియ నిస్సంగ నిర్ద్వంద్వ । నిరుపమ నీరంధ్ర నిర్వికల్ప । నిష్ప్రపంచావ్యయ నిశ్చల నిశబ్ద నిర్వచనానంద నిర్వికార । నిర్విశేషాచింత్య నిరతిశయానంద । స్వస్వరూపంబు నిస్సంశయముగ ॥ గీ ॥ వారిజాసనకైలాసవాసవాదులకునైన వర్ణింపనలవిగాదు । రమ్యగుణధామ భద్రాద్రిరామ । పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ ॥**

ఇట్లు **"సృష్టికి పూర్వము వున్నటువంటి వస్తువును"** - ఈ పద్ధతిగా వున్నదని పెద్దలు నిరూపించారు. అంటే, "శాశ్వతమైనవాడు, ఆకారహితమైనవాడు; ఉపద్రవములు లేనివాడు, పరిపూర్ణమైనవాడు; మలినరహితమైనవాడు; గుణరహితమైనవాడు; కళంకములేనివాడు; కర్మములేనివాడు; క్రియలేనివాడు; సాంగత్యములేనివాడు; సమానములేనివాడు [అంటే తనతో సమానమైన వస్తువులేనివాడు]; ఉపమానములేనివాడు [ అంటే - ఈ రీతిగా వుంటాడని చెప్పేకి కూడ వీలు లేనివాడు ]; సృష్టియోని లేనివాడు; ఏ కల్పనలు లేనివాడు; ప్రపంచము లేనివాడు, నాశరహితమైనవాడు; చలనము లేనివాడు; శబ్దము లేనివాడు; చెప్పుటకు శక్యముగాని ఆనందరూపముగలవాడు; వికారము లేనివాడు, విశేషము ఏమి లేనివాడు; తెలుచుటకు శక్యముగానివాడు; అతిశయములేని సహజానాందముగలవాడు;" **"నీయొక్క నిజ**

స్వరూపమును సందేహములేక బ్రహ్మ, ఈశ్వరుడు, ఇంద్రుడు - మొదలైన దేవతలకైన వర్ణించటకు శక్యముకానివాడని" చెప్పి, సృష్టికి పూర్వమువున్న వస్తువుని ఇలా చెప్పివుండారు.

మనము దీన్ని, సృష్టిరహితమైన పద్ధతిలోగూడ ఇదే వస్తువు వుంటుంది అనేటివంటి పద్ధతిలో అందరూ కూడ, ఈ సృష్టి లయించిన తరవాత, ఆ పరమాత్మ ఇదే రకంగా శాశ్వతముగావుంటాడు అని, సకల మతాలు ఎటు తిరుగి దాన్నే సేవించాలి, దాన్నే పూజించి మనము దాంట్లోనే లీనముకావాలని చెప్పి, తననుంచి ఉత్పత్తైన నామరూపములను, తనలోపలనే లీనముచేసి, మళ్ళ ముక్తి పొందుతాము అని ఆశతో వున్నారు. అంటే, దానికంటె మేము భిన్నంగావున్నాము, దానినుంచి విడువబడిన వాళ్ళము, తిరిగి దాన్నే చేరాలనే ఉద్దేశము కలవాడు - కానీ, గురుకృప కలిగిన టివంటివాడు, గురుసేవ జేసినటివంటివారు, గురువుదగ్గర ధర్మాలు చక్కగ ఆచరించుతున్నటివంటివారు, ఆ స్వరూపాలు కలియడమే కాదు, **"ఆ స్వరూపమే తాను", "నేనే ఆ స్వరూపము"** అనేటువంటి ఏకైక నిర్ణయము పొంది, సృష్టియంత దేనియందు ఆవిర్భవించింది, తిరోభావము పొందుతావుందో, ఆ విషయాలన్ని పరిశీలించి, **"జన్మకు మూలకారణ వస్తువు ఇదేనని తెలిసి, దాన్ని రహితమందేగాని జన్మరహితమని"**, దాన్ని నిలుపుకొనే వారికి జన్మరహితము కాదనేటివంటి నిర్ణయానికి వచ్చి, మిగిత విషయాలన్ని తెలియజెస్తారు.

ఇట్లా - సృష్టికి పూర్వమువున్నటివంటి నామరూపరహితమైనటివంటి, ఈ **"బ్రహ్మమందున"**, సృష్టి ఎలా కలిగిందన్నప్పుడు - ఇక్కడ దీన్ని క్రమపద్ధతిగా తెలియజేస్తారు. ఇటువంటి **"ఆత్మము మనకు సృష్టికి పూర్వము వున్నది."** ఇది మనకు ఎప్పుడు అనుభవములో తెలియబడుతుందంటే? మనము నిద్రపోయినప్పుడు - ఈ సర్వ వ్యవహారాలకూ మూలమైనటివంటి **" జీవుడు - మనస్సు "** చైతన్యమందు లీనమైనప్పుడు, కేవలము నిర్వయవ స్వరూపమైనటువంటి వాయువు ఒక్కటే, ఈ శరీరములోపల సంచరించేటపుడు, అట్లా నిర్గుణ స్థితి మనకు కలుగుతుంది. అంటే, సృష్టి ఏమీ కూడ కనిపించకుండ వట్టి **"చైతన్యమైన**

**పదార్థమే",** ఈ శరీరమును చెడిపోకుండ రక్షణ చేస్తూవుంటుంది. ఆ చైతన్యమునందే, మనస్సు పుట్టుతుంది. ఆ మనస్సు పుట్టుతానే, దేహేంద్రియ సమూహమంత ఎట్ల పుట్టుతుందనేటువంటి విషయాన్ని తెలియచేస్తూ, సృష్టి క్రమాన్ని " **సాంఖ్యయోగము – ప్రపంచోత్పత్తి లక్షణము ".**

## సాంఖ్యయోగము – ప్రపంచోత్పత్తి లక్షణము

**7. సీ ॥ ఆత్మయందున యేకమాకాశముదయించె । ఆకాశమందనిలంబు బుట్టె । ననిలంబువల్లను నగ్నిహోత్రుడు బుట్టె । నగ్నిహోత్రమువల్లనప్పుబుట్టె । నప్పువల్లను మహీయవనిస్తలియబుట్టె । నవనియందోషధులమరబుట్టె । నోషధులందనొనరనన్నము బుట్టె । నన్నమందున నరులాది సకల ॥ గీ ॥ జంతు జాలంబు లాయె నీజగయుగంబు । లాయె నీరీతి పరమాత్మ మాయవలన ॥ రమ్య ॥**

## ఇప్పుడు, ఉత్పత్తి క్రమాన్ని మనకు తెలియజేస్తావుండారు.

ఆత్మయందున ఆకాశము పుట్టింది, ఆకాశమునందు వాయు, వాయువందు అగ్ని, అగ్నియందు జలము, జలమునందు పృథ్వి. ఇట్ల పుట్టినట్లు క్రమముగా చెప్తావుండారు. ప్రపంచము ఇట్ల పుట్టితేనే అది సరిపోతాది. అందుకు, 40 కోట్ల యోజనాలతో మనకు మొట్టమొదట ఆకాశము పుడుతుంది – అంటే, నాల్గు భూతాలును తనలో ఇముడ్చుకొనేంత శక్తి వుండాల – ఐదో భూతము కాబట్టి, మిగితా నాల్గు భూతములను తనలో ఇముడ్చుంచికొనే శక్తి ఆకాశముకివుంటుంది. అందుకే, ఇది 40 కోట్ల యోజనాలు విస్తీర్ణములో వుంటుంది. ఇంక దానిలోపుల 30 కోట్ల యోజనాలు విస్తీర్ణం కలిగిన మూడు భూతాలను తనలోపల పెట్టుకొనే శక్తితో వాయువు పుడుతాది. ఈ వాయువుయుక్క జన్మము ఎట్లావుంటాదంటే, అగ్ని, జలము, పృథ్వి అని మూడు భూతములను తనలోపల ఇముడ్చుకోవాలి కాబట్టి, ఆ మూడు భూతములను తనయుక్క ఆవరణములో పెట్టుకొంటుంది కాబట్టి, 30 కోట్ల యోజనముల విస్తీర్ణము కలుగునటువంటి వాయువు పుట్టింది. దానియందున 20 కోట్ల యోజనములు కలిగినటివంటి అగ్ని పుట్టింది. అంటే, ఇంక రెండు భూతాలు దీంట్లో ఇముడ్చుకొనివుంటుంది. ఇంక దానికిలోపుల 10 కోట్ల యోజనములు కలిగినటువంటి

జలభూతము పుట్టింది. అంటే, పృథ్విని మాత్రమే తనలోపల పెట్టుకొంటుంది. ఇంక, ఈ జీవరాశులకును జలమునకు - 90 భాగము జలానికిచ్చి, జీవకోట్లకూ 1 కోటియోజనాల విస్తీర్ణము, ఈ భూమికి ఇస్తుంది. అంటే, కోటి యోజనాల విస్తీర్ణముతో, ఈ భూమి పుట్టింది. ఇప్పుడు, మన శరీరములో కూడ అలాగే. ఈ స్థూల శరీరము కోటియోజనాల విస్తీర్ణమువుంటాది. ఇందులో, జలము అనేక నాడులతో ప్రవహిస్తు, దీనికంటె 10 రెట్లు ఎక్కువవుంటుంది. దీనిలోపుల ఉష్ణశక్తి అంతకంటే మూడు వంతుల ఎక్కువ వుంటుంది. దానికి లోపుల - దానికంటే, వాయుభూతము ఇంక మూడు వంతులు అధికముగవుంటుంది. దానిమీద ఆకాశ భూతము వుంటాది. ఇవన్నింటికి "**ఆత్మ సత్తా**" ఇచ్చింది. ఈ "**ఆత్మకు**" ఈ ఐదు భూతములు - ఈ ఐదు శరీరాలు. ఈ ఐదు శరీరాల విమర్శ వచ్చినప్పుడు ఏ భూతము ఏ శరీరము అనేటువంటిది తెలుస్తుంది.

ఇప్పుడు ప్రపంచ ఉత్పత్తి ఎట్ల పుట్టింది? మరి ప్రపంచములో, ఈ జీవకోట్లు అన్నిటికి ముందు ఆహారము చేయాల కదా! అందుకు, మనకు భాగవతములో పృథు చక్రవర్తి అనేటివంటివాడు, ఈ జీవకోట్లకు కావాల్సినటువంటిదాన్ని కూడ, ఈ భూమి అనే గోవునుండి పితికినాడని - ఒక కథ మాదిరి వ్రాసినారు. అంటే, అది సామాన్యముగా కథరూపము కాదు. వాస్తవికముగా చూస్తే, ఈ భూమి అనేటివంటి గోవునుండి ఓషధులను పుట్టించి, జీవకోట్లకు తగినటివంటిది - పాలుదాగేవాటికి పాలు, అన్నము తినేవాటికి అన్నము, తృణములు తినేవాటికి తృణములు, గడ్డి గాదము, చెట్లు చామలు తినేవాటికి అది. ఇవన్నిట్ని కూడ, ఈ భూమినుండి మనము తీసుకొంటున్నాము. అందుకే, దీనికి పృథు చక్రవర్తి - అంటే, భూమిలోపలనుండి ఇవన్ని పెలికితీసి జీవకోట్లకు సరైనటువంటి పద్ధతిలో సమకూర్చినటువంటివారు పృథు చక్రవర్తి అన్నారు. ఇట్లు మనకు సృష్టిలో ఏర్పడివుంది. ఇది మీకు పిండాండ విమర్శ వచ్చినప్పుడు ఇదంత తెలియబడుతుంది. ఇది భూత సృష్టికి, ప్రపంచ ఉత్పత్తి లక్షణములో, సంస్కృతములో కూడ ప్రమాణములు వుండాయి, దానికే వాళ్ళు శ్లోకాలు వ్రాసివుండారు కాబట్టి, ఈ తెలుగుయొక్క పద్ధతిలోనే చెప్పుకొందాము.

# నరప్రమాణ లక్షణము

ఇందులో, ఇంక ఈ సృష్టిన తరవాత నర ప్రమాణ లక్షణము ఏమి? అంటే, ఒక దేహము ఎంత ప్రమాణములో పుట్టుతుంది? ఈ కొలతలువున్నటివంటి శరీరములో, ఈ ఒక లక్షణాలన్ని వుంటావని, ముందు ఈ భూత సృష్టిన తర్వాత పిండాండములో, మానవుని – ఈ శరీరమును మాత్రమే, ఆధారముగా తీసుకొని చెప్పుతూ – ఇంక దీని మీద వుండేటువంటి విమర్శలన్ని చెప్తూవచ్చినారు. మరి 84 లక్షలు జీవరాశులు వున్నప్పటికీ, కేవలము నరప్రమాణము ఎందుకు చెప్పివుండారు అంటే? నరునికే – ఈ విమర్శలన్నీ కావాలి. నరుడే వీటినుండీ విముక్తి పొందాలసేటువంటి భావమువుంది కాబట్టి, వీనియొక్క శరీరమునే, మొట్టమొదటగ విచారణ తీసికొనివుండారు.

**8. సీ ॥ నరుడు తొంభైయారునంగుళా లెనిమిది । జానలపొడువు నాల్జాన లెళుపు । యిట్లు ముప్పైమూడు కోట్ల రోమంబులు । వెలయ డెబ్బదిరెండు వేల నాళ్ళు యెముకలరువది యారు నమరి తొంబది రెండు కీళ్ళు ముప్పదిమూడు మూళ్ల పేగు । శేరుగుండె నర్ధశేరురుధిరంబు । మణుగునాలుగు శేర్లుమాంసముండు ॥ గీ ॥ సోలపైత్యంబు శ్లేష్మమర్సోలెడుండు । నీ ప్రకరంబు దేహంబులన్ని చూడ ॥**

ఇది నరప్రమాణము. ఏమయ్యా మణువు నాల్గు సేర్లు మాంసమేనవుండేదని చెప్పేది కాదు, అంటే, ఇవన్ని తీసేయాల. ఎట్లా – 96 అంగులాలు – 8 జానల పొడవు, 4 జానల వెడల్పు వుంటాడు. అంటే, 33 కోట్ల రోమకూపంబులు, 72,000 నరములు, 66 ఎముకలు, 92 కీళ్లు, 33 మూరల పేగు, సేరు గుండె, అర్ధ సేరు నెత్తురు, మణువు 4 సేర్లు మాంసము, సోలడు పైత్యము, అరసోలడు శ్లేషము, విచారించగా – ఈ కొలతలు గలిగినటువంటి శరీరానికి ఇవి వుంటాయి. మరి ఇప్పుడు, మన శరీరములో ఇట్లే వుంటాయి అని కాదు – ఆ కాలములో నరప్రమాణము వ్రాసేటివంటి కాలములో, ఇంత మాత్రము వున్నటివంటివారు. ఇప్పుడు మనకు 6 అడుగుల వాళ్ళు సరీగాలేదు కదా! 5 అడుగులు 2 ఇంచులు, 5 అడుగులు, 4 ముక్కాలు అడుగులు, 4 న్నర అడుగుల వాళ్ళే వున్నారు. ఇంకా ఒక కొలత తగ్గింది అంటె అన్ని కొల్తలు తగ్గుతాయన్న మాట. ఇట్లా నర ప్రమాణము చెప్పి, దీనియందున ఎన్ని తత్వాలువుండావి, ఎన్ని దీనియందున కావల్సివచ్చిందో, అదంత కూడ విచారించినారు. అంటే, వాళ్ళు ఈ శరీరమును

పరిశీలించి దాంట్లో, ఈ విషయాలన్ని భాగ అర్థమైయ్యేలాగ - వాళ్ళు అర్థము చసుకొని, ఇతరులకు అర్థమైయ్యేటువంటి పద్ధతిలో వ్రాసినటువంటి విషయాలివి. ఇంక 96 తత్వాలు ఈ పద్యమునకు మిగత గ్రంథమంత తయారైతాది.

## తొంబదియారు తత్వములు

**9.** సీ ॥ జ్ఞానేంద్రియముల్లైదు కర్మేంద్రియముల్లైదు । శబ్దాదులైదు కోశంబుల్లైదు కరణముల్ నాల్గు రాగాదులెన్మిది పదినాళ్ళు వాయువులు పద్నాల్గు నేడు । ధాతువుల్లైదు భూతము లారుచక్రములు । మలములు మూడవస్థలునైదు । మూడు మండలములు మూడీషణంబులు మూడు వ్యాధులు గుణాల్మూడు రెండు ॥ గీ ॥ తనువులనుగూడి షణ్ణవత్యాది తత్వ సాక్షి రూపుడవైనావు సత్యముగను ॥ రమ్య ॥

ఇట్లా - ఈ 96 తత్వములుకు **"ఆత్మ"** సాక్షిస్వరూపముగా వుంటాది. ఈ 96 తత్వములను విచారించితేనే, **"ఆత్మ"**యుక్క సాక్షితత్వ లక్షణము అర్థమవుతుందిగాని, లేకపోతే కలగాపులగముగావుండి మొత్తమంతా భ్రాంతిరూపముగా ఆవరిస్తాది. ఇంక ఈ 96 తత్వాలలో, వుండినటువంటియుక్క విషయాన్ని తెలియజేస్తున్నారు. మనకు ఇప్పుడు ఐదు జ్ఞానేంద్రియములు వున్నాయి - ఏవి? జ్ఞానేంద్రియములు - అంటే:

<u>జ్ఞానేంద్రియముల్లైదు:</u> - (1) శ్రోత్రము (2) త్వక్కు (3) చక్షు (4) జిహ్వ
(5) ఘ్రాణము - ఇవి ఐదు జ్ఞానేంద్రియములు

<u>కర్మేంద్రియముల్లైదు:</u> - (1) వాక్ (2) పాణి (3) పాదము (4) పాయు
(5) ఉపస్థ - ఇవి ఐదు కర్మేంద్రియములు.

<u>శబ్దాదుల్లైదు:</u> - (1) శబ్దము (2) స్పర్శము (3) రూపము (4) రసము
(5) గంధము - ఇవి ఐదు విషయేంద్రియములు.

కోశంబులైదు : – (1) అన్నమయ (2) ప్రాణమయ (3) మనోమయ
(4) విజ్ఞానమయ (5) ఆనందమయ
ఇవి – ఐదు కోశములు.

కరణముల్ నాలుగు : – (1) మనస్సు (2) బుద్ధి (3) చిత్తము (4) అహంకారము
ఇవి నాల్గు – అంతఃకరణములు.

రాగాదులన్మిది: – (1) రాగము – పరస్త్రీ గమనము చేయుట.
(2) ద్వేషము – అపకారము చేయుట.
(3) కామము – కోరుట.
(4) క్రోధము – కోరిక కొనసాగకుండుట.
(5) లోభము – వచ్చిన ద్రవ్యమును వదలకుండుట.
(6) మోహము – ధనముమీద ఆపేక్ష గలుగుట.
(7) మదము – ధనమున్నదని ఉబ్బుట.
(8) మత్సరము – తన ద్రవ్యమునపహరించే వారిమీద ఈర్ష యుంచుట.

పదినాడ్లు: –

| | |
|---|---|
| (1) గాంధారి | (6) పయుశ్విని |
| (2) హస్తిని | (7) శంఖిని |
| (3) పూషా | (8) కులహా |
| (4) ఆలంబ | (9) సినివాలి |
| (5) జిహ్వా | (10) రత్నాహ్వాయి |

ఇవి – పదినాడులు.

వాయువుల్ పదినాలుగు: –

| | |
|---|---|
| (1) సమానము | (8) కృకురము |
| (2) వ్యానము | (9) దేవదత్తము |
| (3) ఉదానము | (10) ధనంజయ |
| (4) ప్రాణము | (11) అంతర్యామి |
| (5) అపానము | (12) ప్రపంచికుడు |
| (6) నాగము | (13) వజ్రుడు |
| (7) కూర్మము | (14) ముఖ్యుడు |

ఇవి – పదినాలుగు వాయువులు

<u>ఏడు ధాతువులు:</u> - (1) రసము (5) మజ్జ
(2) రుధిరము (6) అస్థి
(3) మాంసము (7) శుక్లము
(4) మేధస్సు

ఇవి – ఏడు ధాతువులు.

<u>ఐదు భూతములు:</u> – (1) పృథ్వి (2) జలము (3) అగ్ని (4) వాయు
(5) ఆకాశము – ఇవి ఐదు భూతములు.

<u>ఆరు చక్రాలు:</u> – (1) ఆధారము (4) అనాహతము
(2) స్వాధిష్టానము (5) విశుద్ధము
(3) మణిపూరకము (6) ఆగ్నేయము
ఇవి ఆరు చక్రములు.

<u>మలములు మూడు</u> (1) ఆణవ మలము (2) మాయా మలము
(3) కార్మిక మలము – ఇవి మూడు మలములు

<u>అవస్థలునైదు:</u> – (1) జాగ్రదావస్థ (2) స్వప్నావస్థ (3) సుషుప్తావస్థ
(4) తుర్యావస్థ (5) తుర్యాతీతావస్థ
ఇవి – ఐదు అవస్థలు.

<u>మూడు మండలములు:</u> – (1) అగ్ని మండలము (3) చంద్రమండలము
(2) సూర్య మండలము
ఇవి – మూడు మండలములు.

<u>మూడీషణంబులు:</u> – (1) ధారేషణ (2) పుత్రేషణ (3) ధనేషణ
ఇవి – మూడు ఈషణత్రయములు.

<u>మూడు వ్యాధులు:</u> – (1) వాతరోగము (2) పైత్యరోగము

(3) శ్లేష్మరోగము – ఇవి మూడు వ్యాధులు.

<u>గుణాల్మూడు:</u> – (1) సత్వగుణము (3) తమోగుణము
(2) రజోగుణము
ఇవి మూడు గుణములు.

<u>రెండు తనువులనుగూడి :</u> -(1) క్షరోపాధి (2) అక్షరోపాధి
ఇవి – రెండు తనువులు.

షణ్ణ్యావత్యాది తత్వసాక్షిరూపుడపైనావు సత్యముగను.

**ఈ 96 తత్వములుకు సాక్షి స్వరూపముగా యుండనది పరమాత్మ యనబడను.**

ఇది – ఈ పద్యానికి వాళ్ళు వ్రాసినటువంటి తాత్పర్యము. మరి ఇవన్ని కూడ అనుభవముగా – ప్రతి ఇంద్రియము ఏ ఒక కూటమును చెప్తావుంటారో – జ్ఞానేంద్రియము కూటమును చెప్పినప్పుడు, జ్ఞానేంద్రియ కూటాన్ని ఆలోచన చేయాలి – అనుభవానికి తీసుకోవాలి. ప్రాణేంద్రియముల కూటాన్ని చెప్పినప్పుడు ప్రాణేంద్రి యములను ; విషయేంద్రియముల కూటాన్ని చెప్పినప్పుడు విషయేంద్రియాల కూటాన్ని; కర్మేంద్రియముల కూటాన్ని చెప్పినప్పుడు కర్మేంద్రియములను ఆలోచన చేయాలి. చేసేదాన్న తపస్సు అంటారు. ఆలోచన చేసి, నిర్ణయానికి చిక్కినదానిసే అనుభవము అనేది. ఆలోచన చేయకుండ పాఠాల మాదిరి చదువుకోని, పాఠాల మాదిరి వినుకుంటే, అది అనుభవానికి రాదు – అనుభవానికిరాని విద్య నిష్ప్రయోజనము. యేమిటికి కూడ పనికిరాదన్నమాట. ఇంకా ఈ పద్యములో వున్నటువంటి, ఈ తత్వాలని విచారించికొంటూనే ఒక ఒక పద్యము వస్తుంది. ఇప్పుడు కేవలము 96 తత్వాలు మాత్రమే, మీకు వినిపించినాము. ఇంక ఇప్పటినుండి దీని లక్షణాలన్ని వస్తాయి. ఇంక బ్రహ్మాండ సృష్టి విధానమును తెలియజేస్తున్నారు.

## <u>పంచభూత లక్షణము</u>

10. సీ ॥ వసుధజలంబగ్ని వాయు వాకాశంబు లివి పంచభూతముల్వీటియందు । రక్తశుభ్రాసీతయుక్త ధూమ్రసునీలములు గంధరసరూపములును స్పర్శ । శబ్దంబులును క్రియాశక్తి జ్ఞానేచ్ఛాది శక్తులు వరపరాశక్తి ల – వ – ర – య – అ – అజవిష్ణు

త్రియంబకేశ్వర । సదాశివులు నొండాంటికి స్థిరముగాను ॥ గీ ॥ వర్ణగుణశక్తి బీజ దేవతలునుండు । నీకు నేగుణములు లేవు నిర్మలుడవు ॥

ఇక్కడ బ్రహ్మాండాన్ని, సృష్టి క్రమాన్ని చెప్పుతూ, బ్రహ్మాండమునుండి విలక్షణముగా, నీకు ఏ గుణములు లేవు - నిర్మలుడవు. అంటే, **"ఆత్మ"** కేవలము **"చైతన్య స్వరూపమే"** తప్ప దానికి ఇంకొక్క గుణము వుండదు. మరి మనము **"ఆత్మ స్వరూపములైన"** కూడ - మన స్వరూపమున నిజ స్థితిలో వుండలేకా, విషయసంయోగము చేసి, బంధనమును కల్పించికొంటున్నాము. ఈ ఒక్క పద్యములోనే, మనకు బ్రహ్మాండమునంత కూడ తెలియజేస్తున్నారు.

ఈ బ్రహ్మాండమును తెలియజేసే సాంఖ్య పద్ధతి ఎటువంటిదంటే?
ఆత్మనుండి ప్రకృతులు ఎనిమిదిగా విభజనింపపడియుంది - ఎట్లా? అంటే :

" బ్రహ్మణోర్వ్యక్తాః ; అవ్యక్తాన్ మహత్ ; మహతోమహదాంకారాః ;
మహదాంకారాత్పంచతన్మాత్రాణి ; పంచతన్మాత్రభ్యో పంచమహాభూతాని ;
పంచమహాభూతేభ్యో అఖిలమ్ జగత్ "

ఇట్లా మనకు అఖిల జగత్తు ఏర్పడివుందని, ఈ రకముగా చప్పుతున్నారు. అంటే, బ్రహ్మమునుండి **"అవ్యక్తము"** అనే వస్తువు పుట్టింది. అంటే, ఇక్కడ మనకు **దేవతలు, బీజములు, శక్తులు, తన్మాత్రలు, భూతములు** ఇవైదు క్రమముగా వస్తాయి.

మొట్టమొదట, సత్వగుణముతో దేవతా సృష్టించింది. అంటే, బ్రహ్మముయొక్క లక్షణము మాయయందు ప్రతిఫలించిన తరవాత, ఈశ్వరునియొక్క స్వరూపము ఏర్పడినప్పుడు, ముందు పంచభూతములవంటి దేవతలు ఏర్పడినారు. ఆ అధిదేవతలే - **సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ** అనేటువంటి, ఈ ఐదు మంది అధిదేవతలు ఏర్పడ్డారు. ఈ ఐదు మంది అదిదేవతలైన తర్వాత, ఈ అధిదేవతలకంటే, కొంచము స్థూలముగ బీజములు ఏర్పడ్డాయి. అంటే, **సదాశివునికి - "హం" బీజము; ఈశ్వరునికి - "యం" బీజము; రుద్రునికి - "రం" బీజము; విష్ణువుకు - "వం" బీజము; బ్రహ్మదేవునికి - "లం" బీజము.** ఈ బీజములు ఏర్పడిన తర్వాతనే, శక్తులువచ్చి సృష్టికి కారణమైనాయి. ఇది క్రమ పద్ధతి.

సృష్టి ఎలా సూక్ష్మరూపమునుండి స్థూలశరీరము ధరిస్తుందంటే, ఇప్పుడు "హం" - **బీజమునుండి పరాశక్తి; "యం" - బీజమునుండి ఆదిశక్తి; "రం" - బీజమునుండి జ్ఞానశక్తి; "వం" - బీజమునుండి ఇచ్ఛాశక్తి; "లం" - బీజమునుండి క్రియాశక్తి. ఈ ఐదు శక్తులు ఏర్పడిన తర్వాత తన్మాత్రలు ఏర్పడినాయి. అంటే, పరాశక్తినుండి - శబ్దతన్మాత్ర; ఆదిశక్తినుండి - స్పర్శ తన్మాత్ర; జ్ఞానశక్తినుండి - రూప తన్మాత్ర; ఇచ్ఛాశక్తినుండి - రసతన్మాత్ర; క్రియాశక్తినుండి - గంధతన్మాత్ర ఏర్పడినాయి. ఇది స్థూలానికి వచ్చింది.** ఇంక ఇక్కడ పూర్తి భూత సృష్టైన తర్వాతనే, మనకు 84 లక్షల జీవోపాదులు ఏర్పడినవి. ఇప్పుడు **శబ్దతన్మాత్రనుండి - ఆకాశభూతము; స్పర్శతన్మాత్రనుండి - వాయుభూతము; రూపతన్మాత్రనుండి - అగ్నిభూతము; రసతన్మాత్రనుండి - జలభూతము; గంధతన్మాత్రనుండి - పృథ్వీభూతము; ఏర్పడినవి.** ఇలా భూత సృష్టైంది.

మరి దీనిలోపుల, ఈ **"బ్రహ్మామైనటువంటి"** - ఈ అధిదేవతల శక్తి ఎలా క్రియలు చేస్తావుంది? ఎలా పని చేస్తావుందనేటివంటిదాన్ని, మనము బాగ ఆలోచించిజూస్తే - పైనవుండేటువంటి ఈ సూత్రాత్మ, ఈ **"స్వయంభూ బ్రహ్మము"** - అంటే, **"స్వయంభూ బ్రహ్మము"** మొట్టమొదట **"పరిపూర్ణ బ్రహ్మము"** అని కాదు - ఈ సృష్టికి పూర్వము నామ రూపములులేక _ స్వజాతీయ విజాతీయ స్వగతభేధ శూన్యమై, మహాద్వైతమై, చట్టువలే కదలక మెదలక, తనకు తాను స్వతః సిద్ధమైనటువంటి **"పరిపూర్ణ పరబ్రహ్మము ఒక్కటే"** వున్నది. అట్టి **"పరిపూర్ణ బ్రహ్మమునందులే కనే"** - మాయాశక్తి, వినిర్ముక్త, త్రిశక్త్యాత్మ, సంవిద్రూప, సచ్చిదానంద స్వరూపముగలిగిన **"స్వయం ప్రకాశ బ్రహ్మము తనకు తానే కలవలే తోచిందని"** ఎప్పుడైన మనము యరుకోత్పత్తిని చెప్పుకొనేపుడు, **"యెరుక"** ఎలా ఉత్పత్తైంది అంటే - దానికి ఒక కర్తలేడుగాని, తనకుతానే స్వయంబుగా తోచినటివంటి గుణమున్నది. దీనియొక్క సామర్థ్యమే సృష్టిమొత్తం. ఈ **"స్వయంప్రకాశ స్వయంభువు బ్రహ్మమే"**, పృథ్వి అధిష్టాన దేవతయగు బ్రహ్మ స్వరూపమై; **"లం" బీజము** ప్రేరకత్వముతో క్రియాశక్తి స్వరూపమై; గంధతన్మాత్ర ద్వార పృథ్వి భూతమై, 84 లక్షల జీవరాశులును సృష్టించి, ధరించి, భరించిచున్నది కనుకనే, శృతిప్రకారముగా, అనుభవపూర్వకముగా చూస్తే - బ్రహ్మదేవుడు సృష్టికర్తయని - ఇట్ల నిర్ణయము జేసివుండారు. బ్రహ్మదేవుడు అంటేనే, ఎవరనేది తెలీకనే, సృష్టిచేసేదనేది ఊకుడు కథలులాగే వుంటుందిగాని, ప్రమాణము వుండదు.

ఇప్పుడు, ఈ **"సూత్రాత్మ"** - జలాధిష్టాన దేవతయగు విష్ణుస్వరూపమై, "వం" **బీజము** ప్రేరకత్వముతో - ఇచ్ఛాశక్తి స్వరూపమై; రసతన్మాత్ర ద్వార జలభూతమై; నీరే ప్రాణాధారము అన్నట్లుగా - 84 లక్షల జీవరాశులను పోషణజేయుచున్నది - అందుకు విష్ణువు పోషణకర్త అనేటువంటి నిర్ణయము జరిగింది.

ఇంక, ఈ **"సూత్రాత్మ"** - అగ్ని అధిష్టాన దేవతయగు రుద్రస్వరూపమై, "రం" **బీజము** ప్రేరకత్వముతో - జ్ఞానశక్తి స్వరూపమై; రూపతన్మాత్ర ద్వార అగ్నిభూతమై - 84 లక్షల జీవరాశులను ప్రకాశింపజేసి, వెలిగించి, మార్పుజేసి, దహించి, లయముచేస్తావున్నది కనుక - రుద్రుడు లయకారకుడని నిర్ణయము జేసివున్నారు.

ఇంక, ఈ **"సూత్రాత్మ"** - వాయువు అధిష్టాన దేవతయగు ఈశ్వరస్వరూపమై, **"యం" బీజము** ప్రేరకత్వముతో - ఆదిశక్తిస్వరూపమై, స్పర్శతన్మాత్ర ద్వార వాయుభూతమై, ఈ సకల జీవోపాదుల లోపల స్పర్శేంద్రియము ద్వార సృష్టిని విస్తీర్ణము చేయబడుతావుంది కాబట్టి - ఈశ్వరుడు విస్తీర్ణకర్తని నిర్ణయము జేసివుండారు. అంటే, ఇది నశింపుకాకుండ - సృష్టి వుండగానే సృష్టిని; ఒక శరీరము వున్నట్లే, ఇంకొక్క శరీరమును; ఒక బీజము వున్నట్లనే, అనేక బీజములు తయారుచేసి - అది అవ్యయశక్తిగా ఒక వస్తువులాగ వుండదుగాని - అది పరివర్తన చెందుతూ ఎప్పటికీ కూడ వుండేటువంటి పద్ధతి చేసుకొంటాది కాబట్టి, ఈ రకముగా ఇది విస్తీర్ణం చేస్తావుంది.

ఇంక, ఈ **"సూత్రాత్మ"** - ఆకాశాధిష్టాన దేవతయగు సదాశివస్వరూపమై, "హం" **బీజము** ప్రేరకత్వముతో - పరాశక్తిస్వరూపమై, శబ్ధతన్మాత్ర ద్వార ఆకాశభూతమై, సర్వమునూ తనవంకకు ఆకర్షిస్తావుంది. ఎందుకంటే, ఈ మిగత నాల్గు భూతములు, ఈ ఆకాశమనే భూతమునుండే ఉత్పత్తై వుండాయి కాబట్టి, ఈ భూతముచేత ఆకర్షింప పడుతున్నవి. ఆకాశము జ్ఞానస్వరూపము కాబట్టి, సృష్టినంత తన అధీనములో పెట్టుకోవాలని, సృష్టియంత తానే ఓతప్రోతముగా వుండాలని, ఈ శరీరములోవుండే - ప్రతి ఇంద్రియము, ప్రతి గుణము, ప్రతి విషయము, నాకు స్వాధీనమైవుండాలనేటువంటి గుణము, ఈ జ్ఞానానికివుంది కాబట్టి, **"ఆకాశతత్వమైన జ్ఞానము"**, ఆకర్షించేశక్తితో వుంటాది. అందువల్ల, ఇది ఆకర్షణశక్తి అనేది మనకు తెలియబడిందనే మాట. అందుకు, ఈ భూతములకూ, ధర్మములు - కర్మములని - రెండు పద్ధతులు

చెప్పినారు. అంటే, ఆకాశము బయలైవుండడము ధర్మము, అవకాశము ఇయ్యడము కర్మము; అంటే, దాని సహజ ధర్మము ఏమి? ఊరికె నిర్మలముగావుండేది. ఇప్పుడు మనకు నిర్మలముగావుంది ఆకాశము – వానకాలము వస్తాది – అప్పుడు మేఘాలకు అవకాశము ఇయ్యబడుతుంది. ఆకాశము బయలైవుండడము ధర్మము – అవకాశము ఇయ్యడము కర్మము. వాయువుకు చలించేది సహజ గుణము. అది ఒకే దగ్గరగా వుండేటువంటి తేలిక పదార్థాన్ని ఇంకొక్క దగ్గరికి చేరవేస్తాది. అంటే, ఎత్తుకుపోయె గుణమువుంది. ఆ రకముగా, అది ఏమి పనిజేస్తున్నదంటే? వట్టి ధర్మముతోనే వుంటుందా? ఏమన్న కర్మము చేస్తుందా? అంటే, అది ఈ రకముగ పని చేస్తాది.

అట్లనే, మనకు బీజముల లోపలదూరి అనేక బీజాలకు అవకాశము ఇచ్చేటువంటి కర్మ, ఈ ప్రాణశక్తియే చేయాలి. అందువల్ల, అగ్నికి వెలగడము ధర్మము – కాల్చడమనేది కర్మము. అగ్ని ప్రకాశము దాని స్వధర్మముకాని, దానియందు పడిన పదార్థాలను భస్మము చేయడము దాని కర్మము. అలాగే, జలమునకు పోషించడమనేది ధర్మము – పదును చేయడము దాని కర్మము. అది దానియందు వుండేటువంటి సస్యాదులను పోషింపజేసే ధర్మమువుందికాని, భూమిని పదునుజేసి జలము ప్రవాహరూపముగా చేసేటువంటియొక్క కర్మము కూడా వుంటుంది. పృథ్వికి స్నేహించడము ధర్మము – భరించడము కర్మము. పృథ్వి అన్ని వస్తువులను స్నేహముగ పెట్టుకోనేది ధర్మమే కాని, ఆ తర్వాత అన్నిట్ని తానే ధరించాలి కదా! ధరించేటివల్ల దానికి వసుంధర అని పేరు వచ్చింది – ఇట్లా మనకు, ఈ పంచభూతములు ఏర్పడిన తరవాత, ఈ సృష్టి ఎలా జరిగింది? ఐదు శరీరములయొక్క సృష్టి ధర్మము ఎట్లవుంటాది? అనేటువంటి విషయాన్ని క్రింద తెలియజేస్తున్నారు.

మనకు వేదము అనేక ప్రకారాలుగా సృష్టి ధర్మాన్ని తెల్పింది. పంచముఖములని, పంచతన్మాత్రలని, పంచభూతములని, పంచవర్ణములని, పంచకోశములని, పంచబీజములని, పంచాదిదేవతలని, పంచబ్రహ్మములని, ఈ రకముగా మనకు వేదోపనిషత్తులలో రకరకాలైనటువంటి భావాలు చెప్పినవి. అందుకు, ప్రణవము చెప్పినటువంటి ఒక విషయాన్ని, దీన్ని ఇతరులు చెప్పినవన్ని, ఈ శరీరములో నిరూపించారు కాబట్టి, సృష్టిలో వాటినన్నిటిని తెలియజేస్తున్నారు. ఆకాశమునకు – ఈశాన్యముఖము అని పేరు. పంచముఖములు వుండాయి కద – ఈశాన్యముఖము, తత్పురుషముఖము, అఘోరముఖము, వామదేవముఖము, సద్యోజాతముఖము అనిచెప్పి

"బ్రహ్మకు" ఐదు ముఖాలని చెప్పినారు. అందువల్ల, సృష్టికర్తనటువంటి, ఈ **"చైతన్యబ్రహ్మకు"** – ఈ ఐదు ముఖాలువున్నవి. అందుకే, ఈశాన్యముఖము మొట్టమొదట ఆకాశము రూపములో పుట్టింది. ఇంక, తత్పురుషుడు అంటె దీనికి పురుష ప్రయోగము ఎందుకు వస్తుదంటె సమిష్టిప్రాణమునకు. ఇది మనకు **"అక్షరపురుషుడు"**. 84 లక్షల జీవరాశులను, ఈ సూత్రాత్మ పద్ధతిలొనే, కాపాడుతూ వుంటుంది కాబట్టి, దీనికి ఈ పేరు – కాబట్టి దీనికి తత్పురుష ముఖము – వాయువు. ఎవరికి ? ఈ **"చైతన్యబ్రహ్మకు"**.

ఇంక, అగ్ని – అఘోరముఖము; జలము – వామదేవముఖము; పృథ్వి – సధ్యోజాతముఖము; ఈ పంచముఖములు ఈశాన్యముఖము, తత్పురుషముఖము, అఘోరముఖము, వామదేవముఖము, సధ్యోజాతముఖము – ఈ ఐదు ముఖములు, ఈ **"చైతన్యబ్రహ్మకు"** – పంచముఖాల స్వామి. ఇంక, దీనికి పంచతన్మాత్రలు – శబ్ధము, స్పర్శము, రూపము, రసము, గంధము అనేటువంటి ఐదు తన్మాత్రలు వున్నవి. ఈ ఐదు తన్మాత్రలచేత పుట్టినటువంటివే, ఈ ఐదు భూతములు. అంటే, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అనేటువంటి ఐదు భూతములు. మనకు బైట భూతములు ఘనీభవించి కనిపించవు కదా! – కేవలము వర్ణములు మాత్రమే కనపడతావి. అందుకే, వర్ణముల చేతనే చప్పినారు దాన్ని. ఆకాశమునకు – సునీలవర్ణము; వాయువుకు – ధూమ్రవర్ణము; అగ్నికి – అసితవర్ణము; జలమునకు – శ్వేతవర్ణము; పృథ్వికి – చిత్రవర్ణము; చిత్రవర్ణము అంటే, రకరకాలుగా వుండేటువంటివొక్క గుణముంది పృథ్వికి. కాని పిండాడములో చెప్పేటపుడు కేవలము ఎరుపుగుణమే చెప్పాలి. అది మన కనురెప్పకిందవుండేటువంటి పృథ్వి తత్వమది – మనకు నేత్ర సాంఖ్యము వచ్చినప్పుడు వస్తుంది అది.

ఇంక దీనికి – "లం" **బీజము,** "హం" **బీజము,** "యం" **బీజము,** "రం" **బీజము,** "వం" **బీజము** అనేటువంటి ఐదు బీజాలు వున్నావి. ఇంక ఆకాశానికి "హం" **బీజము,** వర్తులాకారము – అంటే, సున్నావలే వుండేది. వాయువుకి షట్కోణాకారము, ఆరు కోణములువుంటాయి. ఎట్లా వుంటాయి ఆరు కోణములు? అంటే, బ్రహ్మాండములో మనము కోణాలు చెప్పలేముకాని, పిండాండములో మనకు ఆరు (కోణములు) స్థానములు వున్నాయి. ఆధారచక్ర, స్వాధిష్ట, మణిపూరక అనాహత, విశుద్ధ, ఆగ్నేయము అనేటువంటి ఆరు కోణములో ఇది ప్రసరిస్తుంది. అంటే, శిరసుకువున్నటువంటి రెండు

చెవులు, రెండు కన్నులు, రెండు నాసికములు అనేటువంటి ఆరు కోణాలలో - స్థూలముగనూ, సూక్ష్మముగనూ, ఈ వాయువు కదులుతూ సంచరిస్తావుంటాది. అందువల్ల, ఇది షట్కోణాకారము. అగ్నికి త్రికోణాకారము. అగ్నిభూతమునకు మూడు కోణములే ప్రకాశానికి. మరి జలమునకు అర్ధ చంద్రాకారము, పృథ్వికి చతుష్టకోణాకారము. ఇవి మనకు ఈ ఆకారాలు తెలియజేసినటువంటి పద్ధతి. మనకు శరీరము చతుష్కోణాకరముగా వుంటాది. నేత్రములో మనకు జలము చూసినప్పుడు, తెల్లగుడ్డు అర్ధ చంద్రాకారముగానేవుంటాది. నేత్రములో వుండేటివంటి అగ్ని ఎదురుగాను, రెండు ప్రక్కలకు - మూడు కోణాలకు ఇది చూస్తాది. వెనుకకు ఇది చూడలేదు కాబట్టి, ఆ రకముగా వుంటాది. ఇంక, చెవుల స్థానములో వర్తులాకారము, ఆకాశ తత్వము చెప్పినప్పుడు, ఇది చుట్టూ ఎక్కడో వున్నటువంటి ఒక శబ్దాన్ని ఆకర్షిస్తుంది కాబట్టి, దీనికి వర్తులాకారమని - ఈ రకముగా చెప్పినారు. వీటికి - **సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ అనేటువంటి దేవతలు.**

ఇంక, **మనుబ్రహ్మ, మయబ్రహ్మ, త్వష్టబ్రహ్మ, శిల్పిబ్రహ్మ, విశ్వఘ్నబ్రహ్మ అనేటువంటి పంచబ్రహ్మలను** గురించి చెప్పినారు. అంటే, సృష్టికి కారణమైనటువంటి వస్తువు. వీళ్ళను దేవతలుగా చెప్పేటపుడు ఎలా చెప్పినారంటే? **బ్రహ్మ, విష్ణు, ఈశ్వరుడు** - ముగ్గురిని తీసుకొని, **సూర్యుని-చంద్రుని; లేక సూర్యుని-దేవేంద్రుని దేవతలుగా తీసుకొని - ఈ ఐదుమంది విళ్ళు ప్రపంచ కర్తులు.** ప్రపంచము ఉత్పత్తి, స్థితి, లయము చేసి పరిపాలించేదానికి విళ్ళు ఐదుమంది కర్తలు. అంటే, సూర్యుడిని-దేవేంద్రుని తీసుకోనటువంటివారు - ఆ రకముగా ఈ శరీరములో వుండేటువంటియొక్క లక్షణాలు, ఈ రకముగా వున్నాయని చెప్పి, మనకు తెలియజేసినారు. ఇంక, ఇది శరీరము స్థూలప్రక్రియ ఎలా అపంచీకృత పంచ మహాభూతములచేత వున్నటువంటి సృష్టి, పంచీకృత పంచభూతములు ఎలా అయింది? ఈ విశ్వ బ్రహ్మాండ నిర్ణయాలు ఎలా జరిగినాయి? అనేటువంటి విషయాన్ని మనము ఇప్పుడు పరిశీలించుదాము.

బ్రహ్మాండ విషయాన్ని ఇంతవరకూ - సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణల పద్ధతిలో ఇలావున్నదని చెప్పి - ఈ ఐదు భూతముల మీద, ఈ సృష్టిక్రమముమీద పంచముఖాలు ఎలా చెప్పినారు? పంచ భూతాలు ఎలా అయినవి ? పంచ బీజాలు ఎలా అయ్యాయి? పంచ బ్రహ్మములు ఎలా చెప్పినారు? అనేటువంటిది - **ఈ 'అ'కార, 'ఉ'కార, 'మ'కార, అర్ధమాత్రిక** రూపమైనటువంటి **'ఓం'కారములో** - ఈ **స్థూల, సూక్ష్మ,**

**కారణ, మహాకారణ శరీరాలు** ఎట్లా పుట్టినవి? అనేటువంటి విషయాన్ని తెలుసుకొందాము. ఎందుకంటే, మనకు విచారించతగినటువంటి సృష్టి, వస్తునిర్ణయముగా మనకు అర్థము కావాలన్నప్పుడు, ఇవి తెలుసుకోవాలి. వస్తునిర్ణయమైన తరవాత, అన్ని మనకు తెలియబడతాయి. ఈ నాడు **"యెరుక"** యెరుకని అందరు అంటారు కదా! – ఆ యెరుకంటే ఏమి ? అంటే, చెప్పలేకపోతూ వుండారు. అది మాయ అని, అది సంకల్పము అని, అది ఏమోనని చెప్పుతూ వుండారుకాని – **"ఆ అఖండముగవున్నటువంటి యెరుక స్వరూపము నేనే"** అనేటువంటి అనుభవము చెప్పలేకపోతూ వుండారు. ఎందుకంటే, దాన్ని గురించి వాళ్ళు ఆలోచన చేయలేదు కనుక వస్తువు, నిర్ణయ పద్ధతిలోనేవుండాలి – ఏదైన బోధవుంటె. ఏ విషయాన్ని మాట్లాడుతూ వుండామో, ఆ వస్తువు మనకు వస్తుపద్ధతిగ తెలియబడాలి. అందుకే, ఇప్పుడు బ్రహ్మాండమును, పంచభూతాలను, పంచరంగులను గురించి చెప్పినారు. ఇంక, పిండాండములో పంచీకృత పంచ మహాభూతాలు ఎట్లైనాయి? ఇప్పుడు సూక్ష్మశరీర పంచీకరణ మనకు వస్తుంది. బ్రహ్మాండమైన తర్వాత పిండాండములో నివాసము ఏర్పరచుకొని, పిండాండ అనుభవాన్ని పొందాలంటే, సూక్ష్మ శరీర పంచీకరణ జరగాలి. ఇక్కడ, తన్మాత్రలు మాత్రము పంచితే సరిపోతుందిగాని, భూతాలని పంచకూడదు. కాని మనము భూతాలనే పంచడము ముందునుండి కూడా అలవాటు చేసుకొన్నాము. భూతములను మనము గోళకములుగా సృష్టిచేయాలి, మరల దానియందున ఇవి చేయాలి. ఏలాగంటే – ఇప్పుడు భూతములను పంచుదాము:

**1.** <u>**ఆకాశము భూతము :–**</u> ఆకాశము రెండు భాగములై – అర్ధ భాగము **"జ్ఞానము"** నివశించే గోళకమైంది. మిగితాది నాల్గు భాగములై – వాయువుతో ఒక భాగము కలిసి, **"మనస్సు"** నివశించే గోళకమైంది. రెండో భాగము అగ్నితో కలిసి. **"బుద్ధి"** నివశించే గోళకమైంది. మూడో భాగము జలముతో కలిసి **"చిత్తము"** నివశించే గోళకమైంది. నాల్గో భాగము పృథ్వితో కలిసి, **"అహంకారము"** నివశించే గోళకమైంది. ఇప్పుడు మనకు ఆకాశము ఏమైందంటే – **జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములనే అంతరింద్రియములను** ఎక్కడ నివశించాలో, అక్కడ వాటికి ఉపాధి గోళకములైనాయి భూతాలు.

2. <u>**వాయు భూతము:–**</u> ఇంక, వాయువు రెండు భాగములైంది – అర్ధ భాగము సర్వాంగాలములో నివశించే **"వ్యాన వాయువుకు"** గోళకమైంది. మిగితాది నాల్గు

భాగముల్లై, ఆకాశముతో ఒక భాగము కలిసి, "**సమానవాయువు**" నివశించే గోళకమైంది. రెండో భాగము అగ్నితోగూడి "**ఉదానవాయువు**" నివశించే గోళకమైంది. మూడో భాగము జలముతో కలిసి, "**ప్రాణవాయువు**" నివశించే గోళకమైంది. నాల్గో భాగము పృథ్వితో కలిసి, "**అపానవాయువు**" నివశించే గోళకమైంది. ఇప్పుడు **వ్యానవాయువు, సమానవాయువు, ఉదానవాయువు, ప్రాణవాయువు, అపానవాయువులని** – ఈ పంచప్రాణములను నివశించే గోళకాలు వాయుభూతమైంది.

3. <u>**అగ్ని భూతము:-**</u> ఇంక, అగ్ని రెండు భాగముల్లైంది – అర్ధ భాగము "**నేత్రములను**" నివశించే గోళకమైంది. మిగితాది నాల్గు భాగముల్లై – ఆకాశముతో ఒక భాగము కలసి, "**శ్రోత్ర**" గోళకమైంది. రెండో భాగము వాయువుతో కలిసి, "**త్వగేంద్రియ**" గోళకమైంది. మూడో భాగము జలముతో కలిసి, "**జిహ్వేంద్రియ**" గోళకమైంది. నాల్గో భాగము పృథ్వితో కలిసి, ఘ్రాణమును నివశించే "**ఘ్రాణేంద్రియ**" గోళకమైంది. ఇప్పుడు – **చక్షువు, శ్రోత్రము, త్వక్కు, జిహ్వ, ఘ్రాణము** – అగ్నిభూతము **జ్ఞానేంద్రియములయొక్క** గోళకముల్లైనాయి.

4. <u>**జలభూతము :-**</u> ఇంక జలము రెండు భాగముల్లైంది – అర్ధ భాగము "**రసేంద్రియము**" నివశించే గోళకమైంది. ఇంక మిగితాది నాల్గు భాగముల్లై – ఆకాశముతో ఒక భాగము కలిసి, "**శబ్దేంద్రియము**" నివశించే గోళకమైంది. రెండో భాగము వాయువుతో కలిసి, "**స్పర్శేంద్రియము**" నివశించే గోళకమైంది. మూడో భాగము అగ్నితో కలిసి, "**రూపేంద్రియము**" నివశించే గోళకమైంది. నాల్గో భాగము పృథ్వితో కలిసి, "**ఘ్రాణేంద్రియము**" నివశించే గోళకమైంది. ఇప్పుడు **రసము, శబ్దము, స్పర్శ, రూపము, గంధము** – జలభూతము **విషయేంద్రియములయొక్క** గోళకముల్లైనాయి.

5. <u>**పృథ్వి భూతము :-**</u> ఇంక, పృథ్వి రెండు భాగముల్లైంది – అర్ధ భాగము "**పాయు ఇంద్రియము**" నివశించే గోళకమైంది. ఇంక, మిగితాది నాల్గు భాగముల్లై – ఆకాశముతో ఒక భాగము కలిసి, "**వాగేంద్రియము**" నివశించే గోళకమైంది. రెండో భాగము వాయువుతో కలిసి, "**పాణీంద్రియము**" నివశించే గోళకమైంది. మూడో భాగము అగ్నితో కలిసి, "**పాదేంద్రియము**" నివశించే గోళకమైంది. నాల్గో భాగము జలముతో కలిసి, "**ఉపస్థ ఇంద్రియము** " నివశించే గోళకమైంది.

ఇప్పుడు పంచభూతాలు మనకు ఏమైనాయి ? ఈ **25** ఇంద్రియములను నివశించేటువంటి గోళకాలైనాయి. ఇంక వీటిలోపల మనము ఇప్పుడు తన్మాత్రలను పంచాలి. ఇప్పుడు తన్మాత్రలను పంచితే, మనకు **25** సూక్ష్మేంద్రియాలు పుడుతున్నవి:

1. **<u>శబ్దతన్మాత్ర</u> :-** అంటే, శబ్దతన్మాత్ర రెండు భాగములై - అర్ధ భాగము **"జ్ఞానమైంది"**. మిగితాది నాల్గు భాగములై స్పర్శతన్మాత్రతో, ఒక భాగము కలిసి **"మనస్సు"**; రూపతన్మాత్రతో ఒక భాగము కలిసి **"బుద్ధి"**, రసతన్మాత్రతో ఒక భాగము కలిసి **"చిత్తము"**; గంధతన్మాత్రతో ఒక భాగము కలిసి **"అహంకారమైంది"**. ఇప్పుడు **జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము** అనేటువంటివి ఆకాశ సూక్ష్మాంశమైన శబ్ద తన్మాత్రయొక్క పంచీకరణవల్ల - మనకి ఈ **"అంతరింద్రియాలు"** ఏర్పడినాయి. ఇవే **"మహాశక్తిసంపన్నమైనటువంటివి" - 'సృష్టి'; 'స్థితి'; 'లయాలకు '; మొత్తము - ఇవే "మూలకారణమైనటువంటి పదార్థాలు".**

2. **<u>స్పర్శతన్మాత్ర</u> :-** స్పర్శతన్మాత్ర ఏమైందంటే, రెండు భాగములైంది - అర్ధ భాగము **"వ్యానవాయువైంది"**. మిగితాది నాల్గు భాగములై - శబ్దతన్మాత్రతో ఒక భాగము కలిసి **"సమానవాయువు"**; రూపతన్మాత్రతో ఒక భాగము కలిసి **"ఉదానవాయువు"**; రసతన్మాత్రతో ఒక భాగము కలిసి **"ప్రాణవాయువు"**; గంధతన్మాత్రతో ఒక భాగము కలిసి **"అపానవాయువైంది"**. ఇప్పుడు, **వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన** అనేటువంటి **"పంచప్రాణములు"** స్పర్శేంద్రిము పంచీకరణవల్ల పుట్టినవి. ఎందుకంటే, భూతము పంచితే మల్ల మిగలదు కాబట్టి, ఇది అణువిద్యుత్ కేంద్రములాంటిది - ఎన్ని సార్లు ఉపయోగించినా - అదే వుంటుంది అనే మాట - అట్లే ఈ తన్మాత్రలు.

3. **<u>రూపతన్మాత్ర</u> :-** రూపతన్మాత్ర రెండు భాగములై - అర్ధ భాగము **"నేత్రేంద్రియమైంది" (చక్షువు).** - మిగితాది - నాల్గు భాగములై శబ్దతన్మాత్రతో ఒక భాగము కలిసి **"శ్రోత్రము"**; స్పర్శతన్మాత్రతో ఒక భాగము కలిసి **"త్వగేంద్రియము" (త్వక్కు)**; రసతన్మాత్రతో ఒక భాగము కలిసి **"జిహ్వేంద్రియము"**; గంధతన్మాత్రతో ఒకభాగము కలిసి **"ఘ్రాణేంద్రియమైంది"**. అంటే, ఇప్పుడు మనకు **శ్రోత్రము, త్వక్కు, జిహ్వా, ఘ్రాణములనేటువంటివి** - ఈ **"సూక్ష్మ ఇంద్రియాలు"** రూపతన్మాత్ర పంచీకరణవల్ల మనకు పుట్టినవి.

4. <u>రసతన్మాత్ర</u> :- ఇంక, రసతన్మాత్ర రెండు భాగములైంది - అర్ధ భాగము "రసమైంది". మిగితాది నాల్గు భాగములై - శబ్దతన్మాత్రతో ఒక భాగము కలిసి "**శబ్దము**"; స్పర్శతన్మాత్రతో ఒక భాగము కలిసి "**స్పర్శము**"; రూపతన్మాత్రతో ఒక భాగము కలిసి "**రూపము**" గంధతన్మాత్రతో ఒక భాగము కలిసి "**గంధము**". **శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు** - ఐదు బ్రహ్మాండములోను, పిండాండములోను ఒకే పద్ధతిగావుంటాయి. దీనికి పంచీకరణ ఇంతే. అందుకే, కృష్ణప్రభు - "**మరుపుకు తన్మాత్రలు గలవు; యెరుకకు తన్మాత్రలున్నను ఇవి రెండూ ఒక్కటే**". "**నేను జీవుడని**" నిన్ను నీవు మరిచిపోయినప్పుడు - నీవు తన్మాత్రలనే అనుభవించినావు; "**నేను ఈశ్వరుడు**" - "**నేను బ్రహ్మను**", "**నేను ఆత్మను**" అనేటపుడు కూడ, ఆ తన్మాత్రలనే అనుభవించుతూ వుండావు కాబట్టి, ఈ రెండు ఒక్కటే - ఇది మారేదికాదు. కాబట్టి "**పరిపూర్ణముయొక్క**" తన్మాత్రసహితము "**లేనిదని**" ఆయన తీర్మానము జేసినాడు. ఇప్పుడు తన్మాత్రలు అంటే, "**విషయేంద్రియములు**" ఇవియే.

5. <u>గంధ తన్మాత్ర</u> :- ఇంక, గంధ తన్మాత్ర రెండు భాగములై - అర్ధ భాగము "**పాయువైంది**". మిగితాది నాల్గు భాగములై - శబ్దతన్మాత్రతో ఒక భాగము కలిసి "వాక్కు"; స్పర్శతన్మాత్రతో ఒక భాగము కలిసి "**పాణి**" రూపతన్మాత్రతో ఒక భాగము కలిసి "**పాదము**"; రసతన్మాత్రతో ఒక భాగము కలిసి "**ఉపస్థ**" నేటువంటి "**కర్మేంద్రియములైదు**" - **వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ** - ఈ ఐదును, **గంధ** తన్మాత్ర పంచితే అయినాయి.

ఇప్పుడు మనకు గోళకములైనాయి, గోళకములను నివశించే ఇంద్రియములైనాయి. ఇంక "**వీటికి దేవతాసృష్టి**" కావాలి. **భూతములు తమోగుణ సృష్టి; ఇంద్రియములు రజోగుణ సృష్టి; దేవతలు సత్వగుణ సృష్టి.** ఇప్పుడు దేవతా సృష్టికావాలి - అందుకు, ఇప్పుడు మనకు :

(అ) జ్ఞానమునకు - కూటస్థుడు; మనస్సుకు - చంద్రుడు; బుద్ధికి - బృహస్పతి; చిత్తమునకు - క్షేత్రజ్ఞుడు; అహంకారమునకు - రుద్రుడు; అధిదేవతలైనారు.

(ఆ) అట్లనే, సమానవాయువుకు - జయుడు; వ్యానవాయువుకు - విశ్వయోని; ఉదానవాయువుకు - అజుడు; ప్రాణవాయువుకు - విశిష్టుడు; అపానవాయువుకు - విశ్వకర్త అధిదేవతలైనారు.

(ఇ) ఇంక అట్లే, శ్రోత్రమునకు – అష్టదిక్పాలకులు; త్వక్కుకు – వాయుదేవుడు; నేత్రములకు – సూర్యదేవుడు; జిహ్వకు – వరుణ దేవుడు; ఘ్రాణమునకు – అశ్విని దేవతలు; అధిదేవతలైనారు.

(ఈ) ఇంక అట్లనే, శబ్దమునకు – సదాశివుడు ; స్పర్శమునకు – ఈశ్వరుడు; రూపమునకు – రుద్రుడు; రసమునకు – విష్ణువు; గంధమునకు – బ్రహ్మ దేవుడు; అధిదేవతలైనారు.

(ఉ) అట్లే, వాక్కుకు – అగ్ని; పాణికి – ఇంద్రుడు; పాదములకు ఉపేంద్రుడు (విష్ణువు); పాయువుకు – మృత్యువు; ఉపస్థుకు – బ్రహ్మ; అధిదేవతలైనారు.

<u>ఇప్పుడు, మనకు సత్వగుణముచేత దేవతా సృష్టి ఏర్పడివుంది. ఇంక వీళ్ళ కర్మలు ఎలాచేస్తారు? అన్నప్పుడు :</u>

1. **<u>జ్ఞానము</u> :–** జ్ఞానము – "భ్రూమధ్య స్థానము". అంటే, మూర్తి స్థానమునందువుండి సర్వమును గుర్తెరిగేది – ఇది చేసే పని. **అధిదేవత "కూటస్థుడు".**

2. **<u>మనస్సు</u> :–** మనస్సు **"కంఠస్థానమునందుండి"**, సంకల్ప వికల్పాలు చేసేది దీని పని. **అధిదేవత "చంద్రుడు".**

3. **<u>బుద్ధి</u> :–** బుద్ధి **"ముఖస్థానమునందుండి"**, సకల విషయాలను నిర్ణయాలు చేస్తువుండేటువంటిది. **"బృహస్పతి" అధిదేవతగావుండి (గురు)** – ఈ బుద్ధి ఇంద్రియము చేసేటువంటి పని ఇది.

4. **<u>చిత్తము</u> :–** చిత్తము **"నాభిస్థానమునందుండి", "క్షేత్రజ్ఞుడు" అనే అధిదేవత.** ఈయన గతించినటువంటి విషయాలన్ని ముందరేసుకొని చింత చేసేటువంటి లక్షణము ఈ చిత్తానికి. అంటే, ఇది ఈ పని చేస్తాది.

5. **<u>అహంకారము</u> :–** అహంకారమునకు – **"రుద్రుడు"** అధిదేవత. ఇది

"హృదయ" స్థానములోవుండి అభిమానించేది. స్వాభిమానాన్ని రక్షించు కుంటూ వుండేటువంటిది దీని పని.

అంటే, "**అంతరింద్రియములు**" ఐదు ఇప్పుడు వాటి వాటి స్థానములలోవుండి, వాటి అధిదేవతల చేత అవి చేసేటువంటి పనులు మనము తెలుసుకున్నాము.

<u>ఇంక ఇప్పుడు "పంచప్రాణములు" - అధిదేవతలు చేసేటువంటి పని :</u>

**1. <u>సమానవాయువు</u> :-** ఇప్పుడు సమానవాయువు "**నాభి స్థానములోవుండి**", తినిన ఆహారమును పచనముచేసి డబ్బదిరెండువేలు (72,000) నాడులకూ రసాన్ని పంపిస్తాది. సూక్ష్మ రసాన్ని మనోబుద్ధులకూ బలముగా ఇస్తాది. ఇది చేసేటువంటి పని - దీనికి "**జయుడు అధిపతి**" పచనము చేసేది దీని పని.

2. **<u>వ్యానవాయువు</u> :-** వ్యానవాయువు "**సర్వాంగములయందుండి**", శీతోష్ణ స్పర్శలను ఎరిగేటువంటిది దీని పని. దీనికి "**విశ్వయోని అధిదేవత**".

**3. <u>ఉదాన వాయువు</u> :-** ఉదాన వాయువు "**కంఠస్థానములోవుండి**" - మరి వైఖరి పలుకులు పలికించడము; అన్నపానములను లోపలికి మింగేట్లు చేయడము; కఫము ఏమైన చుట్టుకుంటే దాన్ని బైటికి నెట్టివేయడము - ఇది చేసేయొక్క పని. యావుది? ఉదానవాయువు చేసేటువంటిది. దీనికి "**అజుడు అధిదేవత**".

4. **<u>ప్రాణవాయువు</u>** :- ఇంక ప్రాణవాయువు - ఇది ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములో, దినమునకు 21,600 సారులు లోపలకు బైటకు తిరుగేటువంటిది - దీని పని. దీనికి ఎవరు **అధిదేవత** అంటే? - "**విశిష్టుడు**".

5. **<u>అపానవాయువు</u> :-** ఇంక అపానవాయువుంది. ఇది "**పాయు-ఉపస్థలయందుండి**" - మల, మూత్ర, శుక్ల, శ్రోణితములను విసర్జన చేస్తు, ఋతుచక్రమును కూడా క్రమముగా నడిపించే శక్తి దీనికివుంది. దీనికి ఎవరు **అధిదేవత** అంటే? "**విశ్వకర్త**".

అంటే ఇప్పుడు, దేవతలు ఇంద్రియములతో కూడా కూడుకొని కర్మలు ఎలా చేస్తావుండారంటే? "**చైతన్యరూపమైన ఆత్మ**" ఇన్ని మెట్లుగా దిగివచ్చి కర్మబంధానికి

ఎట్లా ఏర్పడుతూవుందో ? కర్మతంత్రముగా ఎట్లా మారుతూవుందో? అనేది మనకు దీనినిబట్టి అర్థమైంది కదా!

1. <u>**శ్రోత్రము**</u> :– ఇంక శ్రోత్రమునకు (చెవులు) "**అష్టదిక్పాలకులు అధిదేవతలు**". ఇవి శబ్దములను వినేటువంటియొక్క పని వీటివి. చెవులు అనేటువంటి గోళకములోవుండి అష్టదిక్పాలకులనే అధిదేవతలు "**శబ్దమును**" వినేటువంటి కర్మ చేస్తున్నాయి.

2. <u>**త్వక్కు (త్వగేంద్రియము)**</u> :– ఇంక త్వగేంద్రియము – దీనికి "**వాయువు అధిదేవత**". ఇది స్పర్శములను ఎరిగేటువంటి పని ఇది చేస్తాది. ఇప్పుడు ఇది యెండగావుంది; ఇది చల్లగావుంది; ఇది వుడుకుగావుంది – అనేటువంటి యొక్క"**చర్మేంద్రియానికి**"సంబంధించిన విషయాలన్నిట్నీ ఎరిగే గుణము దీనికివుంది.

3. <u>**చక్షువు (నేత్రములు)**</u> :– ఇంక చక్షువు – "**కన్నులను స్థానముగ**" జేసుకొని సృష్టిలోవుండేటువంటి అంద చందాలు; సృష్టి సౌందర్యమునంత కూడా చూసే శక్తి దీనికివుంది. సూర్యునియొక్క వెలుగుతో నివశించేటువంటిది కాబట్టి, సూర్యునియొక్క వెలుగు ఎంత పరిధిలో వుంటుందో, ఈ నేత్రమునకు దృగాకాశము ఎంత పరిధి వ్యాపిస్తాదో, అంతవరకూ వుండేయొక్క లక్షణాలన్నిట్నీ కూడ తెలుసుకొనే శక్తి; చూసే శక్తి; నేత్రములకువుంది. అంటే, కన్ను దృశ్యరూపాన్ని చూసి, అందులోవున్నటువంటి సుఖదుఃఖాలను అనుభవించే శక్తి దీనికివుంది. దీనికి "**సూర్యుడు అధిదేవత**".

4. <u>**జిహ్వ (నాలుక)**</u> :– ఇంక జిహ్వ – ఇది "**వరుణదేవుడు**" అనే అధిదేవతనుండి, షడ్రుచులను – ఉప్పు, కారము, చేదు, ఒగరు, పులుపు, తీపు అనేటువంటియొక్క రుచులను గమనిస్తూ, ఈ ఒక జిహ్వేంద్రియమును ఆధారము చేసుకొనివుంటాది, అందుకు, ఈయన వరుణదేవుడు ఇక్కడవుండి ఇటువంటి పని చేస్తాడు. ఇక్కడ మనకు ఎప్పుడూ కూడ జలము – లాలజలము వూరాలి. అందుకే, సరస్వతి ఎక్కడవున్నది – శబ్ద రూపిణి అంటే, పూర్వము ఇదే – ఈ నాలుకనే చలువబండగా చేసుకొని, ఇందులో వూరేటువంటి, లాలజలమే సిరాగా యోగులైనటువంటి వాళ్ళు ఉపన్యాసము; ఉపనిషత్తులు; అనేటువంటి అనేక గ్రంథాలు వ్రాసేదానికి ఇదే అనుకూలించేటిది. ఇదియే సరస్వతి పీఠము – ఇదే "**బ్రహ్మదేవుడు రస స్వరూపమైన సృష్టి చేసే స్థానము**" – ఇది "**బ్రహ్మపీఠము**". నేత్రములు – "**విష్ణుపీఠము**". చెవులు –

"**శివపీఠము**". చెవులో పోయి చేరేటివే కాని, చెవులనుండి బైటికి వచ్చేటువంటివి వుండవు. అంటే, అది లయ స్థానము. లయస్థానముయొక్క పనిచేస్తాది. అట్లే నేత్రములు విశ్వవ్యాపకముగా పరిపాలన చేస్తాయి కాబట్టి, ఇది విష్ణుస్వరూపము. ఇది వాక్వివిద్యల రూపము రాణింప చేస్తాది కాబట్టి – వాక్ బ్రహ్మపీఠముగా, ఈ త్రిపీఠములలో మనము నివశించేటువంటి విధానాన్ని పూర్వీకులు ఈ రకముగా చెప్పేటువంటివారు.

5. **<u>ఘ్రాణము (ముక్కు)</u> :–** ఘ్రాణేంద్రియమునకు "**అశ్విని దేవతలు – అధిదేవతలు**". ఉఛ్వాస – నిశ్వాసములు నడపించేటువంటి శక్తి దీనికివున్నది. అందుకే, శరీరమును బ్రతికించే శక్తి; ప్రాణమును నడిపించే శక్తి; ఈ అధిదేవతలకు వున్నదని – ఈ శ్వాస ఏ నాల్గు క్షణములు నిలిచిపోయినా కూడ – శరీరము నిలబడిపోతది కాబట్టి, వీళ్ళకు అశ్విని దేవతలని ఎందుకు పేరు పెట్టినారంటే? శరీరము చచ్చేస్వభావము ఎప్పటికీ వున్నదని – అది ఏ క్షణమైన అంటే – అది ఎప్పుడూ చచ్చేవున్నది కాని, ఈ "**చైతన్యమనేటువంటి వస్తువు**" వియోగమైతే – అది ఆ క్షణములోనే చస్తాది కాబట్టి, అది వియోగము కాకోకుండ కాపాడేశక్తి అశ్విని దేవతలకు వున్నది. ఉఛ్వాస – నిశ్వాసాలను నడిపించ శక్తివుంది కాబట్టి, వాళ్ళకు అశ్వినిదేవతలని పేరు. అంటే, గుర్రములాగ నిలుకడలేకుండ నడిపేటువంటివారు. ఎప్పుడూ కూడ కాలము ఒకే రీతిగా నడిపించే శక్తి వీళ్ళకువుంది కాబట్టి అశ్విని దేవతలన్నారు. ఆ రకముగానే, ఈ జ్ఞానేంద్రియాది దేవతలు – ఈ రకముగా వాటి వాటి స్థానములోవుండి, ఆయా పనులను చేస్తూ వుండారు.

<u>ఇప్పుడు మనకు ఇంక విషయేంద్రియములు :</u> –

1. **<u>శబ్దము</u>** :– దీనికి "**సదాశివుడు అధిపతి**" – ఇది జీవకోట్లన్నిటికీ కూడ, ఈ శబ్దేంద్రియము **చెవులకు ఆహారముగా**; ఆత్మకు తృప్తినిగలిగించేదిగా వుంటాది. అంటే, ఇది విషయేంద్రియమే కాబట్టి, దీనికి కర్తృత్వము వుండదు. అది ఇంకొక దానికి అదే ఆహుతి అయితుంది తప్ప అది ఇంకొక దానిని తీసుకోనేకి కాదు.

**2. <u>స్పర్శము</u> :–** అట్లే స్పర్శేంద్రియమువున్నది – దీనికి "**ఈశ్వరుడు అధిపతి**". ఇది చర్మానికి మాత్రము విషయము – **చర్మానికి ఆహారము.**

3. **<u>రూపము</u> :–** ఇంక రూపేంద్రియమువున్నది – దీనికి "**రుద్రుడు అధిదేవత.**" ఇది నేత్రములకు విషయము, **నేత్రములకు ఆహారము.**

4. **రసము** :- ఇంక రసముంది - ఇది **జిహ్వాకు ఆహారము. దీనికి "విష్ణువు అధిపతి".** జిహ్వేంద్రియానికి విషయేంద్రియమే తప్ప వేరే కాదు.

5. **గంధము** :- దీనికి **"అధిపతి బ్రహ్మ"** - ఇది ఘ్రాణముకు విషయము - **ఘ్రాణ మునకు ఆహారము.**

ఈ విధముగా, శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధములనే ఐదు విషయేంద్రియములు - ఈ యొక్కజ్ఞానేంద్రియములకు ఆహారములాగ పని చేస్తాయి

**ఇంక పృథ్వి తత్వమైనటువంటి గంధ తన్మాత్రచేత పంచబడిన కర్మేంద్రియాలు వుండాయి; వాక్; పాణి; పాద; పాయు; ఉపస్థలు:**

1. **వాక్కు** :- నోరు అనే గోళకములోవుండి, **"అగ్ని అనే దేవత"** చేత భావములో పుట్టినటువంటియొక్క భావములనన్నిట్ని కూడ ప్రకటనపరుచునటువంటి శక్తి వాక్కు.

2. **పాణి** :- ఇంక పాణి ఇంద్రియమువున్నది (చేతులు). ఇది శరీర పోషణకు, జీవనవిధానానికి, తాను అనుకొనేటివాటిని నిర్మించుకొనేదానికి - ఈ చేతులే కారణము. ఇందుకు దీనికి **"ఇంద్రుడు అధి దేవతయై విశ్వనిర్మాణము"** చేస్తాడు. అందుకే, ఆయనని **"శిల్పి బ్రహ్మ"** - అంటే, విశ్వాన్ని చేసేవాడు - పరిపాలించేటు వంటివాడు. దీనికి **"విశ్వనిర్మాత"**, ఇంద్రుడు అనేటువంటి పేరు **"దేవేంద్రునికి"** వచ్చింది.

3. **పాదము** :- ఇంక పాదమువున్నది - దీనికి **"ఉపేంద్రుడు అధిపతి"** - వామనుడు (విష్ణువు). ఎందుకంటే, ఈ శరీరమంత కూడ, పాదేంద్రియములపైన ఆధారపడి నడుస్తాది - జీవిస్తాది కాబట్టి, పాదములు ఎవరు అన్నప్పుడు - **"విష్ణువును"** పాదములుగ పెట్టినారు. మరి పంచభూతములు నీకు శరీరముగా అయినప్పుడు, ఇవన్నీ ఎక్కడెక్కడ వుంటాయి అనేది చెప్తారు. అవి ఇప్పుడు దీనికి మాత్రము - పాదేంద్రియములకు **"విష్ణువు"** గమనాగమనములు చేసి - సంకల్పించుకొన్న చోటికి శరీరమును మోసుకొని పోయే శక్తి దీనికి వుంది.

4. **ఉపస్థ** :- ఇంక ఉపస్థ **"మర్మస్థానము"**. ఇది సృష్టి విధానానికి తోడ్పడేటువంటి శక్తి దీనికి వున్నది. దీనికి **"అధిపతి బ్రహ్మ"**. పాదములకు **"విష్ణ బ్రహ్మమై"** ఎట్లా శరీరాన్ని మోస్తావుంటాడో, ఉపస్థనకు **"బ్రహ్మ అధిపతియై"** సర్వమును కూడ **"సృష్టి"** చేసే దానికి కారణమైతావుండాడు.

5. <u>పాయు</u> :– ఆ రకముగానే, పాయువింద్రియమువుంది. ఇది మలినపదార్థములను విసర్జన చసేది. మనము భోజనము చేసిన తర్వాత – రసమునంతా శరీరానికి పంపించిన తర్వాత, స్థూల పదార్థమునంత విసర్జనచేసేటువంటి శక్తి దీనికి వున్నది.

ఈ రకముగా సకలేంద్రియములు – ఈ శరీరములో వాటి వాటి స్థానములలో, అవి పని చేసినప్పుడే మనకు శరీరము ఆరోగ్యకరముగా; మనస్సు ప్రశాంతముగా; జీవనము బాగవుండేట్లుగా మనకు తెలియబడుతుంది. ఇట్లా మనకు ఈ ఇంద్రియములయొక్క లక్షణము – స్వభావాన్ని తెలిసికొన్న తర్వాత, ఇది ఈ ఐదు అవస్థలు ఎట్లా పొందుతావుంది ఐదు శరీరాలుగా; ఐదు అభిమానులుగా ఇది ఎట్లవుంటాది? అనే విషయము మనము ఇప్పుడు తెలిసికొందాము.

## <u>పంచభూత గుణముల లక్షణము</u>

**11. సీ ॥ రూఢి శబ్ద స్పర్శ రూపముల్ రస గంధములునైదు పృథ్వియందలరి యుండు । రస రూప స్పర్శ శబ్దంబులు నాలుగు జలమందు జనితమై చెలగియుండు । నగ్నిహెూత్రమునందు నమరి రూప స్పర్శ శబ్దముల్ మూడు నిశ్చయముగాను । వాయునందు స్పర్శవరశబ్దములు రెండు నంబరబందు శబ్దంబునొకటి ॥గీ॥ యొక్కటియూ లేక దిక్కులు పిక్కటిల్లగ । వెలుగు చున్నావు లోపల వెలుపలనక ॥రమ్య॥**

1. మనకు ఒక భూతమునకు ఎన్ని గుణములు వుండావి? అది ఎన్నో భూతము అని చెప్పేది ఒక పద్ధతివుంది. **శబ్ద స్పర్శ, రూప, రస, గంధము – అనేటువంటి ఐదు గుణములు** ఐదో భూతానికి వుంటావి. ఏ భూతము? **పృథ్వి భూతము.** పృథ్వి భూతము అనేటువంటిదానికి, ఐదు గుణములు వుంటావి. మనము, ఇది ఎన్నో భూతము అని చెప్పేదానికి తన్మాత్రలే ప్రమాణము – వేరె ఇంకేమి ఎదికీ అవసరములేదు.

2. ఇంక – **శబ్ద, స్పర్శ, రూప, రసములు** – అనే నాల్గు గుణాలు, నాల్గవ భూతానికి వుంటాయి. అంటే **జలభూతానికి** వుంటాయి ఇవి.
3. ఇంక – **శబ్ద, స్పర్శ, రూప, – అనేటువంటివి మూడు గుణాలు** – మూడవ భూతమైన **అగ్ని భూతానికి** వున్నవి. అంటే, అగ్నిభూతము మూడవ భూతము అనే దానికి – ఇవి మూడు తన్మాత్రలు వుంటాయి.

4. ఇంక – **శబ్దము, స్పర్శ** – **అనేటువంటి రెండు గుణాలు** – రెండవ భూతానికి – ఇవి రెండు గుణాలు మాత్రమేవుంటాయి. అంటే – **వాయుభూతానికి.**

5. ఇంక – **ఆకాశమునకు** – **శబ్దము** ఒక్కటే గుణము వుంటాది. ఇవి 15 అక్షరములు – అంటే తన్మాత్రలు:

**(1) పృథ్వికి – 5 (2) జలమునకు – 4 (3) అగ్నికి – 3 (4) వాయువుకి – 2 (5) ఆకాశమునకు – 1 – మొత్తము = 15 అక్షరములు. ఈ "పంచదశ" అక్షరములే, సృష్టికి కారణ వస్తువులు. ఈ సృష్టికి కారణము** – అందుకే **" ఐదు అక్షరములు చదువురా – సద్గురిని కరుణ – ఐదు ఐదులు = ఇరుపై ఐదురా ". "ఐదు అక్షరముల ఒక చదువు ఇది ". "క్షర భూతము" – "అక్షర భూతము";** అని రెండు పంచభూతములు వుంటాయి. పిండాండములోవుండే రెండు పంచ భూతములు – క్షరములు నశించి పోతాయి – బ్రహ్మాండములోవుండే పంచ తన్మాత్రలు నశించకుండ వుంటాయి. ఆ అక్షర తన్మాత్రలు, ఈ క్షరభూతానికి కారణమైతావుంది కాబట్టి – ఈ ఒక 5 ఐదుల 5 = 25 అయియుండేది పిండాండములో. కాని, ఇది 25 అయి మారిన తర్వాత నశించి పోతాయి. 5 - 5 గానేవుండేటివి – అది **"ఈశ్వరుని శరీరము"** తక్షణము నశించదు. ఇది **"జీవశరీరము"** – ఇది తక్షణము నశిస్తాది కాని, ఈ తన్మాత్రలయొక్క విషయాన్ని గ్రహించి చూస్తే, ఇవి అందుకే **"పంచదశ అక్షరముల ప్రంపంచము, తాను ఉద్భవించి ప్రణవాక్షరమునందు అని శృతులు పలికినాయి".** శృతులు ఏమి చపుతున్నాయి?

> **"ప్రణవమునందు ఐదు ప్రాణాక్షరములు పుట్టి జగములాయనయ్య జతనముగను । అదియు జీవమాయ । ఆ పై శివమాయ । అఖిల జీవసంగ ఆత్మలింగ ॥"**

ఈ ఒక్క ప్రణవమనేటువంటి మొట్టమొదట శబ్దమైన – "ఆకాశ బ్రహ్మమందున", ఐదు ప్రాణాక్షరాలు పుట్టి, అంటే – **శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ** ములు అనేటువంటి **ప్రాణాక్షారాలు** పుట్టినాయి – పుట్టిన తర్వాత ఇది **"జీవమైయింది".** ఆ పైన వుండేటువంటి ప్రణవ అక్షరము **"శివమైయింది".** ఈ రెండును విచారించినటువంటి వారే, ఈ జీవేశ్వర విచారాన్ని జేసినటువంటివారు అని – చెప్పాలని అన్నారు. అంటే, ఇప్పుడు **"బ్రహ్మము"** జీవుడుగా పరిణామముచెంది ఎలా వుండాడు?

విశ్వబ్రహ్మాండములుగా ఎట్లావుంటాడు? అనేటువంటి విషయాన్ని మనము పరిశీలిస్తాము. ఎందుకంటే :

మనకు బ్రహ్మముయొక్క విషయాన్ని రూఢిగా తెలిసినప్పుడే, సంపూర్ణముగా అది బోధ పడతాది. ఎట్ల వుంటాది ముందు బ్రహ్మము ? బ్రహ్మాండము నిర్ణయము ఏమి అన్నప్పుడు? **"మహాకాశము – పరాకాశము"** అని ఈ "స్వయంభూ బ్రహ్మకు" పేరు. ఇది **"స్వయం ప్రకాశము"** – **ఇదే "ఉత్తమ పురుషుడు". ఇదే "నిజముగా పరమాత్మ స్థానము". దీనికి "స్వయం ప్రకాశ బ్రహ్మమని" – "చేతన బ్రహ్మమని" బ్రహ్మాండానికి పేరు.**

ఇంక, **"దహరాకాశముంది"** – ఇది రెండవది. ఇది **"సమిష్టి అంతఃకర్ణ"** – ఈ సమిష్టి అంతఃకర్ణ బ్రహ్మాండాన్ని నడిపే సంకల్పశక్తి – ఇది **"దహరాకాశము."**

ఇంక, **"నిర్వయువ ఆకాశముంది"** – అంటే, **"సమిష్టి ప్రాణము"** – **"జగత్తుకు ఆధారమైనటువంటి ప్రాణశక్తి".** ఇప్పుడు మన శరీరానికి ఆధారమైన ప్రాణశక్తి ఎట్టిదో, బ్రహ్మాండానికి ఆధారమైనటువంటి ప్రాణశక్తి – ఇది **"అక్షరపురుషుడు".** ఈ దహరా–కాశములోవుండేటువంటి **"సమిష్టి అంతఃకర్ణ – అక్షర పురుషుడు".** ఇది సమిష్టి ప్రాణము – ఇది మనకు బ్రహ్మాండము. యావుది?

(అ) పరాకాశము – మహాకాశము అనేటువంటి పేరుతోవుండే **"స్వయం ప్రకాశ బ్రహము";**

(ఆ) దహరాకాశము అనేటివంటి పేరుతోవుండేటువంటి సమిష్టి అంతఃకరణమే **"అక్షర పురుషుడు" ;**

(ఇ) ఈ నిర్వయువ ఆకాశము అని పేరుతోవుండేటువంటి **"సమీష్టి ప్రాణము";**

**ఈ మూడుయొక్క కలియకకు – ఈ మూటియొక్క పద్ధతికి – బ్రహ్మాండమని పేరు;**

ఇంక మనకు పిండాండములో – సూర్యాకాశము; భూతాకాశము; వాయువు; అగ్ని; జలము; పృథ్వి. ఈ ఆరు భూతములు కలిసి మనకు పిండాండము ఏర్పడివుంది. ఎందుకంటే, "**ఈశ్వరుని శక్తి సూర్యునందు వుండాది**". "**సూర్యుడు**" – "**ఈశ్వరుడు**" అనే పేరుకింద శాస్త్రకారులు నిర్ణయించివుండారు. **ఆ "సౌరకుటుంబమే", మొత్తము భూమండలములో – "సృష్టి"; "స్థితి" "లయాలకు"** కారణము – ఇది **క్షరపురుషుడు,** ఈ ఐదు భూతములతో సృష్టియై, ఈ శరీరానికి ఆధారముగా – గూడుగా పెట్టుకొని, ఇందులో వుండేటువంటి **"జీవునికి క్షరపురుషుడని"** పేరు.

ఇప్పుడు దహరాకాశములో వుండేటివానికి **"అక్షరపురుషుడని"** పేరు. మహాకాశము–పరాకాశమనే పేరుతో వుండేటువంటి "స్వయం ప్రకాశ బ్రహ్మకు – **ఉత్తమపురుషుడని**" పేరు. ఈ పురుషత్రయాలలో – ఇప్పుడు మనము యా స్థానములో వుండామంటే – ఇక్కడ వుండాము – **"క్షరపురుష" స్థానములో**. ఈ క్షరపురుష స్థానమును మనము అవలోకిస్తూ పోతే, మనకు **"అక్షర పురుష"** స్థానము లభ్యమైతుంది. అందుకు, ఇప్పుడు క్షరపురుషుడిలో నిన్ను పేరుజేసి చెప్పేటువంటి విషయాన్ని పంచీకరణ పద్యము ఒక్కటివుంది.

## <u>పంచీకరణ లక్షణము</u>

12. సీ॥ ఆకాశపంచకమంతరింద్రియములు । ప్రాణాదులును వాయుపంచకంబు । జ్ఞానేంద్రియములు వైశ్వానరపంచక । మప్పుపంచకము శబ్దాదులైదు । కర్మేంద్రియములైదు । కడు భూమిపంచకం । బిట్టు లిరువదియై దింద్రియములు । యివి

యాత్మగాదని యిన్నింటిసెరిగెడు । యెరుకయే పరమాత్మయని యెరింగి ॥ గీ ॥ సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు । ముక్తిజెందును మీ పాదభక్తితోను ॥ రమ్య ॥

ఈ ఇరువైదు ఇంద్రియములు ఆత్మగాదని – అంటే నేనుకాదని, ఇన్నిటిన్నీ యెరుగేటువంటి "**యెరుకయే పరమాత్మ స్వరూపమని**" తెలుసుకొని – సాంఖ్యయోగంబు సాధించిన గురుపుత్రుడు ముక్తిపొందును నీ పాదభక్తితోను. ఇప్పుడు ఇంత పంచీకరణ కలగాపులగముగా వున్నప్పుడు, మన స్వరూపము ఎట్లా తెలియబడతాది? అన్నప్పుడు

– మనము బాగ ఆలోచించి చూస్తే – ఇట్లా విభజనచేసి; ప్రతితత్వాన్ని విభజించి; అందులోవుండేటువంటి సారవస్తువుని మాత్రమే మనము తీసుకోవాలి – అప్పుడు దీనియొక్క లక్షణము మనకు బోధపడుతాది.

పెద్దలను ఆశ్రయించి, వాళ్ళ సేవజేసి – సాంఖ్యయోగాన్ని తెలిసికొన్నందుకు ఏమి సిద్ధి కలుగుతాది? అన్నప్పుడు ఇట్లా – "జ్ఞాన మనోబుద్ధి చిత్తాహంకారములు" – **"ఆకాశ పంచకమని;"** "సమాన వ్యాన ఉదాన ప్రాణాపానములనేటువంటివి" – **"వాయుపంచకమని;"** "శ్రోతము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణములనేటివి" – **"అగ్నిపంచకమని;"** "శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనేటివి ఐదు" – **"జలపంచకమని;"** "వాక్కు, పాణి, పాదము, పాయు, ఉపస్థ అనేటువంటివి ఐదు" **"పృథ్వీ పంచకమని;" "ఇవి ఆత్మకాదని", ఇవన్ని "నేను కాదని," "ఇన్నిటిని యెరుగుతూ వుండేటువంటి యెరుకనే పరమాత్మ నేను అని"** సాంఖ్యయోగము సాధించనటువంటి సజ్జనుడు – ఈ విధానము తెసులు కొని ముక్తుడౌతాడని – ఈ పద్యమున సారాంశము.

మరి దీనియందున – మనము ఎలా వుండాము? పిండాండమందు పంచభూతములు ఎట్లా మనము వర్తించుతూ వుండాము? ఇది " **స్తభకము** " అంటారు.

## పిండాండమందు పంచభూతములు

13. సీ॥ జ్ఞానసమానముల్ వీనులుశబ్దంబు । వాగ్వ్యోమయంశముల్ వరుసనాయె । మనసు వ్యానము చర్మమును స్పర్శకరములు । వాయువాంశంబులు వరుసనాయే । రూఢిబుద్ధియు దానరూపాక్షి పాదముల్ । వహ్నియంశంబులు వరుసనాయే । చిత్తంబు ప్రాణంబు జిహ్వాశిశ్నరసంబు వారి యంశంబులు వరుసనాయే ॥ గీ ॥ గంధహంకారముల పానఘ్రాణగుదము । లాయే భూయంశలిట్లు నీమాయవలన ॥ రమ్య ॥.

ఇక్కడ - ఈ **"జ్ఞానము"** కూటస్థుడనే అధిదేవతచేత ప్రేరేపింపబడి - జ్ఞానరూపుడై నాభిస్థానమునందు సమాన వాయువును గూడి - శ్రోత్రేంద్రియము ద్వార శబ్ధములను విని, వాక్కు చేత వచిస్తాడు. ఇది **"ఆకాశతత్వ స్తభకము ".** అంటే, ఆకాశ తత్వముతో నీవు కూడి రోజు జేసేటువంటి పనులు.

ఇదే **"జ్ఞానము"** చంద్రాది దేవత చేత ప్రేరేపింపబడి - మనోరూపుడై - సర్వాంగములయందుండే - వ్యాన వాయువుతోగూడి - త్వగేంద్రియము ద్వారా స్పర్శను గ్రహించి - పాణి ఇంద్రియము చేత ఇచ్చి - పుచ్చుకుంటుంది. అంటే, సకల పనులు చేస్తూవున్నది. ఇది వాయు తత్వముతో నీవు గూడి రోజూ చేసేటువంటి పనులు. ఇది **" వాయుతత్వ స్తభకము ".**

ఇంక - ఆ **"జ్ఞానమే"** - బృహస్పతి అధిదేవత చేత ప్రేరేపింపబడి బుద్ధిరూపుడై - కంఠస్థానమునందు ఉదాన వాయువుతో గూడుకొని - నేత్రేంద్రియము ద్వారా దశవిధ రూపములను చూసి - పాదము చేత గమనాగమనములు చేస్తోవుంటావు. ఇది అగ్ని తత్వముతో గూడుకొని - నీవు రోజు జేసేటువంటి పనులు. ఇది **"అగ్నితత్వ స్తభకము".**

ఈ **"జ్ఞానము"** క్షేత్రజ్ఞాది దేవత చేత ప్రేరేపింపబడి - చిత్తరూపుడై - హృదయ స్థానమందుండే ప్రాణవాయువుతో గూడుకొని - జిహ్వేంద్రియము ద్వారా షడ్ రుచులను గ్రహిస్తూ - ఉపస్థ ఇంద్రియముచేత ఆనందిస్తోవుంటాడు. ఇది నీవు జలతత్వముతో కూడుకొని - నీవు రోజు చేసేటువంటి పనులు. ఇది **" జలతత్వ స్తభకము ".**

ఇదే **"ఈ జ్ఞానమే",** రుద్రాది దేవతచేత ప్రేరేపింపబడి - అహంకార రూపుడై - పాయుస్థానమందుండి అపాన వాయువుతో గూడుకొని - ఘ్రాణేంద్రియము ద్వారా గంధములను గ్రహించి - పాయు ఇంద్రియము చేత విసర్జనచేస్తోవుంటుంది. ఇది నీవు పృథ్వి తత్వముతో కూడుకొని - నీవు రోజు చేసేటువంటి పనులు. ఇది **" పృథ్వితత్వ స్తభకము ".**

ఇట్లా - ఈ 25 ఇంద్రియములతో నీవు ప్రతి రోజూ చేసేటువంటి పనులు. ఈ కర్మబంధానికి లోనయ్యి, దీనినుంచి విడువబడే విధానము తెలియలేక - ఈ వాసన

నశించక "**పునరపి జననం పునరపి మరణం**" అనే పద్ధతి క్రింద భ్రాంతి తెగకుండ - ఇట్లు పుట్టుతూ - చస్తూవుండే స్వభావము దీనికివుంది. అందువల్ల, దీనికి ఎప్పుడైతే, విషయము వున్నది వున్నట్లు అర్థమైతాదో - అప్పుడు దీనినించి విడుబడేదానికి వీలవుతుంది.

ఇంక ఈ శరీరములో - ఈ 25 ఇంద్రియములును నివశించే గోళకాలు చెప్పుకున్నాము కదా - అందులో, పంచభూతాలయొక్క గుణాలు ప్రస్ఫుటంగా కనబడే టువంటి వస్తువులు - ఈ దేహముమీద ఎట్లావుంటాయి? అన్నప్పుడు :

## పంచభూతాంశ గుణములు

**14.** సీ॥ నరములస్థులు చర్మ నఖ రోమ మాంసముల్ । భూగుణంబులు స్వేదమూత్రశ్లేష్మ । ములు శుక్లశోణితంబులు జలగుణములు । క్షుత్పిపాసాలస్య సుషుప్తిసంగమములు వహ్నిగుణములు చలనధావనకంప । నా కుంచన ప్రసరణాధికములు । పవనాది గుణములు భయకామమోహముల్ । క్రోధ లజ్జయు నభోగుణములిట్టి ॥ గీ ॥ పంచభూతాంశ గుణములు బారదోలి । నీ స్వరూపంబు గనువాడు నిర్మలుండు ॥ రమ్య॥

" **నరములస్థులు చర్మ నఖ రోమ మాంసముల్ । భూగుణంబులు** " - ఇప్పుడు మనకు కఠిన పదార్థము - పృథ్వితత్వము ఈ శరీరములో ఎట్లావుంది? అంటే - నరములు, ఎముకలు, చర్మము, గోళ్ళు, వెంట్రుకలు మాంసము; ఇవన్ని కఠిన పదార్థాలు కాబట్టి, ఇవి **"పృథ్వి తత్వము"** - ఖచ్చితముగా భూతత్వమంటే, ఎట్లావుంది? అన్నప్పుడు - ఇది స్థూలపదార్థముగావుంది. "**స్వేదమూత్రశ్లేష్మములు - శుక్లశోణి తంబులు జలగుణములు**" అంటే - స్వేదము, మూత్రము, శ్లేష్మము, శుక్లము, శ్రోణితములు - అనేటువంటివి **"జలగుణములు"** - ఇవన్ని ద్రవపదార్థాలు. ఈ శరీరములో, ప్రవహించేటువంటి జలము ఇది - ఇట్లా జలతత్వము మనయందున వున్నది. ఇంక - " **క్షుత్పిపాసాలస్య సుషుప్తిసంగమములు** " - ఆకలి, దప్పిక, ఆలస్య, నిద్ర, సంగమము - అనేటువంటివి ఐదు - **"అగ్నితత్వము"** తో పుట్టినటువంటివి. అగ్ని ఉష్ణముగా ఈ తత్వాలన్ని ప్రస్ఫుటముగా తెలియజేస్తాది. ఇంక " **చలనధావనకంపనా కుంచన ప్రసరణాధికములు పవనాది గుణములు** " - కదులుట,

తిరుగుట, నడుచుట, చాచుట, ముడుచుట – అనేటువంటి శరీర ప్రక్రియలు ఏవైతే మనలోన్నీ జరుగుతావుండాయో – ఇవన్నీ కూడా మనకు **"వాయు తత్వగుణ ములు."** ఇంక "**భయకామమొహముల్ క్రోధ లజ్జయు నభోగుణములు** " – భయము, కామము, మోహము, క్రోధము, లజ్జ అనేటువంటి – ఇవన్నీ శూన్యపద్ధతియే. భయము వచ్చినా, హృదయము శూన్యమైతాది; కామము వచ్చినా, హృదయము శూన్యమైతాది; మోహము వచ్చినా, హృదయము శూన్యమైతాది; కోపము వచ్చినా, హృదయము శూన్యమైతాది, లజ్జవచ్చిన కూడ హృదయము శూన్యమైతాది – ఇవన్ని కూడ "**ఆకాశ తత్వాలు**" మనకు బాగ కనబడతాయి. అందుకు "భయ కామ మోహ క్రోధ లజ్జయు నభోగుణములు" ఇట్లు " **పంచభూతాంశ గుణముల బారద్రోలి, నీ స్వరూపంబు గనువాడు నిర్మలుండు** ". ఈ అన్ని కూడ, ఏ ఏ భూతగుణము, ఆ భూతానికి తెలుసుకొని – "**ఇవి నావి కాదు**" – ఇవి ఫలాని భూతానివి అని ఎవడైతే – దాన్ని విచారించి విడిచిపెడతాడో – వాడు "**నిర్మలుడు**" అయితాడు.

ఇప్పుడు – స్థూల పదార్థమంతా పృథ్వీతత్వానిది; ద్రవపదార్థమంత జలతత్వముది; శూన్య పదార్థమంత ఆకాశతత్వముదని – ఏ భూతగుణములను – ఆ భూతానికి పంచిపెట్టితే, నీవు ఎట్లైతావు? అంటే! "**నిర్మలుడవుతావు**". అందుకు, **"నిన్ను నిర్మలుడుగా – చేసేనిమిత్తమై వేదాంతప్రక్రియయె – ఇంతగా కష్టపడ్డాడు."** ఏదో వున్న కాడికి వుండి – బ్రతికిన కాటికి బ్రతికి – చచ్చిన కాటికి చావు అని అంటే, ఇదంతా ఏమి అక్కరలేదు. కానీ... విజ్ఞాన దృష్టితో "**నీయొక్క స్వరూపాన్ని**" – బాగ తెలుసుకోవాలంటే – ఈ విధముగా వుండక తప్పదు.

ఇంక తర్వాత – ఇది ఎన్ని పంచకోశములుయొక్క లక్షణాలు? ఎట్ల అయింది? అనేది దీనికి మనకు బాగ తెలియబడతాది. ఈ ఐదు శరీరములయొక్క సాంఖ్యము కూడ, దీనియందున వున్నది. ఇప్పుడు మనము, బ్రహ్మాండ సృష్టి, పిండాండ సృష్టి చెప్పుకొనివుండాము. ఇది పరిణామము చెందుతా చెందుతా – ఎట్ల వచ్చిందనేదానికి

మనము నిదానముగా అర్థముచేసుకొంటే - బాగ తెలియబడతాది. ఇంక పంచ కోశములుయొక్క నిర్ణయము.

## పంచకోశముల నిర్ణయము

15. సీ॥ అన్నరసంబుతోనైన శోణితశుక్లమయమైన ఈ దేహమన్న మయము । పంచప్రాణంబులు ప్రబలి కర్మేంద్రియ పంచకంబునుగూడి ప్రాణమయము । జ్ఞానేంద్రియములైదు మానసంబొక్కటి కూడియైనది మనః కోశమయము । వెలగి జ్ఞానేంద్రియంబులు బుద్ధియునుగూడి విజ్ఞానమయము । యవిద్యయందు ॥ గీ ॥ మనసుగలసిన యానందమయము లిట్లు పంచకోశంబులకు సాక్షిపరుడువీవె ॥ రమ్య ॥

అని మనకు కోశాలు చెప్పినారు. కోశమంటే, మనకు అర్థమైవుంటాది - కత్తిని దాచేదాన్ని కోశమంటారు; ధాన్యమును దాచేదాన్ని - కోశమంటారు; ధనమును దాచేదాన్ని కోశమంటారు; - అట్లా **"నేను"** అనేటువంటి, " **ఆత్మను** " దాచినటువంటి కోశాలు ఏవి? మరి, ఆ కోశములకు - అది విలక్షణముగా వున్నదా ! ఇది కలిసివుందా ! అనేదాన్ని, మనము బాగ విచారించి చూస్తే, మనకి పంచకోశ వివేకము బాగ అర్థమైతాది.

1. **అన్నమయకోశము** :- అన్నరసముతో పుట్టి, అన్నరసముతోనే జీవించి - బ్రతికినన్నాళ్ళు, తర్వాత **"అన్నరూపమైన పృథ్వీలో మన్నుగా మారిపోయే"** - భాగమంత మ నకు అన్నమయకోశము - ఇది **"అన్నమయకోశము."**

2. **ప్రాణమయకోశము** :- ఇంక, పంచ ప్రాణములు మనస్సుతో- జీవునితో కూడితే - ప్రాణమయకోశము. అంటే, కేవలము ప్రాణమే - ఒక కోశముగావుంది మనకు - **"ఆత్మకు".** అందుకు, అన్నమయకోశాన్ని నడిపించాలంటే, ప్రాణమయకోశము కావాలి. అన్నమయకోశము జడముగనుక - జడమైన శరీరాన్ని కదలించాలన్నా - దాన్ని లేపాలన్నా, శక్తివంతమైన ప్రాణమువుండితీరాలి. అందువల్ల, ప్రాణమయకోశమైంది. "పంచ ప్రాణములు - కర్మేంద్రియములు కలిసి" మనకు **"ప్రాణమయకోశమైంది."**

3. <u>మనోమయ కోశము</u> :- ఇంక, "జ్ఞానేంద్రియములు - మనస్సు" కలిసి - మనోమయకోశమైంది. జ్ఞానేంద్రియములతో, మనస్సు కలిసినప్పుడే, సంకల్ప - వికల్పాలు ఎక్కువ చేస్తుంది. అందువల్ల, ఇది **"మనోమయకోశము."** ఈ మనోమయకోశమే, రెండు కోశాలు - ఈ ప్రక్క రెండు కోశాలు - ఆ ప్రక్క రెండు కోశాలు పెట్టుకొని - అది మహామయమైనటువంటి కోశమై కూర్చుంది. ఈ మనోమయకోశములోనే, మనకు సర్వ భ్రాంతులు, సకల సంసారాలు, సకల జన్మలు - అనేక జన్మలయొక్క సంస్కారాలు; వాసనలు - అన్ని, దీనియందునే, నిక్షిప్తమైయుండాయి. ఈ కోశమును, మనము - ఈ ప్రపంచ విషయాలన్నీ, వేసి వేసి భర్తీజేసినాము. ఈ కోశము, సంపూర్ణముగా, ఖాలి అయ్యేవరకూ **"పరమార్థము మనసుకు పట్టదు".** అందుకే, ఈ కోశములో - దేవతా ప్రార్థనలు; అనేక శాస్త్ర వాసనలు; అనేక లోకవాసనలు; అనేకమైనటువంటి కర్మవాసనలన్ని - దీనియందే, నిండి-నిబిడీకృతముగా వుండాయి కాబట్టి, ఈ కోశమును మనము ఖాలి చేసేదానికి మొదలుపెడితే, ఒకటి తీయపోతె, మరల ఒకటి వస్తానేవుంటాది - ఇసుకపాతర తీసినట్లు. అందువల్ల, మనము దీన్ని - చక్కగా, బాగా, ఆలోచించి, ఈ ఒక్క మనోమయకోశాన్ని విచారించి, ముందరికి పోవాలి. అందుకు, ఈ అన్నమయ, ప్రాణమయ కోశాలన్ని - రెండింటిని నడిపించాలంటే, మనోమయ కోశమువుండాలి. మనోమయకోశము లేకపోతే - జీవన విధానమే, వుండదు. కాబట్టి, ఈ **"మనోమయకోశము - జ్ఞానేంద్రియ సమూహము - మనస్సు కలిసి అయింది."** ఇంక, ఈ కోశము - కేవలము, నిరంతరమూ - ఎడతెరపి లేకుండ - సంకల్పవికల్పాలు చేసేదే తప్ప - దీనికి నిర్ణయించే గుణమువుండదు కాబట్టి - దీన్ని నడిపించేదానికి, దీన్ని భరించేదానికి - ఇంకొక్క కోశము కావల్సివచ్చింది - అదే, **"విజ్ఞానమయకోశము".**

4. <u>విజ్ఞానమయకోశము</u> :- **"జ్ఞానేంద్రియములు - బుద్ధి"** కలిసి అయినటువంటి కోశమే, **"విజ్ఞానమయకోశము".** ఈ నాడు, మానవుడు ఎక్కువగా ఉపయోగించుకొని - సృష్టినంత తనకు అనుకూలముగా - ఇన్ని సౌకర్యాలుగా మార్చుకోగలుగుతా వున్నాడు. అట్లనే, **"అనాదిగా వచ్చేటువంటి జీవునికి - అనుభవ జ్ఞానాన్ని పెంచి, ఆత్మస్వరూప స్థితినిజేసి, భ్రాంతిరహితము చెయ్యాలన్నా కూడ, ఈ విజ్ఞానమయకోశమే, అవసరము".**

5. <u>ఆనందమయకోశము</u> :- ఇంక, ఆనందమయకోశము - మనస్సు మనకు రాత్రి పండుకొన్నప్పుడు, అవిద్యయందు లీనమైనప్పుడు, ఈ లోకములో ఏ విషయముతో పొందని ఆనందము - మనము నిద్రలోపొందుతాము. అంటే, " **ఆనందమయకోశము** ". కాని, ఇక్కడ **"బ్రహ్మజ్ఞానాన్ని"** అనుసరించి - విచారించి చూస్తే, దేహేంద్రియ ప్రపంచము - దుఃఖమునకు మూలకారణమైన, జనన మరణములకు కారణమైనటువంటి - ఈ విషయాలన్ని **"నేను కాదని",** తీసివేసినప్పుడే - **"తాను అఖండ చైతన్యపరమాత్మ స్వరూపముగా"** మారినప్పుడు ఆ కలిగేటువంటి ఆనందమే, **"నిజమైన ఆనందమయకోశము".** ఈ విద్యాకోశాన్ని - ఈ విచారణ అనేటువంటి కోశాన్ని, ఎప్పుడైతే మనము దర్శిస్తామో, అక్కడ - ఇది సుఖముగావుంటాది. ఇప్పుడు, మనకు - **అన్నమయకోశము; ప్రాణమయకోశము; మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము** అనేటువంటి ఐదు కోశాల లోపల - ఈ ఐదు కోశముల రూపము, నీవే ధరించి - ఐదు కోశములకూ, **"సాక్షివై"** - అన్నిటిని తెలిసికొంటూవుండావు కాబట్టి, పంచకోశములకు విలక్షణపరుడు నీవు. అంటే, ఈ ఐదు కోశములు, నాకే తెలియబడుతావున్నవి, నేను వాటిని తెలిసికొంటూవుంటాను కాబట్టి - తెలియబడే వస్తువులను తెలుసుకొనేవానికి, ఎప్పుడు - దృశ్యములుగనుక, నా చేత - అవి దృశ్యములుగా వున్నాయిగనుక, " **నేను చైతన్యరూపమైన వస్తువును** " - అవి జడపదార్థాలు. అవి నన్ను ఎరుగలేవు, వాటిని నేను మాత్రమే, ఎరుగుతువుండాను - అనేటువంటియొక్క జ్ఞానము ఎప్పుడు వస్తాదో, అప్పుడు మనకు - ఈ పంచకోశములయొక్క లక్షణము తెలియబడతాది. ఇంక పంచప్రాణములయొక్క లక్షణములను చెప్పుతూవున్నారు:

# పంచప్రాణముల నిర్ణయము

16. సీ ॥ ప్రాణుండు హృదయాబ్జ పదమందువాసమై నాణెపుశ్వాసముల్ నడుపుచుండు । పాయు పస్థలయందపానుండు మలమూత్రముల విసర్జన జేసి మెలగియుండు । నాభియందు సమానము యుండి సమముగా నాళ్ళ నన్నింటిని నడుపుచుండు । ఘనయుదానుండును కంఠమందుననుండి నలపైఖరీపలుకులు బలుకజేయు ॥ గీ ॥ వ్యానపవనంబు దేహసర్వాంగములను నిండి శీతోష్ణస్పర్శల నెరుగజేయు ॥ రమ్య ॥

ఇవి మనకు పంచప్రాణాలు చేసేటువంటి పనులు:

1. <u>సమానవాయువు</u> :- సమానవాయువు నాభిస్థానములోవుండి, తినిన ఆహారమును పచనము చేసి డెబ్బది రెండు వేలు (72,000) నాడులకూ, రసాన్ని పంపిస్తాది. సూక్ష్మరసాన్ని మనోబుద్ధులకు, ఇది బలముగా ఇస్తాది _ ఇది చేసేటువంటి పని. "**జయుడు**" – దీనికి అధిపతి.

2. <u>వ్యానవాయువు</u> :- వ్యానవాయువు – సర్వాంగములోవుండి – శీతోష్ణస్పర్శలను ఎరుగుతూవుంటుంది (దీనిపని). దీనికి – "**విశ్వయోని**" అధిదేవత.

3. <u>ఉదానవాయువు</u> :- ఇంక, ఉదానవాయువు – కంఠస్థానమునందుండి, వైఖరిపలుకలను పలుకించడము, అన్నపానాదులను లోపలికి మింగేటట్లు చేయడము, కఫము ఏమన్న చుట్టుకొంటే, బైటికి నెట్టేయడము పని చేస్తుంది. దీనికి "**అజుడు**" అధిపతి.

4. <u>ప్రాణవాయువు</u> :- ప్రాణవాయువు హృదయమునందుండి – దినమునకు 21,600 సార్లు – హంసరూపంలో, అంతర్బాహ్యములకు నడుస్తూ, బ్రహ్మాండములో వుండిన శక్తిని – పిండాండమునకు చేరవేస్తూ, పిండాండములోవుండే, అపానవాయువును బ్రహ్మాండమునకు విడుస్తూ – ఇట్లు, దినమునకు 21,600 చొప్పున తిరుగుతుంది. దీనికి "**విశిష్టుడు**" అధిపతి.

5. <u>అపానవాయువు</u> :- ఇంక, పాయు-ఉపస్థలయందుండి - మలమూత్ర-శుక్ల శ్రోణితములను విసర్జన చేస్తూ, ఇది ఋతు చక్రమును క్రమముగా నడిపించే శక్తి దీనికివుంది. దీనికి "విశ్వకర్త" అధిదేవత.

ఇంక - ఉపవాయువులువున్నాయి - దీంట్లో, ఈ రకముగా పంచ ప్రాణాలు నడేచే టప్పుడు - 12 అంగుళాల ప్రమాణ బలముతో, బైటికివెళ్ళి - 4 అంగుళాల ప్రమాణము నశించి, 8 అంగుళాల ప్రమాణము లోపలికి పోతుంది కాబట్టి, ప్రతిరోజూ కూడ - 3 ఇంట 1 భాగము లయమైతావుంటుంది. " **హంస** " 21,600 హంసలు తిరిగే, ఈ శరీరములో - 7,200 హంసల (శ్వాసలు) ప్రమాణము లయమై, మనకు కేవలము 14,400 హంసలు బలము మిగులుతాది కాబట్టి - ప్రతి రోజుకూ బలము తగ్గుతూ వస్తాది. అందుకు, ఈ హంసను వాడుకొనే విధానాన్ని, మన పెద్దలు గమనించి తారకయోగముచేసి - కుంభకయోగముచేత హంసలు ఎక్కువగా ఖర్చుకాకోకుండ, శరీరము రోగభూయిష్టము కాకోకుండ బాగ నడిపించి - వందల సంవత్సరాలవరకూ బ్రతికేవారు. ఎందుకంటే, మనకు పరుగులు తీస్తే - మనకు ఎక్కువ శ్వాసలు ఖర్చైతాయి; పని ఎక్కువచేసి బరువు మోసిన - మనకు ఎక్కువ శ్వాసలు ఖర్చైతాయి. మరి ఎట్ల వుండాలి? - సజావుగా, ప్రశాంతముగా ఎప్పడువుంటామో, అప్పుడు శ్వాసలు మిగులుతాయి. ఎందుకంటే, ఈ ప్రపంచము మల్లా మల్లా అనుకొనేపుడంతా రాదు కదా! అందువల్ల, వచ్చిన శరీరమును - ఇంక కొంచెము కాలము నిలుపుకొని - ఈ ప్రపంచాన్ని, అనుభవించాలి అనేటువంటి ఉద్దేశముచేత - ఈ వాయువుని నియంత్రించి, ఆయుష్షను పెంచుకొనేటువంటివారు. అట్లనే, మనకు ఉపవాయువులు వుండాయి.

## <u>ఉపవాయువులు</u>

17. సీ ॥ నాగుండు యుద్గారణంబు చేయించును । మేలుగా కూర్మడు న్మీలనంబు । చేయించు కృకురుండు చేరితుమ్మించును । జితదేవదత్తుండు జ్రుంభణంబు । మరణ దేహములందు మరిగి ధనంజయుండతి శోషబుట్టించి యణగజేయు । ఘనముగా అంతర్యామియును ప్రపంచకుడను వాయువుల్ నరునకు వాహనముగ ॥ గీ ॥ యుండు వజ్రుండు ముఖ్యుండు యొనరుగాను । కీళ్ళు కీళ్ళందునుండును చీలపగది ॥ రమ్య ॥ .

**నాగవాయువు** అనేటువంటిది మనకు వళ్ళంతా వాయుభూతము - పాములాంటిది అది - ఆవలింతలు చేపిస్తుంది; ఆవలింతలు చేసే వాయువు అది; **కూర్మడు** - ఉన్మీతము చేయిస్తాడు - కన్నులు తెరపిస్తాడు; **కృకురువాయువు** - తుమ్మునట్లు చేస్తాడు; దేవదత్తుడనే వాయువు - ఒడలు నీల్గేలా చేస్తాడు; వల్లంత మజ్జు అయినప్పుడు - విరుచుకుంటాడు. **ధనంజయుడు** - చచ్చిన దేహమును పాసచేసి - దాన్ని నాశనముచేసి - పొట్టపగలకొట్టి, అప్పుడు బైటకు పోతాది. **అంతర్యామి - ప్రపంచికుడు** - అసే వాయువు లోపలికి - బైటకు తిరుగుతావుంటాడు. **వజ్రుడు -ముఖ్యుడు** అనేటువంటివాడు - కీళ్ళ కీళ్ళలయందున చీల మాదిరివుంటాడు.

ఇట్లా - మనకు, ఉపవాయువులన్ని కలిసి - 14 పని చేస్తావుంటాయి. ఇట్లా, పని చేస్తూ చేస్తూ వచ్చినటువంటి విషయాన్ని, మానవుడు అనుభవిస్తూ - అంటే, "ఘటశోధన చేయకుండ - తన స్థితి ఏమో? తన గతి ఏమో? ఆలోచన చేసుకోకుండ; ఏదో - ఇంత అన్నపానాలు; గూడు; గుడ్డ; కూడు - సంపాదించుకొంటే - జీవనము చాలులే, అన్నట్లుగా - మరి, కేవలము ఆహారముకోసరమె అన్ని జీవులు బ్రతికినట్లే మానవుడు కూడ, బ్రతికి చెడిపోవడము ధర్మము కాదని," **"పెద్దలు - నీ నిజ స్వరూపమైనటువంటి ఆత్మ తత్వాన్ని"** - అర్థముచేసుకోమని - మనకు, ఈ విషయాలన్ని తెలియజేస్తువుండారు. ఇంక సప్తధాతువులు.

## సప్తధాతువుల లక్షణము

**18. సీ॥ మరి రసరుధిరముల్ మాంసము మేధస్సు మజ్జాస్థిరేతముల్ మానితముగ । నివిసప్తధాతువుల్ నిబిడీకృతంబుగా దేహికావరణమై దేహమాయె । పాదాది మస్తక పర్యంతమును నిండి । ప్రకృతి భేదంబుల ప్రబలమాయె । స్థూలమై దీర్ఘమై సూక్ష్మమై నటియించి సెందెందు మరణంబు నొందుచుండు ॥గీ॥ నిట్టి దేహంబులందాసలేమిలేక । నిన్నుగనువాడు ముని జనసన్నితుండు ॥ రమ్య ॥**

ఇంక - ఇవన్ని పంచప్రాణాలు, ఉపవాయువులన్ని పనిచేస్తే; ఇవి ఇక్కడ మనకు ఎలా పనిజరుగుతూవుంది, ఈ శరీరములో? అంటే, ధాతువులు ఏడుగా

మారుతూవుండాయి – ఎలాగంటే? అన్నము – రసమై; రసము – రుధిరమై; రుధిరము – మాంసమై; మాంసము – మేధస్సై; మేధస్సు – మజ్జయై; మజ్జ – అస్థియై; అస్థి – రేతస్సై (శుక్లమై) – ఈ జీవునికి ఆవరణమై; ఈ శరీరము పుట్టుతూవుంది. అంటే, ఇది ఏంది? రస రూపము మరణించి – రుధిరము; రుధిర రూపము మరణించి మాంసము; ఇట్లా అందందు మరణము చెందుతాడు. ఒక చోట – స్థూలముగాయై; ఒక చోట దీర్ఘముగాయై; ఒక చోట – సన్నమై; అలా నటన చేసుకుంటూ – ఈ శరీరములో, మార్పుచెందుతూ వస్తాది. ఇది సప్తధాతువులను తయారుచేస్తాది. తయారుచేసి, మళ్ల – ఇందులోవున్నటువంటి జీవునికి, మళ్ళీ ఆవరణాలై, శరీరాన్ని తయారుచేసి ఇస్తాది. ఇదే బీజరూపముగావస్తాది. అందుకే, వృక్షము బీజమెట్లైతాది? బీజము వృక్షము ఎట్లైతాదంటే – ఇక్కడ బాగ మనకు తెలియబడతాది. ఎట్లా తెలియబడతాదంటే! ఇదిగో – పైనచెప్పినటువంటి రకముగ.

ఇట్ల తెలియబడిన తర్వాత, ఇప్పుడు – తండ్రి గర్భమునింక వచ్చి, వృక్షము తయారైంది. మల్లా – ఇక్కడనుండ మల్లా – బీజము తయారుచేస్తాది. అదే బీజమునుండి – వృక్షము-బీజము తయారైతాది. ఇట్లా దేహికి ఆవరణమై దేహమైతావుంది కాబట్టి – ఈ దేహ పరిణామము, ఇన్ని రకములుగా వస్తావుందని తెలిసికొన్నప్పుడు **"మానవుడు, ఇవి విడిచిపెట్టి – నిన్ను నిజగురురూపముగా తెలిసికొన్నప్పుడు, గురువుయొక్క కరుణచేత, నీ స్వరూపాన్ని, నీవు తెలిసికొన్నప్పుడు" "మునిజన సన్నితుండు" – "మునులు అంటే మననశీలురు – ఆత్మను గురించి – పరమాత్మ గురించి ఆలోచించేవారు – వారికి – ఇది కనబడతాది."** వాళ్ళకు తెలియబడతాది కాబట్టి – వాళ్ళు మునిజన సన్నిహితులు – **"మునులుచేత స్తుతింప తగినవారు". "ఆత్మను"** గురించి విచారించేవాడు, ఎప్పుడూ గూడ **"గొప్పవాడే"** ఇదీ విషయము. దేహికి ఆవరణమై – దేహమాయ అనే విషయములో, మనము సప్తధాతువుల ఆవరణరూపమైన శరీరము ఎట్లైందో విన్నాము. ఇంక శరీర త్రయము:

## శరీరత్రయము

19. సీ॥ జ్ఞానేంద్రియంబులు కర్మేంద్రియములంత । రింద్రియంబులు విషయేంద్రియములు । ప్రాణాదులును గూడి పరగనిరువదియైదు । తత్వంబులును స్థూల తనువునయ్యె । బాహ్యేంద్రియంబులు పదిప్రాణములునైదు । ధీమనంబులు సూక్ష్మదేహమయ్యె । ఈ శరీరద్వయ హేతుకానాద్య విద్యావృతమై కారణాంగమయ్యె ॥ గీ ॥ మూడు దేహంబులకు నాదిమూలమైన । క్షరున కక్షరునకు విలక్షణుడవీవె ॥రమ్య॥

ఇంక - అంతరింద్రియములు, ప్రాణేంద్రియములు, జ్ఞానేంద్రియములు, విషయేంద్రియములు, కర్మేంద్రియములు - ఈ 25 ఇంద్రియములు కలిసి, **"స్థూలశరీరమయింది"** - అంటే, జాగ్రతావస్థ అయింది. అట్లనే, జ్ఞానేంద్రియములు ఐదు; కర్మేంద్రియములు ఐదు; పంచప్రాణములు; మనస్సు - బుద్ధి కలిసి; ఈ 17 తత్వములతో **"సూక్ష్మశరీరమయింది"** అట్లే, ఈ రెండు శరీరములో, అనాది-అవిద్య ఆవరణమైవుండేటువంటిది **"కారణ శరీరము"** మూడోది. ఈ మూడు శరీరములు కలిసి - మనకు జీవన విధానము నడుస్తూవుంది. ఈ మూడు శరీరముల లోపలనే, మనము జీవన విధానమంత తెలిసికొంటూవుండాము. మరి, ఈ మూడు శరీరములు ఎవరికి తెలియబడతున్నాయంటె? **"నేను అనే ఆత్మచేత"** ఈ మూడు శరీరాలు తెలియబడతున్నాయి. ఈ మూడు శరీరములకూ, నీవు విలక్షణమైనటువంటి **"ఆత్మ స్వరూపమైనావు"**. అందువల్ల, విలక్షణమైనటువంటి **" ఆత్మ "** అన్నిటిని తెలిసికుండేటువంటి **"జ్ఞాన స్వరూపమైవున్నది"** గాని, ఈ 25 ఇంద్రియములు చేత - ఏదాని చేతా - తాను తెలియబడకవున్నది. అందుకే, **"ఇది ఆత్మ తత్వము"**. అన్నిటినీ ఇది తెలుసుకోవలిసినదే కాని, దీన్ని తెలుసుకొనేటువంటిది లేదు అని - శృతులు ఏమి చెప్పినాయంటే? **"యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సః "** - ఎక్కడ వాక్కు, చూపు, మనస్సు - తెలుసుకోలేక; వెనక్కు తిరుగుతున్నవో - అది **"ఆత్మ స్వరూపమైనటువంటిది"**. ఈ 25 ఇంద్రియములు - 17 ఇంద్రియములు - ఈ అవిద్య అనేటువంటిది - **"ఆవరణ"**. ఈ మూడు కూడ, నీకే తెలియ

బడుతూవుండాయి కాబట్టి, "నీవు వీటికి విలక్షణుడవు". ఇంక చతుర్ద శేంద్రియములు.

## చతుర్దశేంద్రియ విషయములు

ఇంక - చతుర్దశేంద్రియ విషయములు, ఈ 14 ఇంద్రియములకు విషయాలు ఏవి? వీటికి అధిదేవతలు ఎవరైవుంటారనే విషయాలు తెలియజేస్తారు;

**20.** సీ॥ శబ్దంబు చెవులకు స్పర్శచర్మంబున । కక్షికిరూపు జిహ్వకు రసంబు । ముక్కుకు గంధంబు వాక్కుకు వచనంబు । కరములకు దానంబు చరణములకు । గమనంబు గుదమునకు గలిగి విసర్జన । గుహ్యము కానందగుణముగల్గు । మనసు చలించును మతినిశ్చయించును । చిత్తంబు చింతించు మొత్తముగను ॥ గీ ॥ మరియహంకారమున కభిమానపడును । నిన్ని టెరిగిన తెలివి దానెరుగవలయు ॥ రమ్య ॥.

<u>జ్ఞానేంద్రియముల విషయాలు</u> :- చెవులకు శబ్దము వినడము; చర్మానికి స్పర్శనెరుగడము; కన్నులకు రూపము చూడడము; జిహ్వకు రుచులను గమనించడం; ఘ్రాణమునకు వాసన చూడడము (ముక్కుకు).

<u>కర్మేంద్రియ విషయాలు</u> :- వాక్కుకు వచించడము; చేతులకు పనులు చేయడం; పాదములకు గమనాగమనములు చేయడం; గుహ్యమునకు ఆనందించడము; గుదమునకు విసర్జన చేయడం;

<u>అంతరేంద్రియముల విషయాలు</u> :- మనస్సు సంకల్ప వికల్పముల చేత చలించును; బుద్ధి నిర్ణయాలు చేయును; చిత్తము చింతన చేయును; అహంకారము అభిమానపడును.

ఇంక, మనకు - జీవునికి చతుర్దశలోకములలో, జీవుని సంచారముపుంటాదని పురాణములో చెప్పారు. అంటే, కథరూపములో ఎందుకు చెప్పవల్సివచ్చిందంటే? ఆ కథ రూపమైతే - వినేదానికి బాగ ఇంపుగావుంటాది. అజ్ఞానులకు కూడ, ఆశ

కలుగుతాదని కథరూపములో తెలియచెప్పినారు. ఇప్పుడు, **"జీవుడు"** అనేటువంటి ఈ **"అహం పదార్థము"** తనను తాను మరిచి, జీవస్వరూపమును ధరించినాక ఇది, ఈ 14 ఇంద్రియములలోనే, సంచారమువుంటుంది. అంటే – మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము; అట్లే, జ్ఞానేంద్రియములు – కర్మేంద్రియములు. ఈ ఒక్క, 14 లోకములే – దీనికి గమనము. ఉదయము నిద్రలేసిననుండి – మరి, రాత్రి పండుకునేవరకూ – ఈ చతుర్దశేంద్రియాల లోపలనే, దీని యొక్క సంచారమంత నిలచివుంటాది. అందుకు, ఈ చతుర్దశేంద్రియాలకూ కూడ – దేవతల పేరు చెప్పుతూ; అవస్థలను చెప్పి, ఈ ఐదు శరీరాలయొక్క **"సాంఖ్యము"** ను తెలియజేసుకొందాము. ఇప్పుడు చతుర్దశేంద్రియాది దేవతలను చెప్పుతూవున్నారు.

## <u>చతుర్దశేంద్రియాది దేవతలు</u>

**21.** సీ॥ శ్రవణంబులకును దిక్చర్మంబునకు వాయు । చక్షువులకు జగచ్చక్షు వరుణు । డును జిహ్వకును ఘ్రాణమున కశ్వినీసురుల్ । వాగింద్రియమునకు వహ్నిహస్త । ములకు నింద్రుడు పాదములకు నుపేంద్రుడు । గుదమునకు మృత్యువు గుహ్యమునకు । చతురాననుడు మానసమునకు చంద్రుడు । బుద్ధికిపరమేష్టి శుద్ధచిత్త ॥గీ॥ మునకు జీవుడంహంకారమునకు శివుడు । తెలియవలే నీచతుర్దశ దేవతలను ॥ రమ్య ॥ .

ఈ, 14 లోకాలకు – ఈ 14 మంది దేవతలు. 14 మంది దేవతలే, 14 ఇంద్రియాలను పరిపాలించేటువంటి కర్తలు అన్నమాట. అందుకు, ఇప్పుడు ఎట్లా – మనస్సుకు – చంద్రుడు; బుద్ధికి – బృహస్పతి; చిత్తమునకు – క్షేత్రజ్ఞుడు; అంహకారమునకు రుద్రుడు; శ్రోత్రములకు – అష్టదిక్పాలకులు; త్వక్కుకు – వాయువు; నేత్రములకు –సూర్యుడు; జిహ్వకు – వరుణుడు; ఘ్రాణమునకు – అశ్వినీ సురులు; వాక్కుకు – అగ్ని; పాణికి – ఇంద్రుడు; పాదములకు – విష్ణువు (ఉపేంద్రుడు); – ఉపేంద్రుడు అంటే విష్ణువు. ఉపేంద్రుడు అనే పదము ఎందుకు వచ్చిందంటే, ఇంద్రునికి తమ్ముడుగా పుట్టినాడు కాబట్టి – ఉపేంద్రుడు అని పేరు. వామనునకు ఉపేంద్రుడు అనే పేరు కూడా వచ్చినది. రాక్షసులచేత, బలిచక్రవర్తిచేత – పతనమై బాధపడుతూవుంటే, మళ్ళీ – వాళ్ళ తల్లికి, ఈయన కొడుకై పుట్టి (వామనుడు) –

అందుకు పుట్టినాడు కాబట్టి ఉపేంద్రుడు. విష్ణువుకు, ఏమి పేరు అంటే? ఇంద్రునికి సమానముగా పుట్టినాడు కాబట్టి - ఉపేంద్రుడు అనే పేరు వస్తుంది. అందువల్ల, పాదములకు ఉపేంద్రుడు - విష్ణువు. ఇంక - గుహ్యమునకు - బ్రహ్మ; గుదమునకు - మృత్యువు. ఈ రకముగా, మనకు చతుర్దశేంద్రియాలకు దేవతలు పుట్టినారు. ఈ లోకాలకు పోతాడు "జీవుడు". అక్కడవుండేటువంటి సుఖ-దుఃఖాలు; నరకాన్ని అనుభవిస్తాడు; స్వర్గాన్ని అనుభవిస్తాడని కథలరూపములలో చెప్పేదానికి కారణమేమి అంటే ఇదే! ఈ 14 లోకాలు రోజు తిరుగవల్సిందే. ఈ లోకాలనే, మనము అర్థము చేసుకోవాలి. ఇంక అవస్థల వివరము తెలుసుకుందాము.

## జాగ్రదావస్థ

22. సీ|| పంచవింశతితత్వ పరిపూర్ణమైనట్టి । స్థూలదేహమునందు సురుచిరముగ రసస్పర్శలును రూప రసగంధవచన దా । న గమనో త్సర్గానందములను మానసహంకార మతి చిత్తముల గూడి । జీవుడు ముఖమున జేరి నిలిచి । విశ్వనామముజెంది పెర్వేరె విభజించి । సకల వ్యాపారముల్ సలుపుచుండు || గీ || నదియు జాగ్రదావస్థయు ననుదినంబు । జనితమై జనుచుండు జన్మరహిత || రమ్య ||.

25 తత్వములు పరిపూర్ణముగావుండే, ఈ అవస్థలో - "జీవుడు ముఖమును", ఆస్థానముగా జేసుకొని, జాగ్రదావస్థను అనుభవిస్తాడు. "విశ్వుడు" అనే, నామముచేంది సకల వ్యాపారములు సలుపుతాడు. మరి, ఇది జాగ్రదావస్థ - మనకు రోజూ జరిగేదే! మరి, ఉపనిషత్తుల్లో " ఓం " కారాన్ని చెప్పేటప్పుడు 'అ' కార మాతృక' 'ఉ' కార మాతృక; 'మ' కార మాతృక; ఈ 'అర్ధ' మాత్ర అయినటువంటి "ఆత్మస్వరూపము" - ఈ మాతృకత్రయములో, ఏమి పనిచేస్తాది? అనేటపుడు - ఈ ఒక విషయాన్ని చెప్పుతారు.

ఈ పురుషుడు, ఈ స్థూల శరీరాన్ని - ఆధారముగా చేసుకొని, 25 తత్వములు పరిపూర్ణముగావున్నప్పుడు, ముఖస్థానములో నివశించే "విశ్వుడు" అనే పేరుతో -

ఇట్లా 'అ' కార మాతృకా అనేటివంటిదాన్ని - ఈ జాగ్రదావస్థను - ముఖస్థానమును నిలయముగా చేసుకొని - విశ్వుడు అనే పేరుతో - స్థూలభోగాలను అనుభవిస్తాడు. ఈయన **'అ' కార మాతృక పురుషుడు.** ఇంక- **'ఉ'** కారము రెండవది ఇది. 17 తత్త్వములను తీసుకొని - అంటే, అన్నిటికి పద్యాలేవుండాయి - ఇది స్థూల పద్ధతి. ఇంక స్వప్నావస్థ.

## స్వప్నావస్థ

**23.** **సీ॥ శబ్దాది విషయ పంచకము వాగాది। పంచకము నీపదియును నిచ్చటనునిల్పి । మానసాహంకార మతిచిత్తములగూడి । సప్తదశకతత్త్వ సంజ్ఞ సూక్ష్మదేహమందున కంఠదేశంబులనుజేరి । నిలిచి కొంచము సేపు నిదురజెంది । జాగ్రత్తయందు తాజరిపినట్లుగ క్రియల్ । జేసి మేల్కొని చూడలేశమైన ॥గీ॥ లేదుగనుకను స్వప్నంబనాది పురుష। సత్యమిదిగాదు జనితమై జనుచునుండు ॥ రమ్య ॥**

జాగ్రదావస్థ అనుభవించివున్నప్పటికీ కూడ - అది శాశ్వతముగా లేకుండ, అది అప్పటికప్పుడు పుట్టి - ప్రతి రోజు - మళ్ళి పోతూవుంటుంది. ఇట్లే, స్వప్నము కూడ - ఎట్లా వుంటాది అంటే? ఈ జ్ఞానేంద్రియములు ఐదు; కర్మేంద్రియములు ఐదు; పంచప్రాణములు ఇవన్నీ కూడి; **"మనో-బుద్ధి"**తో కూడుకొని - ఈ 17 తత్త్వములు చేత కంఠస్థానమును నిలయముగా చేసుకొని; స్వప్నావస్థను **"తైజస్యుడు"** అనే, నామముచేత అనుభవించి, ఆ తర్వాత - ఎందుకంటే, నిద్రపోయినా! - జాగ్రతలో చేసినటువంటి - పనులుచేసేది ఆ వాసనే! ఇది వాసనా శరీర లక్షణము. సూక్ష్మ శరీరము - స్థూలప్రపంచములో, చేసినటువంటివి అన్ని - దానియందున నిలువ యుంటాది. ఆ వాసన నిలువను - ఎప్పుడు అది సంకల్పించుకొంటాడో, అది ఘనముగా - అంటే, బలముగా ఏదాస్నైతె అనుకొంటాడో, అది (ఘనముగ) - మరల స్వప్నములో, తిరుగతోడుకొని చూసే గుణము దీనికివుంది. అందువల్ల, ఈ స్వప్నావాస్థ - బాగుగ ఆలోచించి చూస్తే, ఇది **"జనితమైజనుచునుండును జన్మరహిత"** అన్నట్లు, ఈ అవస్థలే - **"నీవు జన్మరహితునివి"** అంటే, పుట్టి-చచ్చేవాడివి కాదు. కాని, ఈ శరీరమును అభిమానించినందువల్ల - ఈ అవస్థలు ఎట్లావచ్చి పోతావుండావో! అట్లే - **"నేను పుట్టుతావుండాను"; "నేను చస్తావుండాను"** అని మరుపు చేత

అభిమానము పడుతావుండావేగాని – వాస్తవికముగా చూస్తే, "నీవు జన్మరహితునివి " – దీనిలాగ పుట్టిపోయెదానివి కాదు, అని చెప్పి స్వప్నావస్థను తెలియజేశారు. ఇంక సుషుప్త్యవస్థను గురించి వివరించుకుందాము.

## సుషుప్త్యవస్థ

24. సీ॥ కంఠదేశమున నహంకార చిత్తములుంచి । ధీమనంబుల రెంట్ని దీసుకొనియు । కారణదేహ హృత్కమలమందునజేరి । యజ్ఞానసన్నిధియందు నిలిచి । నది సుషుప్తనబడు నచట రెంటినినుంచి । తానవిద్యను గూడి లీనమైన । నదియుగాఢ సుషుప్తియనబడు మహిమీద సర్వంబు బారిన స్ఫురణ దప్పి ॥ గీ ॥ యుండుట తుర్యంబటంచును యోగివరులు చాటు చుందురు జనితమై జనుచునుండు ॥ రమ్య ॥

ఇంక – కంఠదేశముయొక్క వ్యాపారము అయిపోయిన తర్వాత, ఈ కారణ దేహమనేటువంటి హృదయ కమలములో, మనోబుద్ధులను తీసుకోని పోయి – అక్కడ నిలబడతాది – ఇది **"సుషుప్త్యవస్థ"**. హృదయ కమలమునేటివంటి దానికి రెండు అర్థాలున్నాయి. పిండాండములో – హృదయము ఇది. బ్రహ్మాండములో హృదయము **"అష్టదళ పద్మము"**. అక్కడ మనకు, ఆ హృదయ కమలము చెప్పినప్పుడు – అది అట్లావుంటాది. ఇక్కడ స్థానరూపములో, చెప్పినప్పుడు స్థూలపద్ధతిలో ఎట్లావుంటాది? అనేది – ఇక్కడ మనకు **"అష్టదళ పద్మములో"**, దాన్ని విపులముగా తెలియజేస్తారు. ఎందుకంటే? పూర్వదళే – పుణ్యమతే ; ఆగ్నేయే – నిద్రాలాస్యం; దక్షిణే – క్రౌరం; నైరుత్యే – పాపం; పశ్చిమే – క్రీడాశక్తి; వాయువ్యేచ – గమనం; ఉత్తరేచ – రతి ప్రీతి; ఈశాన్యే – ద్రవ్యధానం ; మధ్యే – వైరాగ్యం; కేచరే – జాగ్రతా; కర్ణికాయాం – స్వప్నం; లింగే – సుషుప్తి; పద్మత్యాగే – తురియాహః ".

ఇక్కడ " **లింగే సుషుప్తి** " – ఈ హృదయకమలముయొక్క తొడిమ అంటే, కాడ. పద్మకాడలోనికి వచ్చినప్పుడు సుషుప్తి వస్తాది. అందుకే, ఈ రాక్షసుల బాధకు తట్టుకోలేక – తామర కాడలో దూరు కున్నాడు దేవేంద్రుడు అంటారు కదా! ఈ విశ్వాన్ని చేసి చేసి – అలసిపోయి, వీళ్ళ బాధ తట్టుకోలేక సుషుప్తి వచ్చినప్పుడు, అక్కడ దూరుకొనివుంటాడు – తామర కాడకొనలో. అక్కడ ఆయనకు సుషుప్తి వస్తాది

కాబట్టి, సుషుప్తవస్థ అనేటువంటిది సహస్రారమందునే కలిగేది. అది నిగూఢావస్థ - అక్కడ కలిగేది - బ్రహ్మాండములో కనబడుతుంది. బ్రహ్మాండములో ఎట్లా కలుగుతుందంటే? అంత దృఢమైన నమ్మకము లేనట్టివారికి - హృదయమంటే, ఇలా

చెప్పినారు. ఈ హృదయము సహజముగా జడపదార్థమే - పిండాండములోన శక్తులు ఎప్పుడూ చిన్నవిగానేవుంటాయి. **"బ్రహ్మాండములోనే అన్ని శక్తులువుంటాయి"** కాబట్టి - ఇంక సుషుప్తవస్థ కలిగింది. ఏది "మనస్సుని-బుద్ధిని" - అక్కడ హృదయ కమలములో, చేర్చుకొన్నప్పుడు - కాని, ఆ మనోబుద్ధులను అక్కడే, వదలిపెట్టేసి - అది అజ్ఞానములో, పూర్తిగాలీనమైతే - దీన్ని "**గాఢ సుషుప్తి**" - అంటే, పిలిచినా పలుకకుండ; కొట్టిన పలుకలేకుండేటువంటి నిద్రవస్తాది. ఇది ఎప్పుడో, ఒక్కో సారి వస్తుంది - అందరికి ఎప్పుడు రాదు, ఈ గాఢనిద్ర అనేటివంటిది - ఒక సారి బాగ వస్తాది. సుషుప్తిలోనే, రెండు భావాలువుంటాయి. ఇంద్రియములో మగ్నతచెంది, పిలిస్తే - పలుకేటట్లు; స్పర్శ తగలితే - లేచేటట్లువుండే అవస్థ, నిద్రావస్థ. ఈ నిద్రలోనే, గాఢనిద్ర అనేటువంటిది వచ్చినప్పుడు - ఏమిజేసిన కూడ లేయరు. ఇది ఎప్పుడో ఒక్కొక్క సారి అనుభవానికి వస్తుంది అటువంటి, ఆ గాఢనిద్ర. ఇంక తురియావస్థ గూర్చి తెలుసుకుందాము.

## తుర్యావస్థ

ఇంక "మహిమీద సర్పంబుబారిన" - శరీరముపై సర్పముపారినప్పటికీ కూడ స్పృహ తప్పివుండే పరిస్థితివంటిది "**తుర్యావస్థ**" అని యోగివరులు అంటావుండారు. అంటే, ఇక్కడ తుర్యావస్థ అనేటువంటిది - ఆ విధముగా పొందేదికాదుగాని, అది మరుపురూపములో తెలియబడేది కాదు. యోగమార్గములో - ప్రపంచమును మరిచేదానికి దేహేంద్రియముల బాధ తట్టుకోలేక, "సమాధి స్థితి" పొందాలని - సాధనలుచేసి, చాలా కాలము కష్టపడితే - అది ఏదో ఒక సమయములో తుర్యావస్థ అలా మరుపుకువస్తాది. కాని, **"జ్ఞానమార్గములో తురీయమైనటువంటి ఆత్మ స్వరూపము నీవు అని గురుడు చెప్పగానే, ఈ మూడు అవస్థలు ఏదానిమీద వచ్చి పోతావుండావో, అది తుర్యావస్థ".**

ఇప్పుడు – జ్ఞానావస్థ ఎట్లావుంది? నాకు జాగ్రతవచ్చింది; నాకు స్వప్నము వచ్చింది; నాకు కలవచ్చిపోయింది – జాగ్రతవచ్చి పోయిందని – ఏదైతే, ఈ మూడు అవస్థలను చూస్తూ, అలాగని దాని అనుభవాన్ని చెప్తావుందో, ఆ అవస్థే **"తుర్యావస్థ".** తుర్యావస్థ అంటే, **"జ్ఞానావస్థ".** ఇది ఒక సారి గురుముఖముగా వచ్చిన తర్వాత – ఇంక అది పోయేదికాదు. ఎప్పుడూ కూడ – తురీయ ఆశ్రయపరుడై, తుర్యావస్థ పరుడయ్యేవుంటాడు. ఇంక – ఈ మూడు అవస్థలను చూస్తూ వుంటాడేగాని, మూడు అవస్థలలో, నేను మునిగి పోతావుండాను అని ఎప్పుడూ కూడ అనుకోడు. ఇట్లా – తుర్యావస్థ అనేటువంటిది ఎప్పుడైతాదో ఇది మనకు **ఆత్మసాక్షాత్కారము".**

అంటే – ఇంతవరకూ ఏది కనబడుతూవుంది మనకు? కల్పిత ప్రపంచమే కనబడింది. జాగ్రతగాని; స్వప్నముగాని, సుషుప్తిగాని – ఇప్పుడు మూడు అవస్థలను ఏదైతే చూస్తావుందో? ఈ మూడు అవస్థలను ఏదైతే వెలుగిస్తావుందో? **"ఆ ఒక్క స్వరూపమే నేను",** అనే **"జ్ఞానము" "గురుముఖముగా తెలిసితే"**– ఇది**"ఆత్మసాక్షాత్కారము".** ఇది – ఐదు శరీరాల్లో – ఎట్లావుంటాదో? దీన్నిగురించి – మనకు ఐదు శరీరాల సాంఖ్యము భాగవతకృష్ణ దేశికేంద్రులవారు – ఆయన ఎక్కడ సంపాదించారో? ఏమోగాని! తన **"సదృష్టాంత ప్రకాశికలో"** – ఇవన్నీ కనపరచినారు. అంటే, ఏ ఏ అవస్థలో – ఏ ఏ గుణాలు ప్రస్ఫుటముగా కనపడతవో, అవన్నీ కూడ ఆధ్యాత్మికంగా ఉపనిషత్తులలో, వేదములలో – ఏదైతే చెప్పినారో; అవన్నీ దీనియందున కనపరిచారు. ఇంక, ఇక్కడ ఐదు శరీరములయొక్క సాంఖ్యము – పంచీకరణ పద్యాలతో సహా వున్నాయి. వీటిని గూర్చి చెప్పుకొందాము.

# 1. స్థూలదేహ లక్షణం

| ఆకాశం | వాయువు | అగ్ని | జలం | పృధ్వి | భూతములు |
|---|---|---|---|---|---|
| శోకం | ప్రసరణం | నిద్ర | శ్లేష్మం | రోమాలు | ఆకాశం |
| కామం | ధావనం | దప్పిక | చెమట | త్వక్కు | వాయు |
| క్రోధం | తిరుగుట | క్షుద | మూత్రం | నరములు | అగ్ని |
| మోహం | చలనం | కాంతి | రక్తం | మాంసం | జలం |
| భయం | అకుంచన | ఆలస్యం | శుక్లం | అస్థులు | పృధ్వి |

## స్థూలశరీరము:

**(అ) <u>ఆకాశము</u> :–** ఇప్పుడు – ఆకాశము అర్ధభాగము – శోకమయింది; స్థూలశరీర పద్ధతి; ఇంక మిగితాది నాల్గు భాగములై – వాయువుతో – ఒక భాగము కలిసి – కామము; అగ్నితో ఒక భాగము కలిసి – క్రోధము; జలముతో – ఒక భాగము కలిసి – మోహము; పృథ్వితో – ఒక భాగము కలిసి – భయమైంది; అనేటువంటివి **"ఆకాశ పంచీకరణవల్ల"** ఏర్పడివుంది.

**(ఆ) <u>వాయు</u> :–** ఇంక – వాయువు రెండు భాగములై అర్ధభాగము ధావన మయింది; మిగితాది నాల్గుభాగములై – ఆకాశముతో – ఒక భాగము కలిసి – ప్రసరణము; అగ్నితో – ఒక భాగము కలిసి – తిరుగుట; జలముతో – ఒక భాగము కలిసి – చలనము; పృథ్వితో – ఒక భాగము కలిసి – ఆకుంచనము – అంటే, ముడుచుకొనేటువంటిది అయింది; అంటే, **ప్రసరణము; ధావనము; తిరుగుట; చలనము, ఆకుంచనమనేటివంటివి** – ఈ దేహము యొక్క మెలికలు. ఇవి అన్ని **"వాయుతత్వ"** ముతో పుట్టినటువంటివి.

**(ఇ) <u>అగ్ని</u> :–** ఇంక – అగ్ని రెండు భాగములై – అర్ధభాగము – క్షుధ అయింది; అంటే, ఆకలి అయింది. మిగితాది నాల్గు భాగములై – ఆకాశముతో – ఒక భాగము కలిసి – నిద్ర; వాయువుతో – ఒకభాగము కలిసి – దప్పిక; జలముతో – ఒక భాగము కలిసి – కాంతి; పృథ్వితో – ఒక భాగముకలిసి – ఆలస్యమైంది. అంటే – **ఆకలి, నిద్ర, దప్పిక, కాంతి, ఆలస్యం** – అనేటివంటివి **"అగ్ని పంచీకరణవల్ల"** – ఈ స్థూల శరీరములో పుట్టినవి.

**(ఈ) <u>జలము</u>:–** ఇంక – అట్లే, జలము రెండు భాగములై – అర్ధభాగము రక్తమయింది. మిగితాది నాల్గు భాగములై; ఆకాశముతో – ఒక భాగము కలిసి – శ్లేష్మము; వాయువుతో – ఒక భాగము కలిసి – చమట; అగ్నితో – ఒక భాగము కలిసి – మూత్రము; పృథ్వితో – ఒక భాగము కలిసి – శుక్లము; అయింది. అంటే, **రక్తము, శ్లేష్మము, చమట, మూత్రము, శుక్లము** – అనేటివంటివి ఐదు మనకు – **"జలపంచీకరణవల్ల"** పుట్టి నవి.

**(ఉ) <u>పృథ్వి</u> :–** ఇంక – పృథ్వి – రెండు భాగములై; అర్ధభాగము అస్తులు అయినావి, అంటే ఎముకలు. మిగితాది నాల్గు భాగములై; ఆకాశముతో – ఒక భాగము కలిసి – రోమాలు; వాయువుతో – ఒక భాగము కలిసి – త్వక్కు; అగ్నితో – ఒక భాగము కలిసి నరములు; జలముతో – ఒక భాగము కలిసి – మాంసము; అయింది. అంటే, **అస్తులు, రోమములు, త్వక్కు, నరములు, మాంసము** – అనేటువంటివి; ఈ ఐదు మనకు **"పృథ్వి పంచీకరణవల్ల"** పుట్టినవి. ఇది ఇక్కడవుండేయొక్క మాతృకలు అవస్థలు, స్వరూపమంటే, ఎటువంటిదో? దీనికన్ని పృథ్వి తత్వముతో పుట్టినటువంటి స్థూల శరీరమిది. ఇది మనకు ఇప్పుడు కనబడుతున్నటువంటి శరీరము.

<u>స్థూలశరీరము స్థానము</u>:– నేత్రములు; మాతృకలో 'అ' కార మాతృక; వర్ణములలో – తామ్రవర్ణము; వ్యాపారములో – సర్వవ్యాపారము; వేదములలో – ఋగ్వేదము; అభిమానములలో – విశ్వుడు అభిమాని; గుణములలో – రజోగుణము; తత్వములలో – భూతత్వము; దృశ్యరూపము; స్థూలభోగము; విపరీత జ్ఞానము; వైఖరి పలుకులు. సార్థత్రయ హస్త ప్రమాణము; జాగ్రదావస్థ; నేత్రస్థానము; పంచభూతమయం;

పంచవింశతి తత్వాత్మకం; ప్రత్యేక భూమికళలు; ఉత్పత్తి; జాగ్రతా; బోధ; వ్యావృత్తి – ఈ నాల్గు పృథ్వి కళలు.

ఇప్పుడు – పృథ్వి ఒక శరీరము – మనకు ఒక అవస్థ. మనకైన – విరాట్ శరీరానికైన; ఈ పృథ్వి స్థూలశరీర పద్ధతి. ఇంక, దీనిలోపల – తన్మాత్రలను మనము అప్పుడు చెప్పుకొన్నట్లుగా – సూక్ష్మపంచీకరణవున్నది – అది తన్మాత్రల పంచకము. అది, ఇంతకి ముందే, చెప్పుకున్నాము. ఏవి? జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము; సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపానము; శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణము; శబ్ధము, స్పర్శ, రూప, రస, గంధము; వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదములు – అనేటువంటి ఈ కర్మేంద్రియాలు – ఈ 25 తత్వములు, మనకు ఇప్పడు వుండేటువంటి సూక్ష్మశరీరము. స్వప్నములో వుండేటువంటి సూక్ష్మశరీరము కాదు.

## 2. సూక్ష్మదేహ లక్షణం

| ఆకాశం | వాయు | అగ్ని | జలం | పృథ్వి | భూతములు |
|---|---|---|---|---|---|
| జ్ఞానం 1/2 | సమానం | శ్రోత్రం | శబ్దం | వాక్కు | ఆకాశం |
| మనస్సు | వ్యానం 1/2 | త్వక్కు | స్పర్శ | పాణి | వాయు |
| బుద్ధి | ఉదానం | చక్షు1/2 | రూపం | పాదం | అగ్ని |
| చిత్తం | ప్రాణం | జిహ్వాం | రసం 1/2 | గుహ్యాం | జలం |
| అహంకారం | అపానం | ఘ్రాణం | గంధం | గుదం1/2 | పృథ్వి |

**సూక్ష్మశరీరము :–**

ఇప్పుడు – ఈ స్థూలశరీరములోపల – సూక్ష్మశరీరము ఎట్లవున్నది? ఈ 25 గోళకాలలో – ఈ 25 ఇంద్రియములు ఎట్లవుండాలి? ఈ సూక్ష్మ శరీరానికి మాత్రకలంటే ఏమి? అనేది – ఇప్పుడు చెప్తారు. ఈ సూక్ష్మదేహానికి అపంచీకృతము – అంటే, ఇవి పంచీకృతము కాదు – పంచబడదనే మాట. సూక్ష్మ శరీరము అన్ని ఓతప్రోతముగా వుంటుంది.

<u>స్థానము</u> :– కంఠ స్థానము; గుణము – సత్వగుణము; దీనికి, మాత్రకలలో – 'ఉ' కార మాత్రక ; సూక్ష్మశరీరానికి – అవస్థలలో – స్వప్నావస్థ; జ్ఞానము – అన్యధాజ్ఞానము; తత్వములలో – జలతత్వము; వర్ణములలో – శుక్లవర్ణము; మరి దృష్టరూపము – చూసేటివంటి రూపము దీనికి; వాక్కులలో – మధ్యమ వాక్కు; వేదములలో – యజుర్వేదము; వికారములలో – మనోవికారము; మాత్రకలలో– అంగుష్ట మాత్రకము; అంగుష్ట మాత్రకము అంటే – ఈ బొటనవేలు శిఖరము; అభిమానములలో – తైజస్సుడు అభిమాని; భోగములలో – ప్రవిక్తభోగము; ప్రత్యేకజలము యొక్క కళలు; సాదృశ్యము; అసాదృశ్యము; యాదృశ్యము; తాదృశ్యము – ఈ నాల్గు జలకళలు.

<u>స్వప్నము</u> : – స్వప్నము ఎట్లావుంటాదంటే? మనకు **"సాదృశ్యము"** – మనకు జరుగబోయేది కనబడతాది; **"అసాదృశ్యము"** – ఎప్పుడూ కనబడనివి కనబడతాయి; **"యాదృశ్యము"** – ముందుకు జరుగబోయేది కనబడేది ఒకటి; **"తాదృశ్యము"** – వెనక జరగిబోయిటివి కనబడేటివంటిది ఒకటి. ఇవి సూక్ష్మ శరీరములో కలిసివుంటాయి. అందువల్ల, ఇప్పుడు – జలమనే శరీరముగా కలిగి, జలముయొక్క స్వరూపమే మెజారిటిగా వుండేటువంటి – ఈ సూక్ష్మ శరీరములో, ఈ లక్షణాలు అన్నివుండాలి – ఇది మనకు ఒక అవస్థ – స్వప్నావస్థ అనుకోండి – ఈ అవస్థలోనే, వచ్చే స్వప్నావస్థ మళ్ళీ రాత్రి పూట వచ్చే స్వప్నముకాదు.

# 3. కారణ దేహ లక్షణం

| ఆకాశం | వాయు | అగ్ని | జలం | పృధ్వి | భూతములు |
|---|---|---|---|---|---|
| అవకాశం1/2 | భ్రాంతి | గూఢం | మృదుత్వం | మూర్తత్వం | ఆకాశం |
| విస్మృతి | శంకా 1/2 | రూఢం | పోషణత్వం | శబలత్వం | వాయు |
| ఆవరణం | శోషణం | కృతజ్ఞత1/2 | విశదత్వం | లజ్జ | అగ్ని |
| నిరావరణం | శీతలీకరణం | అవిచారం | క్లేదనత్వం1/2 | పిండీకరణం | జలం |
| అప్రమాణం | ధీరత్వం | సంశ్లేషణం | ధారణత్వం | కాఠినత్వం1/2 | పృధ్వి |

## కారణశరీరము : –

ఇంక – కారణదేహము – ఇప్పుడు, ఈ శరీరములో కారణ శరీరము ఎట్లవున్నది? అనేది ఇప్పుడు తెలియజేస్తారు:

(అ) **ఆకాశము** :– ఆకాశము – రెండు భాగములైంది; అర్ధభాగము – అవకాశమైంది; మిగితాది నాల్గు భాగములైంది; వాయువుతో – ఒక భాగము కలిసి – విస్మృతి కలిగింది; అగ్నితో – ఒక భాగము కలిసి – ఆవరణమైంది; జలముతో – ఒకభాగము కలిసి – నిరావరణమైంది. పృథ్వితో – ఒక భాగము కలిసి – అప్రమాణమైంది; అంటే, ఈ కారణ శరీరములు అన్ని కూడ చిక్కకుండ బీజరూపములో వుంటాయి. **అవకాశము, విస్మృతి, ఆవరణము, నిరావరణము, అప్రమాణము** – అనేటువంటి **"ఇవి – ఐదు ఆకాశ తత్వములో"** పుట్టినటువంటివి కారణశరీరములో.

(ఆ) **వాయువు** :– అట్లే, వాయువు రెండు భాగములై – అర్ధభాగము శంక – అంటే సందేహము కలిగే స్వభావము. ఏదాన్నన విచారించు! ఏదాన్నన ఆలోచించు! – అవునా–

కాద! అనేటువంటి సందేహము వుంటాది దీనికి - ఈ కారణ శరీరానికి లక్షణము ఇది. ఇంక - మిగితాది, నాల్గు భాగములై - ఆకాశముతో ఒక భాగము కలిసి - భ్రాంతి; అగ్నితో ఒక భాగము కలిసి - శోషణము; జలముతో - ఒక భాగము కలిసి - శీతలీకరణము; పృథ్వితో ఒక భాగము కలిసి - ధీరత్వమువచ్చింది - అంటే, ఈ కారణ శరీరములో - వాయుభూతము ఎట్లవున్నదంటే - ఇట్లవున్నది. భ్రాంతి, శంకా (సందేహము), శోషణము, శీతలీకరణము, ధీరత్వము - అనేటువంటివి వాయుతత్వముతో వచ్చినటువంటివి.

**(ఇ) <u>అగ్ని</u> :-** ఇంక - అగ్ని రెండు భాగములైంది; అర్ధభాగము - కృతజ్ఞతగా ఏర్పడివుంది. మిగితాది నాల్గు భాగములైంది - ఆకాశముతో, ఒక భాగము కలిసి - గూఢము; వాయువుతో - ఒక భాగము కలిసి - రూఢము; జలముతో - ఒక భాగము కలిసి - అవిచారము; పృథ్వితో - ఒక భాగము కలిసి - సంశ్లేశణ - అయింది. అంటే - **గూఢము, రూఢము, కృతజ్ఞత, అవిచారము, సంశ్లేషణ** - అనేటువంటి - ఐదు గుణాలు - ఈ ఒక కారణశరీరములో **"అగ్ని తత్వ"** ముతో పుట్టినటువంటివి.

**(ఈ) <u>జలము</u> :-** ఇంక జలము - రెండు భాగములై - అర్ధభాగము క్లేదనత్వము అయింది. మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో ఒక భాగము కలిసి - మృదుత్యము; వాయువుతో ఒక భాగము కలసి - పోషణత్వము; అగ్నితో - ఒక భాగము కలిసి - విషాదత్వము; పృథ్వితో - ఒక భాగము కలిసి - ధారణత్వము అయింది. అంటే, మృదుత్వము, పోషణత్వము, విషాదత్వము, క్లేదనత్వము, ధారణత్వము - అనేటువంటి యొక్క - ఈ రస గుణాలన్ని **"జలపంచీకరణవల్ల"** పుట్టినవి - ఈ కారణ శరీరములో.

**(ఉ) <u>పృథ్వి</u> :-** అట్లే, పృథ్వి - రెండు భాగములై - అర్ధభాగము కాఠినత్వము వచ్చింది. ఇవన్ని మనస్సులో వుండేటువంటి గుణాలివి. దేహము మీద కనపడేవికాదు. అంటే, కారణ శరీరము ఎట్లవుంటాది అనేదానికి? ఇది కారణము. ఇంక మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో - ఒక భాగము కలిసి - మూర్తత్వము; వాయువుతో - ఒక భాగము కలిసి - చపలత్వము; అగ్నితో - ఒక భాగము కలిసి లజ్జ; జలముతో - ఒక భాగము కలిసి - పిండీకరణము. అంటే, **మూర్తత్వము; చపలత్వము;**

**(ఆ) <u>వాయువు</u> :-** ఇంక - వాయు రెండు భాగములైయింది. అర్ధభాగము అభేద్యత్వమైంది; మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో, ఒక భాగము కలిసి - అఖండత్వము; అగ్నితో - ఒక భాగము కలిసి పరాత్పరత్వము; జలముతో - ఒక భాగము కలిసి - నిర్మలత్వము; పృథ్వితో - ఒక భాగము కలిసి అజరత్వం - అంటే, పృథ్విలాగ మార్పుచెందగా; అజర - అంటే, ముసిలితనము రాకోకుండవుండేది. **"జ్ఞానమునకు ముసలితనము ఎప్పుడూ వుండదు."** విషయాలు ఎక్కవచ్చు - తగ్గవచ్చుకాని; జ్ఞానము ఎప్పటికీ, ఒక తీరుగానేవుంటాది. దాంట్లో, విషయ సంగ్రహణ తగ్గిపోతాది. అది విషయాలను మరిచితే, జ్ఞాపకము లేదు అంటారుకాని - **"జ్ఞానము లేదు"** అని మాత్రము అనరు. జ్ఞానము నిర్మలత్వాన్ని పొందేకొద్ది - విషయాలు తగ్గిపోతావస్తాయి. ఇట్లా - వాయుతత్వము మహాకారణ శరీరములో - **అఖండత్వము, అభేద్యత్వము, పరాత్పరత్వము, నిర్మలత్వము, అజరత్వము** - అనే పేర్లతో **"వాయు తత్వ"** మువున్నది.

**(ఇ) <u>అగ్ని</u> :-** ఇంక - అగ్ని రెండు భాగములైయింది. అర్ధభాగము ప్రకాశత్వమైంది. మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో, ఒక భాగము కలిసి - అధాహ్యత్వము; వాయువుతో - ఒక భాగము కలిసి ఊర్ధ్వత్వము; జలముతో - ఒక భాగము కలిసి - చైతన్యత్వము; పృథ్వితో - ఒక భాగము కలిసి - అనర్ఘ్యత్వము; అయింది. ఇది - అగ్నియొక్క లక్షణము. మహాకారణ శరీరములో - **అధాహ్యత్వము; ఊర్ధ్వత్వము: ప్రకాశత్వము, చైతన్యత్వము, అనర్ఘ్యత్వము;** అనేటువంటియొక్క గుణములు **"అగ్నితత్వము."**

**(ఈ) <u>జలము</u> :-** ఇంక, జలము రెండు భాగములై - అర్ధభాగము అమృతత్వము అయింది. మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో - ఒక భాగము కలిసి - అక్లేద్యత్వము; వాయువుతో - ఒక భాగము కలిసి - జగజ్జీవత్వము; అగ్నితో - ఒక భాగము కలిసి - పరంజ్యోతిత్వము; పృథ్వితో - ఒక భాగము కలిసి కారణత్వము అయింది. అంటే, **అక్లేద్యత్వము, జగజ్జీవత్వము, పరంజ్యోతీత్వము, అమృతత్వము, కారణత్వము** అనేటువంటి, ఈ ఐదు **"జలము పంచీకరణవల్ల"** అయినటువంటి తత్వాలు.

(ఉ) <u>పృథ్వి</u> :- ఇంక - పృథ్వి రెండు భాగములై, అర్ధభాగము - సర్వధారత్వము అయింది. మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో, ఒక భాగము కలిసి అశోష్యత్వము; వాయువుతో - ఒక భాగము కలిసి - కారణత్వము; అగ్నితో - ఒక భాగము కలిసి - పావనత్వము; జలముతో - ఒక భాగము కలిసి సమృధ్యత్వము అయింది. అంటే, **అశోష్యత్వము, కారణత్వము, పావనత్వము, సమృధ్యత్వము, సర్వధారత్వము** - అనేటువంటి, ఈ ఐదు **"పృథ్వి తత్వ"** ముతో పుట్టినటువంటి పంచీకరణ. ఇది మహాకారణ శరీరము. అందుకే, దీనికి - అఖండత్వము, అధావ్యాత్వము, అఖేదత్వము, అశోష్యత్వము - అనిచెప్పి "ఆకాశ స్వరూపమైన ఆత్మ తానుగా భావించినప్పుడు" - దీనికి " **అర్జున - అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యో శోష్య ఏవచ । నిత్యః సర్వగతః స్థాణురచలోయం సనాతనః**" అని చెప్పి - దీనికి. ఎందుకంటే, దీనికంటే - క్రింద భూతాలు - దీన్ని కాల్చలేవుకదా! ఆకాశము అన్ని - భూతములకంటే గొప్పది కాబట్టి - ఆకాశ తత్వముతో, వాయువు కలిసినప్పుడు - ఇదిగో, ఈ పద్ధతులన్ని ఏర్పడినవి. దీన్ని, ఆధారముగా చేసుకోని - గీతయందు మనకు - ఆ **"శృతి"** చెప్పింది. ఇది మహాకారణదేహము - శుద్ధ సాత్వికగుణమిది.

<u>ప్రత్యగాత్మ</u> : - దీనియొక్క స్వరూపము - అభిమాని స్థానము - మూర్తిని స్థానము; భోగము - పైభోగికభోగము. అంటే, విశేషమైనటువంటి భోగము; అవస్థ - తురియావస్థ; మాతృకలలో - అర్ధమాతృక; జ్ఞానములో - వివేకజ్ఞానము; రూపములో - దృశ్యరూపము; (అంటే, ఇవి చూసే రూపము). తత్వములలో - వాయుతత్వము: వర్ణములలో - ధూమ్రవర్ణము; అంటే, మసురామాత్ర ప్రమాణము (అంటే, చిన్న అర్ధమాతృకలో వున్నటువంటి ఒక ప్రమాణము); వేదములలో - అధర్వణ వేదము; వాక్కులో - పరావాక్కు; దీని మండలము - వాయు మండలము.

<u>ప్రత్యేక వాయు కళలు</u> :- వైరాగ్యము; ముముక్షత్వము; ఆత్మత్వము; పదదర్శనం - ఈ నాల్గు వాయువుయొక్క కళలు. ఇది మన - **"ఆత్మకు మహాకారణ శరీరము"**.

# 5. కైవల్య దేహ లక్షణం

| యీ అయిదున్ను నిర్విషయ వ్యాపారాదులైన అంతఃకరణాలు | యీ అయిదున్ను నిర్విషయ వ్యాపారాదులైన సమానాదులవలె | యీ అయిదున్ను నిర్విషయ శ్రోత్రాదుల వలె | యీ అయిదున్ను సగుణరాహిత్య మైన శబ్దాదులవలె | యీ అయిదున్ను నిర్విషయ కర్మేంద్రియ ముల వలె |
|---|---|---|---|---|
| నిరాకాశం1/2 | ఆత్మా రామత్వం | స్వయం జ్యోతిత్వం | పరామృతత్వం | భేదాభేదాతీ తత్వం |
| పరాకాశం | అనావృత 1/2 చైతన్యత్వం | పరం జ్యోతిత్వం | సమరసత్వం | అభేదా భేదత్వం |
| చిదాకాశం | చిదీశ్వరభావ మఖిల లీనత్వం | జ్యోతిర్మ 1/2 యత్వం | తత్వామృతత్వం | భేదాభేదత్వం |
| దహరాకాశం | సత్యజ్ఞాన మనంత లక్షణత్వం | ఆపోజ్యోతిత్వం | అమృతత్వం1/2 | అఖండత్వం |
| అవ్యాకృతా కాశం | అంతర్బాహ్య స్ఫూర్తిరహి తత్వం | జగజ్యోతిత్వం | బోధామృతత్వం | ద్వయత్వం1/2 |

## కైవల్య శరీరము :-

ఈ – **కైవల్య శరీరము** ఇప్పుడు యాటికి వచ్చింది? పంచభూతముల చేత – స్థూలశరీరము; పంచతన్మాత్రల చేత – సూక్ష్మశరీరము; పంచశక్తులవల్ల

కారణశరీరము; పంచ బీజములవల్ల – మహాకారణ శరీరమయింది. ఇప్పుడు ఏవి మిగిలాయి? పంచ అధిదేవతలుండారు – ఇది కైవల్యాశరీర లక్షణము. ఇది, విషయరూపము కాదుగాని – ఇంద్రియములు – దీన్ని కేవలము అనుభవపూర్వకముగా ఊహించేకి మాత్రమే తురీయమువరకూ మనకు అవస్థలు వుంటాయి. తురీయమువరకే, తెలుసుకోదగినవి; వినదగినవి; చూడదగినవి అన్నీవుంటాయి .

ఇంక – తురీయమైనటువంటి జ్ఞానము కూడ – ఈ కైవల్య శరీరములో లీనమైతాది. ఈ కైవల్య శరీరము కేవలము చేతనము మాత్రమే (చైతన్యము మాత్రమే) – అన్ని కూడ అక్కడ లేకపోతె ఇక్కడ పుట్టేకి ఎట్ల కారణమైతాది? అక్కడ ఎట్ల వుంటాది? అంటే, కేవలము **"లీలా మాత్రముగా"** – చిన్న బీజరూపములో వుంటాది. మర్రివిత్తనములో – మర్రివృక్షము ఎట్లాదాగివుంటాదో! – అట్ల కైవల్య శరీరములో – ఈ మహాకారణ శరీరము, కారణ శరీరము, సూక్ష్మశరీరము, స్థూలశరీరము – అన్ని కూడ దీంట్లో దాగివుంటాయి కాబట్టి, **"లీలా సూచన"** మాత్రముగానే, దీనిని అర్థము చేసుకోవాలి.

## <u>నిర్విషయ వ్యాపారాదులైన అంతఃకరణాలు</u>

అతఃకరణములు వుంటాయిగాని, సంకల్ప – వికల్పములుగాని; నిశ్చయ – అనిశ్చయములుగాని; ఏమీవుండవు. అట్లనే, నిర్విషయ వ్యాపారాదులైన – సమానాదులు; ప్రాణశక్తులు; వుంటాయిగాని, విషయ రూపముగా ప్రవహించవు అనే మాట. నిర్విషయ జ్ఞానేంద్రియములు; నిర్విషయ విషయేంద్రియములు; నిర్విషయ కర్మేంద్రియములు – అన్ని నామమాత్రముగా వుండేటివేగాని, వేరే రకముగావుండేటివి కాదు. ఇట్లా దీనికి కైవల్యశరీరము కూడ 25 తత్వాలు – అణురూపములో ఎట్లవుంటాయో? వాటిని గూర్చి చెప్పున్నారు.

**(అ) <u>ఆకాశము</u> :–** ఇప్పుడు – ఆకాశము రెండు భాగములైంది; అర్ధభాగము – **"నిరాకాశమైవుంది"**. అంటే, ఇతర భూతములకు కారణమైనా కూడ, వ్యాకృతి చెందకుండ – అణురూపములోనే వుంటాది. మిగితాది నాల్గు భాగములై – వాయువుతో–ఒక భాగము కలిసి – **"పరాకాశము"**; అగ్నితో – ఒక భాగము కలిసి – **"చిదాకాశము"**; జలముతో – ఒక భాగము కలిసి – **"దహరాకాశము"**; పృథ్వితో – ఒక భాగము కలిసి– **"అవ్యాకృతాకాశము"**; అంటే – **నిరాకాశము; పరాకాశము;**

చిదాకాశము; దహరాకాశము; అవ్యాకృతాకాశము – అనేటువంటి పంచ ఆకాశాలు – ఈ పంచ భూతములతో కలిసి – **"ఆకాశ తత్వ"**ము వున్నది అన్నమాట. ఇది **"ఆకాశ పంచీకరణ"** – మనకు కైవల్యశరీరములో.

**(ఆ) వాయువు :–** అట్లే, వాయువు రెండు భాగములై – అర్ధభాగము **"అనావృత చైతన్యత్వమై"** – మిగిలినది నాల్గు భాగములై – ఆకాశముతో – ఒక భాగము కలిసి **"ఆత్మారామత్వము"**; అగ్నితో – ఒక భాగము కలిసి **"చిదీశ్వరభావమఖిల లీనత్వం"**; జలముతో – ఒక భాగము కలిసి – **"సత్యజ్ఞానమనంతలక్షణత్వం;"** పృథ్వితో – ఒక భాగము కలిసి –**"అంతర్బాహ్యాస్ఫూర్తిరహితత్వం"**; అంటే, ఇవి ఐదు వాయువుయొక్క స్వరూపములైవుంటాయి. **"కైవల్యశరీరములో"–ఆత్మారామత్వము; అనావృతచైతన్యత్వం; చిదీశ్వరభావమఖిల లీనత్వం; సత్యజ్ఞానమనంతలక్షణత్వం; అంతర్బాహ్యాస్ఫూర్తిరహితత్వం;** అనేటువంటి తత్వముల పద్ధతిలో, ఈ కైవల్యశరీరములో **"వాయువు"** వుంటుంది.

**(ఇ) అగ్ని:–** ఇంక – అగ్ని పంచీకరణము – అగ్ని రెండు భాగములుగావుండి; అర్ధభాగము – **"జ్యోతిర్మయత్వం"**; అయింది – మిగిలినది – నాల్గు భాగములై – ఆకాశముతో – ఒక భాగము కలిసి –**"స్వయంజ్యోతిత్వం"**; వాయువుతో – ఒక భాగము కలిసి **"పరంజ్యోతిత్వం"**; జలముతో – ఒక భాగము కలిసి **"ఆపోజ్యోతిత్వం"**; పృథ్వితో – ఒక భాగము కలిసి – **"జగజ్యోతిత్వం"**; అంటే, అగ్ని ఎట్లావున్నదంటే? అన్నిటిలోపలగూడ ప్రకాశవంతముగానేవుంది. **స్వయంజ్యోతిత్వం; పరంజ్యోతిత్వం; జ్యోతిర్మయత్వం; ఆపోజ్యోతిత్వం; జగజ్యోతిత్వం;** ఎందుకంటే, ఈ పృథ్వికంతవెలుగును ఇస్తాది కాబట్టి – జగజ్యోతి అని; జలమునకు – వెలుగును ఇస్తాది కాబట్టి– ఆపోజ్యోతిత్వము అని; అగ్ని స్వరూపతః జ్యోతిస్వరూపము కాబట్టి జ్యోతిర్మమయత్వము అని; అది వాయువుతో – కలిసినప్పుడు పరంజ్యోతిత్వము అని; అంటే, **"ఇహ–పరాలకూ"** – రెంటికీ కూడ వెలుగునిస్తాదని – అది ఆకాశముతో – కలిసినప్పుడు – **"స్వయంజ్యోతి ఆత్మస్వరూప"**ముగా వుంటాది. ఇట్లా **"అగ్నితత్వము పంచీకరణ"** – అంటే, వర్ణించి పాడేటిదికాదు దానిలో, ఈ రూపముగా వుంటాది అని ఊహించాలి.

**(ఈ) <u>జలము</u> :-** ఇంక - జలము రెండు భాగములై; అర్ధభాగము - **"అమృతత్వమైంది"**; మిగితాది నాల్గు భాగములై - ఆకాశముతో, ఒక భాగము కలిసి **"పరామృతతత్వం"**; వాయువుతో - ఒక భాగము కలిసి - **"సమరసతత్వం"** అగ్నితో - ఒక భాగము కలిసి - **"తత్వామృతత్వం"**; పృథ్వితో - ఒక భాగము కలిసి - **"బోధామృతత్వము"** అనేటువంటియొక్క పద్ధతిలో **"జలభూతము"** ఈ కైవల్య శరీరములో వున్నది.

**(ఉ) <u>పృథ్వి</u> :-** అట్లనే - పృథ్వి రెండు భాగములుగా విభజింపపడి - అర్ధభాగము - **"ద్వయత్వం"** అయింది. అంటే, ఆత్మకు అనాత్మ ఎట్లవుంటాదనే దాన్ని - ఒకటిని రెండుగా చూసే గుణము వుంటుంది. దానియందే, మనకు కందార్థాలు వచ్చినప్పుడు దీని విషయమంత తెలియబడతాది. ఆకాశము: - ఇంక ఆకాశముతో - ఒక భాగము కలిసి **"భేదాభేదాతీతత్వం"**; వాయువుతో ఒక భాగము కలిసి - **"అభేదాభేదత్వం"**; అగ్నితో ఒక భాగము కలిసి - **"భేదాభేదత్వం"**; జలముతో - ఒక భాగము కలిసి - **"అఖండత్వం"**; అంటే, భేదాభేదాతీతత్వం - భేదమువుండిన కూడ - ఇప్పుడు మనకు భేదమువున్నది. విచారించిచూస్తే, అంతా ఒకే పదార్థమే - అభేదముగావుంది. అంటే, భేదముగా కనబడేదానియందు - అభేదముగా చూసే గుణమువుంది; భేదాభేదత్వము - భేదములోవుండేటువంటి అభేదత్వమును చూసే జ్ఞానము వున్నది. భేదాభేదత్వం - భేదము, అభేదముగాను; అభేదము - భేదముగానూ, కలిసి చూసే ఒక్క ద్వయత్వం వున్నది. అంటే, దీన్ని చేప్పేటపుడే - తల్లితండ్రులు; జీవేశులు; ఇలయోమము; నేనుమేను; యెరుక మరుపులు; కలమేల్కలు; శుక్లక్షము - ఇలా రెంటినీ ఒక్కటిగా భావించే తత్వమే ద్వయము అనబడుతుంది.

పృథ్వి తత్వము కైవల్య శరీరములో - భేదాభేదాతీతత్వం; భేదమునకూ - అభేదమునకూ - అతీతముగావుండేటివంటి ఒక లక్షణము - కైవల్య శరీరములో ఆకాశగుణమూ; అట్లే, వాయువు - అభేదాభేదత్వం; అభేదములో - భేదమును కల్పించి చెప్పడము; అగ్ని తత్వములో కూడినప్పుడు భేదాభేదత్వము; భేదము కనబడి అభేదత్వ ముగావుండేటివంటి లక్షణము - అగ్ని తత్వములోవుంటుంది. జలతత్వములో, కలిసినప్పుడు - అఖండత్వము; పృథ్వి నిజాంశము - ద్వయత్వము; కైవల్య శరీరములో - ఈ రకముగా మనకు పృథ్వితత్వము; **"లీలా సూచనగా"** వుంటాది. అంటే, కైవల్య శరీరములోవుండే, అంతరేంద్రియములు నిర్విషయాలు. అంటే, అవి మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు - ఇప్పుడు పని చేసినట్లు పని చేయవు. కేవలము,

బీజరూపముగా వుంటాయి. ప్రాణాదులు కూడ నిర్విషయ ప్రాణాదులు. అంటే, జ్ఞానేంద్రియములు కూడ - నిర్విషయ జ్ఞానేంద్రియములూ; విషయేంద్రియములు కూడ - నిర్విషయ ఇంద్రియములూ; కర్మేంద్రియములూ కూడ - నిర్విషయముగా వుండేటివంటివి. ఇట్లా - నిర్విషయ అంతఃకరణాలు; నిర్విషయ ప్రాణాదులు; నిర్విషయ జ్ఞానేంద్రియములు: నిర్విషయ విషయేంద్రియములు; నిర్విషయ కర్మేంద్రియములు - అన్నీ కూడా పరమాణు రూపకంబుగా ఈ **"కైవల్య శరీరములోనే"** వున్నాయి.

మరి **"ఆత్మ"** లక్షణము ఏమి? మన ఆత్మయొుక్క లక్షణము ఎట్లావుంటాది? అంటే - **"దేహేంద్రియాదులకు వ్యతిరిక్తుడు; పంచకోశాలకు భిన్నుడు"** - అంటే, దేహేంద్రియములకు అతీతముగావుండేవాడు, పంచకోశములకు కూడా విలక్షణముగావుండి, పంచకోశాలను తెలుసుకొనేవాడు.

**దశప్రాణధర్మ రహితుడు** :- ఇప్పుడు 10 ప్రాణాలువుండాయి కదా! సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన - అనేటువంటి ప్రాణేంద్రియాలు; అట్లే - నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ - అనే ఉపవాయువులు. అన్నిటికీ కూడ, ఈయన వ్యతిరిక్తుడుగా వుంటాడు, ఈ **"ఆత్మ స్వరూపుడు"**.

**షట్కోశవినిర్ముక్తుడు**:- అన్నమయ; ప్రాణమయ; మనోమయ; విజ్ఞానమయ; ఆనందమయ; హిరణ్మయ కోశములకు వ్యతిరిక్తుడుగా వుంటాడు.

**షడూర్మిరహితుడు**:- ఆత్మ ఎలా వున్నాడు? పుట్టుట-చచ్చుట అనే **"దేహధర్మాలు"**; శోకము-మోహము అనే **"మనోధర్మాలు"** ; ఆకలి-దప్పిక అనే **"ప్రాణ ధర్మాలు"**; ఈ షడూర్ములు లేనటువంటివాడు.

**షడ్భావవికార శూన్యుడు** :- షడ్భావములంటే - ఈ శరీరమునకు - అస్తితే; జాయతే; పరిణమితే; వర్ధతే ; అపక్షితే; వినశ్యతి; అనేటివంటివి - ఆరు వికారగుణాలు వుండావి. అంటే, తల్లిగర్భములో వుండుట; పుట్టుట; పెరుగుట; బలముపుంజుకొనుట; మల్లా క్షీణించుట; నశించుట; అనే ఈ ఆరు షడ్భావ వికారాలు ఆత్మకు లేవు.

__అవస్థాసముదాయ సాక్షి__ :- జాగ్రత; స్వప్న; సుషుప్త్యావస్థలన్నిటినీ కూడ, సాక్షి మాత్రముగా చూచేవాడే కాని - అవస్థలు పొందేవాడు కాదు - " **నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య జ్ఞాన పరమానాందాద్వయ స్వరూపుడు** ".అంటే, మన శరీరములో - అవస్థలు ఎన్నిమారిన, తాను మారకుండావుండేటువంటివాడు; గుణములు, ఇంద్రియములు - మలినమైనాకూడ - తాను మలినముకానివాడు. **"బుద్ధుడు"** - అంటే, దృఢత్వముగా (స్థిరముగా) వుండేవాడు; ముక్తస్వరూపుడు; ఎప్పుడూ కూడ - **"ఈ బంధనములనుండి విడువబడినవాడు; సత్యజ్ఞాన పరమానాందాద్వయస్వరూపుడు; సత్యస్వరూపుడు;"** వికారములయందు, మూడు అవస్థలకూ, సాక్షిగా - అద్వయము - ఒకే ఆత్మరూపకంబుగావుండి - **"ఆనందమే",** స్వరూపముగా వెలుగునటువంటివాడు - ఈ **"ఆత్మస్వరూపుడు."** అట్లే - **"సావయవ శుద్ధ పీత స్వరూపామార్యదర్పణే జ్ఞాతవ్యం"** - ఇట్లా సావయవ రహితమైనటువంటి **"శుద్ధ పీత"** స్వరూపమైనటివంటిది. ఇది **"గురుముఖముగా"** విచారించదగినటువంటియొక్క విషయము.

ఇట్లా - పంచశరీరముల లోపల **"పరమాత్మ"** - ఇంత నిగూఢముగా వుంటాడు. ఇది మనయొక్క స్వరూపము. నిజముగా విచారించి చూస్తే, దీనిని అనుభవానికి తెచ్చుకోవాలి. మరి, ఈ శరీరము పడిపోయేటపుడు ఎట్లవుంటాది? మరణ సమయములో - అంటే:

" మొదలు రాగాదులతో ఆకాశము లేచును".

రాగములు కోరికలు - రకరకాలైనటువంటి ఆలోచనలు అన్నిటిని వెంటపెట్టుకొని ముందు ఆకాశములేచి పోతాది. అందుకే, చనిపోయేటప్పుడు - అనుబంధవిముక్తుడుగా, అన్నిటిని వదిలేస్తాడు అన్నమాట. సహజ మరణమువల్ల - ఆక్సిడేంటు ( అంటే దుర్మరణము) ఇట్లాంటిది కాదు. సహజ మరణము వచ్చేటప్పుడు - ఎట్లావుంటాది సృష్టి అంటే? ఇట్లావుంటుంది.

"అటువెనుక క్షుద తృష్ణాదుల చేత అగ్ని లేచును"

అంటే - ఆకలి, దప్పికలన్ని పెంటుపెట్టుకోని - అగ్ని వదలిపెట్టి పోతాది - శరీరాన్ని.

" ఆ వెనుక చలనాదులతో వాయువు లేచును"

కాళ్ళు, చేతులు, శరీరము, కదలికలనేటువంటి - చలనము లేకోకుండ వాయువు లేచి పోతాది ఆ మీద.

" లాలాజల - మూత్రాదులతో, ఉదకము లేచును "

ఇంక - చూడండి మీరు శరీరాన్ని - అది చచ్చిపోయేటప్పుడు - రక్తము అనేది - ఎక్కడలేకుండ ఎంత బాగపోతుందంటే - అంత బాగ పోతుంది. చనిపోయిన శరీరాన్ని - కోడినిగానిలే కోయండి - మల్లా క్లీనుగా ఏమీవుండదు. అంటే, ఉదక భూతము లేచి పోతాది. ఆ తర్వాత - అస్థి మాంసాదులచేత శరీరము పడిపోతాది. ఇట్ల, పంచభూతములు శరీరమునుండి - వదలిపెట్టిపోయినటువంటియొక్క లక్షణము తెలిసికొన్న తర్వాత - నీవు ఎట్లావుండావు అని పిండ-బ్రహ్మాండ విచారణ. ఇప్పుడు నేత్రసాంఖ్యము వస్తుంది.

## పిండ-బ్రహ్మాండ విచారణ - నేత్రసాంఖ్యము

(1) **పీత** :- అంటే - తెల్లగ్రుడ్డు చుట్టూవుండేది ఎర్రగ్రుడ్డు. ఇదియే, పృథ్వి తత్త్వము. క్రియాశక్తి; "బ్రహ్మ" - **అధిదేవత; 'అ' కార మాతృక; అన్నమయకోశము; సధ్యోజ్యాత ముఖము.** ఇప్పుడు - మీరు బాగ ఆలోచనచేయండి - ఈ కన్నురెప్పక్రింద భాగములోవుండే, ఎరుపు రంగే **"పీతవర్ణము"** ఎర్ర గ్రుడ్డు - ఇది పృథ్వి తత్త్వము. **దీని శక్తి - పృథ్వికి "క్రియాశక్తి"; అధిదేవత - సృష్టికర్త బ్రహ్మ; మాతృకలలో 'అ' కార మాతృక; కోశములలో - అన్నమయకోశము; ఇదే - సధ్యోజ్యాత ముఖము** - మనకు ప్రత్యక్షముగా కనపడేటువంటి **"స్థూలబ్రహ్మము"** ఇది. అంటే, బ్రహ్మమునకు ఐదు ముఖములు - ఈ సధ్యోజ్యాత ముఖము ఇప్పుడు కనబడతాది.

(2) <u>తెలుపు</u> :– ఇంక – రెండవది తెలుపు. అంటే, శుక్లవర్ణము – తెల్లగ్రుడ్డు. ఇదియే, "**ఆపోతత్వము**". ఈ ఎర్రదానికి – నల్లగ్రుడ్డుకు మధ్యలో అర్ధచంద్రాకారముగా వుందికదా – ఈ తెల్లగ్రుడ్డే, మనకు జలతత్వము. **దీనిశక్తి – ఇచ్ఛాశక్తి; దీని అధిపతి – "పోషణకర్తయైన విష్ణువు"; దీని మాతృక 'ఉ' కార మాతృక.** ఇది అన్నమయకోశమైన – తర్వాతవుండేది కాబట్టి – **"ప్రాణమయకోశము"; "వామదేవముఖము"**. ఇది రెండవ, భూతము. నేత్రములో చూడండి! మీకు "**ఆత్మ స్వరూపాన్ని**" తెలియచేసేటపుడు – **"శృతులుగాని, మన సిద్ధాంత పరులుగాని అక్కడే చెపుతారు."**

**"తొర్రలు తొమ్మిదిగల మేన్మర్రికి యొకరెంటిలోన మర్రలు నాల్గుండు; ఎర్రది, తెల్లది, నల్లది కర్రిది; దానగ్రమందు కలదొక్కతూటు; అదే యెరుక అనే, పులుగుండే చోటు; కుర్రా గురు బోధానే గొడ్డాలి చేబూని; మర్రి పులుగులరెంట్ని మలచి కొట్టరా పోని"**

ఇక్కడ – ఆ పులుగువుండేటువంటియొక్క చోటు మనకు తెలియబడతాది. పులుగు అంటే – "**పక్షి**". అందువల్ల, ఈ ఒక గ్రుడ్డుకుండటేవంటియొక్క లక్షణము ఇది. అందువల్ల, కంటిలోపలనే – ఈ తత్వాన్ని తెలియజేస్తారు.

(3) <u>**కృష్ణము**</u> :– ఇంక – మూడోది – కృష్ణము (నల్లగ్రుడ్డు) అంటే, **నలుపువర్ణము – నల్లగ్రుడ్డు. ఇదియే, అగ్ని తత్వము. అగ్నికి – జ్ఞానశక్తి; అధిపతి – రుద్రుడు; మాతృకలలో 'మ' కార మాతృక; మనోమయకోశము; అఘోరముఖము** – అంటే, ఈ రకముగా – ఈ నల్లగ్రుడ్డుమీద మూడో తత్వము – అగ్ని తత్వానికి నేత్రములో ఇలావున్నది. ఈ మూడు అండములు – పిండాండమందు **"జీవోహము"** – అనగా **"నేను జీవుడు అనే అహంకారము."** ఈ మూడు శరీరాలవరకూ వుండేటువంటిది, "**నేను జీవుడు అనే అభిమానము చేత బంధిపపడినటువంటిది జీవ లక్షణము**".

<u>ఇంక – రెండవది – బ్రహ్మాండానికి చేప్పేది.</u>

**(4)** <u>**కర్ణిది**</u> **:–** అంటే, సునీలము – నల్లగ్రుడ్డు మధ్యేవుండే **"బిందువు అనే పాప"** ఇదియే, వాయుతత్వము; దీనికి శక్తి – ఆది శక్తి; అధిదేవత – ఈశ్వరుడు; మాతృక – అర్థమాత్రక; విజ్ఞానమయకోశము; తత్పురుషముఖము; సధ్యోజ్యాతముఖము; వామదేవముఖము; అఘోరముఖము; తత్పురుషముఖము; ఈశాన్యముఖము ; అని వుండేది క్రమముగా పృథ్వికి; జలమునకు; అగ్నికి; వాయువుకు; ఆకాశానికి – ఈ ఒక **"తత్పురుషముఖము"** దీనికివున్నది.

(5) <u>**ఇంద్ర నీలము**</u> **:** ఇంక – రెండవది – ఇంద్రనీలము. అంటే, **"పులుగు – హంస పక్షి"**. ఆ పాప మధ్య వెలుగే **"కళ"** – అదియే ఆకాశతత్వము; ఆకాశానికి – పరాశక్తి; అధిదేవత – సదాశివుడు; "ఓం" కార మాత్రక; ఆనందమయకోశము; ఈశాన్యముఖము. ఈ రెండు అండములు బ్రహ్మాండము – అంటే " శివోహం " అనగా – "నేను శివుడను అనే అహంకారము"; ఇక్కడ, పిండ–బ్రహ్మాండములు రెండును – ఈ రెంటిలోను రెండు "అహము" లు:

" ఈ ఖండములు నాల్గు గూడి అఖండంబగు; యెరుక రూపు గనరా మా తండ్రి; ఇది తెలిపిన ఘనుడే తల్లి తండ్రి."

అన్నట్లుగా, ఈ రెండు "శివోహం స్వరూపము". నల్లగ్రుడ్డుకి అండాండమనియూ; గంగయనియూ; చంద్రమండలమనియూ; నాదమనియూ; ఇడాఅనియూ; కామాక్షియనియూ; స్థూలదేహమనియూ; జాగ్రతావస్థనియూ; రజోగుణమనియూ; మలినమాయేయమనియూ; పంచభూతములనియూ; అ–య–వ–ర–ల అనే అక్షరములనియూ; దీనికే – ఈ పేరు వచ్చింది. ఈ స్వరూపాన్నే, మనము నాల్గు శరీరాలుగా – ఇంతకుముందు చెప్పుకొనివుండాము.

ఇప్పుడు, నల్లగ్రుడ్డు మధ్యలోవుండే **"పాపకే"** (గ్రుడ్డుకే) – పిండాండమనియూ; సూర్యమండలమనియూ; బిందువనియూ; పింగళ అనియూ; మీనాక్షియనియూ; ఆకాశతత్వమనియూ; విద్యుల్లేఖయనియూ; కారణ శరీరమనియూ; నీలతోయక మధ్యస్థమనియూ; సూక్ష్మదేహమనియూ; స్వప్నావస్థమనియూ;

రజోగుణమనియూ; మిశ్రమమాయనియూ; జీవుడుయనియూ సొంజ్ఞ. దీనికి శృతులన్ని; మనము ఉపనిషత్తులుగాని, శృతులుగాని చూస్తే, ఇదిగో – దీనికే, ఆ పేరు పెట్టినారు. అందుకే:

" నివారసూక వత్తన్విపీత బాస త్యనూపమ తస్య । శిఖాయా మధ్యే పరమాత్మ వ్యవస్థితః । సద్ బ్రహ్మః సద్ శివః సద్ హరిశ్చంద్రః । సో అక్షర పరా పరమస్మరాత్ ॥"

ఈ రకముగా దీన్ని వర్ణించినారు కాబట్టి – దీనికి ఈ పేరు చెప్పినారు. ఇడాపింగళాలని – ఇంక, బిందు మధ్యను వెలుగే – **"కళకే"** బ్రహ్మాండమనియూ; సరస్వతియనియూ; అక్షరమనియూ; అగ్నిమండలమనియూ; కళాస్వరూపుణియనియూ; సుషుమ్నానియూ; విశాలాక్షియనియూ; మహాకారణ శరీరమనియూ; తుర్యావస్థనియూ; ఓంకారమనియూ; శుద్ధమాయేయమనియూ; సాత్వికగుణమనియూ; పంచశక్తులనియూ; ఐదు అక్షరములనియూ; పంచబ్రహ్మలనియూ; య–వ–సి–మ–న అక్షరములనియూ; అంటే, "నమః శివాయ" అని (అంటే, తిప్పి చదివితే నమః శివాయ అనేవుంటాది. ఈ రకముగా, ఈ పంచాక్షరములచేతా –" ఆ బిందు మధ్యనవెలుగేటువంటి 'కళకే' ఇన్ని పేర్లు " ఇన్ని కాదు ఇంకా మొత్తము – ఈ సృష్టిలోవుండే విద్యలన్ని దానివే – వేరె ఏమీ ఇంకోక వస్తువులేదు. "మొత్తము సకల విద్యలస్వరూపణి" అది. అందుకే, మనకు షోడషి భావము చెప్పేటపుడు – "సకలవిద్యాస్వరూపిణి" – అందుకే, "కళా స్వరూపిణి" అని; "సరస్వతినాడి" అని; "సరస్వతి అంటేనే – సకలవిద్యలనిలయము" అని అర్థము. ఈ రకముగా – ఇంక మనకు, ఈ **"యెరుక"** అగు **"కళకే"** – ఆకాశ తత్వమనియూ; ప్రణవాక్షరమనియూ; రక్తశ్వేత కృష్ణనీలవర్ణము మధ్యే ప్రకాశించేది "ఆపోజ్యోతియనియూ"; నీలతోయద మధ్యస్థమైన విద్యుల్లేఖయనియూ; మేరు శిఖరమనియూ; బ్రహ్మరంధ్రమనియూ; స్వయంజ్యోతియనియూ; సర్వసాక్షియనియూ; మహదహంకారమనియూ; మూలజ్ఞానమనియూ; గగనముద్రమనియూ; స్వప్రకాశమనియూ; అంతర్లక్ష్యమనియూ; శిఖాస్థానమనియూ బ్రహ్మాండమనియూ; అనేక వర్ణ గుణ, నామ – రూపాదులతోనిండినది "ఈ మూలం లేని గుర్తెరిగే శరీరం". ఇదే, ఇన్ని పేర్లు పెట్టుకొన్నది. అందుకే, "ఎన్నటికీ

నమ్మరానిది । క్షణభంగురం ఇది । ఎన్నో పేర్లు పెట్టుకొన్నది". అందుకే, "అనంతకోటి నామములవాడు; అపరిమిత సంకల్ప పురుషుడు" - "**ఈ బ్రహ్మాండ పురుషునియొక్క స్వరూపము.**" ఇది నివృత్తిచేయుటకు "**గురువు**" అవసరము.

శాస్త్రములచేత సాధ్యమయ్యేది కాదు; సాధనచేత సాధ్యముకాదు. ఎందుకంటే, శాస్త్రము చదివినప్పుడు - శాస్త్రాలు ఎంతంటే అంత నీవు చదువుకొని అర్థము చేసుకోవచ్చేమో గాని, అందులో "**మూల రహస్యము**" బైటపడదు. నాకు సందేహామువున్నది చెప్పు అంటే - తిరిగి ఆ శాస్త్రము కలిపించుకొని చేప్పలేందు కాబట్టి, దానికి స్వశక్తిలేదు కనుక - దీనికి "**ప్రబోధించే గురువే అవసరము**".

## షోడష కళలు

ఇంక షోడష కళలు చెప్పుకొందాము:-

1. **జాగ్రత** :- జాగ్రత; జాగ్రతలో - స్వప్నము; జాగ్రతలో - సుషుప్తి; జాగ్రతలో - తుర్యము;
2. **స్వప్నము** :- స్వప్నము; స్వప్నములో - జాగ్రత; స్వప్నములో సుషుప్తి; స్వప్నములో- తుర్యము;
3. **సుషిప్తి** :- సుషుప్తి; సుషుప్తిలో - జాగ్రత; సుషుప్తిలో - స్వప్నము; సుషుప్తిలో - తుర్యము;
4. **తురీయము** :- తుర్యము; తుర్యములో - జాగ్రత; తుర్యములో స్వప్నము; తుర్యములో - సుషుప్తి;

ఇట్లా 4 x 4 = 16 రు - కళలుగా "**ఒకే ఆత్మ ప్రకాశిస్తావుంది**". ఈ "**ఆత్మయొక్క ప్రకాశాన్ని**" బాగ తెలిసికొన్నప్పుడు - ఈ శరీరములో, ఈ కళలన్ని కొత్త కొత్తగా భావామునకు ఎదిగేటపుడు - మనకు తెలియనితనమనేటువంటి అజ్ఞానము హృదయములోనుంటి లేసిపోయేటపుడు - ఈ ఆనందరూపముగా - ఈ భావాలన్ని

హృదయములో కూర్చుకునేటపడు - " **బ్రహ్మవిద్య** " ఎంతో సుఖదాయకముగా, ఆనందముగా మనకు కనబడతాది.

ఆ తర్వాత - స్వరూపస్థితి కలిగినప్పుడు, ఇవన్నివున్న - లేకపోయిన; ఎందుకంటే, సైకిలునేర్చుకోనే వరకు ప్రక్కన పట్టుకొనేవాడు ఎట్లవుండాలో - నేర్చికొనిన తర్వాత - ఎవరు సహాయములేకోకుండ - ఎట్ల వెళ్ళిపోతాడో, ఆ రకముగా - "**గురువు**" యుక్క సాన్నిధ్యములో, ఇవన్ని బాగ విచారించేవరకూ - "**గురు సాంగత్యము**" కలిగి వ్యవహారముచేసి, తర్వాత "**స్వరూపస్థితి కలిగితే**", ఆ "**స్థితిని**" మనము పొందగలుగుతాము.

ఇక్కడ, విరాట్ శరీరములో - జీవ శరీరములో ఎట్లవుంటాయి అనేది చెప్పుకోవుండాము. అంటే, స్థూలశరీరము మనకు జాగ్రతావస్థవుంటాది - దీనికి విశ్వుడుఅనే అభిమానము - నేత్రస్థానము. ఇదే, క్రియాశక్తి; '**అ**' కార **మాతృ**క; మనకు జాగ్రతావస్థలో - దీన్నే, "**జీవాత్మ**" అనుభవించే "**కర్త జీవాత్మ**". ఇంక, సూక్ష్మశరీరము - దీన్ని అవస్థ - స్వప్నావస్థ. దీన్ని అనుభవించే అభిమాని - తైజసడు. స్థానము - కంఠస్థానము; శక్తి - ఇచ్ఛాశక్తి; '**ఉ**' కార **మాతృక**; దీన్ని పేరు "**అంతరాత్మ**". జీవునికి సూక్ష్మ శరీరములోవుండేది "**అంతరాత్మ**".

ఇంక, కారణ శరీరము; అవస్థ - సుషుప్తావస్థ; దీని అభిమాని - ప్రాజ్ఞుడు; దీనికి - స్థానము - హృదయము; దీనిశక్తి - జ్ఞానము; '**మ**' కార **మాతృక**; దీని పేరు - "**పరమాత్మ**".

ఇంక - మహాకారణ శరీరము; అవస్థ - తుర్యావస్థ; దీని అభిమాని - ప్రత్యగాత్మ; దీని స్థానము మూర్తిని స్థానము; దీనిశక్తి - ద్రవ్యశక్తి; "**ద్రవ్యశక్తి**" అంటే, "**ఎప్పుడూ కూడ మనకు సుషుప్తావస్థలోకి పోయినప్పుడు - శరీరములో వుండేటువంటి అలస్యత్వమని తీసివేసి, మల్లి నూతన శక్తిని నింపి - తేజోతత్వాన్నిచ్చి మల్లా ప్రొద్దున్నే - మన శరీరాన్ని మనకు అప్పచెప్పుతాది.**" ద్రవ్యశక్తియందున - సృష్టియంత నిండి నిబిడీకృతముగా వుంటాది. అందుకే, "**భగవంతుడు**" - ఎక్కడదాచుకోనేకి పెట్టెలు పట్టుకోకుండ - బీజాన్నే విత్తనముగా పెట్టుకోని, పద్ద పెద్ద వృక్షాన్ని - బీజములో

పెట్టినట్లు - మొత్తము సృష్టినంత కూడ, ఈ సంకల్పము అనేటువంటి అణువులో పెట్టికాపాడుతావుండాడు, అనే మాట. అందువల్లనే, ఇది ద్రవ్యశక్తి. ఇది **"ఓం"** కారమాతృక - ఇది **"మహా ఆత్మ".** అంటే, మనకు జీవాత్మ; అంతరాత్మ; పరమాత్మ; మహాత్మ; అనేటువంటి పేరుతో - జాగ్రత, స్వప్న, సుషుప్తి, తురీయము అనే అవస్థలు అనుభవిస్తావుండాము.

ఇంక - ఈ శరీరముదాటిన తర్వాత - మనము సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరాలతో, అనుభవించి బ్రహ్మాండ పురుషునియొక్క స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరాలు ఎట్లవుంటాయో - ఇప్పుడు చెప్తావుండారు.

**ఈశ్వరునియొక్క విరాట్ శరీరము:-** ఈయన పని - ఉత్పత్తి చేసేది. విరాట్ స్వరూప లక్షణము. దీని అధిపతి పృథ్వి తత్వానికి **"బ్రహ్మ అధిపతి"**; మండలము - సూర్యమండలము; దీనికి స్థానము కూడ క్రియాశక్తి; **'అ'** కార మాతృక; **"భూతాత్మ."** ఇది అన్ని భూతములకూ, ఆత్మరూపకముగావుంటాది.

**హిరణ్యగర్భశరీరము :-** ఇది చేసేపని - స్థితి; దీని అధిపతి - విష్ణు; దీనియొక్క స్థానము - చంద్రమండలము; దీనికి కూడ ఇచ్ఛాశక్తియే; దీనికి - **'ఉ'** కార మాతృక; దీని పేరు - **"సూత్రాత్మ."** ఇదే, అన్నిటి లోపల కూడ సూత్రముగా పని చేస్తాది - సృష్టిలో అన్ని జీవులకు.

**అవ్యాకృతుడు :-** ఇంక, అవ్యాకృతుడు - దీనియొక్క పని - ప్రళయము చేయుట; దీని **"అధిపతి రుద్రుడు"**; స్థానము - అగ్నిమండలము; శక్తి - జ్ఞానశక్తి; మాతృకలలో **'మ'** కార మాతృక; దీనికి పేరు - **"శుద్ధాత్మ."**

**పరమాత్మ :-** ఇంక, **"పరమాత్మ" - "మూలప్రకృతి";** సర్వసాక్షి దీనియొక్క స్వరూపము; దీని అభిమాని - ఈశ్వరుడు; దీని స్థానము - బ్రహ్మాండము; దీనికీ కూడ ద్రవ్యశక్తి; **'ఓం'** కార మాతృక; దీని పేరు **"నిర్మలాత్మ;"** ఇట్లు ఈశ్వరునికి నాల్గు శరీరాలు; నాల్గు అవస్థలు; జీవునికి - నాల్గు శరీరాలు; నాల్గు అవస్థలు; ఇన్నీ అనుభవించిన తర్వాత - పిండ-బ్రహ్మాండములలోయొక్క అనుభూతి అయిన తర్వాత,

మనకు ఈ **"పూర్ణత్వము లభిస్తాది".**

ఇంక, తర్వాత దీనికి సృష్టిని గురించి చెప్పినవారిలో **"వైశ్వేషిక న్యాయదర్శనము"** ఒకటి అది:

> క్ష్యుత్యప్త్యేజో కురుధ్యోమ । కాలదిగ్దేహి మననః ।
> ఏతే నవవిధ ప్రోక్తద్రవ్యాని చ మహాత్మభిః ॥

దీనికి బ్రహ్మము; అవ్యక్తము; మహత్తు; మహదాంకారము; ఆకాశము; వాయువు; అగ్ని; జలము, పృథ్వి మొత్తము – ఈ **"తొమ్మిది ద్రవ్యాలు"** – సృష్టికి ఇంతమటుకు వుండాల. దానికి వాళ్ళు – **ఆత్మ, మనస్సు, దిక్కులు, కాలము** – ఈ నాల్గు తీసుకోని – **ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి** – అనేటివంటి ఐదు తీసుకోని – ఈ నవద్రవ్యాలచేతనే సృష్టియైతావుంది. ఇంతకంటే – దీనికంటే – పేరయ్యేనటువంటిది లేదు అని – వాళ్ళు చెప్పినారు. కాని, పరిపూర్ణ మార్గములో– ఈ నవద్రవ్యాల సృష్టిని – మన మార్గస్తులు ఒప్పుకోరు. ఎందుకు, ఒప్పుకోరు అంటే, – సృష్టికి ఇన్ని వస్తువులు కావాలన్నప్పుడు, ఇందులో, ఏ వస్తువు లోపమైనకూడ చేసేకి కాదుకద – కాబట్టి, మన సిద్ధాంతమును అనుసరించి చూస్తే **"యెరుకే" – దేహేంద్రియములు; "యెరుకే" వర్ణాశ్రమములు; యెరుకే" – శృతులు; కృతులు "యెరుకే" – నీవును – నేనును; "యెరుకే" – సతిసోదరాదులెరుగుము వత్స "**. అన్నప్పుడు, ఒక వస్తువే – ఈ విశ్వరూపము ధరించాలికాని, ఇంకోగవస్తువు కాదు. కాని వాళ్ళు ఎందుకని అట్ల చెప్పల్సి వచ్చిందంటే? మూల పదార్థముగా **"బ్రహ్మమును"** తీసుకోని కూడ, వాళ్ళు మిగితా సామగ్రులులేకపోతే – ఎట్ల అవుతుంది అని అన్నారు?

అందుకు – మనకు ఉపమానము మిగతా సామగ్రి కాకోకుండ **"ఈ సృష్టికి ఉపాధాన కారణము నీవే" – "నిమిత్త కారణము నీవే"** అని – చెప్పినారు. ఉపాదాన కారణమంటే! కుండ చేయలంటే! **"మట్టి"** ఉపాదాన కారణము కావాల కాని – మట్టివుంటే, కుండ అవుతుందా? దాని చేసేకి కుమ్మరి కావాలి, కుమ్మరివుంటే అవుతాదా? వానికి చక్రము, దండము – అంత వ్యవహారమంత కావాల. అంటే, ఇవి **"నిమిత్తకారణమని;" "ఉపాదాన కారణము మట్టి"** – అట్లనే, ఈ సృష్టికి – ఇది

చెప్పేటపుడు - ఇది **"అభిన్న నిమిత్త ఉపాదాన"** కారణముగా **"ఒకే యెరుకైయింది"** అని చెప్పి - మన వాళ్ళు దానికి - విను :

కం ॥ విను - పూర్ణ నాభితా బుట్టిన మీదట సృజన చేయు;
దినము హరించున్; ఘనమగు పట శతకోట్లను
తనలోపల దారమునను దానట్టే - చనునూ; అట్లానే యెరుక
తా బుట్టి కనునూ; పనిబూని బ్రహ్మాండ భాండానంత
ములాను, క్షణములోపల ద్రుంచి కనరాక పే పేగ తానట్టే
చనునూ; అట్లానే, యెరుక తా బుట్టి కనునూ;

అంటే, పూర్ణనాభికి - ఇంక వేరె సామగ్రి అక్కరలేదు కదా - సాలపురుగుకు పటము అల్లాలంటే, తనలోపలనే దారము తీసుకొని, అది పటము అల్లుతాది. దాన్ని అదే పట్టుకొంటాది. అట్లనే, **"నీ సంకల్పము చేతనే"** సృష్టిచేస్తావు అని చెప్పడమువల్ల - ఈ నవద్రవ్యములయొక్క లక్షణము వున్నది. ఇంక గుణముల గురించి చెప్తారు.

## గుణాలు

### సత్వగుణము

**25.** సీ॥ సత్యవ్రతాచార సంపన్నుడైయుండి సత్కర్మక్రియలెల్ల సలుపుచుండు ।
తపము మౌనంబు యుత్సాహంబు గలిగుండు ధర్మమార్గంబులు దలుచుచుండు ।
శమదమంబులు శాంతి శ్రద్ధలుగలిగుండు । శాస్త్రపురాణముల్ చదువుచుండు ।
ధ్యానసుజ్ఞానసన్మానముల్ గలిగుండు శ్రేష్టదానంబులు సేయుచుండు । ధైర్య
నిశ్చయబుద్ధి సద్భక్తినుండు । కుజన దూరుండు సాత్విక గుణయుతుండ ॥ రమ్య ॥

సత్వగుణము వుండేనటువంటివాడు - ఈ రకముగావుంటాడు. అంటే, సత్యము, వ్రతము, ఆచారము అనేటివంటివి - ఇంక చానవుండావి. సత్వగుణముయొక్క లక్షణాలు. అవన్నీకూడ - తల్లితండ్రులుమీద ప్రేమ; దైవమునందు విశ్వాసము; సాధుసత్పురుషులయందు గౌరవభావము; పాపభీతి; ధర్మనీతి -

ఇవన్నికూడ, సత్వగుణానికివుంటావి కాబట్టి - ఇట్లు సత్వగుణముతో వుండు నటువంటివాడు కుజనులకు దూరముగావుండి, తనయొక్క ఆనందము ఏమో తాను అనుభవిస్తాడు.

## రజోగుణము

### ఇంక - రజోగుణునియొక్క లక్షణాన్ని చెప్తారు:

26. సీ॥ కామంబు క్రోధంబు గర్వంబు గల్గుట కామ్యసంగతుల హంకారపడుట । పరరాష్ట్రముల మీద పంతంబు సేయుట పరధనంబులమీద భ్రాంతిపడుట వారకాంతల పొందు వాంఛింపుచుండుట సేరములెన్నైన గోరి వినుట డంబముద్యోగ మార్గంబుల మెలగుట । యుద్ధరంగమున సంసిద్ధమగుట ॥ గీ ॥ భోగ భాగ్యంబు గోరుట పొగుడుకొనుట । లాలితంబుగ రాజసలక్షణములు ॥ రమ్య ॥"

ఇవి రజోగుణునియొక్క గుణాలు. రజోగుణానికి - తీరని ఆకలి ఆశవారికి - ఎంత వుండినప్పటికీ కూడ, తృప్తిపడేటువంటి గుణమువుండదు. ఏ దాంట్లలో కాని - కీర్తి ప్రతిష్టలలోగాని; ధనధాన్యములలోగాని; భోగ భాగ్యములలోగాని; పరువుప్రతిష్టలలో గాని - వాడికి వాడే ముదుటగావుండాలనే స్వభావమువుంటాది. ఇంకా వాడు, ఏది మనస్సుకు వస్తే - అది చేసెయ్యాలనే బుద్ధి; డబ్బు దర్పము అంతావుంటే, ఇంక వానికి ఏమి తక్కువ? అన్నిరకాలుగా అనుభవించాలని చూస్తాడు. ఇది రజోగుణముతో, నీవుకూడినప్పుడు - ఇటువంటి గుణాలలో, నిన్ను ముంచివేస్తాడు. ఈ మూడు గుణాలు కూడ, నిన్ను బంధించేటివే కాబట్టి, రజోగుణసంబంధమైన **"జీవుడు"** ఇటువంటి లక్షణాలతో వుంటాడు. ఇంక తమోగుణము:

## తమోగుణము

27. సీ॥ అజ్ఞానవృత్తి మోహాంధకారయుతుండు భూరినిద్రాసక్తి బొందియుండు । యెదురు తన్నేరుగక విదలించి యదరించి కొట్టును తిట్టును కోపపడును । అతి భోజనప్రియుండతి పానవశ్యుండు పాతకంబులబట్టు బడుచునుండు । దూషింపుచుండు దుర్భాషలు భాషించు రోషంబులాడిన రోయకుండు ॥ గీ ॥ బుద్ధిహీనుండు సంసార బద్ధకుండు । కుటిల సంగుండు తామసగుణరతుండు ॥ రమ్య ॥

ఇవి తమోగుణునియొక్క లక్షణము. అజ్ఞానమే, వృత్తిగాగలిగి - మోహాంధకారములో జీవితము గడుపుతూ, మరి - మరుపు; నిద్ర; సోమరితనముండి - అతిగా తినడము; అతిగా పానముచేయడము; అతిగా నిద్రపోవడము; కోపము అధికముగా తెచ్చుకొని - ఎదుటివారియొక్క ఒప్పులు చూడకనే తప్పులుగా భావించడము; కొట్టడము; తిట్టడము - అంటే, అజ్ఞాని ఏమేమి చేయాలో అవన్ని చేస్తాడు. తమోగుణముగలిగినవాడు - వాస్తవికముగా వీనికి సజ్జనుల సాంగత్యము అంటే గిట్టదు. మంచివారిని పొగడడము అంటేనే, వానికి నచ్చదు కాబట్టి, తమోగుణమువాడు, ఈ రకముగావుంటాడు. ఇంక - ఈ మూడు గుణములను విభజించి చూస్తే :

## గుణత్రయ విభాగ నిర్ణయము

**28.** సీ॥ సాత్వికగుణునికి సగము రాజసము రాజసములో సగము తామసముయుండు । రాజసగుణునికర్ధము సత్వమందుండు సత్వంబులో తామసముసగంబు । తామస గుణు నికర్ధము రాజసము రాజసమునకు సత్వంబు సగముయుండు । త్రిగుణంబు లీరీతి దేహంబులందుండు సాత్విక గుణముండు సజ్జనుండు ॥ గీ ॥ గురుముఖంబున మీరూప మెరుగుచుండు । త్రిగుణరహితుండు వర్ణింప నగణితుండు ॥ రమ్య ॥

ఇది మనకు - అన్ని గుణాలు - అందరిలోపల వుంటాయిగాని, ఒక్కొక్క గుణము మెజారిటిగా ( అంటే, ఎక్కువగాను); ఒక్కొక్క గుణము మైనారిటిగా (అంటే, తక్కువగాను) వుంటాయి. అంటే:

(అ) **"సత్వగుణము"** బాగా మూడుపాళ్ళు నిండుగావుండేవానికి - రజోగుణము రెండు భాగాలుగాను; తమోగుణము ఒక భాగముగాను వుంటాది;

(ఆ) **"రజోగుణము"** మూడు భాగాలు నిండుగావుండేవానికి - సత్వగుణము రెండు భాగాలుగాను; తమోగుణము ఒక భాగము వుంటాది;

(ఇ) ఇంక, **"తమోగుణము"** - మూడు భాగాలు నిండుగావుండేవానికి, రజోగుణము

రెండు భాగాలుగాను సత్వగుణము – ఒక భాగమువుంటాది;

అంటే, త్రిగుణములు – ఈ రీతిగావుంటావి. సత్వగుణ భాగము అధికముగ వుండే, **"సజ్జనుడు"** – **"గురుముఖము చేత పరమాత్మ స్వరూపాన్ని"** తెలిసికొంటూవుంటాడు. **"పరమాత్మ స్వరూపాన్ని"** తెలుసుకోని – ఈ మూడు గుణములు మాయయే – సాత్విక పద్ధతి చేత, సత్వగుణము కట్టేస్తాది **"జీవున్ని"**; రాజసగుణము చేత రజోగుణము కట్టేస్తాది **"జీవున్ని"**; తమో పద్ధతుల చేత, తమోగుణము కట్టేస్తాది కాబట్టి, **"నిత్రైగుణ్యోభవ అర్జున"**. మూడు గుణములు విడచిపెట్టు – నీవు త్రిగుణరహితుడవు; నీవు ఆత్మస్వరూపుడవు – ఈ గుణములకు బద్ధుడవు కాకూడదని చెప్పినట్లుగా; మూడు గుణములను బాగా విడుచు నటువంటివాడు **"అగుణితుండు"** – గుణములు లేనివాడు – **"వాడే ఆత్మస్వరూపుడు"** అనేటువంటి విషయాన్ని తెలియజేసినారు.

## దశనాడుల నిర్ణయము

29. **సీ॥ గాంధారి హస్తిని ఘననాళములు రెండు । నేత్రద్వయంబున నిలచియుండు । నమరి పూషాలంబ నాళంబులును రెండు । కర్ణద్వయంబున గలిగియుండు । వర జిహ్వానాడియు వక్త్రంబు నందుండు । నాభిని శంఖినినాళముండు । కులహ శినీవాలి గూడి రత్నాహ్వాయు । గుద గుహ్యములయందు కుదిరియుండు ॥ గీ ॥ కంఠమందు పయస్విని గలిగియుండు । క్షుధయు తృష్ణయు నెరిగింపుచుండు నెపుడు ॥ రమ్య ॥**

ఈ **"దశనాడులు ముఖ్యమైనటువంటివి"**. డెబ్బదిరెండువేలు నాడులలో (72,000) - ఇవి పది నాడులు మనకు – ఈ ఇంద్రియాలలో పని చేసేటివంటివి. **కన్నులలో; చెవులలో; నాలుకలో; గుదగుహ్యములయందు** (పాయు – ఉపస్థ) ఇక్కడ చేసేటువంటి పనులు – దీనిలోపల మనకు **"ముఖ్యమైనటువంటిది సుషుమ్నానాడి"**. అందుకు – **"గాంధారి"** దక్షిణ నేత్రమునందుండును; **"హస్తిని"** అనేటువంటి నాడి కుడి కర్ణమునందుంటాది; ఈ కుడికన్నుకు **"గాంధారి"** అని; ఎడము కన్నుకు **"హస్తిని"** అని పేరు. ఎందుకు పెట్టినారంటే? ఎడము కన్నుకు బలము ఎక్కువ; కుడి కన్నుకు

బలము తక్కువ. మబ్బువుండేటువంటి కన్ను కుడికన్ను; వెలుగువుండేటువంటి కన్ను ఎడమకన్ను కాబట్టి - వామనేత్రమందండునది. అంటే, ఎడమ కంటియందు, **"పూష"** దక్షిణ కర్ణమందుండును. **"ఆలంబ"** వామ కర్ణమందుండును - అది కుడిచెవియందువుంటాది. ఇది ఎడమ చెవియందు వుంటాది. **"జిహ్వా"** వక్త్రమందుండును. అంటే, నాలికెయందున జిహ్వానాడియుంటాది. **"పయశ్విని"** - కంఠమందుండును. పయశ్విని నాడి అనేటివంటిది కంఠమందుండి **"వైఖరి పలుకులును పలుకిస్తావుంటాది". "శంఖిని"** నాభియందుండును. ఎందుకంటే, నాభియందున నాదాలు వినుబడుతూవుంటాయి. అప్పుడప్పుడు పడిన ఆహారము; జీర్ణము కాని వస్తువులు పడినప్పుడు, అక్కడ ఆ నాదము చేస్తూ, ఆ నాడి దాన్ని పచనము చేస్తాది అనేమాట.

"కృకురము" : గుదమందుండును. అది ఎలాస్టిక్ మాదిరి ముడుచుకోనేటువంటి స్వభావము వుంటాది కాబట్టి, అది గుదమునందు వుంటాది.

"శినివాలి" - గుహ్యమందుండును. ఇది పెద్దగాను; చిన్నగాను ఊదేటివంటియొక్క గుణము - ఈ నాడికి వుంటాది కాబట్టి దీనియందుంటుంది.

"రత్నాహ్వాయు" - రత్నాహ్వాయ అనేటువంటిది శుక్లద్వారమునందు వుంటుంది. ఎందుకంటే, గుహ్యమందు - రెండు ద్వారాలువుంటావి. **"ఒకటి శుక్ల ద్వారము" - "ఇంకొకటి మూత్ర ద్వారము".** ఈ రెండు నాడులు దానియందు పని చేస్తూవుంటాయి. ఇదంత మనకు **"పరిశోధన - జ్ఞానము"** శరీరముమీద ఎట్లా పరిశోధన జరిగినదో తెలుసుకున్నాము.

ఇవైన తర్వాత - ఇవన్నీ వుండాయి సరే!! దీనికి **"కరంటు"** ఇచ్చేనాడి వుండాల కదా! - మొత్తమంత స్టేషన్ అంత బాగవుంది. దీనికి కరంట్ సప్లై చేసె నాడిని గురించి చెప్పుకొందాము **-" సుషమ్నునాడి "అదే - "బ్రహ్మనాడి".**

## సుషమ్న నాడి లక్షణము (బ్రహ్మనాడి)

30. సీ|| ఇడయు పింగళయును కుడియెడమలనుండు । నడుమ సూక్ష్మసుషమ్న నాడియుండు । యానాడిరంధ్ర మధ్యమునందు, సూర్య సోమాగ్ని

విద్యాక్షరమాయయాత్మ । సప్తసముద్రముల్ సప్తపర్వతములు । చతురాగమంబులు శాస్త్రములును । పంచభూతములు సప్తద్వీపములు లోకములు గుణంబులు మంత్రములును కళలు ॥ గీ ॥ బిందునాదము దిగ్వాయుబీజమాది । సకల దృశ్యపదార్థముల్ సమతనుండు ॥ రమ్య ॥

ఇంక సృష్టియంత ఇక్కడేవుంది చూడండి! ఈ సృష్టికి పేరు పెట్టినటువంటి **"జ్ఞానము ఇక్కడేవున్నాది"**. ఇది **"సముద్రము"** – నేను సముద్రమని చెప్పదు; **"పర్వతాలు"** – నేను పర్వతాలు అని చెప్పదు; **"గాలి"** – నేను గాలి అని చెప్పదు; **"అగ్ని"** – నేను అగ్నియనదు; ఈ అన్నిటికి నామకరణాలు చేసి, అన్నిటిని సృష్టింప చేసిన **"బ్రహ్మదేవుడు"** ఇక్కడేవుండాడు కాబట్టి – వాటన్నిటికి పేర్లుపెట్టుతారు. ఈ శరీరమందు డెబ్బదిరెండు వేల నాడులువున్నవి. (72,000). అందులో, పది నాడులు మనకు ప్రత్యక్షముగా, ప్రతినిత్యము పని చేసె పది నాడులువున్నవి. ఈ 10 నాడుల కూడ **"ముఖ్యమైనటువంటివి"** మూడు వున్నవి – అవే **"ఇడా," "పింగళ", "సుషుమ్న",** నాడులు అనేటుటివంటివి. ఇవి ఈ మూడు నాడులు.

**<u>ఇడానాడి</u> :–** ఇడానాడి అనేటివంటిది ఎడము ముక్కుయందుండి – **"చంద్రుడు"** అనే అధిదేవతను కూడుకొని, యమున అనే నది గలిగి; దీని అధిదేవత విష్ణురూపముగా వుంటాది. ఎందుకంటే – ఒక దేవతనూ; ఒక నదినీ; ఒక గ్రహాన్ని; – దీనియందు నిరూపించినారు. **చంద్రగ్రహాన్ని; విష్ణుదేవున్ని; యమునానదిని** – ఈ మూడు లక్షణా లను కలిగినది **"ఇడానాడి."**

**<u>పింగళనాడి</u> :–** కుడిముక్కునయందు వుంటాది. ఇదే, **"సూర్యనాడి"** – గంగానది. దీని అధిదేవత బ్రహ్మ. ఇక్కడ గ్రహాన్ని – సూర్యుని తీసుకొనివుండారు – సూర్యనాడి అని పేరు పెట్టినారు. ఇది గంగానది – నిరంతరమూ, ప్రవహించేటువంటి స్వరూపము. దీని అధిదేవత – **"సృష్టికర్త బ్రహ్మ."** దేవతలందరినీ – మనము దేవస్థానము–దేవస్థానము అంటాము కదా! తీర్థయాత్రలు తిరగడము అంటే, ఇక్కడ – ఎక్కడెక్కడ ఏ దేవతలు వుండారో, తెలిసికోవడమే **"సరియైన తీర్థయాత్రలు" గాని** మనము బైట నానా తిప్పలుపడి చేసేటువంటిది కాదు.

**సుషుమ్న నాడి** :- ఇంక సుషుమ్న నాడి - "ప్రసిద్ధమైన బ్రహ్మనాళము" - ఇదే, మధ్యనాళము; అగ్నినాడి; సరస్వతి నది; మహేశ్వరుడు - అధిదేవత; దీనికి సరస్వతి నది; అధిదేవత - మహేశ్వరుడుగా వున్నటువంటిది ఇది **"సూర్య (అగ్ని) గ్రహము"**. ఇదే, అన్నిటికీ - **"శక్తి ఇచ్చేటువంటిది - ఇదే కరంట్"**. అంటే, ఈ వస్తువే - ఆధార చక్రమునుండి సహస్రారమువరకూ - ఇది 8 ప్రకృతులు గలిగి (8 మెలికలు) సంచరిస్తావుంటాది. ఈ 72,000 నాడులు కలిగినటువంటి శరీరములో - ఇది మూలా ధారమందున పృచ్ఛము పెట్టుకొని, పడుగముడుచుకొని, **"యోగమాయ"** చేత సర్వజగత్తును తన లోపల తీసుకొని; నిద్రావస్థలో - సర్వమును తాను మ్రింగి, తాను మాత్రమే, వుండేటువంటి స్వరూపము కుండలిని శక్తికివుంది. ఈ **"యోగమాయ - బ్రహ్మముహూర్తముకాగానే"**, ఇడా-పింగళ నాడియొక్క సంచారము మధ్యమున, తాను ఎట్లు సంచరింపబడుతాది అటువంటిదాన్ని మనకు తెలియజేస్తారు.

**సూర్యనాడి:-** ఇప్పుడు - అదే, మూలాధారమునుండి - సూర్యనాడి కదిలి, సహస్రారమువరకూ వచ్చి - అక్కడ వుండేటి "గురుస్వామిని" అంటే, "బ్రహ్మకపాలాన్ని" తాకి, కుడిముక్కు (నాసికమందు) నందు అది 12 అంగుళాల ప్రమాణము బైటికిపోతాది. పోయి 4 అంగుళాల ప్రమాణము నశించి - 8 అంగుళాలు లోపలికి పోతాది - ఇది సూర్యనాడి.

**చంద్రనాడి** :- ఇంక చంద్రనాడి - ఇది మూలాధారమునందు ఉత్పత్తి అయ్యి, కూడాపైకి వచ్చి - అది **"గురుస్థానమును తాకి (బ్రహ్మరంధ్రాన్ని)"** ఎడము ముక్కునందు (నాసికమందు) బైటికి పోతాది. 16 అంగుళాల ప్రమాణము పోయి - అది 8 అంగుళాల ప్రమాణము లోపలికి పోతాది. ఇట్లు ఇవి ఇలా - **"పిండ-బ్రహ్మాండాలకు, ఇడా పింగళ సుషుమ్నానాడులు సంచరిస్తావుంటాయి."** ఇంక - సుషుమ్ననాడి వివరము.

**సుషుమ్ననాడి** :- మూలాధారమందున కదలి, ఇంక - సుషుమ్ననాడి కోటి సూర్యప్రకాశము కలిగి - ఈ శరీరమంత వెలుగును నింపుకొంటూవచ్చి - సహస్రారమందున చేరి - అగ్నిమండలములో నిలబడతాది. ఇది బైటికి లోపలకి పోదు. ఇది ఇక్కడే, నిలబడతాది. ఇక్కడ నిలబడినప్పుడే, మిగితా 72,000 నాడులు కూడ పని

చేస్తావి. ఈ నాడిలోపలనే, మనకు సమస్త ప్రపంచము నిండి–నిబిడీకృతముగావున్నది. ఇక్కడ, ఈ **"బ్రహ్మదేవుడు"** లేక పోతే, బైటచేసేటువంటి సృష్టిని గుర్తించే శక్తి ఎవరికీలేదు. బైట అపంచీకృతముగావుండాది కాబట్టి, అక్కడ జ్ఞానము లేదు – అది గురుతెరుగలేదు. ఇక్కడనే, మనము గురుతెరుగాలే కాని, ఇంక వేరె రకముగా యెరుగేకివుండదు అన్నమాట. కాబట్టి నాడియొక్క గొప్పతనాన్ని **"శృతులు"** – **"సృష్టిని "** – అన్నికూడ అనేక రకాలుగా చెప్పినవి. దీనికి :

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా । గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలాన్యనుసన్తతాని । కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥

ఇది ఊర్ధ్వానికి – అధనానికి (క్రిందకి) వ్యాప్తిచెందివుంటాది – వూడలవలే. దీనియందున వున్నటివంటియొక్క భావాలు – కొత్త కొత్తగా చిగురాకులువలే చిగురిస్తూ; భ్రాంతులు పెంచుకొంటూ; మమకారము తెంచుకోలేకోకుండ – కర్మలచేత బంధిపపడేటు–వంటి గుణము మనకు దీనియందే వుంటాది. అందువల్ల, ఈ మునుపు చెప్పిన ప్రకారము, **"ఇడా–పింగళను"** బాసిన సుషుమ్న నడుమ **"పగడపుతీగవలే"** – **"కోటి సూర్య ప్రభగా వెలుగుచుండును"**. ఇదే, సకల లోకాలకూ ఆధారము. ఇప్పుడు మనకు ముందరికి లోకాలు వస్తావి – షడ్చక్రాలు; అన్ని – 14 లోకాల నిర్ణయము. అన్నిటికీ, ఇదే ఆధారము – ఇదే **"త్రిమూర్తి స్వరూపమైన సుడి"**. ఇది అగ్నిమండల పర్యంతమువచ్చి – అచ్చట నిలిచియుండును. ఈ **"నాడి కొనను సూక్ష్మరంధ్రము"**యుండును. ఇదే **"బ్రహ్మరంధ్రము"**. దీనిని దశమ రంధ్రమనబడును. ఈ **"బ్రహ్మరంధ్రమందు బ్రహ్మాండమంతా వ్యాపించియున్నది"**. అది యెట్లనగా! అంటే, ఈ పద్యములో చెప్పినటువంటివన్నీ కూడ దీనియందు వున్నవి. దాని "అగ్రరంధ్రమందు" **"సూర్యుడు; చంద్రుడు; అగ్ని; విద్య; అక్షరము; మాయ; ఆత్మ; సప్తసముద్రములు; సప్త పర్వతములు; చతుర్వేదములు, శాస్త్రములు; పంచభూతములు; సప్తద్వీపములు; లోకములు; గుణములు; మంత్రములు; కళలు; బిందువు; నాదము, దిక్కులు, వాయువులు, బీజములు, ఈ మొదలైన సకల దృశ్య పదార్థములు గూడియుండును"** ఇక్కడే. మరి ఇది ఇంత **"చిన్న అణువులో"**– ఎవరికీ కూడ తెలియబడదు – అట్లా అణువులోనే:

" సర్వ జగము జనించి మించి జెనుచునుండును ; కనుమిదే
ఉత్పత్తి, స్థితి, లయ, కాలగతియనుచు"

అని అన్నట్లు, ఈ **"అణురూపమైనవటుంటి - ఈ తెలివిలోపలనే"**, ఇంత **"బ్రహ్మాండమంతా పుట్టివున్నది"**. అందుకు, బ్రహ్మరంధ్రమునకు స్థానము ఏది? అని అన్నప్పుడు - కన్నుల రంధ్రాలు రెండు, ముక్కు రంధ్రాలు రెండు, చెవుల రంధ్రాలు రెండు - ఎక్కడైతే కలస్తవో, అది **"త్రికూటమని చతుఃపాదమని; పంచకమల సింహాసనమని"** - అక్కడవున్నప్పడే, నీవు పంచ భూతాలను పరిపాలిస్తావు. ఎక్కడుంది? ఈ సుషుమ్న సింహాసనమందుండి - ఆకాశ తత్వమైనటువంటి శబ్దాలువింటావు; వాయుతత్వమైన చర్మములో చేరి స్పర్శలను గ్రహిస్తావు; నేత్రములలో చేరి అగ్నితత్వమైన రూపమును చూస్తావు; జిహ్వాందుయ చేరి జలతత్వమైన రసాన్ని అనుభవిస్తావు; ముక్కుయందున చేరి పృధ్వీతత్వమైన గంధాన్ని అనుభవిస్తావు (ఘ్రాణేంద్రియము ద్వార). ఈ **"పంచకమల సింహాసనం మీద ఇది కూర్చోని వున్నది"** - దీనికే మూలకారణమైనటువంటి దేవుడు ఎక్కడోవున్నాడు - ఆయన తపస్సుచేస్తే, మనకు ప్రత్యక్షమైతాడు అని చెప్పి - మనస్సును బాహ్యాప్రపంచములో - దూరముగా దేవున్ని నిర్మించుకోని, దానిపై తపన చేస్తారు. అదే. **"గురువు"** ద్వార, **"పెద్దల"** ద్వార తెలిస్తే ఆ తత్వము ఇక్కడేవున్నది. ఆ తత్వము **"నేనయ్యేవున్నాను"**. ఆ తత్వమే **"సకలమాయలకూ మూలమైవుండాది"** అనేటువంటి అనుభవము వస్తాది. తెలియకపోతె, ఎన్ని తిప్పలు పడాలో తెలిస్తే అట్లవుంటాది అన్నమాట. ఇప్పుడు చతుర్దశ లోకములను చెప్పుకుందాము.

## <u>చతుర్దశలోక నిర్ణయము</u>

**31.** సీ|| అతలంబు పాదముల్ వితలంబుగుల్భలు । జంఘులు సుతలంబు జానులందు । యుండుతలాతలం బూరుయుగ్మము మహా । తలముగుహ్యాము రసాతలముయుండు । కటిని పాతాళలోకము నాభిభూలోకముండు భువర్లోకముదరమందు । స్వర్గంబుహృదియు వక్షము మహర్లోకంబు । ఘనజన లోకంబు గళము బొమల || గీ || మధ్యమందు తపోలోక మమరుమూర్ధిని । సత్యలోకంబు నీ నివాసస్థలంబు । రమ్య ||

ఇట్లా – ఆయా స్థానములో అతలము – అరికాళ్ళు; వితలము – గుల్ఫములు; గుల్ఫములు అంటే, మిడియాలు అనే అర్థము చేసుకోవాల. సుతలము – జంఘములు; (అంటే పిక్కలు); తలాతలము – జానువులు (జానువులు అంటే, మోకాళ్ళు); మహాతలము – ఊరువులు; ఊరువులు అంటే, తొడలు అన్నమాట; రసాతలము – గుహ్యము; అంటే, మర్మస్థలము; పాతాళ లోకము కటిప్రదేశము అంటే పాయు స్థానము; భూలోకము – నాభి; భువర్లోకము – ఉదరము; ఉదరము అంటే, కడుపు; స్వర్గలోకము – హృదయము; కడుపుకి కొంచము పైన ; మహర్లోకము – వక్షము; జనలోకము – గళము అంటే – కంఠ స్థానము; తపోలోకము – భ్రూమధ్యము; **"సత్యలోకము – మూర్తి స్థానము"**; ఇది **"నీ నివాస స్థలము"** అని రామునికి చెప్పినాడు కదా అని – అనుకోద్దండి. రామునికి చెప్పినటువంటి రహస్యము – శిష్యునికి గురువు చెప్పాలి. ఈ అన్ని కూడ, నీపైవున్నావు అని వచ్చినప్పుడే, **"అద్వైతసిద్ధి కలుగుతాది"**. అద్వైత సిద్ధి కలగాలంటే, ఇవన్ని పేరు చేస్తే – అద్వైత సిద్ది కలగదు. అందుకే, అద్వైత సిద్దికి విలక్షణముగా చెప్పుతూ – అది **"నీవయ్యే వుండావు"** – నీవు తప్పపేరవాడు చేస్తే – ఏమి దానమిస్తాడా! ఈ అన్ని వస్తువులు – నీవు అనుభవించురా అని! నీవే చేసుకోవాలి కదా వాస్తవికముగా! కాబట్టి, ఈ 14 లోకాలు – ఈ రకముగా మనకు తెలియబడింది. **"విరాట్ పురుషునికి",** కూడ 14 లోకాలు ఇక్కడనే వుంటాయి. బ్రహ్మాండములో – అది హిరణ్యాగర్భ శరీరానికి, మరి ఈ మేరు పర్వతములో, ఈ రకముగా 14 లోకాలు. ఇప్పుడు సత్యలోకానికి వచ్చినాము కదా – ఇప్పుడు, ఇవన్నీ క్రమేపిగా ఎక్కుకుంటూ రావాలి. అతలము – అరికాళ్ళు దగ్గరనుండి భ్రూమధ్య స్థానానికి వచ్చి, తపోలోకములో – దానియొక్క స్థితిని తపించి, నీ నివాసస్థలాన్ని నీవు గుర్తెరగాలి. అది సహస్రారమందువున్నప్పుడు, ఈ మొత్తము – ఈ శరీరములో ఎన్ని లక్షణాలు; ఎన్ని తత్వాలైతేవుండాయో! **–"వాటన్నటికి ఇచ్చేటువంటి సత్తా నాదే "**. అదే:

శ్లో ॥ న తద్ భాసయతే సూర్యో । న శశాంకో న పావకః ।
యద్ గత్వా న నివర్తన్తే । తద్ధామ పరమం మమ ॥

**"న తద్ భాసయతే సూర్యో"** - సూర్యుడు ప్రకాశింప చేయలేడు; చంద్రుడు ప్రకాశింప చేయలేడు; అగ్ని ప్రకాశింప చేయలేడు; అది, నా లోకము అని కృష్ణుడు అన్నాడు. అంటే, కృష్ణుడు అంత పైన లోకములో వుండాడేమో అని, మనము అనుకొంటాము. **"వాస్థవికముగా - ఈ లోకము మనదే - మీరువుండేటువంటి లోకమే ఇది ".** ఇన్ని లోకాల మీద మీరు వుండేటువంటి యొక్క స్వరూపాన్ని తెలియజేసినారు అన్నమాట.

పాదములు - అరకాళ్ళనుండి - సహస్రారమువరకూ, నీవు ప్రకాశింప చేస్తావుండేటువంటి లోకాలు ఇది నీవు. నీవు ఇక్కడ లోకాలకు పోయి బాధ పడేదిలేదు, సుఖపడేది లేదు. ఈ ముందర చెప్పిన 14 ఇంద్రియములలో, సుఖ-దుఃఖమును అనుభవించే స్థితివుంది. **"జీవుడు"** 14 ఇంద్రియములు అనే, 14 లోకాల సంచారమువుంటాది. అందుకే, నారదుడు 14 లోకాలు సంచరిస్తాడు అన్నారు.

ఇప్పుడు, **"చైతన్యము"** - ఈ శరీరములో - 14 భువనాలు. 14 లోకాలు ఎట్లు వున్నవి? ఆ 14 లోకాలులో, తాను ఎట్ల వున్నాడు? ఈ సత్యలోకమందు చేరి తన స్వరూపాన్ని ఎట్లు పొందుగలుగుతావుండాడు? ఆ **"గురు కృపచేత"** దాన్ని తెలుసుకొన్నప్పుడు - ఇంక, ఈ లోకాల సిద్ధి నిర్ణయము ఎట్లావుంటాదని ఇప్పుడు చెప్పుతారు.

## <u>అష్టదిక్పాలక స్థల నిర్ణయము</u>

32. సీ॥ భ్రూమధ్యమున జంభభేదిపురంబుండు । నగ్ని దేవుని పురంబక్షియందు । దక్షిణకర్ణమందంతకుని పురంబు । తత్పార్శ్వమున యాతుధానపురము । పరగుపృష్టము నందు వరుణుని నగరంబు । పవనపురంబు నాపార్శ్వమందు । వామకర్ణము నందువరకుబేరపురంబు । హరునిపురంబు వామాక్షియందు ॥ గీ ॥ శిరము నడుమనుయుండు సుస్థిరముగాను । కుంఠితముగాని నీదు వైకుంఠపురము ॥ రమ్య ॥

ఇంక, మనకు - భ్రూమధ్యస్థానమందున - అంటే, సరీగా బొట్టు పెట్టుకొనే స్థానములో - ఇంద్రపురమువున్నది; కుడి కన్నులో - అగ్నిపురమువున్నది; కుడిచెవిలో - యమపురమువున్నది; దానిపక్కన నైఋత్యములో - నైఋత్యపురము వున్నది; పరమట - వరుణదేవుని పురమున్నది; దానిపక్కన - వాయుదేవుని పురమువున్నది; ఎడమ చెవియందు కుబేరపురమువున్నది; ఎడము కంటిలో - ఈశ్వరుని పురము వున్నది; అంటే, ఈశాన్య పురము. ఇంక షడూర్ముల లక్షణము చెప్పుతారు.

## షడూర్ముల లక్షణము

షడూర్ములు - ఇట్లా, ఈ రకముగా - ఈ అష్టపురముల మధ్యములో పరివేష్టితుడవై, ఈ అష్టపురాలను పాలించేటువంటి పరమాత్మ స్వరూపమై, నీవు వున్నావు. మరి ఇవన్నీ, కలిగినటువంటి ఈ శరీరములో - ఏ ఏ ధర్మము ఎట్లున్నది? అంటే, మనకు కొన్ని ధర్మాలు - కొన్ని నడుపిస్తావి; అన్ని ఆత్మధర్మాలు కాదు. ఏదాని ధర్మము దానిది. అందుకు షడూర్ముల గురించి చెప్పుతావుండారు.

**33. సీ॥ పృథ్వీజీవులకెల్ల క్షుధతృష్ణలును రెండు । ప్రాణధర్మములని పలుకబడెను । శోక మోహంబులు శోధింపగా, మనోధర్మములని వాటి దలుపబడెను । జనన మరణంబులు జడరూపమైనట్టి దేహధర్మములని దెలియబడెను । ఇవి షడూర్ములటంచు వివిధమార్గంబుల । వివరించి వీటిని విడిచి నిన్ను ॥ గీ ॥ సద్గురూక్తంబుగా గన్న సజ్జనుండు । నిష్కళ బ్రహ్మమైయుండు నిగమవినుత ॥ రమ్య ॥.**

మనకు, ఈ షడూర్ములు - ఇప్పుడు ప్రత్యక్షముగా కనబడుతున్నవి. ఒక సారి పుట్టి, ఒక సారి చచ్చే ధర్మము - దేహధర్మము (శరీరానిది). మరి ఆకలి; దప్పికలు అనుభవంచేటువంటిది ప్రాణధర్మము. అందుకే, అన్నము లేకపోతె - ప్రాణము తహతహలాడుతుంది. సుఖము-దు:ఖము అనుభవించేటువంటిది మనోధర్మము. ఎప్పుడైతే, ఈ ధర్మాలు - వాటి వాటి ధర్మములు; వాటి వాటివి అని తెలిసికొన్నప్పుడు, ఓహో! ఆకలి-దప్పికలు, ప్రాణధర్మాలు; జనన-మరణాలు, దేహ ధర్మాలు; సుఖ - దుఃఖములు, మనోధర్మాలు. ఇంక, నా ధర్మము ఏది అంటే? ఈ ఆరు ధర్మాలూ - వాటికి పంచి పెట్టితే షడూర్ములు - **"నీవు నిష్కళ బ్రహ్మమై వుంటావు"**. నీకు ఇందులో, జనన మరణాల సంబంధములేదు; ఆకలి దప్పికల సంబంధములేదు. ఇవన్ని, ఎందుకంటే, ఈ నీయుక్క సన్నిధానములో, ఏ ఏ ఇంద్రియాలు, ఆ పని చేస్తున్నవి.

కాని, వాస్తవికముగా నీవు నిష్కళ బ్రహ్మముగా వుంటావు. అంటే, వీటిలో కలిసేటు వంటి లక్షణము నీకు లేదు అని. ఇది "ఆత్మ భోధ" చెప్పేటప్పుడు ఎట్లా వస్తాది అన్నప్పుడు – ఇట్లా సర్వధర్మవిలక్షణముగా – ఆత్మను నిరూపించి చెప్పిన తర్వాత – అది పూర్తి దృఢమైన తర్వాత మరల "**శాంతి**" – " **సర్వం ఖల్విదం బ్రహ్మ** " – అంటే, అప్పడు ఒకే పదార్థముగా చెప్పిన, అప్పడు నీవు దాంట్లో కలియువు – అన్న మాట.

## అష్టమదములు

34. **సీ॥ యెక్కువకులమందు నేజనించితి నాదుకులమెక్కువనుటయు కులమదంబు । సకలశిష్టాచార సంపన్నుడను నేను శ్రేష్టుండననుటయు శీలమదము । ద్రవ్యంబు నావద్దదండిగాయున్నది యని గర్వపడుటయు ధనమదంబు । ధరను నావంటి సుందరుడు లేడనినిక్కి రూఢిగా దిరుగుట రూప – మదము ॥ గీ ॥ మద ములన్నియూ ఈ దేహమందు విడిచి । భక్తినీ మీద గలవాడు ముక్తుడగును ॥ రమ్య ॥ "**

ఇంక – అష్టమదములనేటివంటివి వస్తే, ఇంక నీకు సంయోగమువుంది. సంయోగింపపడేవి కొన్నివున్నాయి. ఎట్లంటే, కులము బాగవుంది అంటే, కుల మదమువస్తాది; ఇది స్వతః ఆత్మకు లేదు – కాని, ఆ కులము వస్తానే కులమదము వస్తాది; రూపము వస్తానే, నేను రూపవంతుడు అనే రూపమదము వస్తాది; ధనమువస్తే – ధనమదము వస్తాది; యౌవనమువస్తే – యౌవన మదము వస్తాది; రాజ్యమువుంటే – రాజ్యమదము వస్తాది; తపస్సువుంటే – తపోమదము వస్తాది; ఏదానితో నీవు కూడితే – ఆ గుణములు ఎట్లైతేవస్తావుండాయో – ఇవి అష్ట మదములని ఎవరైతే దీనియొక్క లక్షణాన్ని బాగ తెలియజేసుకోని – మరి "**అష్టమదములనణచిన నిష్టపరుడు; పుణ్యపురుషుడు వైకుంఠపురమునుండు**".

అష్టమదములు ఇవి – ఏ ఏ వస్తువులు వచ్చినపుడు వచ్చే గుణాలేగాని, నిజమైన గుణములు కాదు. ఇవి సత్యములు కాదని – ఎవరైతే వచ్చినటువంటి మదాలను అణచుకోగలుగుతావుండాడో – అటువంటివాడు, ఎట్లా వుంటాడు? అంటే, "**కుంఠితముగాని వైకుంఠపురమునుండు**". " ఏ కుంఠితములేనటివంటి ఆత్మ స్వరూపస్థితుడుగా వుంటాడు. ఎందుకంటే, ఇవన్ని మనకు మధ్యలో వచ్చేటువంటి బంధాలు ఇవి. ఇటువంటివి తొలగించుకొన్నప్పుడే, మానవుడు ముక్తి స్థితికి పోతాడు –

కాని, వాస్తవికముగా నీవు నిష్కళ బ్రహ్మముగా వుంటావు. అంటే, వీటిలో కలిసేటు వంటి లక్షణము నీకు లేదు అని. ఇది "**ఆత్మ భోధ**" చెప్పేటప్పుడు ఎట్లా వస్తాది అన్నప్పుడు – ఇట్లా సర్వధర్మవిలక్షణముగా – ఆత్మను నిరూపించి చెప్పిన తర్వాత – అది పూర్తి దృఢమైన తర్వాత మరల "**<u>శాంతి</u>**" – " **సర్వం ఖల్విదం బ్రహ్మ** " – అంటే, అప్పుడు ఒకే పదార్థముగా చెప్పిన, అప్పుడు నీవు దాంట్లో కలియవు – అన్న మాట.

## <u>అష్టమదములు</u>

34. సీ॥ యెక్కువకులమందు నేజనించితి నాదుకులమెక్కువనుటయు కులమదంబు । సకలశిష్టాచార సంపన్నుడను నేను శ్రేష్టుండననుటయు శీలమదము । ద్రవ్యంబు నావద్దదండిగాయున్నది యని గర్వపడుటయు ధనమదంబు । ధరను నావంటి సుందరుడు లేడనినిక్కి రూఢిగా దిరుగుట రూప – మదము ॥ గీ ॥ మద ములన్నియూ ఈ దేహమందు విడిచి । భక్తినీ మీద గలవాడు ముక్తుడగును ॥ రమ్య ॥ "

ఇంక – అష్టమదములనేటివంటివి వస్తే, ఇంక నీకు సంయోగమువుంది. సంయోగింపపడేవి కొన్నివున్నాయి. ఎట్లంటే, కులము బాగవుంది అంటే, కుల మదమువస్తాది; ఇది స్వతః ఆత్మకు లేదు – కాని, ఆ కులము వస్తానే కులమదము వస్తాది; రూపము వస్తానే, నేను రూపవంతుడు అనే రూపమదము వస్తాది; ధనమువస్తే – ధనమదము వస్తాది; యౌవనమువస్తే – యౌవన మదము వస్తాది; రాజ్యమువుంటే – రాజ్యమదము వస్తాది; తపస్సువుంటే – తపోమదము వస్తాది; ఏదానితో నీవు కూడితే – ఆ గుణములు ఎట్లెట్లేవస్తావుండాయో – ఇవి అష్ట మదములని ఎవరైతే దీనియొక్క లక్షణాన్ని బాగ తెలియజేసుకోని – మరి "**అష్టమదములనణచిన నిష్టపరుడు; పుణ్యాపురుషుడు వైకుంఠపురమునుండు**".

అష్టమదములు ఇవి – ఏ ఏ వస్తువులు వచ్చినపుడు వచ్చే గుణాలేగాని, నిజమైన గుణములు కాదు. ఇవి సత్యములు కాదని – ఎవరైతే వచ్చినటువంటి మదాలను అణచుకోగలుగుతావుండాడో – అటువంటివాడు, ఎట్లా వుంటాడు? అంటే, "**కుంఠితముగాని వైకుంఠపురమునుండు**". " ఏ కుంఠితములేనటివంటి ఆత్మ స్వరూపస్థితుడుగా వుంటాడు. ఎందుకంటే, ఇవన్ని మనకు మధ్యలో వచ్చేటువంటి బంధాలు ఇవి. ఇటువంటివి తొలగించుకొన్నప్పుడే, మానవుడు ముక్తి స్థితికి పోతాడు –

అష్టమదములు, ఈ రకముగా "**అష్ట ఐశ్వర్యాలూ అనుభవించు – సంతోషమే – కాదనడు సృష్టికర్త**" – కానీ, మదములుపడితే – నీకు శత్రువులుగా తయారౌతారు. శత్రువులు తయారైతే, ఇంక నీకు నిద్రా – సుఖము శూన్యమైపోతుంది. అందువల్ల, నీకు బాధపెట్టే, ఇటువంటి గుణాలను నీవు పెంచి పోషించుకోరాదు. వీటినే మనకు అష్టమదాలని చెప్పినారు. ఇంక అష్టపాశములు చెప్పుతారు.

## అష్టపాశములు

36. సీ॥ తల్లిదండ్రులు భార్య తనయులు మిత్రులు । ధనము సహోదరుల్ తనువులైన । అష్టపాశంబులు నమరి బంధములచే । దగిలుండునరుడుయీ ధరణియందు । యత్తమామలు బావ లల్లుండ్లు కోడండ్లు మరుదండ్లు వదినెలు మరుదులనుచు తాపత్రయంబుల దగిలి వర్తింపుచుమత్తులై మనుజులు మందమతిని ॥ గీ ॥ సాధుసజ్జన సంగతి సలుపలేక । మోక్షమార్గంబెరుంగరు మోహరహిత ॥ రమ్య ॥

ఇవన్ని – మనకు చూడండి – తల్లితండ్రులు; భార్య తనయులు; అన్నలు; తమ్ములు; బావలు; బామర్దులు; మిత్రులు; బంధువులు; అనేటువంటి ఒక బంధము కాదు నిజముగా, ఒక మానవ జాతికే ఇవన్నీను. మిగితావి ఏవి కూడ బంధుత్వము ఏర్పరచుకోవు – పిల్లలు చస్తావుంటే కూడ పట్టించుకోవు. కాని, ఈ "**మానవునికి**" ఈ అష్టపాశాలు తగులుకోని – ఒక త్రాడుకి ఉరివేసుకోని చచ్చిపోతావుంటే, 8 త్రాళ్ళ చేత రోజూ ఇది బిగింపబడుతుంటే – వీడు ఎప్పుడు స్వస్తత పొందేది? ఎప్పుడు "**శాంతిని**" అనుభవించేది? కాబట్టి, ఈ రకముగా అష్టపాశములచేత వుండేటువంటివాడు – సాధు సజ్జనులయొక్క సేవ సలుపక – ఈ రకమైనటువంటి బంధముతోనే తగులుకొనివుంటాడు కాబట్టి – దీనినుండి మేల్కొనాల. ఇంక మలత్రయాలు చెప్పుతారు.

## మలత్రయ లక్షణము

37. సీ॥ పరమాత్మ నెరుగకతెరుపు మరుపులచాత గాత్ర పుత్రకళత్రమిత్రులందా । సక్తుడై కడలేని సంసారవార్ధిలో మునిగి తేలుటనెల్లయణవ మలము । పరద్రవ్యమాపేక్షపడి పరజనులకు నపకృతిశేయ మాయామలంబు । పుణ్యా

పాపములచే పుట్టుచావులును నిర్మించుచుండుటయు కార్మిక మలంబు ॥ గీ ॥ మూడుమలముల విడువక ముక్తిపథము । గానలేరైరి పామరమానవులును ॥ రమ్య ॥

1. **<u>ఆణవమలము:-</u>** ఇంక - పరమాత్మను, ఎరగకుండ - మరి గాత్ర, పుత్ర, కళత్ర, మిత్రులందు - ఆసక్తుడై వుండేటివంటిది - **"ఆణవమలము".** అంటే, ఇది నీవు సమీపములోవుండి అనుభవించే మలము ఇది.

2. **<u>మాయామలము:-</u>** మరి సంసారాసక్తుడై - ఇతరులకు అపకృతిచేసి, తన స్వార్థముకోసరము జీవించాలి అనే మనస్సు తత్వముగలిగివుండడము. అది మనస్సులో గలిగినటువంటి **"మాయామలము".**

3. **<u>కార్మికమలము :</u>** మరి పుణ్యపాపములు జేసి, జనన మరణాలను అనుభవిస్తాను అని చెప్పి - మనకు పునర్జన్మలు; పూర్వజన్మలు; గతజన్మలు; భవిషత్ జన్మలు - అన్నిటినీకూడ, అనుకుంటూ - దానికోసము పరితాపముచెందేటువంటిది - **"కార్మికమలము".** అంటే, **"కర్మచేసి"** పరితపించి తాపమనేటువంటి లక్షణము - ఇట్లా మలత్రయాలు మూడింటిలో పడి, **"పరమాత్మను"** తెలియలేక వుండారు. ఇట్లనే, **"పామర మానవులు"** - ఇవన్నీ మనకు మధ్యలో వస్తూవుండాయి కదా! అనేటువంటి **"జ్ఞానమును"** మనము సంపాదించుకోవాలి. సంపాదించుకొన్నప్పుడు - అది దగ్గరైన, దూరమైన బాధలేకోకుండవుండే నేర్పు వస్తాది.

## <u>తాపత్రయములు</u>

**38.** సీ॥ తాపత్రయంబుల ధర్మముల్ వేర్వేర వివరించి చెప్పెద విమలచరిత । దేహజన్యములైన త్రివిధరోగంబుల తాపదుఃఖంబు లధ్యాత్మికంబు । వ్యాళవృశ్చిక చోరవ్యాఘ్రాది భూతసంభవ దుఃఖములు నాది భౌతికంబు । వర్షాశనీపాత వాయురగ్ని శిలాపతన దుఃఖములు నధిదైవికంబు ॥ గీ ॥ నిట్టితాపత్రయంబుల గొట్టివేశి । ధీరుడగువాడు మోక్షాధికారి యగును ॥ రమ్య ॥

1. **ఆధ్యాత్మిక** :- ఇంక - వాత పిత్త శ్లేష్మాదుల చేత మనకు లోపల వచ్చేటువంటి దుఃఖాలన్ని **"ఆధ్యాత్మిక దుఃఖములు".**

2. **ఆధిభౌతిక** :- అట్లనే - తేళ్ళచేత; పాములచేత; దొంగలచేత; బంధువులచేత; ఈగల చేత; దోమలచేత; నల్లులచేత; మొదలైనటువంటితోవచ్చే దుఃఖమూ; ఇంక - కొడుకులు, తల్లితండ్రులు వీళ్ళందరిచేత వచ్చే దుఃఖమూ **"ఆధిభౌతిక దుఃఖము."**

3. **ఆధి దైవిక** :- ఇంక వర్షముగాని; అతివృష్టి; అనావృష్టి; భూకంపము; జలప్రళయము; వాయు ప్రళయములాంటివి - అన్ని ప్రళయములాంటివి. అకస్మాతుగా సంభవించే దుఃఖాలు **"ఆధి దైవిక దుఃఖాలు"**

ఈ మూడు దుఃఖాల లోపల మనము వుండాము. ఇప్పుడు, ఏదో ఒక అనారోగ్యము - మనస్సుకు కలత ; శరీరానికివచ్చే రోగానికి ఎట్లా మందుతింటూ వుండామో! కాని - **"మనస్సుకు"** వచ్చేటువంటి రోగాలు విపరీతమైనట్టివి. ఇవి **"ఆదులు "** - అవి **"వ్యాధులు"** - అనేటివంటియొక్క మనస్సుకు వచ్చే రోగములు జయించడము మహాకష్టము. కాబట్టి - ఇంక తాపత్రయముల చేత మానవులు కట్టుపడివుండారు. దీనిని కొట్టివేసి, **"ధీరుడైనటివంటివాడు మోక్షాధికారి యగును."** బుద్ధిమంతుడు దీనిని అర్థము చేసికొన్నప్పుడు మోక్ష స్థితిని పొందాలని అనుకుంటాడు. ఇంక ఈషణత్రయాలు చెప్పుతావుండారు.

## ఈషణత్రయ లక్షణము

ఇంక - ఈషణత్రయము - ఇవన్ని త్రయాలే చూడండి. ఎన్ని త్రయాలువుండాయో మనలో - మూడువచ్చి - మూడు ముచ్చట్లు చేసేవి అనే మాట.

39. **సీ॥ కామధర్మార్థముల్ గలుగుటకై భార్య । నిచ్చయించుటయు దారేషణంబు । సుతులులేకున్నను గతులులేవనుచును । పుత్రేచ్ఛనుండుటయు పుత్రేషణంబు । దానధర్మములచే తరియింతునని । ద్రవ్యమిచ్ఛయించుటయు**

ధనేషణంబు । ధారాదియీషణత్రయములచాతను యవనిలో సౌఖ్యంబులను భవించి ॥గీ ॥ పుణ్యలోకంబులెల్లను బొందవచ్చు । గాని మీలోన నైక్యమార్గములుగావు ॥ రమ్య ॥

ఈ ఈషణత్రయములు మూడింటినీ ప్రయత్నముచేత సంపాదించుకొంటావు. నీకు కోరిక పుట్టిన తర్వాత – కామ గుణము పుట్టిందా! **"పెండ్లి"** – భార్యను కోరుతావు ఇది **"దారేషణ"**. ఆ తర్వాత ముందుగతులను ఆలోచించుతావు. పిల్లలు లేకపోతె – నానా రకాలుగా తంటాలు పడి దేవతలకు మ్రొక్కి – మంత్రాలు చేతనో, మందుల చేతనో – పిల్లలు పుట్టేనట్లు చేసుకొంటావు – ఇది **"పుత్రేషణ"**.

ఇంక ధనేషణ – ధనముతో సుఖపడుతాను అని, బాగ కష్టపడి ధనము సంపాదన చేసుకొంటావు. ఇవన్ని, నీ ప్రయత్నముతో చేసుకోని – ఈ లోకములో – సుఖములన్ని పొందవచ్చు. కాని, పుణ్యలోకాలు వుంటాయి అని చెప్పుతున్నారు కాబట్టి – ఆ లోకములలో సుఖము పొందవచ్చు. ఇవి అన్ని క్షిణించి పోయే సుఖాలే గాని, శాశ్వతముగా **"నిలబడియుండేవి కాదు"**. అవి, నీలొ ఐక్యమయ్యేటివంటివి కాదు. ఆత్మ స్వరూపములో, ఐక్యముకాగుండ – ఇటువంటి విషయల్లో సంచరించునటువంటి మనస్సుకు – ఎప్పుడూ కూడ గమ్యము చిక్కదు కాబట్టి – అర్థము చేసుకోని ఈ **"ఈషణత్రయాలనుండి"** బైట పడాలి. ఇంక వాసనాత్రయాలు చెప్పుతారు.

## వాసనత్రయము

40. సీ॥ లోకానుసారియై లౌకికవృత్తుల వసియించుటయు లోకవాసనండ్రు । శాస్త్రపద్ధతి తపో జపక్రతు వ్రతముల వర్తించుటయు శాస్త్రవాసనండ్రు । దేహపోషణజేసి తీర్థయాత్రలకెల్ల వడిగదిరుగుట దేహవాస నండ్రు । నీ మూడువాసన లిచ్ఛయించక దేశికుల సేవజేసి దుర్గుణములణచి ॥ గీ ॥ తత్త్వమస్యాదివాక్య తాత్పర్యమెరిగి । తన్నుదాగన్న పురుషుడు ద్వైతుడగును ॥ రమ్య ॥

1. **లోకవాసన** :– ఈ వాసనత్రయాలు మనకు ఎక్కువ – లోకవాసన; దేహవాసన; శాస్త్రవాసన ఎక్కువుంటాది. ఇంక దేహములో లోకవాసనంటే – లోకానుసారముగా అందరితో మాదిరి వర్తించాల; అందరితో పాటి జీవించాలన్నది.

2. **దేహవాసన** :- ఇంక దేహవాసన గురించి - కుల వ్యవహారము, మత వ్యవహారము - దేహ సౌఖ్యములో, ఎల్లప్పుడు మునిగివుండడము.

3. **శాస్త్రవాసన** :- ఇంక - శాస్త్రవాసన - మనకు అన్ని వాసనలకంటే శాస్త్రవాసన ఎక్కువ బలయుతమైనది. ఇప్పుడు ఏకాదశి వ్రతము చేస్తె ఎట్లవస్తాది? ద్వాదశి వ్రతము చేసి, తిరుగ ఎట్ల లేపారు? జపముచేస్తె ఎట్ల? తపము చేస్త ఎట్ల? తీర్థయాత్రలు చేస్తె పుణ్యము వస్తాది. ఏమీ కూడ నీకు ప్రత్యక్ష ప్రమాణము కాకపోయిన ఈ శాస్త్రవాసనలు కాదంటే, మహానరకము అన్నట్లు ప్రవర్తించటము.

ఇప్పుడు - సత్యనారాయణ వ్రతము చేస్తారు అనుకో - ఇది శాస్త్రవాసన తప్ప ఎవరికి ఏమైనా వచ్చిందా? ఆ వ్రాసినోళ్ళు, అంత పిచ్చి ప్రపంచములో ఇంకోగటివున్నదా! కాని దానికంత ప్రాముఖ్యము ఇస్తారు. ఎందుకంటే, ఇది శాస్త్రవాసన. శాస్త్రము బలయుతము అయినప్పుడు, ఎవరు కూడ దాన్ని **"జయించడము"** కష్టమే - **బల్లి శాస్త్రమని; పిల్లి శాస్త్రమని; సగణితశాస్త్రాలని;** ఇట్ల అనేకమైనటివంటి **"భ్రాంతులు"** పుట్టించినారు. కాబట్టి - ఇట్ల శాస్త్రవాసనలచే ముడిబడివుంటాడు **"మానవుడు".** కాని, ఇవన్ని విడిచిపెట్టమని, ఎట్లా చెప్పినాడో చూడండి. ఈ ఒక దేశికుల సేవజేసి - ఈ దుర్గుణములన్ని **"మూఢనమ్మకాలని"** విడిచిపెట్టి **"తత్వమసి మహావాక్యమును గురువు దగ్గరవిని" - తత్-త్వమ్-అసి. "తత్"** అనుగా - **"ఈ సృష్టికి ఆధారమైనటువంటి పరమాత్మవు"; "త్వమ్"** - అనుగా - **"నీవు"; "అసి" అంటే, - "అయుండావు".**

ఈ సృష్టిలో కనబడె విషయాలు నీవికాదురా; అవి సత్యములు కాదు - **"కల్పితములు". "సృష్టికి ఆధారమైనటువంటి పరమాత్మ వస్తువు ఏదైతో వున్నదో, అది నీవు అని చెప్పి" - ఆ "గురు వాక్యము"** చేత దాన్ని బాగ చక్కగా వినేవాడు, ఇటువంటి వాసనత్రయాలన్ని జయించుతాడు. ఇంక వ్యాధిత్రయములు చెప్పుచున్నారు.

## వ్యాధిత్రయము

41. సీ॥ వాతంబునం దుద్భవంబైన రోగంబులు దండిగా యెనిమిది పదులునయ్యె । పైత్యమందుద్భవంబైన రోగంబు దండిగా యెనబదిరెండు నయ్యె । శ్లేష్మమందు జనించిన రోగములును యిన్నూట యిరుపైనాల్గనుచితమయ్యె । త్రివిధ రోగంబు లీతీరున మున్నూట యనబదినారుసైయెన్నికయ్యె ॥ గీ ॥ నట్టివ్యాధుల కాధారమైన దేహ । భ్రాంతి విడిచినవాడు సద్బ్రహ్మవిదుడు ॥ రమ్య ॥

వాతరోగములు – 80; పైత్యరోగములు – 82; శ్లేష్మరోగములు – 224; మొత్తము – 386 రోగాలు వున్నాయి కదా! అని తెలుసుకోని – దానికి 386 రకాల వ్యాధులకు – 386 రకాల మందులు జేసినారు. మందులు తింటావుంటే, ఏవన్నా రోగాలు పోయినాయా? అంటే, ఏమి పోలే! తినే రోగము ఇంక ఒకటి ఉద్భవమైంది – అది **387**వదిగా తయారయ్యింది. ఇప్పుడు – ఈ మందులు తినితిని – రోగాలు బాగ నాటుకొని పొయ్యాయి కాబట్టి – ఇన్ని రోగములుకు ఆస్పదమైనటివంటిది – ఈ శరీరము అని చెప్పి **"దీన్ని విడిచి పెట్టినతండు సద్బ్రహ్మవిదుడు"** – అంటే, **"నిజముగా బ్రహ్మమును"** తెలిసినటువంటివాడు అని. ఇన్ని కలిగినటు వంటిదానికి జన్మహేతు లక్షణాన్ని చెప్పుతావుండారు ఇప్పుడు:

## జన్మహేతు లక్షణము

42. సీ॥ ఆత్మయందునమాయ యారోపితంబయ్యె । మాయయందజ్ఞాన మపుడుగల్గె । అజ్ఞానమునదోచె నవివేక మవివేక । మందున నభిమాన మమరబుట్టె । నభిమానమందు రాగాదులుద్భవమయ్యె । రాగాదులందు కర్మంబు బొడమె । కర్మమువల్లను కడలేని సుఖ–దుఃఖ । మూలమైన శరీరములు జనించె ॥ గీ ॥ నీ విధంబున దేహంబులెత్తి జనులు । నిన్ను గనలేరు నిరుపమ నిర్మలాత్మ ॥ రమ్య ॥

ఇప్పుడు – ఆత్మయందున మాయ ఆరోపితమైయింది. ఇప్పుడు ఆత్మ అంటే, ఇది కథలాగానా! అనుభవముగానా! అని బాగ ఆలోచన చేస్తే – **"ఆత్మ"** అంటే

ఇప్పుడు ఎవరు? **"నేను"** అనేటివంటి **"ఆత్మయందున"** మాయ ఆరోపితమైయింది. ఇప్పుడు సుషుప్తి అవస్థలో దేహము – ప్రపంచమువున్నా – లేనట్లు గావుంది. అప్పుడు **"ఆత్మ"** నిర్గుణ స్థితిలో వున్నది. అట్లా నిర్గుణ స్థితిలోవుండిన టువంటి – ఆత్మయందున దేహాది ప్రపంచము ఆరోపితమయివుంది. త్రాటియందు పాము ఎట్లా ఆరోపించబడివుందో, ఆ **"నిర్గుణ బ్రహ్మమందున"**– ఈ **"నకార ప్రపంచము"** ఆరోపించబడింది. ఈ మాయ కనబడతానే – ఈ ఆకారము కనబడతానే – నేను **"ఆత్మ"** అనేది మరిచిపోయింది. నేను దేహమే అనుకొన్నది; **'నేను'** ప్రపంచమే అనుకొన్నది. పాము అన్నను – ఆత్మజ్ఞాన రూపమును ఎప్పుడు ధరిస్తదో, అప్పుడే మనకు నిర్గుణము మంచిపోతాది. అందుకే, **"సగుణము – నిర్గుణము"** అని నీకు రెండు పొరలువుండాయి. సగుణములో కొంత కాలము; నిర్గుణములో కొంత కాలము వుంటావు. కాని, సగుణము – అశాశ్వితము; నిర్గుణము – శాశ్వతము; అని అంటావు. నిర్గుణము శాశ్వతము అని అంటే, నిర్గుణముగా వుంటేగాని, శాశ్వతముగా వుంటాదో ఏమోగాని, అది నిర్గుణముగావుండదు – సగుణము అయితాది. **"నేను బ్రహ్మను", "నేను ఆత్మను", "నేను సాక్షిని," "నేను జడమును కాదు" – "నేను చైతన్యుడను" అనేది గుణమేకదా!** అనుకుండే గుణము, ఎప్పడైతేవుందో – అప్పుడే, అన్ని గుణాలు. దానికి ఆవరిస్తాయి – ఇంక వేరే అవసరములేదు.

ఇప్పుడు – **"పరిపూర్ణముంది"** – అది నేను పరిపూర్ణము అని అనదు. అందుకే, దానికి కృష్ణప్రభులు అన్నారు! ఒరే! నిర్గుణుడనని నీవు అంటావుండావు – **'నేను'** నిర్గుణముగవుండే వస్తువు అయితే; అది అనసే అనదు. అది అందుకు "అహం" **అనదుకదా "అచలము"! అది "అహం" నేను అనదుకదా! "అహం" వున్నదో లేదో – చూడదు అది నిజమే కదా! "అహంను" పుట్టించదు కదా! "అహం" ఉదయించేకి – ఇదివరకూ అది వున్నది కదా! ఇది పుట్టకనే అది వున్నది కదా! " ఈ "అహమే" ఈ విశ్వమై నిలిచింది కదా! "అహమే తాను లేను అని యెరిగితే సరి కదా! ఇది సరియైన మార్గము నాయన – మల్లా దీనిని**

నిర్గుణముగా చేసుకొని వుండేది మంచిది కాదు అని చెప్పేనటువంటిది " **మన పరిపూర్ణ బోధ** ".

కాని – ఇప్పుడు **"ఆత్మపైన నీవు"** – జన్మహేతువు ఎట్లా వచ్చిందంటే? ఎప్పుడు నీయందు ఆరోపింపబడి వుండేటివంటి దేహాది ప్రపంచమును, నీవు చూస్తావో – అప్పుడు **"అజ్ఞానము"** వచ్చింది. అంటే, నిన్ను నీవు మరిచి పోయే చీకటి వచ్చింది. ఎప్పుడు అది వచ్చిందో? అజ్ఞానము, అవివేకము వచ్చింది. **"అవివేకము"** అంటే, **"నిత్యానిత్యవస్తు వివేక జ్ఞానము"** కోల్పోయింది. వివేకము కోల్పోతానే, **"అభిమానము"** పుట్టింది. కనబడిందే సత్యము – ఇదే "నేను అనేటువంటి అభిమానము" – అంటే, ఎదురుగావుండేటువంటిది **"నేను" అనే అభిమానము.** అట్లా అభిమానించే దాన్ని అభిమానము అంటారు – ఇట్లా అభిమానమైయింది. అభిమానము ఎట్లా అవుతుందో, అప్పుడు నీకు రాగద్వేషాలు మొదలైతాయి. వీరు నావారు; నేను బాగవుండాలి; వారు వేరే; వాళ్ళకు నాకు సంబంధములేదు అన్నట్లుగా, ఒకరిమీద రాగము; ఒకరిమీద ద్వేషము – ఇట్లా మొత్తము శరీరములో, నీకు నచ్చిన దానిమీద రాగము; నీకు నచ్చని దానిమీద ద్వేషము. ఇది నీకు కర్మము పడదింప (పెంచేదానికి) చేసేదానికి కారణమైయింది. అది ఎప్పుడు నాది అనుకొంటావో అప్పుడు దాని పని చేస్తావు. ఎప్పుడు నాది కాదు అనుకొంటావో దానికి వ్యతిరేకమైన పని చేస్తావు. దీంట్లోను కర్మమువుంటాది – దాంట్లో కూడా కర్మమువుంటాది. ఈ **"కర్మవల్లనే"**, ఇంక **"నీకు సంకల్ప రూపమైన జన్మాలు వస్తానే వుంటాయి".** ఇదే జన్మహేతువు యొక్క లక్షణము.

## <u>ప్రపంచ భ్రాంతి లక్షణము</u>

ఇంక – ప్రపంచ భ్రాంతి ఎట్లాతోచింది నీకు? ఈ అభిమానము ఎట్లా కలిగింది? అనే దానికి క్రింద చెప్పుతారు.:

**43. సీ॥ రాతిరిపడియున్న రజ్జువంతటజూచి భ్రమిసిపామని భయపడిన యటుల । శుక్తిదూరంబునజూచి వెండియటంచు ప్రబలిన యాశచేభ్రమసినట్లు । దండకారణ్యా మందెండు మొద్దునుజూచి దొంగవాడని భీతిదోచినట్లు । కలలోన వస్తువుల్**

గనిమేలుకొని యా వస్తువుల్ పెదకులాడినట్లు ॥ గీ ॥ నరులు సత్యము జగమని నమ్మినారు । జ్ఞానపథమందు నిజరూపు గానలేక ॥ రమ్య ॥

జ్ఞాన పథములో తెలియనటువంటివారికి, ఇది ఎట్లా కనబడతాది అంటే – రాత్రి; అంటే, సం దెచీకటి వేళ పడియున్నటివంటి త్రాటియందున పాము ఆరోపించబడినట్లు; ముత్యము చిప్పను దూరముగా జూసి వెండి అని, దాని మీద ఆశ పెంచుకొన్నట్లు; దండకారణ్యమందు యెండిన మొద్దును జూసి దొంగవాడని భయపడినట్లు – భీతి పొందినాడు వీడు. కలలోన వస్తువులగని మేలుకోని, అది సత్యమే అని భ్రమకులోనై, ఆ వస్తువులను పెదుకులాడినట్లు – **"నరులు సత్యము జగమని నమ్మినారు – జ్ఞానపథమందు నిజరూపుగాన లేక"**. అంటే, **"జ్ఞాన రూపముతో పెద్దల ద్వార నీ నిజ స్వరూపాన్ని తెలియలేక"** – కల్పిత వస్తువులు సత్యమునేటువంటియొక్క లక్షణము తోచింది. ఇప్పుడు, ఈ ఉపమానాల చేత ఇక్కడ **"అనాత్మ లక్షణము"** ఏది? **"ఆత్మ లక్షణము"** ఏది? అనేటివంటి విమర్శ ఇప్పుడు కలుగుతావుంది. ఇప్పుడు అనాత్మ లక్షణమును చెప్పుతారు.

## అనాత్మ లక్షణము

44. సీ॥ జన్మాస్థవృద్ధులు క్షయపరిణామ వినాశములు షడ్విధవికారము లనాత్మ । ఘనబాల్య యౌవన కౌమార వార్ధక్యములు జాగ్రదాద్యవస్థలు ననాత్మ । కమనీయ మదహంకార భూజలహుతాశన శమీరాంతరిక్షములనాత్మ । త్రిగుణముల్ స్థూలాది దేహత్రయంబు లన్నమయాది పంచకోశములనాత్మ ॥ గీ ॥ యంతరింద్రియ బాహ్యేంద్రియము లనాత్మ । దృశ్యరూపంబు శృతమును దృక్కనాత్మ ॥ రమ్య ॥

ఇప్పుడు – మనకు ఇది **'కల్పిత జ్ఞానము తెలిసినట్లే కదా!"** త్రాడు అని జూసి పాము అని; ఎండిన మొద్దును జూసి దొంగవాడు అని; ముత్యము చిప్పను జూసి వెండి అని; కలలోన వస్తువులను మేల్కోని పెదకినట్లుగా – ఇవన్నీ కూడ మనకు అనుభవములోవుండేటువంటివి – కాని అలింగ పదార్థాలు. అంటే, విచారించితే అప్పుడే, లేకోకుండ పోతావి. ఇక్కడ విచారించిన వుంటాయి ఇవి – వుండినా కూడ దీన్ని

అంటకుండవుండే, లక్షణాన్ని మనకు పెద్దలు నేర్పిస్తారు అన్నమాట. ఇక్కడ, అనాత్మ ఏదో? దాన్ని విమర్శిస్తారు:

"జన్మాస్థవృద్ధులు క్షయపరిణామ వినాశములు షడ్విధ వికారములనాత్మ"

ఈ ఆరు వికారాలు వున్నాయి - షడ్ భావ వికారాలు: అస్థితే, జాయతే, వర్ధతే, పరిణమితె, అపక్షయతె, విఫశ్యతె - అనేటివంటి ఈ ఆరు వికారములు కనిపడేవంటి **"స్థూలమంత - అనాత్మ";** ఇంక శరీరమీదవచ్చే అవస్తలు వుండావి.

"ఘనబాల్య యౌవన కౌమార వార్ధక్యములు జాగ్రదాద్యవస్థలు ననాత్మ"

ఇంక - నీ ఎదుట వచ్చేటివి - బాల్యము; కౌమారము; యౌవనము; వార్ధక్యము - ఇవి అనాత్మ. అట్లనే, గృహస్థము; వానప్రస్థము; సన్యాసము; అవధూతలాంటి ఆశ్రమాలు కూడ, ఈ శరీరమందే వుండేది కాబట్టి, ఇవి **"అనాత్మ పదార్థాలే".**

" త్రిగుణముల్ స్థూలాది దేహత్రయంబు లన్నమయాది పంచ కోశములనాత్మ". "కమనీయ మదహంకార భూజలహుతాశన శమీరాంతరిక్షములనాత్మ"

అహంకారము; ఆకాశము; వాయువు; అగ్ని; జలము; భూమి - ఇవన్నీ కూడ అనాత్మ పదార్థములే. రజోగుణ, తమోగుణ, సత్వగుణాలు; - స్థూల, సూక్ష్మ, కారణ, శరీరాలు; - మరి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ , ఆనందమయ - అనే, పంచకోశములు **"ఇవన్ని అనాత్మలే"**

"అంతరింద్రియ బాహ్యేంద్రియములనాత్మ । దృశ్యరూపంబు శృతమును దృక్కనాత్మ"

ఇంక - అంతరింద్రియములు - బాహ్యేంద్రియములు పది ( అంతరింద్రియములు- 5; బాహ్యేంద్రియములు - 5; = 10) ఇవన్ని కూడ సత్యవస్తువులు కాదు **"అనాత్మ పదార్థాలే".** మరి దృక్; దృశ్యము; శ్రోతము - త్రిపుటులు వుండేటువంటి; త్రిపుటులు

- ద్వీపుటులు - అన్ని కూడ **"అనాత్మ పదార్థమే"**. ఇప్పుడు నీవు ఎవరయ్యి వున్నావంటే, **"నీవు ఆత్మ స్వరూపుడువైవున్నావు"**.

ఇక్కడనుండి ఎప్పుడైతే - ఈ **"అనాత్మ అనే భావము"** వచ్చిందో, వాటన్నిటి మీద మనస్సు - వైరాగ్యము వచ్చి, ఇంక **"పరమాత్మ వైపుకు ప్రయాణము చేయాలి."** ఈ సృష్టి క్రమమంత ఇంతవరకూ వచ్చింది. ఇప్పుడు సుమారుగా 44 పద్యాలు - సృష్టిలో తాను కల్పన చేసుకొంటూ - బంధాన్ని ఏర్పరచు కుంటూవుంటుంది. ఇంగ ఇక్కడనుండి దానికి మల్ల **"పరమాత్మ వైపుకు - జ్ఞానానికి తోచినటువంటి అజ్ఞానాన్ని ఎలా నివృత్తి చేసుకోనాల్నో"** అది సాధన చతుష్టయ సంపత్తికలిగి - అరిషడ్వర్గాలను జయించి మరి **"పరమాత్మ స్థానానికి"** ఎలా ఎక్కి పోవాలో? - ఇప్పుడు ఇక్కడనుండి ప్రారంభమవుతుంది.

## సాధన చతుష్టయ సంపత్తి

**45.** సీ॥ సత్యంబు బ్రహ్మమసత్యంబు సర్వప్రపంచంబుయని విమర్శించు
వాడు । యిహపర సౌఖ్యంబు లిచ్ఛ గింపక నుండి పాపపుణ్యంబుల బడని
వాడు । శమదమంబులు శాంతి శ్రద్ధోపరతి తితీక్షలు సతతంబును గలుగు
వాడు । మోక్షంబునందు నపేక్షవిస్తారమేకాని యేయపేక్షలేనివాడు ॥ గీ ॥ గురు
కటాక్షంబు చేతను గురుతెరింగి । యసిపదంబగు నీయందు నైక్యమగును ॥ రమ్య ॥

ఇప్పుడు - నిత్యానిత్యవస్తువివేకము; ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము; శమాది షట్కసంపత్తి ముముక్షత్వము - అనేటువంటిది మనకు, ఈ సాధన చతుష్టయములో చెప్పారు. అంటే, ఇప్పుడు మనము మొట్ట మొదట ముముక్షత్వము అనే చెప్పుకోవాలి. మోక్షముమీద అపేక్ష కలిగినప్పుడే, అదంత వస్తాది. మొట్ట మొదట యొక్క **"సాధన ముముక్షత్వము - మోక్షముమీద అపేక్ష కలగాలి."** - ఎలా వుండాలంటే, ఇదిగో - ఈ రకముగా - ఇట్లు:

"ఇల్లు అగ్నిదగులుకోని మండేటపుడు, ఇంటిలోవుండేవాడు ఎంత తీవ్రముగా బైటకి పోవాలని జూస్తాడో; పాము వెంటపడినప్పుడు, ఆ పాముబాధనుండి - తప్పించికోవాలని ఎంత తీవ్రముగా చూస్తాడో; అడవిలో - దారి తప్పినప్పుడు నిజమైన దారి -

ఊరుకోసము ఎంత పరితాపము చెందుతాడో; పులి వెంబడించినప్పుడు; దొంగలు వెంటపడినప్పుడు – వారినుండి తప్పించుకొనేదానికి ఎట్లా చూస్తాడో – అట్లా" ఈ శరీరములో వీళ్ళందరూ మనకు వుండారు. "**తాపత్రయము**" అనే, "**అగ్ని**" నిరంతరము – ఈ "**తనువును**" కాల్చుతూవుంది కాబట్టి, దీని బాధనుండి ఎలా తప్పించుకోవాలి – "**అహంకారము**" అనేటువంటి బెబ్బులిపులి వెంటపడి నిరంతరమూ అభిమానాన్నీ పెంచుతావుండి – దీని బాధనుండి ఎలా తప్పించుకోవాలి; "**తనను తాను యెరగకుండ**" తనువునే "**నేను**" అనే భ్రాంతిచేత అడవిలో త్రోవతప్పి వుండానే – ఇప్పుడు నాయొక్క స్థితి ఏమి? గతి ఏమి? నాకి ఎవరు నిజమైన మార్గము చూపిస్తారాని పరితాపము చెందాలి. ఇంక శమాదిషట్క సంపత్తి చెప్పుతావుండారు.

## శమాదిషట్క సంపత్తి

**46.** సీ॥ అంతరింద్రియ నిగ్రహంబు శమంబుగు బహిరింద్రియములని గ్రహముదమము । యరిషట్కవర్గంబు నణచుట శాంతియు సుఖ దుఃఖముల సహించుట తితీక్ష । వేదాంత శాస్త్రముల్ విని విమర్శించి సద్గురు నందు భక్తి గల్గుటయు శ్రద్ధ । కర్మంబులును బ్రహ్మకర్పించి హృత్పర బ్రహ్మసంగంబుపరతియటంచు ॥ గీ ॥ నెరిగి నడిచినవాడు యోగీశ్వరుండు । నతడు ముఖ్యుండు నార్యుండు నచలితుండు ॥ రమ్య ॥.

ఇంక – **రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు** – అనే దొంగలు, జ్ఞానములో స్థిరత్వము లేకోకుండ – నిరంతరము – నాకు "**జ్ఞానరత్నాన్ని**" అపహరించితావుండారే – ఈ దొంగలు? ఈ దొంగలను నేను ఎలా జయించాలి, అనేటువంటియొక్క భావము వుండాల. ఇంత తీవ్రమైన ఇచ్ఛ కలిగినటువంటేవాడే, సరియైన సద్గుణాలను సంపాదించుకొని – **శమము; దమము; ఉపరతి; తితీక్ష; శ్రద్ధ; సమాధానము సంపాదించుకొని; పెద్దల దగ్గిర శ్రవణము చేయాలి.**

1. <u>**శమము**</u> :– శమము అంటే, అంతరింద్రియ నిగ్రహము. "**శ్రవణము చేసేటపుడుగాని**"– "**పెద్దల దగ్గర సేవచేసేటపుడుగాని**" – "**మనస్సు**" పరాదీనము కాగూడదు. అంటే, మనస్సులో – వేరే చింతలు, చికాకులు రాకూడదు.

ఊరుకోసము ఎంత పరితాపము చెందుతాడో; పులి వెంబడించినప్పుడు; దొంగలు వెంటపడినప్పుడు - వారినుండి తప్పించుకొనేదానికి ఎట్లా చూస్తాడో - అట్లా" ఈ శరీరములో వీళ్ళందరూ మనకు వుండారు. **"తాపత్రయము"** అనే, **"అగ్ని"** నిరంతరము - ఈ **"తనువును"** కాల్చుతూవుంది కాబట్టి, దీని బాధనుండి ఎలా తప్పించుకోవాలి - **"అహంకారము"** అనేటువంటి బెబ్బులిపులి వెంటపడి నిరంతరమూ అభిమానాన్నీ పెంచుతావుండి - దీని బాధనుండి ఎలా తప్పించుకోవాలి; **"తనను తాను యెరగకుండ"** తనువునే **"నేను"** అనే భ్రాంతిచేత అడవిలో త్రోవతప్పి వుండానే - ఇప్పుడు నాయొక్క స్థితి ఏమి? గతి ఏమి? నాకి ఎవరు నిజమైన మార్గము చూపిస్తారని పరితాపము చెందాలి. ఇంక శమాదిషట్క సంపత్తి చెప్పుతావుండారు.

## శమాదిషట్క సంపత్తి

**46.** సీ॥ అంతరింద్రియ నిగ్రహంబు శమంబుగు బహిరింద్రియములని గ్రహముదమము । యరిషట్కవర్గంబు నణచుట శాంతియు సుఖ దుఃఖముల సహించుట తితీక్ష । వేదాంత శాస్త్రముల్ విని విమర్శించి సద్గురు నందు భక్తి గల్గుటయు శ్రద్ధ । కర్మంబులును బ్రహ్మకర్పించి హృత్పర బ్రహ్మసంగంబుపరతియటంచు ॥ గీ ॥ నెరిగి నడిచినవాడు యోగీశ్వరుండు । నతడు ముఖ్యుండు నార్యుండు నచలితుండు ॥ రమ్య ॥.

ఇంక - **రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు** - అనే దొంగలు, జ్ఞానములో స్థిరత్వము లేకోకుండ - నిరంతరము - నాకు **"జ్ఞానరత్నాన్ని"** అపహరించితావుండారే - ఈ దొంగలు? ఈ దొంగలను నేను ఎలా జయించాలి, అనేటువంటియొక్క భావము వుండాల. ఇంత తీవ్రమైన ఇచ్ఛ కలిగినటువంటేవాడే, సరియైన సద్గుణాలను సంపాదించుకొని - **శమము; దమము; ఉపరతి; తితీక్ష; శ్రద్ధ; సమాధానము సంపాదించుకొని; పెద్దల దగ్గిర శ్రవణము చేయాలి.**

1. **<u>శమము</u> :-** శమము అంటే, అంతరింద్రియ నిగ్రహము. **"శ్రవణము చేసేటపుడుగాని"- "పెద్దల దగ్గర సేవచేసేటపుడుగాని" - "మనస్సు"** పరాదీనము కాగూడదు. అంటే, మనస్సులో - వేరే చింతలు, చికాకులు రాకూడదు.

అంటే, మనస్సులో వేరే చింతలు వచ్చినాయంటేగాని – అది అంతరింద్రియ – నిగ్రహము అనుపించకోదు. అంతరింద్రియాలు నిగ్రహించాలంటే – **"ఎక్కడ ఏ పనులు చేసేకాడైనగాని – ఏకాగ్రతగా పెట్టినప్పుడే"**, ఆ పని బాగవుతుందిగాని – లేకపోతే కాదు. ఆ రకముగానే, ఏకాగ్రతతో నిగ్రహముగా చేయాలి. శ్రవణము చేసే కాలములో – అవి **"విపరీత భావన"** – **"అసంభావన"** రాకోకుండ – శాస్త్రవాసన పదే పదే అడ్డుతగులుకోకుండ, **"గురువుచెప్పిన మాటనే మనము రమిస్తా"** – దానినే మనము ఆలోచిస్తావుండేటువంటిది **"అంతరింద్రియ నిగ్రహము"**.

2. **<u>దమము</u> :-** అట్లనే, బాహ్యేంద్రియములు కూడ – బైట విషయాల మీద పోనీయకుండ – గురువుపైపే చూస్తు – గురువు ప్రక్కనే, ఏకాగ్రతముగా గమనిస్తూవుండి, బాహ్యేంద్రియాలు కూడ – అదుపులో పెట్టుకోవాలని అర్థం. ఇది **"బాహ్యేంద్రియ నిగ్రహము"**.

3. **<u>ఉపరతి</u> :-** ఇంక – ఉపరతి ఆత్మయొక్క స్వరూపాన్ని తెలిసి – **"ఆత్మయందునే రతి చేయాల"**. **"ఆత్మస్వరూపము"** తెలియనప్పుడు – గురుడు చేప్పేటువంటి మాటలలో వుండేటువంటి సారాన్ని, ఆ అర్థాన్ని మాత్రమే, మనస్సులోకి తెచ్చుకోవాలి. అందుకే, **"ఉపరతి"** అంటే ఎట్లా శరీరాన్ని కూర్చొపెట్టి వింటూవుండామో – గురువు మాటల దగ్గర, గురువనె మాటని ఆనికోని – మాటలోవుండేటువంటి అర్థాన్ని – ఆ **"అమృతమును"** రమించేటువంటి గుణాలు కావాలి మనస్సుకు – అది **"ఉపరతి."** ఇంక తితీక్ష.

4. **<u>తితీక్ష</u> :-** తితీక్ష – గురువులు దగ్గర ఓర్పు – త్వరలో కోల్పోతారు శిష్యులు. ఏది అడిగనప్పుడు మా స్వామి తెలిసింటే – ఏమిటికి చెప్పడు అనేది; చెప్పిందే, పది సార్లు చెప్పుతాడు – మాకు చిరాకు వస్తాది అనేది; ఊరుకే ఊరుకేసె – మా స్వామి కోపముచేసుకొంటాడు అనేది – ఇవన్నీ కూడ మన ఓర్పుని నశింపచేసే గుణాలు. ఏది ఏమైన కూడ – **"చంద్రకిరణాలకి ఎదురు చూసే, చకోర పక్షిలాగ"** పెద్దల దగ్గర,

ఆ ఒక్క మాట కోసరమే – పరితాపము చెంది, మిగితావన్ని మనస్సులోకి రానీయకుండ చేసుకోనేటువంటిదే, **"నిజమైన తితీక్ష".** ఇంక శ్రద్ధ.

5. **<u>శ్రద్ద</u> : –** ఇప్పుడు – పది గంటలకు మనము ఉపన్యాసము ప్రారంభము చేసుకొంటామంటే, ఇంకొక్క ఐదు నిమిషాలు ముందే పోయివుండాల అనేటివంటిది వుంటాదో – దీనికి, పరపురుషుని గమన వున్నటువంటి స్త్రీ ఇంటిలో అన్ని పనులను చేసుకొంటూవున్న, దానిమీద శ్రద్ధ ఎట్లా వుంటాదో, ఆ రకముగా మనకు సమస్త సంసార తాపత్రయాలు వున్నప్పటికీ కూడ – ఈ తాపమును చల్లారచేసేటువంటి చక్కనైన బోధ – **"ఏ గురుదేవుడు"** చెప్పుతాడో, ఆ గురుదేవుని బోధవినేదానికి; వాళ్ళ సేవజేసెదానికి శ్రద్ధను కనపరిసేదానిని **"శ్రద్ద అంటారు".** ఇంక సమాధానము.

6. **<u>సమాధానము</u> :–** సమాధానము అనే భూమిక – మన మనస్సుకు తగిన బోధ, **"గురుడు"** చెప్పినప్పుడు, మన మనస్సు – అందులోవున్నటివంటి అర్థాన్ని గ్రహించినప్పుడు – ఇంక నాకు సందేహము లేదప్ప – ఇంక నాకు – సందేహము తీరిపోయింది అన్నప్పుడు – సమాధానము ఏర్పడుతాది. ఇంక సాధన చతుష్టయ సంపత్తి చెప్పుతారు:

## <u>సాధన చతుష్టయ సంపత్తి</u>

1. **<u>ఇహామూత్రార్థఫలభోగవిరాగము</u> :–** ఈ ఆరు ఒక సంపత్తులుగలిగి – ఇహామూత్రార్థఫలభోగవిరాగాలను సంపాదించుకోవాలి . **"ఇహము"** అంటే – ఇప్పుడు మనము అనుభవించేది. భార్య; బిడ్డలు; ధన ధాన్యములు; ఈ సుఖములు; **"ఆమూత్రకములంటే"** – స్వర్గ; వైకుంఠ; కైలాస; సత్యలోకాలలో వచ్చేటువంటి సుఖములు. ఇవి ఎట్లా అపద్ధముల్లై పోతావుండాయో, అవి కూడ మనము సంపాదించిన పుణ్యాము అయిపోతానే – అవి కూడ క్షీణించి పోతావుంటాయి కాబట్టి, నశించి పోయేటువంటి సుఖాలు – నాకు ఏమీవద్దు అని చెప్పి – **"ఇహామూత్రార్థఫలభోగ విరాగము కలగాలి".** ఇంక నిత్యానిత్యవస్తువివేకము;

2. <u>నిత్యానిత్యవస్తువివేకము</u> :- ఇంక - నిత్యానిత్యవస్తువివేకము ఎట్లా రావాలి? నిత్యానిత్య వస్తు జ్ఞానమువుంటే చాలదా? అంటే **"వివేకము"** - అనుభవముతో కూడినటువంటిది **"జ్ఞాన విజ్ఞాన సహితం; యజ్ఞత్వ మోక్షస శుభాత్"** - అన్నట్లు - శాస్త్రజన్య జ్ఞానము **"అనుభవ జ్ఞానముతో"** కూడినప్పుడు - అది విజ్ఞాన మవుతుంది. అట్ల మనము విన్నటువంటి **"జ్ఞానానికి"**, ఆ **"పరమాత్మ"** సాక్షాత్కారసదనానికి - ఇప్పుడు **"నిత్యుడు; నిరాకారుడు; సర్వవ్యాపకుడు"**; - సకలదేశాలలో, సర్వకాలాలలో, సమస్తమైన వస్తువులయందు **"ముల్లు కుచ్చేదానికి సందు లేకోకుండ వున్నటువంటిది"** అని, మనము శాస్త్రము విన్నాము అనుకో, అట్ల శాస్త్రము విని - శాస్త్రాన్నీ అనుకుంటువుంటే, మనకు ఎన్నాళ్ళకి కడతేరుతుంది? ఆ వస్తువుని **"గురువు దగ్గర అనుభవజ్ఞానముగా"** - ఇదిగో! - ఆ వస్తువు ఇట్ల చూడు - ఇదిగో, **"సర్వదేశాలలో; సర్వకాలాల్లో; ఇదే వున్నదని"** - **"సమస్తమునకు యెరుకే"** మూలము నాయనా! **'మనస్సే'** అన్నిటికి మూలము. ఇది లేకపోతె సుఖముగావుంటాది అని మనము శాస్త్రము చదివినాము అనుకో! ఆ మనస్సు, ఆ **"యెరుకంటే"** ఏది? అది లేకుండవుండే స్థితి ఏది? అది వుంటే ఎట్లావుంటాది? అనేటువంటి రెండును ఇవి **"గురువు చూపించినప్పుడు - హస్తమస్తక సంయోగముచేసి - "ఆ యెరుక స్వరూపము నీవే అని చూపించినప్పుడు"** - ఈ శాస్త్రార్థానికి అనుభవార్థము మనకు లభ్యమైతాది.

ఇట్లా - నిత్యానిత్యవస్తు వివేకము - మనకు చక్కగా కలిగినప్పుడు - ఆ ఒక్క బోధే పవిత్రమైనటువంటిది. ఇంక, ఇవన్ని సాధన చతుష్టయ సంపత్తి అయిపోయిన తర్వాత, మానవునికి - ఇంక **"పరిపూర్ణబోధ సద్గురువుని ఆశ్రయించే లక్షణము వస్తాది"**. ఈ సాధన చతుష్టయము సంపాదించిన తర్వాత వానిలో వుండేటువంటి అరిషడ్వర్గాలు ఎలా అణిగివుంటావి? వాడు జయించే పద్దతి ఎట్లా? మరి ఈ అరిషడ్వర్గాలు వానికి అడ్డము వస్తావుంటే వాడు ఎలా కడతేరుతాడు? అనే దానికి అరిషడ్వర్గములు అడ్డము రాకోకుండ చేసుకోసెదానికి మనకు పెద్దలు, ఈ సాధన చతుష్టయము సంపాదించిన తర్వాత - తారకోపదేశము పొందే ముందర - ఈ పద్యాన్ని పెట్టినారు. ఇప్పుడు అరిషడ్వర్గాలు చెప్పుతావుండారు.

## అరిషడ్వర్గములు

47. సీ॥ కోరుటకామంబు కోరినకోరికె కొనసాగకుండిన క్రోధమగును। వచ్చినద్రవ్యంబు వదలకుండుట లోభమాధనాపేక్ష మోహంబు యగును। ధనమున్నదని మొదమునమబ్బి నాకేమి కొదువని గర్వించినది మదంబు। తన ద్రవ్యమపహరింతమనేటి జనులందు మది నీర్ష్యయుంచుట మత్సరంబు ॥గీ॥ గనుక నీ శత్రువర్గషట్కములణంచ్చి। శాంతి జెందిన పురుషుండు సర్వసముడు ॥ రమ్య ॥

ఇప్పుడు కోరుట కామము – ఆ కోరికలు నెరవేరకపోతే, ఆ కోరిక క్రోధముగా మారుతాది. ఆ కోరిక నెరవేరి – ఆ ద్రవ్యము వచ్చిందా! కామము, క్రోధమైనాక లోభమైతాది – అంటే, అది నాకే కావాల. ఆ వస్తువు మీద లోభము వచ్చిన తరవాత ఏమి జేస్తాడు? దాన్ని మోహిస్తాడు – మోహించిన తరవాత వీనికి ఏమి పుట్టుతుందంటే, ఒక గుణము చూడు – ఇన్ని గుణాలుగా మారుతుంది – షణ్ముఖుడు వీడు. ఆరు ముఖాల స్వామి ఎక్కడ వుండాడంటే? ఇదిగో ఇక్కడే వుండాడు. ఒక్కడే, ఆరు ముఖాలు అయ్యివుండాడు. ఈ ఒక మోహము అవుతానే – ఇంక మదము వస్తాది. ఇంక మదము వస్తానే, స్వార్థము; శత్రువులను తయారు చేసుకొంటాడు. ఇంక అందరి మీద మత్సరమే – ఇంక వానికంటే బాగ బ్రతకరాదు; వాని ధనాన్ని ఎవరు అడగరాదు; ఎవరూ అపేక్షించరాదు – అట్లావుంటేనే, వీనికి సరిపోతాది. ఇట్లా మత్సర గుణము వస్తాది. ఇట్లా, ఈ అరిషడ్వర్గాలను జయించినటువంటివాడు – గొప్పవాడు అని, ఈ కామ క్రోధాదులయొక్క విషయాన్ని తెలియజేసి – సాధన చతుష్టయాన్ని చెప్పుతారు. సాధనచతుష్టయము సంపాదించుకొన్న తరవాత గురువు దగ్గరికి పోయే విధానము చెప్పుతున్నారు.

## తారకయోగము – ఉపదేశక్రమము

48. సీ॥ సాధన చత్వారిసంపత్తియును గల్గి పరిపూర్ణుడైన సద్గురుని జేరి ద్వాదశసాష్టాంగదండంబు లర్పించి తనుమనః ప్రాణముల్ ధార బోసి। భక్తితోనాత్మాంగ భావసుస్థాన శుశ్రూషలు జేసి సంతోషపరచి। నట్టి శిష్యుని మెచ్చి గట్టిగా గురుమూర్తి త్రివిధదీక్షలొనర్చి దివ్యముగను ॥ గీ ॥ హస్తమస్తక సంయోగ మంచితముగ। జేసినిజకేవలాత్మోపదేశమొసగు ॥ రమ్య ॥ "

ఇట్లా - సాధన చతుష్టయ సంపత్తిగల్గి - ఏ గురువునంటే, ఆ గురువును పట్టుకోకుండ, "**పరిపూర్ణభావము తెలిసినటువంటి పరిపూర్ణుడైన సద్గురువును చేరి**" - "**ద్వాదశి సాష్టాంగ దండ ప్రణామములర్పించి -తనుమనప్రాణములను శాస్త్రోక్తముగా ధారపోసి; భక్తితో - ఆత్మ, అంగ, స్థాన, భావ సేవలుజేసి**" - సంతోషపరచిన శిష్యుని మెచ్చి - అంటే, గురువును సేవ చేత సంతోష పెట్టాలి. మనము వస్తు వాహనములిచ్చి సంతోషపెట్టితే, అది అంత బాగవుండదు. మూడు పద్ధతులువుండావి - గురువు దగ్గర విద్యని గ్రహించుటకు:

**(1)** ధనము ఇచ్చి విద్యను గ్రహించేది ఒక పద్ధతి;

**(2)** సేవజేసి విద్యను గ్రహించేది ఒక పద్ధతి;

**(3)** తాను నేర్చిన విద్యను గురువుగారికి ధారపోసి, మళ్లా గురువు ద్వార "బ్రహ్మవిద్య పొందేది" ఒక పద్ధతి;

ఇట్లా - ఈ విద్యాధనములు ధారపోసి - వినినటువంటి బోధతో, కోరిక మాత్రమే, తీరుతుందిగాని - భావశుద్ధి కలగదు. సేవజేసి క్రమపద్ధతిగా విన్నట్టివానికి సిద్ధికలుగుతాది. "**భావసిద్ధి; ఆత్మ శుశ్రూషలు; అంగ; భావ; సుస్థాన గురువుగారికి, ఈ ఒక చతుర్విధ సేవలు చేయాలి**". ఆ చతుర్విధ సేవలు - "**బాహ్యముగ తప్పకుండ గురువుకు స్థాన సేవ; అంగసేవ; భావ సేవ; ఆత్మ సేవ ఈ నాల్గు విధముల సేవలు చేయాలి:**"

## <u>బాహ్యా సేవ</u>

(1) <u>స్థాన సేవ</u> :- గురువు వుండేటువంటి పరిసరాన్ని శుభ్రపరచడము - ఆశ్రమముగాని; గృహముగాని; గురువుగారి ఇంటికిగాని - పోయినప్పుడు, ఆ స్థానమును పరిశుభ్రము జేసి; ముగ్గుపెట్టి; పూవులుచల్లి - గురుడు పారాడేటివంటి ప్రదేశాన్ని "**ఆహ్లాదకరముగా**" - అందముగా తీర్చిదిద్దడము "**స్థానసేవ**". ఇది మనకు బాహ్యముగా తప్పకుండ మొదట వుండే తీరాలి.

(2) **<u>అంగసేవ</u> :-** ఇంక స్నానము చేయించడము; శుభ్ర వస్త్రాలు కట్టడము; విభూతి ధారణ చేయడము; మరి గురువుగారికి ధ్యానానికి అనుకూలమైనటువంటి వస్తువులన్ని సమకూర్చడము - ఇది మనకు అంగసేవ అవుతుంది.

(3) **<u>భావ సేవ</u> :-** ఇంక భావ సేవ - **"గురువును" "గురు బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః గురు సాక్షాత్ పరబ్రహ్మః;** అని - నా సృష్టి, స్థితి, లయములకు, నా మోక్షానికి, **"నా గురుడే"** కారణము - అనే, భావము చేత - తల్లివి, తండ్రివి, దాతవు, వల్లభుడవు, బాంధవర్తనుడవు, వసుదీక్షుడవు, తెల్లముగ - దేవుడవు, నీవల్లో కదా! ఇట్టి బోధవర్తనలు వినుట అని - ఆ గురువును అనేక పద్ధతులుగా భావిస్తూ - ఆ భావ మాధుర్యాన్ని అనుభవించేటువంటి సేవ -**"భావ సేవ"**

(4) **<u>ఆత్మ సేవ</u> : -** ఇంక, గురువుకు - ఏ సమయానికి ఫలహారము అవసరమో, పాలు అవసరమో, అన్నము అవసరమో - ఏమి ఆయనికి కావాలో దానిని సమకూర్చడము - ఇది **"ఆత్మ సేవ"** - ఇవి మనము బాహ్యముగా చేస్తూ - అట్లనే ఈ సేవలన్నీ **"ఆంతర్యముగా"** లోలతగావించుకోవాలి, ఆ సేవలో తరించాలి.

## <u>ఆంతర్య సేవ</u>

1. **<u>స్థాన సేవ</u> :-** గురువుగారికి స్థాన సేవ - **"గురుడు మంత్ర రూపుడై,"** మన హృదయములో వుండాడు. మన హృదయములో - హృదయ కమలము అనే, స్థానములో - కూర్చోపెట్టినాము. అక్కడ **"రాగ, ద్వేష, కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలు లేకోకుండ"** - ఆ హృదయాన్ని పరిశుభ్రముగా చేసినప్పుడు - ఆంతర్యములో, ఇది స్థాన సేవ అ వుతుంది - గురువుగారికి. ఇంక అంగ సేవ.

2. **<u>అంగ సేవ</u> :-** గురువుకు దారపోసినటువంటి తనువును - బ్రహ్మచర్యాది పద్ధతిలో - అంటే, **"ఏకపత్ని వ్రతుడన్నా - బ్రహ్మచారియన్నా"** ఒక్కటే పద్ధతి. అన్యతా వ్యభిచార గుణము లేకోకుండ - శరీరాన్ని క్రమపద్ధతిగా నడుపుకుంటూ - మరి గురువు అంగాన్ని ఎట్లైతే - రోగభూయిష్టముగా కాకుండ మంచి సదాచార

సంపన్నముగా పెట్టికొనివుంటాడో, మనము అట్లు పెట్టుకొనేటువంటిదానిని **"అంగసేవ"** అంటారు. ఇంక భావ సేవ.

3. <u>భావ సేవ</u> **:-** గురుడు చెప్పినటువంటి బోధను - భావములో స్థిరపరచుకోవాలి. గురువుకు అన్ని సేవలు చేయవచ్చుగాని - భావసేవ చేసేది మహాకష్టము. గురుడు భ్రాంతి లేని బోధ చెప్పితే, శిష్యుడు భ్రాంతి పొందుతావుంటాడు. అంటే, వానికి భావ సేవ కుదరదు అనే మాట. ఇది కూడదురా! అంటే అదే చేస్తాడు. ఈ భ్రాంతి పెట్టుకోవద్దురా! అంటే, ఆ భ్రాంతిలోనే పడుతాడు. ఇట్లా, గురువుకు అన్యథా వేరే భావాలు కలిగేటి పద్ధతులను అవలంబించవద్దు - అట్లైతే, నీ భావము పాడై పోతాది అంటే! అటువంటిదాన్నే అవలంబిస్తాడు! కాబట్టి, భావసేవ గురువుకు బాగా చేయడములో విఫలురైపోతారు అందరు. చాలామంది - నూటికి నూరుపాళ్ళు ఇక్కడే, నిర్గమిస్తారు. **"గురువు - శిష్యునియొక్క భావము"** కుదరకుండావుండడానికి ముఖ్య కారణము ఇదే! అందువల్ల, దీనిని చక్కనైనటువంటి పద్ధతిలో నడుపుకోనేది **"భావశుద్ధి" – "భావ సేవ".**

4. <u>ఆత్మసేవ</u> **:-** ఆత్మ అంటే, నిర్ణయ పద్ధతి. గురుడు నిజ ధర్మము తెలిసి - ఎట్లా **"భ్రాంతి రహిత"** ముగావున్నాడో, తాను తద్ రీతిగావుండి - గురువుకు, ఆ సేవని అర్పించి కృతార్థుడు అయేటివంటి సేవ - **"ఆత్మసేవ"**. అట్లానే, తారక పద్ధతిలో **"గురు స్థానమును - గురుతెరగడము"** - అంటే, సాంఖ్యాది క్రియలు తెలుసుకోని - గురువుకు, ఆ పాఠాన్ని అప్పచెప్పి - నాకు ఈ నిర్ణయము అయిందయ్య - నీకు సేవ జేసినందుకు - నా మనస్సుకు - ఈ నిర్ణయము అయింది అని చెప్పి చేసినటువంటిది **"ఆత్మసేవ"** అయితాది. ఇంక అమనస్క స్థితి:

## <u>అమనస్క స్థితి</u>

ఇంక భావసేవ అయి నాక అమనస్క స్థితిని - అంటే, **"ఆత్మ స్వరూప స్థితిని"** పొందే టువంటి భావము ఎప్పుడు అవలంభిస్తామో - అది మన ఆంతర్యముగా భావసేవ అయితాది. మరి :

" ఆత్మాతీతం కేవలాత్మ దేహా నాస్తి కదాచన ।
అస్తి నాస్తీతి కోపేదా నిర్ణయో నాస్తీతి సర్వదా ॥ "

అనే విషయానికి ఎప్పుడు వస్తామో, అప్పుడు ఆత్మసేవ పరిపూర్తి అయితుంది. ఇది మనకు పరిపూర్ణబోధలో, వుండేటువంటియొక్క సేవలు. ఇట్లా – సాధన చతుష్టయ సంపత్తిగలిగి – **"పరిపూర్ణుడైన సద్గురుని చేరి"** – ఈ చతుర్విధ సేవలు జేసి – ఆయన మనస్సును మెప్పించి – మరి "ఆయన హస్తమస్తక సంయోగముజేసి – త్రివిధ దీక్షలు ఇచ్చి – స్వస్తికా ఆరోహణ స్పర్శ దీక్షల చేత స్వస్థితిని, మేలును కోరి – ఆరోహణ దృష్టితో చూసి – మరి ఆశీర్వాద భావముచేత ఉపదేశము" చేసేటువంటి క్రియ కూడ గురువుగారు చేస్తారు – కాబట్టి ఇలా చేయాలి.

## <u>గురుడు బోధించే క్రమము</u>

ఇంక – గురుడు బోధించె క్రమము ఒకటుంది. ఎందుకంటే, పూర్ణసిద్ధుడై వచ్చినటువంటి శిష్యుడు వస్తే, అది వేరెగాని – సాధకుడనేటివాడు వస్తే బోధ క్రమ పద్ధతిగా వుండాలి.

**49. సీ॥ యమము నియమ మాసనములు ప్రాణాయామ । మమర ప్రత్యాహార మంచితముగా । ధ్యానధారణసమాధ్యష్టాంగయుత మంత్ర । యోగము లయహఠ యోగములును । రాజ యోగంబు తారకము సాంఖ్యామనస్క । ములు ముద్రలు లక్ష్య సాధనములు । వరతత్వ మస్యాది వాక్యముల్ జీవైశ్వరైక్యసంధానము రాజితముగా ॥ గీ ॥ శిష్యునకు దెల్పి గురుమూర్తి స్థిరముగాను । పూర్ణభావంబు బోధించుబుధులు మెచ్చ ॥ రమ్య ॥**

ఇది గురుడు బోధించేటియొక్క క్రమము అన్నారు. యమము; నియమము; ఆసనము; ప్రాణాయామము; ప్రత్యాహారము; ధ్యానము; ధారణము; సమాధి; అని – ఇవి పతంజలి యోగ సూత్రాలలో వుండేటువంటివి – అష్టాంగయోగాలు:

1. <u>**యమము**</u> **:–** ఇంక యమము అంటే – అహింస; సత్యము; ఆస్తేయము; అపరిగ్రహము; బ్రహ్మచర్యము – అనేటివంటివి. ఈ ఐదు యమాలు. యమము అంటే, కాలమంత పాటించేటివి. దీనిని **"యమము"** అంటారు.

2. **<u>నియమము</u>** :- ఇంక – నియమము అంటే, ప్రతి రోజు చేసుకోనేటివి. రోజు చేసేవంటివి **"నియమము"** అంటూరు. అంటే, అహింస, సత్యము – ఇవి జీవితమంత వుండాలి.

3. **<u>అహింస</u>** :- అహింస అనేటువంటిదానికి జీవున్ని హింసించరాదు. అహింస అనేదానికి మాంసాహారమును మాత్రమే, ఇక్కడ ప్రాధాన్యముగా తీసుకొంటూరు. కాని మాంసాహరము తినకపోయినంత మాత్రము చేతనే జీవులను హింసించకుండ ఎవ్వరు వుండలేరు. ఇప్పుడు, రైతు పొలమును దున్నుతాడు – అనేక జీవులు చస్తాయి. ఇట్లా **"అనేక జీవులను చంపిన"** తరవాతనే, మనము జీవిస్తావుండాము. కాబట్టి దీనియందున అహింసా వాదము పెద్దగా కనబడదు. అహింస అనేటిది ఎప్పుడు వస్తాది మనకు అంటే, మనము **"జీవునికి జనన – మరణములు హింసను తప్పించినప్పుడే", "పూర్తి అహింస"** తత్వము వస్తాది.

అందుకే, **"గాంధి మహాత్ముడు"** నేను గొప్ప అహింసావాదిని అనుకొన్నాడు. ఆ మాట అన్నప్పుడు, అది చూసి **"సర్వేపల్లి రాధాకృష్ణ నగినాడంట"** – ఎందుకు రాధాకృష్ణ అట్ల పరిహాస్యముగా నగుతావు అన్నాడు. అంటే, నేను అహింసావాదిని – నీవు అనుకొంటూవుంటే, నాకు నగువువస్తావుంది అంటూడు. మరి నేను అహింసావాదినే కదా! నేను వట్టి శెనగిత్తనాలే కదా తినేది! ఇంకేమి తింటూను అన్నాడు. అంటే, **"శెనగిత్తనాలు జీవులుకాద ! అవి భూమిలో వేస్తే – అవి చెట్లుగా మారి సంతానాని కనవా" !** సృష్టిలో – అవి అభివృద్ధి చెందవా! వాటి అభివృద్ధిని నీవు నిరోధము చేస్తావుండావా లేదా ! పాడు చేస్తావుండావు కదా – ఎక్కడ నీవు అహింసావాది. అంటే, ఈయన ఆలోచనపరుడు కదా ! " **జ్ఞాని** " – వెంటనే, మేల్కోని – నిజమే మరి – ఇంగ ఎట్లా అని అన్నాడు?.

సృష్టిలో జీవులు పుట్టేటపుడే – ఈ జీవులు తల్లిని కష్టపెట్టి పుట్టుతాయి. మనము కూడా, తల్లిని బాధపెట్టి – మొదటనే హింసచేసివుండాము – ఆ తరవాత పుట్టినప్పటినుండి పెద్దల ఇష్టానికి సరిగా నడుసుకోకుండ – వాళ్ళ మనస్సును తెలిసికోకుండా – ఎన్నో సార్లు బాధలు పెట్టిండాము. మనము నడిస్తే జీవులు చస్తాయి; పణ్ణుకొంటే, జీవులు చస్తాయి; స్నానము చేస్తే జీవులు చస్తాయి; వంట చేస్తే జీవులు

చస్తాయి; మనము కసువును నూకితే జీవులు చస్తావి; మరి పంటలకు, ప్రతి పంటమీద మందులు కొట్టి – జీవులను చంపినాకనే, మనము భోజనము చేస్తావుండాము. కాబట్టి ఎక్కడ వుందయ్యా ఈ అహింస? ఈ సృష్టిలో ఎక్కడ కూడా అహింస అనేటువంటిది మనకు కనపించదు. వాస్తవికముగా చూస్తే, **"నేను"** అనేటువంటి – ఈ **"జీవునికి"**, ఈ **"జనన మరణ"** హింసను తప్పించడమే **"అహింస"**

ఇంక – అట్లు కావాలంటే, జనన మరణ రహితమైన వస్తువును నీవు తెలిసుకోవాలి. అట్లు, ఆ స్థితిని నీవు పొందితే, నీకు అహింస సిద్ధిస్తుందే కాని, కేవల మాంసాహారము అహింస కాదు. ఆహారము తినేటివంటివి ఏవీ కూడ హింస కానే కాదు. ఆహారము తినడము సృష్టిలో ధర్మమైయున్నది **"జీవో జీవస్య భక్షణః"** కాబట్టి, తింటే తినవచ్చు మానితే మానవచ్చుగాని – అది ఒక్కటే, నీవు అహింసగా భావించరాదు అని చెప్పి అంటారు. అందువల్ల, ఎవరైతే – జీవుని హింస పద్ధతిగా పోకుండ నడుపించుకొంటారో, **"వాడే అహింసాతత్పరుడు".**

4. **<u>సత్యము</u> :–** సత్యము సంఘ జీవనములో, వున్నది వున్నట్లుగా చెప్పేవాన్ని సత్యవాది అంటారు. లేనిది వున్నట్లు కల్పనజేసి – వున్నది లేనట్లు కల్పన జేసి చేప్పేది అసత్యము అంటారు. ఇది సంఘ జీవితములో. **" కాని ప్రపంచములో సత్యమైన పదార్థము మూడు కాలాల్లో చెడకుండావుంది".** ఆ సత్యవస్తువును నీవు గ్రహించినప్పుడే, నీకు సత్యము సిద్ధిస్తాది. **"అసత్యము నీవు ఎంత ఆచరించినా అది నిలబడేటువంటిది కాదు".** ఈ ధర్మము తెలిసి నడుచుకోవడమే **"సత్యము."** ఇంక ఆస్తేయము.

5. **<u>ఆస్తేయము</u> :–** అహింస; సత్యము; ఆస్తేయము – అంటే, దొంగతనము లేకుండ వుండుట. దొంగతనము నీవు శారీరకముగా చేస్తెనే కాదు – మనస్సుతో కూడ చేయరాదు; వాక్కుతో కూడ చేయకూడదు. అందుకే, **"రామకృష్ణస్వామి అనేవారంట – ఏ మహాత్మునితో – మనము ఈ మాట విన్నామో, ఆ మహాత్ముని పేరు తోనే, ఆ మాట చెప్పితే – మనకు తప్పేముంది".** ఆ మహాత్ముడు చెప్పిన మాట – ఆయన చెప్పింది కాదు, నేను చెప్పినాను అని చెప్పి అనడము దొంగతనము కాదా! ఒకరి మాటను ఒకరు దొంగలించడము కాదా ; "వాక్కు

చేత దొంగతనము చేయరాదు; మనస్సుతో కూడ చేయరాదు; ఇట్లా, శరీరముతోను దొంగతనము చేయరాదు". దీనిని **"ఆస్తేయము".** అంటారు. అంటే, ఆస్తేయము అంటే, దొంగ తనము చేయకుండ వుండుట. ఇంక – అపరిగ్రహాము.

6. **<u>అపరిగ్రహాము</u> :–** ఇంక – అపరిగ్రహాము అంటే, ఇతరులునుండి ఏ వస్తువుని కూడ **"స్వార్థ బుద్ధితో తీసుకోరాదు"** – గ్రహించరాదు. అందుకే, దాన ధర్మాలు తీసికొనెటపుడు కూడ సరియైన పాత్రము వుండేవాడు తీసుకోవాలసేగాని – మిగ తావారు తీసుకోరాదు. తీసుకొంటే, ఆ ఫలితము అనుభవించే శక్తివుండాల కాబట్టి మనకు **"అపరిగ్రహాము"** వుండాలి. ఇంక బ్రహ్మచర్యము.

7. **<u>బ్రహ్మచర్యము</u> :–** ఇంక బ్రహ్మచర్యము – మనస్సు మనకు ప్రపంచములో, శరీరముతో – జీవనయాత్ర జరుపుతావున్న – మనస్సు మాత్రము **"శాశ్వతమైన బ్రహ్మమందునే చరించ్చాలి ".** అట్లాచరించేదానికే – **"బ్రహ్మచర్యము అంటారు".** బ్రహ్మచర్యము అంటే, మాములుగా "వివాహము లేకుండ వుండడము బ్రహ్మచర్యము అని – అనుకోరాదు". బ్రహ్మమందు చరించే, మనస్తకలిగిత్వము వుండ్వాలి. ప్రపంచమంత కూడా మార్పులు చెందుతూవుంటుంది, కాబట్టి – **"మార్పులు చెందనటువంటి బ్రహ్మ తత్వాన్ని మనము ఆచరించాలి".** ఇంక నియమము:

8. **<u>నియమము:</u>–** ఇంక – నియమమువుంది. నియమము అంటే, ఎట్లా? – శౌచము; సంతోషము; తపస్సు; స్వాధ్యాయనము; ఈశ్వర ఫణిదానము అనేటువంటి – ఈ ఐదు మనకు నియమాలు. అంటే, ప్రతి రోజు చేసేటివి. రోజు స్నానము చేయాలి. శౌచము అంటే, శుచిత్వము వుండాలి. **"సంతోషమును ఎప్పుడూ కూడ, హృదయమునుండి దూరము చేసుకోరాదు". "దుఃఖము కలిగించేటువంటి" ఆలోచనలుగాని; పనులుగాని చేయరాదు.** సంతోషము తగ్గితే శరీరానికి – మనస్సుకూ రెంటికీ కూడ బలము తగ్గిపోతాది కాబట్టి – సంతోషము అనేదానిని ఎప్పుడూ హృదయములోనుండి తొలగనీయకూడదు – శౌచము – సంతోషము. ఇంక తపస్సు.

9. <u>**తపస్సు**</u> :- ఇంక - తపస్సు, మనము ఏ ఒక్క సిద్ధాంతమును సంపూర్ణముగా అర్థము చేసుకోవాల అని వుండామో; లేదు - ఏ పనిని చక్కగా - బాగ చేయాలా అనుకోనివుండామో - దీనికై తపించుట. అంటే, ఏకాగ్రత చిత్తులైదాని సిద్ధికొరకు తపించేదాన్ని **"తపస్సు"** అంటారు. అట్లనే, **"జ్ఞాని పరమార్థం"** కోసరము తపస్సు చేయాలి.

10. <u>**స్వాధ్యాయము**</u> :- ఇంక - స్వాధ్యాయము రోజు ఒక గంట సేపు కాని; అర్థగంట సేపుకాని; ఒక సద్గ్రంథాన్ని పఠన చేయాలి. ఇది అధ్యయనము. స్వాధ్యాయము అంటే, **"అధ్యయనము"**. మన మనస్సు ప్రపంచ విషయాలలో పడి చికాకుచెంది, మబ్బు చుట్టుకోక పూర్వమే - మనము ఈ ఒక్క అధ్యయనము చేసి, పెద్దల వాక్యాలను మనస్సులో నిలుపుకొంటే, అది ఎంతో ఆనందాన్ని ఇస్తుంది.

11. <u>**ఈశ్వర ప్రణిదానము**</u> :- ఇంక - ఈశ్వర ప్రణిధానము ఎట్టి పరిస్థితిలో కాని **"గురుపూజగాని - దైవపూజగాని"** మరువరాదు. బాహ్యముగగాని; అంత్యర్యముగగాని చేయాలి. అందుకే, ఈశ్వర ప్రణిదానాన్ని గురించి మనకు సీతారామాంజనేయములో చక్కని పద్యము ఒకటి చెప్పినారు:

(అ) **"కరణంబులు అఖిలోప కరణంబులును కాగ "**

అంతఃకర్ణాలు - అన్నిటిని సమకూర్చే పని ముట్లైవుండాయి.

(ఆ) **"ప్రాణంబులుపచార భటులు కాగ"**

పంచ ప్రాణాలు నీకు ఉపచారము చేసె భటులుగా వుండారు.

(ఇ) **"షట్కమలములు పుష్పములు కాగ "**

ఆధార; స్వాధిష్ఠ; మణిపూరక; అనాహత; విశుద్ధ; ఆగ్నేయ; సహస్రారములు - అనే కమలములు - నీకు పుష్పములు అయితాయి మరి.

(ఈ) **"జఠరాగ్ని వీచికలు ధూపము కాగ"**
**"భటు జీవకళలు దీపము కాగ "**

జఠరాగ్ని లోపలనుండి మనకు ప్రసరించేటివంటి లక్షణాలు ధూపమైయింది. జీవకళలు శరీరాన్నంత ప్రకాశింపజెసేటివంటి దీపమైయింది; మరి

(ఉ) "సూర్య చంద్రాదులు హారతులు కాగ"
"ఆనందమే, నీకు నైవేద్యము కాగ "

ఇట్లా ఈ దేహమనేటువంటి – ఈ మందిరములో – సహస్రార కమలమనే, సింహాసనమందు **"శాంతి"** అనేటువంటి **"సీతాదేవితో కూడుకొని – విశ్వమును పరిపాలించే ఆత్మారామునికి"** ఈ నైవేద్యము పెట్టాలి. ఇది **"ఈశ్వర ఫణిదానము"**అంటారు పెద్దలు. అంటే, ఈశ్వరుని పూజ చేయుడము – అంటే, ఇది చక్కనైనటువంటి పూజ. మనము బైట పెట్టడము – తీసేయడము తప్ప వేరె పనివుండదు. ఆ మన జడపదార్థాలకు చేయడము; తర్వాత దాన్ని తీసివేయడము లోకవాసనకూ; శాస్త్రవాసనకూ – బానిసలు అయివుండేటువంటి పద్ధతి. ఇట్లా – యమము; నియమము అయిన తరవాత :

12. <u>**ఆసనము**</u> **:–** మనకు అనేక ఆసనములు వుండాయి. అందులో, స్వస్తికాసనము; పద్మాసనములాంటి ఆసనములు కాకుండ – ఏ ఆసనములో, నీవు చాలాసేపు కూర్చోగలుగుతావో, ఆ ఆసనములో – కూర్చొనేటువంటి స్థితిని పొందాలి – ఇది ఆసనము.

13. <u>**ప్రాణాయామము**</u> **:–** ఇంక – ప్రాణాయామము – ఎందుకు చేయాలంటే, శరీరములో ప్రాణము అన్ని ప్రాంతాలకు పంపించినప్పుడే, శరీరము ఆరోగ్యవంతముగా వుంటుంది. మనము ఆలోచనచేసేటపుడు – ప్రాణవాయువునిండుగా పారదు. అది అక్కడ అక్కడకే, హృదయము దగ్గరికి కొంత దగ్గరికి పారుతావుంటాది. అందువల్ల, మనుష్యునికి రోగాలు; శరీర నొప్పులు ఎక్కువ అవుతూవుంటాయి. అందుకు, **"ఒక అర్ధగంట** సమయం – **బాగా ప్రాణాయామము చేయాలి."** "పూర్తిగా గాలి లోపలికి తీసుకోవాల – బాగ 8 – 10 సెకన్ల కాలము కుంభించి – మల్ల విడువాల. ఇట్లా – ఒక 30 శ్వాసలు – మనము ఈ పద్ధతిగా – లోపలికి బైటికి చేస్తే – శరీరము

ఆరోగ్యవంతముగా వుంటుంది." **"మోక్షము"** అనే విషయము తర్వాత, ముఖ్యముగా శరీరారోగ్యానికి ప్రాణాయామము కావాలి.

14. <u>**ప్రత్యాహార**</u> **:–** ఇంక – ప్రత్యాహారము ఇంద్రియములకు కావాలి మనకు. మనము అనేకమైనటువంటి విషయాలకు బానిసలై వుండాము. మన ఇంద్రియాలు అట్లాటపుడు – అవి ఏమి కోరుతాయో, అవి కోరినప్పుడు – వాటికి **"వ్యతిరేకముగావుండేటువంటి పారమార్థిక విషయాన్ని ఇవ్వాలి".** మనము పారమార్థ వైపుకు మనస్సు రావాలంటే, సామాన్యముగా ప్రపంచ విషయాలకు అలవాటపడిన మనస్సు రాదు. అలా, రానప్పుడు దాన్ని వచ్చేట్లుగా ఎలా చేయాలా? అన్నప్పుడు **"బీడి త్రాగే అలవాటువుంటుంది అనుకోండి – అప్పుడు, బీడి కావాలని అడుగుతుంది మనస్సు – అప్పుడు పెప్పర మెంటు దానికి ఇవ్వాలి".** అట్లే, **"సినిమా చూడాల అనేటువంటి మనస్సు వస్తాది – అప్పుడు, పెద్దలయొక్క సాంగ్యత్యము ఎక్కడవుందో – "సత్సంగానికి" పోదాము అని చెప్పాల."** ఆ సమయానికి అది దానికి ప్రత్యాహారము. తినే ఆహారమునకు బదులు, వేరే ఆహారము ఇచ్చినట్లు – ఇంద్రియాలను ఆత్మ వైపునకు మళ్ళించాలి. ఇది **"వేదాంత ప్రక్రియలో ప్రత్యాహారము"** అని భావము.

15. <u>**ధ్యానము**</u> **:–** ఇంక – ధ్యానము – **"గురు మంత్రాన్నిగాని;"** లేదా – ఏదో, **"దైవమంత్రాన్నిగాని ధ్యానము చేయాలి."**

14. <u>**ధారణ**</u> **:–** ఇంక – ధారణ ఎప్పుడూ కూడ – అది **"మనస్సులోనుండి తొలగి పోకోకుండ – అదే, ఒక స్థితిని ధరించి పెట్టుకోవాల."**

15. <u>**సమాధి**</u> **:–** ఇంక సమాధి పద్ధతి వస్తాది – సమాధి అంటే, ధ్యానము చేత ప్రపంచాన్ని మరిచి – తన్మయుడై వుండేటువంటిది సాధన పద్ధతిలో – సమాధి. ఈ సృష్టి అంత **"గురుపరమాత్మయొక్క దివ్యచిద్విలాసమే"** తప్ప వేరే కాదు – కాబట్టి, దీనియందు భేద బుద్ధి వుండకూడదనే భావము ఎప్పుడైతే వస్తాదో – ఈ సమత్వము పొందిన బుద్ధి స్థితిని సమాధి అంటారు. అంటే, ఇప్పుడు – మనకు ఈ సమాధి అంటే – **"ఆంజనేయస్వామి అంటాడు"** – స్వామి! ఈ సృష్టి యంత నానించి

ఉద్భవమైందంటివి కదా! – మరి, ఈ విశ్వమంత – నీ రూపముతోనే నాకు దర్శనము అయేటపుడు – నాకు దైవదర్శనములో, లోపము ఏముంది ఇంకా? అంటే, అంతా **"నీ రూపముగా చూసేటివంటి దివ్యజ్ఞానాన్ని";** అటువంటి తత్వాన్ని నాకు ప్రసాదించమని అంటాడు. ఒక పరమాత్మనుండి ఆవిర్భవించే సృష్టిని భేదముగా చూసి, దీని బుద్ధి పాడు చేసికొనేకంటే – ఇదంతా **"నా గురు స్వరూపమే కదా"!** – అనేటువంటియొక్క దివ్యజ్ఞానము ఇస్తే – నాకు భేదము లేకుండ; బాధలేకుండ వుంటాది కదా అంటాడు. అంటే, ఇది మనము ఆ యొక్క స్థితిని పొందేటువంటిదానినే **"సమాధి"** అంటారు.

ఇలా – గురుడు ఈ లక్షణాలన్ని – జీవేశ్వరైక్యాన్ని – సాంఖ్య; తారక; అమనస్కాలను; తత్వమసి – మహావాక్యాన్ని – ఇవన్నిటిని కూడ బోధించి; జీవేశ్వరైక్యాన్ని జూపించి – ఈ బ్రహ్మము ఒక్కటే – **"ఆ బ్రహ్మమే, నీయొక్క దివ్యతత్వమని"** గురువు ఆశీర్వాదము పొందిన తర్వాత – ఈ యొక్క పూర్ణభావాన్ని బోధిస్తారు. పూర్ణభావము ఎప్పుడు వస్తాదంటే? ఈ మూడింటియొక్క ఆత్మబోధ పూర్తికావాలి. యెరుకబోధ సంపూర్ణముగా – అయిన తరవాతనే, మనకు పూర్ణబోధ పట్టుపడుతుంది. కాని, యెరుక బోధ అట్లే మిగిలి వుంటే, పూర్ణబోధ పట్టదు. ఇప్పుడు దీని క్రమాన్ని చెప్పుతారు మంత్రయోగ లక్షణము.

## ధ్యానముద్ర – మంత్రయోగ లక్షణము

**50. సీ॥ భూసురుండెవడైన పుణ్యశీలుడు మహానదుల తోయముల స్నానంబుజేసి । శుభ్రవస్త్రము గట్టి శుచియైన స్థలమందు క్రమముతో కూర్మ చక్రము లిఖించి । దర్భకృష్ణాజిన ధవళాసనములపై పద్మాసనస్థుడై పదిలముగను । కన్నులు బిగియించి కడుపెన్ను నిక్కించి నాసాగ్రమున చూపుజేసి ॥ గీ ॥ మనసు కిష్టమైనట్టి మంత్రంబు నిష్టతోను । జపముజేసిన యోగి విలక్షణుండు ॥ రమ్య ॥ .**

ఇలా – భూసురునకు మాత్రమే చెప్పినారంటే కాదు! **"ఎవరైనా – గురుపుత్రుడైయుండేటువంటి వాడు దైవధ్యానము చేయాలనుకొనే వాడు"** – నదులయొక్క నీళ్ళలో స్నానము జేసి శుభ్రమైన వస్త్రముకట్టి; శుచియైన స్థలమందున – అంటే, ఎత్తు–పల్లములేకుండవుండే, స్థలమందున – కూర్మ చక్రాన్ని లిఖించికొని;

కూర్మచక్రాన్ని ఎందుకు లిఖించుతారంటే? ఉత్తరాదిలో – ఈ ఒక మంచి పద్ధతి పెట్టుకొనివుండారు.

**"భగవద్గీతలో – శ్రీ కృష్ణపరమాత్మ స్థితప్రజ్ఞుడు"** లక్షణము చెప్పినపుడు – **"స్థితప్రజ్ఞుడు"** ఎట్లా వుంటాడయ్యా అంటే? తాబేలువలే వుంటాడు నాయనా! తాబేలు ఎవరు లేకున్న సమయములో యథేచ్ఛగా ఇంద్రియములన్ని విడిచి ఆడుకుంటాది; ఎవరైనను చూస్తూనే, అన్నిటిని ముడుచుకొని – ఊరుకొంటాది. అట్లా **"జ్ఞానియైనటు వంటివాడు"** ప్రపంచ విషయాలు లేనప్పుడు బ్రహ్మానంద సుఖముగా ఆడుకొంటాడు. ఏదైన ప్రపంచవాసనాలు వచ్చినప్పుడు, తన అవయవాలన్ని ముడుచు కొని లోపలవుంటాడు. ఈ విధముగా **"స్థితప్రజ్ఞుడు"**, ఏదాని మీద **"భ్రాంతి"** లేకుండ **"నిర్మల"** ముగావుంటాడు అనేదానికి – ఆయన చెప్పినటువంటి ఉపమానమిది. ఉత్తర ఇండియా అంతా – అంటే, ఇప్పుడు దక్షిణానికి వ్యాపించింది అనుకోండి, ఇది ఇక్కడ కూడ కూర్మ చక్రాన్ని లిఖించడము; ఆ కూర్మమువలే – మన మనస్సు కూడ నిలబడివుండాలి, అనే సంకల్పము చేసుకొన్నాము. దానిమీద ధర్భాసనము; దానిమీద కృష్ణాజినము; దానిమీద వస్త్రాసనము వేసుకోని – మరి పద్మాసనస్థుడై, వెన్నెముక బాగ చక్కగా నిక్కించి, నాసాగ్రము లోపల చూపు నిలిపి – **"గురుడు చెప్పిన మంత్రముగాని"**; మన మనస్సుకు ఇష్టమైనటువంటి మంత్రముగాని – **"ధ్యానము"** చేసేటువంటివాడు – **"మంత్రయోగి"**. **"యోగము"** అంటే, **"కూడిక"** అని అర్థము. యోగము అంటే, **"చిత్త నిరోధము"** అని – అంటే, ఇతర విషయాలను నీకు అసంబద్ధమైనటువంటి విషయాల మీద నీకు విరోధము కలిగి – **"ఆత్మ వస్తువుమీద నీకు ప్రేమకలిగి"**, దాన్ని ధ్యానించేటివంటి దానిని యోగమంటారు. ఈ యోగమునగా కూడిక. అందువల్ల, ఇప్పుడు ఏమిటితో కూడుకొనుంది మనస్సు? ఈ దైవమంత్రముతో, ఈ రకమైన పద్ధతులకు – అది అలవాటుబడి, దానితో కూడుకొని వుంటాది. అందువల్ల, ఇది **"మంత్రయోగము"**. ఇంక లయయోగముంది – మనకు ఎట్లా అంటే:

## రాధాయంత్రముద్ర – లయయోగము

51. సీ॥ రెప్పలు వాల్చక రెండు చూపుల కనుబొమల మధ్యమునందు పొందనిలిపి । కర్ణరంధ్రములు గదియంగ బిగియించి యంతరజ్ఞప్తిచే నాలకించి । గజ్జముప్వల నాద ఘంటారావము శంఖవీణ తాళ ధ్వనుల్ వేణుభేరి । మర్ధళమేఘాది మహనీయ దశవిధనాదముల్ విని చాల మోదమంది ॥ గీ ॥ నందు లోపల తుదినాదమందు మనసు । లయము జేసిన యోగి విలక్షణుండు ॥ రమ్య ॥

ఇప్పుడు రెండు కన్నుల రెప్పలు వాల్చకుండ, దృష్టిని ఇట్లా – **"భ్రూమధ్యమునందు"** నిలిపి, మరి రెండు చూపుడు ప్రేళ్ళను చెవుల్లో పెట్టుకొని – అక్కడ కలుగేటువంటి నాదాలన్ని వినాలి. అక్కడ దశవిధనాదాలు – ఒకటొకటే బయలుదేరతా వస్తాయి. ఎందుకంటే, మెదడునుండి డెబ్బదిరెండు వేల నాడులు (72,000) మనకు శరీరమంత వ్యాపించివున్నాయి. కాబట్టి, ఈ చూపుడుప్రేళ్ళు చెవులయందున పెట్టినప్పుడు – ఆ చెవులయందున వుండేటువంటి నరాలకు – ఈ ప్రేళ్ళకుండే నరాలు సంగీతము పలుకుతాయి . అవి నిదానముగా ఆలకిస్తే, ఇవన్ని వినపడతాయి. ఇలా వినపడిన తరవాత నాదములన్ని అణిగిపోయి, చివరిలో మేఘనాదమువలే ఊరికే జుమ్ జుమ్ అనేటువంటియొక్క నాదములో మనస్సు లయము చేసినటువంటివాడు – నాదానందము పొందునటువంటివాడు. అంటే, పూర్వము ఎలాగంటే? ఇతర విషయాలను వినగూడదు అనుకొనేవారు, తాళాలు ఒక జత జేబిలో పెట్టుకోని – ఏదైన శబ్దాలు వినినప్పుడు, చెవుల దగ్గర తాళాలు వాయించుకోనేవారు. అంటే, నాయొక్క నాదమే నాకు చాలు – ఈ ప్రపంచ నాదాలు వద్దు – అనే గుణముచేత వుండేవారు. అప్పుడు, అలా లయయోగము చేసేటు వంటివారియొక్క దశవిధనాదాలు వినాలి. మంత్రయోగము చేసేవారు ముందు చెప్పినట్లు – ఇది **"లయయోగము"**. ఇంక హఠయోగము గురించి చెప్పుతారు.

## షణ్ముఖీముద్ర – హఠయోగము

52. సీ॥ అంగుష్టములను కర్ణాంగంబులను మూసి । చక్షుల మధ్య తర్జనుల మూసి । నాసికాయుగ్మ మనామకంబుల మూసి । ఘనవక్త్రము కనిష్టకముల మూసి । పాదమూలంబుల పాయూపస్థలు మూసి । యాధారమున వాయువపుడు లేపి ।

షట్చక్రములనున్న సంజ్ఞల కడతేరి । యాజ్ఞేయ చక్రమం దమరనిలిపి । ॥ గీ ॥ చూపు పవనంబు యా మనస్సొకటి జేసి । ధ్యానమునాచరింప హఠయోగి ధన్యుడగును ॥రమ్య॥

ఇది – షణ్ముఖీముద్ర. సామాన్యముగా – తారక యోగములో ముద్రాభ్యాసము ఎక్కువవుంటాది. **ఖేచరి; భూచరి; మధ్యమ; షణ్ముఖీ; శాంభవి** – అని, ఈ ఐదు ముద్రలు వుంటావి. ఈ మొట్టమొదట అక్షి భావాన్ని చెప్పేటివంటి పద్ధతి మనకు సాంప్రదాయములో వుండేది. ముద్రలు చూపించినప్పుడు **"దశవిధ నాదాలు వినడము"; "చిత్కళలు చూడటము"; "ఖేచరిపైన చూపు చూడటము"; "భూచరి క్రిందచూపు చూడటము"; "మధ్యము చూపు చూడటము"** (అంటే – అర్థకన్ను మూసి, అర్థము బైటికి – అర్థము లోపలికి చూసేటువంటియొక్క). ఈ ముద్రలన్ని వేసుకుంటూ చివరికి షణ్ముఖి ముద్ర వేపిస్తారు. అంటే, **"తొమ్మిది ద్వారాలు మూయాలి".** ఒక మిడిమతో – పాయు; ఒక మిడిమతో – ఉపస్థ; మూసి – దీనియందున ఇట్లా – ప్రతి ఒకటి – ఒక్కొక్క ఇంద్రియమును మూస్తూరావాలి. ఇట్లా, మూస్తూవచ్చినప్పుడు – మనకు ఇలా అన్ని ఇంద్రియాలు బంధింపపడినప్పుడు – మనస్సు బైట విషయాలికి పోకుండ, దానిమీదనేవుంటుంది. ఇది ఈ స్థూల పద్ధతి ప్రక్రియ – **"హఠయోగము".**

సూక్ష్మముగా వుండేటువంటి – తొమ్మిది ద్వారాలూ; ఈ బైట స్థూలముగా మూస్తే ఎవరికీకూడ, ఏ మనస్సు నిలబడదు వాస్తవికముగ. ఇప్పుడు – **"కామ; క్రోధ; లోభ; మోహ; మద; మాత్సర్యములు అనేటువంటివి – ఆరు"; – "దారేషణ; ధనేషణ; పుత్రేషణ – అనేటువంటి – మూడు ఈషణాత్రయాలు";** ఈ తొమ్మిది ద్వారాలనుండి **"మనస్సు"** ఎక్కువ – బైట ప్రపంచములోకి పోతావుంటుంది. వీటిని అరికట్టినప్పుడే, **"నవద్వార బంధము"** జరుగుతాదిగాని – బైట వుండే టువంటి శరీర రంధ్రాలను మూసినంత మాత్రాన ఏమి జరగదు. కాని, దీనిని శాస్త్రోక్తముగా ఇలా చెప్పినారు పెద్దలు.

పైన చెప్పినటువంటి పద్ధతిలో – ఇట్లా – అంగుష్టము చేత ఒకటి; తర్జనుల చేత ఒకటి; మధ్యముతో ఒకటి; అనామికములతో ఒకటి; కనిష్టకములతో ఒకటి; – ఈ

ఇంద్రియములన్ని మూసి; పాదములచేత పాయు - ఉపస్థలను మూసి - అప్పుడు అంత్రజ్ఞముచేనాలకించి - ఆధార స్థానములో వుండేటివంటి **"హంసను" "సహస్రానికి"** తీసుకోవాల. అంటే, ఇది అయేది కాదు. ఎందుకంటే, నాకు ఒక మహానుభావుడు - షణ్ముఖిముద్ర వేపించినాడు! ఇప్పుడు, మనమే మూసుకోవాలి. ఇది ఇక్కడ చెప్పేది కాదు కాని - ఆయనే మూసినాడు నాకు. బిర్రుగా పట్టు కొన్నాడు. బాగ తలమీద కాళ్ళు పెట్టినాడు - నీవు ఇలా వుండాలంటాడు. ఇప్పుడు, మనము మూసుకూంటే - అది ఇబ్బంధైయినప్పుడు; కష్టమైనప్పుడు మనము తీసేసుకోవచ్చు; ఆయన సామాన్యముగా తీసేయడు. నేను ఎంతెంతో అవస్థపడుతావుంటేను తీసేయడు - వుండాలంటాడు. అంటే, సరే ఎట్లో వదలించికొన్నాను స్వామిని - విడిచిపెట్టినాడు అనుకొండి. విడిచిపెట్టిన తర్వాత; నేను చెప్పితిని - అయ్యా! **"ఉక్కిరి-బిక్కిరి అయ్యే మనస్సు - ఏ హంస"** మీద నిలబడతాది? ఎక్కడ కనబడతావుంది అది - ఇది **"మూర్ఖసాధనే"** కాని, **"జ్ఞానపద్ధతి"** కాదు. అంటే? పెద్దలు అంత బుద్ధిహీనులు అనుకోవుండావా? చేసినవాళ్ళు అని చెప్పినారు. ఎవరూ చేయరయ్యా దీనిని - చేయాలాంటే, మహాకష్టము - కాని దీనియొక్క పద్ధతివుందని చెప్పి - అప్పుడు, ఈ అంతరార్థమును చెప్పిన తరవాత - ఆయన కూడ దానికి పాపము కన్నులలో నీళ్ళు పెట్టుకొన్నాడు - తెలియకపోతె - మేము ఇట్లాంటివే కదా చేస్తాము! ఎదుటివారియొక్క - అదే పని నేను చేస్తే, నీకు ఎట్లావుంటాది స్వామి? బాగ బిర్రుగా అదిమిపట్టి - నీకు ఊపిరాడకుండ చేస్తే - ఎట్లా వుంటాది? ఇటువంటి సాధనల్లో ఎక్కడైన కడతేరుతార అని! అట్లా షణ్ముఖి ముద్ర చేసినప్పుడు జరిగినది ఇది. ఇప్పటివరకూ, మంత్రయోగము; లయయోగము; హఠయోగము అయింది - ఇంక రాజయోగ ధర్మాన్ని చెప్పుతావుండారు:

## శాంభవీముద్ర - రాజయోగము

**53. సీ॥ సురుచిరశాంభవి చూడంగ చూడంగ చంద్రసూర్యాగ్నులు నింద్రధనువు । నవరత్నములభాతి నక్షత్రముల రీతి బిరుసుగాల్చినయట్లు మెరుపువలెను । మండు మంటలభంగి నిండు చీకటిబోలు పండు వెన్నల కాంతి యెండవలెను । యిలజలమాదిగా యిట్లనేకంబులు బుట్టి యణగిన పిమ్మట నమలమగుచు ॥ గీ ॥ బట్టబయలైన బ్రహ్మంబు గట్టిగాను । వెలయు లోపల గనుపడు వేత్తలకును ॥ రమ్య ॥**

ఇది రాజయోగధర్మము – అంటే, శాంభవి ముద్ర చూడంగ చూడంగ – ఈ చిత్ కళలన్ని కనుపడతావి. సూర్య; చంద్ర; అగ్ని; ఇంద్ర ధనస్సు; మెరుగుపూవులువలే; మెరుపుతీగలువలే; నానా రకాలుగా కనబడి చివరికి – అణగి పోయి గాఢాంధకార మైన టువంటి మబ్బువచ్చి – ఆ తర్వాత, **"పండుపెన్నెలవలే – ఒక వెలుగు వస్తాది."** ఇదంత నరాలులోవుండేటివంటి ఒక లక్షణాలివి. వచ్చిన తర్వాత – అవన్ని అణగిన తరవాత – ఇంక వెలుపల – లోపల; బైట – తన శరీరమనేది కానరాకుండ — **"అంత ఒకే బయలులాగ కనబడతాది."** ఇది సాధన చేత చేస్తే – కొంచము సమయము కనబడేటువంటి స్థితి. ఇట్లా, మనకు మంత్రయోగము; లయయోగము; హఠయోగము; రాజయోగము – అనేటువంటి నాల్గు ముద్రల ద్వార మనకు బోధించిన తర్వాత – ఇంక మనకు లోపల షట్ చక్రాల సంచారాన్ని గురించి వివరించుతారు పెద్దలు.

## షట్ చక్రాలు

### ఆధారచక్రము

**54. సీ॥ ఆసనస్థానమం దాధార చక్రమునందు నాలుగు రేకులమరి యుండు। వ–శ–ష–స లనియెడి వర్ణముల్ నాల్గుండు చతుర్కోణాకార మవని యుండు। కుంకుమ వర్ణంబు కింకిణినాదంబు నారునూరులు హంస లాడు చుండు। సద్భక్తియును క్రియాశక్తియు వర్తించు ఘనతరంబుగ నిన్ని గలిగినట్టి। ॥ గీ ॥ కమలమందున ప్రేమతో విమలమైన। నీవు గణపతి రూపమై నిలిచినావు ॥ రమ్య ॥.**

ఇంక – ఆధార చక్రానికి – ఇన్ని హంగులు వుంటాయి మనకు. అంటే, పాయుస్థానమునందు – దళములు నాల్గు (4) వుంటాయి అని – వ–శ–ష–స అనేటువంటి నాల్గు (4) అక్షరములు – **"చతుర్కోణాకారము"** – అంటే, నాల్గుకోణా లుగావుంటాది. **"ఇది పృథ్వి భూతము; కుంకుమ వర్ణము (ఎరుపు వర్ణము); కింకిణినాదము; సద్భక్తి: క్రియాశక్తి."** ఇవి ఎందుకంటే, కర్మేంద్రియాలు కాబట్టి – క్రియాశక్తి వచ్చి – అక్కడ అపానవాయువు చేసే శబ్దాలకు – కింకిణి నాదమువలే వుంటాది అని చెప్పినదానికి చెప్పినారు. ఇక్కడ **"ఆరునూరు (600) హంసలు"**

నడుస్తాయి అని. ఇది స్థూలపద్ధతి మనకు. సూక్ష్మముగా వుండేటువంటిది. మూలాధారముగా - ఇప్పుడు **"పృథ్వీ తత్వములో పుట్టినటువంటి కర్మేంద్రియము పాయు - జ్ఞానేంద్రియము ఘ్రాణము"** అంటే - ముక్కు. ఇది ముక్కులోపలవుండి - ఏ విఘ్నముకాకుండ తిరిగేటువంటి, ఈ **"హంస"** మనకు - **"విఘ్నేశ్వరుడు".**

ఈయనకు - సువాసన; సువాసన-దుర్వాసన; సువాసన-మిశ్రమవాసన; దుర్వాసన-మిశ్రమవాసన; అని నాల్గు దళాలు వుంటాయి. ఈ ముక్కుయందున - ఇక్కడ ఈ **"మనస్సు" "హంస"** చేత బంధింపబడివుంది. అందుకు, **"తారకము - మనస్సుద్ధి కారకము"** కాబట్టి - తారకాన్ని చెప్పేవాడు - ఈ ముక్కులోవుండేటువంటి, ఈ మలినగుణాలను విడిచిపెట్టి **"ఆత్మస్వరూపాన్ని సేవించాలి - "ఇతడు విఘ్నేశ్వరుడు".** ఈయనకే, మొట్టమొదట పూజ. అందుకే, వేదములందున - మొట్టమొదట పూజ పెట్టుతూనే - ప్రాణాయ స్వాహా; సమానాయ స్వాహా; అపానాయ స్వాహా; వ్యానాయ స్వాహా; ఉదానాయ స్వాహా; అని చెప్పి - మొట్టమొదట మంత్రము దీనికి - అందుకు విఘ్నము కాకుండ జరిపేటివాడు **"విఘ్నేశ్వరుడు".** ఈ శరీరానికంతా ఆధారభూతముగా వుండేటువంటివాడు - ఈ దేవుడు కాబట్టి, ఈయనకు **"విఘ్నేశ్వరుడు"** అని పేరు పెట్టినారు - ఈయనకే మొట్టమొదట పూజ. ఇక్కడ, ఈ నాల్గు దళములో - మనస్సు శుద్ధి అయితే - ఆధార చక్రములోవుండే - అ **"గురుస్వరూపము నీవుగా భావించి"** - అక్కడ వుండేటువంటి గుణాలను జయించడమే - **"ఆధార చక్రములో విఘ్నేశ్వరునికి పూజ చేయడము".** ఇంక స్వాధిష్టాన చక్రము.

<u>స్వాధిష్టాన చక్రము</u>

**55. సీ|| ఆధారమునకు రెండంగులంబుల మీద లింగస్థలబుండు రంగుగాను । స్వాధిష్టచక్రము షడ్దళంబుల నర్ధ చంద్రాకార మమరి యుండు । బ-భ-మ-య-ర-ల- లుండు పాటిల్లునైష్టిక భక్తినీరము జ్ఞానశక్తి యుండు । విమల విద్యుత్కాంతి**

వీణారవంబును నార్వేలు హంసలు నాడుచుండు ॥ గీ ॥ ప్రకటితంబుగ వికసిత పద్మమందు । నీవు బ్రహ్మస్వరూపమై నిలచినావు ॥ రమ్య ॥

ఇంక – స్వాధిష్టాన చక్రమునకు **"ఉపస్థ"** – అంటే, **"మర్మస్థానము"** – ఆరు (6) దళాలు వుండావి బ–భ–మ–య–ర–ల అనేవి – ఆరు (6) అక్షరములు – జలమునకు. అర్ధచంద్రాకారము; భూతము – జలభూతము; విద్యుత్కాంతి; వీణానాదము; జ్ఞానశక్తి; నైష్ఠిక భక్తి; ఇక్కడ – **"ఆరువేలు (6000)- హంసలు"** ఆడుతూవుంటాయి అని చెప్పినారు; **"అధిపతి – బ్రహ్మ"**; ఇది మనకు స్వాధిష్టాన చక్రములో – అంటే, **"జలతత్వములో పుట్టినటువంటి కర్మేంద్రియము – ఉపస్థ; జ్ఞానేంద్రియము – జిహ్వ;"** జ్ఞానేంద్రియములోనే – ఈ ఆరు (6) దళాల వుంటాయి. అంటే, "నాలుకలోనే – మనకు – ఉప్పు; కారము; చేదు; వగరు; పులుపు; తీపు – అనేటువంటి షడ్ రుచులు తెలుస్తాయి". ఈ ఆరు దళాల మీద రస స్వరూపమైనటువంటి ఈ **"బ్రహ్మ"** వున్నది. ఇదే, **"రస బ్రహ్మము".** ఇక్కడ బీజ సృష్టి జరుగుతుంది. కేవలము ఉపస్థ బీజాన్ని ప్రకృతియందు ప్రవేశపెట్టేకే పనికి వచ్చేది కాని – రస సృష్టి అంత ఇక్కడ జరుగుతుంది. ఇక్కడ మన మనస్సు మలినమయింది – అంటే, షడ్ రుచులకు బానిసయై – అందులో వుండేటువంటి **"పరమాత్మను మరిచి"** – తనయొక్క స్వరూపానికి భ్రాంతిలో, తిరుగుతుంది కాబట్టి – ఇక్కడ వుండేటువంటి **"రస స్వరూపమైన ఆ గురుపరమాత్మను సేవించి"**, ఈ షడ్ భ్రమలుకు – షడ్ రుచులనేటువంటి భ్రమలను జయించడమే మనస్సును శుద్ధి చేయడము. అందువల్ల, స్వాధిష్టాన చక్రములో **"బ్రహ్మ దేవున్ని పూజించి"** – మనస్సును శుద్ధి చేయడమంటే, ఇదీ దీని పద్ధతి అనే మాట. ఇంక మణిపూరక చక్రాన్ని చెప్పుతారు;

## మణిపూరక చక్రము

**56.** సీ॥ మరియు నాభిస్థానమందున మణిపూరకము దశదళములు గలిగియుండు । డఢణాది ఫాంతము ద్రుఢముగా అక్షరములు పదివేణునాదంబు ప్రబలియుండు । శ్యామల వర్ణమిచ్ఛాశక్తి త్రికోణమగ్ని భూతంబు దాన్నంటియుండు । నవధానభక్తియు నచట కుండలిస్థాన నార్వేలు హంసలు నాడుచుండు ॥ గీ ॥ నిన్నియుండిన చక్రమంధిష్టముగను । నీవు విష్ణుస్వరూపమై నిలచినావు ॥ రమ్య ॥ .

ఇంక – మణిపూరక చక్రము – నాభిస్థానము – పది (10) దళములు – **డ–ఢ–ణ–త–థ–ద–ధ–న–ప–ఫ;** ఈ పది అక్షరములు; త్రికోణాకారము; అగ్నిభూతము; శామలవర్ణము; వేణునాదము; అవధాన భక్తి; ఇచ్ఛాశక్తి; **ఆరువేలు (6000) "హంసలు"; "విష్ణువు అధి దేవతైయుండను".** అంటే, ఇప్పుడు మణిపూరక చక్రమునకు అగ్నిభూతము. **"అగ్నిభూతములో పుట్టినటువంటిది – నాభిస్థానమందు – జఠరాగ్ని; నేత్రస్థానమందు క్రోధాగ్ని;"** అంటే, ఇప్పుడు మనకు మణులవలే ప్రకాశిస్తూ – సర్వప్రపంచ భ్రాంతిని కలిగించేటువంటి స్థానము **"నేత్రములు".** నేత్రములు దశవిధరూపాలను చూస్తాయి కాబట్టి – దీనికి దశవిధ దళాలు వుండాయి అనేమాట. ఇక్కడ ప్రపంచ భ్రాంతికి లోనయి – మనస్సు మలినమవుతున్నది. అందువల్ల, ఇక్కడ వున్నటువంటి – ఆ **"విష్ణుస్వరూపమైన గురువును"** సేవించి – ఇక్కడ దశవిధరూపములనే భ్రాంతికి, లోనుకాకుండ తరించే విధానము ఎప్పుడు తెలిసుకొంటాదో, అప్పుడు మనము మణిపూరక చక్రానికి సరిగా, ఆ దేవునికి సేవజేసి **"కడతేరే స్థితి మనకు లభ్యమవుతుంది".** కాబట్టి, మణిపూరకము – అంటే, ఈ రకముగా వుంటాది. ఇప్పుడు మనకు మూడు భూతాలు అయినాయి. పృథ్వి భూతము; జలభూతము; అగ్నిభూతము. ఈ మూడు భూతములు మనకు – ఘ్రాణము; జిహ్వ; నేత్రములు; మనము వివరించుకున్నాము అనే మాట. ఇంక అనాహత చక్రమును గూర్చి చెపుతారు.

## <u>అనాహత చక్రము</u>

ఇంక – అనాహత చక్రము – మనకు మనస్సు మలినము, ఆ స్థానాలలో కాదు. పాయు స్థానములో మలినమైంది; నాభిస్థానములో మలినమయిందనేటువంటిది కాదు. అక్కడ మనస్సు వుండదు – మలినము కాదు. అక్కడ మనము శుద్ధి చేయవలసినటువంటి అవసరము కూడ అక్కడ వుండదు. ఇంక ఇప్పుడు – ఇది ఎక్కడ వుంటుంది? – ఇది ఇలా జ్ఞానేంద్రియముల రూపములోవుంటుంది – ఇక్కడనే, మలినమయ్యే గుణము వున్నది కాబట్టి, ఇక్కడ దానిని శుద్ధి చేసేదే **"తారక మంత్ర సిద్ధి – అనాహత చక్రము" :**

57. సీ॥ హృదయస్థలంబందు హితము గానాహత పద్మమందున దళాల్ పదియు రెండు । కఖలాదిఠాంతము ఘనతరాక్షరములు పదిరెండు యుండును బాగుగాను । షట్కోణమాకార వాయుభూతము నాదిశక్తియుండును భవభక్తియుండు । శాంత కుంభవు కాంతి శంఖారవంబును నార్వేలు హంసలు నాడుచుండు ॥ గీ ॥ భరితమైయున్న చక్రాధిపత్యము గను । నీవు రుద్రస్వరూపమై నిలచినావు ॥ రమ్య ॥

ఇంక – మీకు ఆఖరు చక్రములో నీవు నీవుగా అయింవుడేటువంటి సంగతి ఇప్పుడు చెప్తారు – మనకు అనాహత చక్రము. **"అనాహత చక్రము"** అంటే అర్థము ఏమిటి? "**హతము**" కాకుండవుండే నాదము. ఇది మనకు **"హృదయ స్థానము"**. ఇక్కడ – వాయుభూతము త్వగేంద్రియము దీనికి కారణము. త్వగేంద్రియము చేత వుండేటువంటి మలినమేమో మనకు అర్థమవుతాది. అనాహతచక్రమునకు హృదయ స్థానము – అంటే, పదిరెండు (12) దళాలు దీనికి. **క–ఖ–గ–ఘ–ఙ–చ–ఛ–జ–ఝ–ఞ–ట–ఠ** పదిరెండు అక్షరములు; షట్కోణాకారము; వాయుభూతము; బంగారువర్ణము; శంఖు నాదము; భవభక్తి; ఆదిశక్తి – ఇక్కడ **ఆరు వేలు (6000) "హంసలు"** ఆడుచుంటాయి. **"రుద్రుడు అధి దేవత"** గావున్నాడు. ఇక్కడ నీవు నీయొక్క స్వరూపము ఎట్లావుంది? అన్నపుడు – రుద్రస్థానములో అని అర్థము చేసుకోవాలి. ఇప్పుడు మనకు ఈ అనాహత చక్రము **"వాయుభూత"** సంబంధ మైనటువంటిది.

వాయు భూతములో పుట్టినటువంటి జ్ఞానేంద్రియము ఏది అంటే? **"త్వక్కు – త్వగేంద్రియము"**. దీనికి అనేకమైన స్పర్శలు వున్నాయి. కాలానుగుణముగా త్వగేంద్రియము – కాలములోవుండేటువంటి శీతోష్ణములను అనుభవించే శక్తి త్వగేంద్రియానికి వుంది. అట్లే, ధనముతో సంపర్కమైనప్పుడు; భార్యాబిడ్డలతో సంపర్కమైనప్పుడు; ధాన్యములతో సంపర్కమైనప్పుడు; కఠిన నేలమీద వున్నప్పుడు; ఇవన్నీ కూడ – ఇది స్పర్శను గ్రహిస్తుంది – ఈ త్వగేంద్రియము. ఈ **"స్పర్శేంద్రియముల చేత మనస్సు మలినమైవుంది"** కాబట్టి – ఈ స్పర్శేంద్రియాల లోపలవున్నటువంటి – ఆ **"సద్గురు స్వరూపాన్ని ధ్యానించాలి"** – ఇక్కడ, ఈ మలినములనుండి మనస్సును మరల్చుకోవాలి. ఇప్పుడు, ఇవన్నీ మనకు ఎట్లా వస్తున్నాయి అంటే! ఈ నాడు ముక్కును తృప్తి పరిచేదానికి – ఈ వాసనలు వచ్చినవి.

సబ్బులుగాని; పునుగుజవ్వాజి; పౌడర్లు; అత్తర్లు పన్నీరు - అంతా కూడ - ఈ ముక్కులోవుండేటువంటి **"భ్రాంతిని తీర్చేకొరకే - తుడిచి శుభ్రపరిచేదానికే!"** వీటినుండి కూడా మనస్సును మరల్చుకోవాలి.

ఇంక - నాలుకలో వుండే రుచులకే మనకు నవకాయ పిండివంటలు; రకరకాలైనటువంటి భోజనాలు వచ్చినాయి. దీని కొరకె, ఒక ఇంద్రియమును తృప్తిపరిచేదానికే! అట్లే, నేత్రేంద్రియములోవుండే, మనస్సును తృప్తి పరిచేదానికి - ఇంక - ఈ విశ్వమంతవుంది. సినిమాలు, టెలివిజన్లు వచ్చినటువంటివన్ని కూడ దీని కొరకే! ఇంక డన్లప్ పరుపులు; సెంచురి పరుపులు; మఖమల్ పరుపులు - ఈ రకమైనటువంటియొక్క మెత్తని పరుపులు; సుగంధద్రవ్యాలు, ఈ సౌకర్యాలన్ని - ఈ చర్మేంద్రియములోవుండే, మనస్సును తృప్తిపరిచేదానికే. ఇది పరమార్థదశలో, సృష్టి క్రమములో వున్నది వున్నట్లుగా అర్థము చేసుకొని - అనుభవించి తృప్తిపడే గుణము కోల్పోయి - రకరకాలైనటువంటివి కోరి - భ్రాంతిని తెచ్చుకొంటుండారు. అందువల్ల, జ్ఞానియైనటువంటివాడు ఏమి చేయాలంటే? ఇక్కడవుండే, ఈ విషయమును అర్థము చేసుకొని, దానికి తృప్తి పద్ధతిని నేర్పించి - అక్కడవుండేటువంటి మాలిన్యం పోగొట్టడమే - మనకు **"తారకము - మనస్సు శుద్ధి కారకము".** అందువల్ల, ఇది ఈ రకముగా అయింది కాబట్టి - దీన్ని ఇన్ని రకాలుగా వినిపించినారు. ఇప్పుడు విశుద్ధచక్రమును చెప్పుతారు. ఇది ఆకాశ తత్వముతో వుండేటువంటియొక్క లక్షణము.

## విశుద్ధ చక్రము

**58. సీ॥ తాలుమూలలయందు స్థానంబుగా విశుద్ధాంభోజముండు సుందరముగాను । పదియారు దళములు బాగుగా షోడశస్వరములుండును పరాశక్తియుండు । ఆకాశభూతంబు స్వానంద భక్తియు వర్తులాకారంబు స్ఫటికకాంతి । మోదంబుతో మేఘనాదంబు మ్రోయంగ హంసలు దశశతం బాడుచుండు ॥ గీ ॥ భాసురంబుగ నానందభరితమగుచు । నీవు ఈశ్వర రూపమై నిలచినావు ॥ రమ్య ॥**

విశుద్ధ చక్రమునకు **"జీవుడు అధిపతి"** - ఎందుకంటే, ఈశ్వరుడు ఇచ్చేవాడేగాని, కోరికలు వుండవు - ఈ గొంతులోవుండేటువంటి కోరికలు గొంతెమ్మ కోరికలు. జీవుని లక్షణాలు ఇలాగే వుంటాయి. కోరే గుణము **"జీవునికే"** తప్ప

ఈశ్వరునికి లేదు. అందువలన, ఈ విశుద్ధ చక్రము అనేది ఆకాశతత్వముతో పుట్టినటువంటిది. **"ఆకాశ తత్వములో పుట్టిన జ్ఞానేంద్రియములు - శ్రోతములు".** అందుకే, "మనకు - ధూషణ-భూషణ తిరస్కారాలు, ఈ లోకములోవుండే - కీర్తి ప్రతిష్టలన్ని - ఈ ద్వారములోనే, తెలివికి చేరాలి". అందువల్ల, ఎవరైనా మనలను గురించి, ఒక మాట చెడ్డగా అన్నారంటే, ఇది రకరకాలుగా బాధలు పడుతుంది. ఎవరైనా మంచిగా అన్నారంటే, లేనిపోనంతగా పొంగిపోతుంది - ఇది దీనియొక్క స్వభావము. అందుకే, దీనికి **"శుద్ధమనే"** పేరు పెట్టకుండ - **"విశుద్ధము"** అని పెట్టినారు. అంటే, విశేషమైన శుద్ధము గలిగినటువంటిది ఇది. ఆకాశము ఎప్పుడూ కూడ శుద్ధముగా వుండేదానికి ప్రతీక. దానియందు తోచే ప్రపంచమంతా ఎన్ని ఛిన్నా భిన్నములుగావున్నా - తాను ఏ మాత్రము కల్మషము లేకుండ నిర్మలముగా వుండేటువంటిది అది. ఇటువంటి విశుద్ధ చక్రములో శుద్ధముగా వుండవలిసినటువంటి **"జీవుడు"** - నానా కోరికలు కోరి మలినమైవుంటాడు కాబట్టి - ఇక్కడ వుండేటువంటి - ఆ **"గురుపరమాత్మ చైతన్యస్వరూపాన్ని" - "జీవరూపముగా తలచి" - "పరమాత్మరూపముగా ధ్యానించి",** ఇక్కడవుండేటువంటి గొంతెమ్మ కోరికలన్ని అదుపులో పెట్టుకోని - **"విశుద్ధ చక్రములో మనస్సును శుద్ధి చేయాలి".** అప్పుడు మనకు **"మనస్సుశుద్ధి అవుతుంది"** అన్నమాట. విశుద్ధచక్రమునకు కంఠస్థానము - 16 దళములు అంటే, ఇక్కడ పలుకే పలుకులన్నీ, కూడ కంఠము దగ్గ రనుండే శబ్దాలు వస్తాయి. ఎలాగంటే? " **అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః**" ఇవన్ని కూడ హృదయ మునుండి రావు, కంఠమునుండే వస్తాయి. అందుకే, **"డ-ఢ-ణ-త-థ-ద"** అనేటువంటివి ఎక్కడనుండి పలుకుతాయంటే? ఈ అక్షరముల శబ్దము ఎక్కడ మొదలైతాదో - ఆ స్థానమునుండి దీనికి చెప్పినారు అన్నమాట. కాబట్టి, ఈ రకముగా విశుద్ధ చక్రములో మనస్సును శుద్ధి చేయాలి - ఈ విధముగా మనస్సును శుద్ధి చేసుకొని ఆగ్నేయ చక్రానికి చేరుకోవాలి.

## ఆగ్నేయచక్రము

59. సీ॥ నాసాగ్రవీధిని నయనద్వయంబుల నడుమ నాగ్నేయంబు నమరియుండు । రెండు రేకులు దానికుండు, మీదను రెండు హంక్షంబులనియెడి

యక్షరములు । నబ్ధి నాదంబు మహత్తత్వ భూతంబు మాణిక్య కాంతి సమరస భక్తి । గంగా సరస్వతి సంగమ స్థానంబు హంసలు పది నూర్లు నాడుచుండు ॥ గీ ॥ శ్రీ కరంబుగ నట సదాశివమయస్వ । రూపమైనావు నీవు సంరూఢముగను ॥ రమ్య ॥

ఇది మనకు **"ఆగ్నేయ చక్రము; భ్రూమధ్యస్థానము"**; రెండు దళములు - అంటే, **'హం' 'క్షం'** అనే ఈ అక్షరములు రెండు - త్రికోణవర్తులాకారము; మహత్తత్వము; మాణిక్యవర్ణము; అబ్ధినాదము; సమరసభక్తి; చిశ్శక్తి; **"1000 హంసలు"**; దీనికి **"సదాశివుడు అధిపతి"** అని చెప్పినారు. ఇక్కడ - **"సదాశివుడు"** అంటే, **"ఎల్లప్పుడూ మంగళకరముగా వుండేటువంటివాడు"**. ఈ ఆగ్నేయ చక్రములో నిలబడే, ఈ శ్వాసను చెదరిపోకుండ - ప్రపంచములోనికి పోయినది, తిరిగి రాకుండ పోతుందేమో అని, ఒక క్షణమైన నిద్రపోకుండ - ఈ శ్వాసను లోపలికి లాగడము; బైటికి వదలడము; ఉఛ్వాశ నిశ్వాసముల పనిని చేస్తుంది. అక్కడ - **"అంతఃకరణ నిలయము"**; మనోబుద్ధి చిత్తాహంకారాలు - ఈ నాల్గు అవతారాలు ఎత్తేది అక్కడే. అంటే, సంకల్పించాలి అన్నప్పుడు కంఠస్థానానికి అక్కడనుంటీసే వస్తాది; నిశ్చయించేప్పుడు - ముఖస్థానానికి కూడా అక్కడనుంటీసే వస్తాది; చింతన చేయాలన్నా కూడ నాభిస్థానానికి - అక్కడనుంటీసే వస్తాది. అభిమానపడినప్పుడు హృదయస్థానానికి - అక్కడ నుండీసే వచ్చి, అంతఃకరణ నిలయమైన - ఈ **'హం' 'క్షం'** - అనేటువంటి సంకల్ప - వికల్పాల చేత సంకల్పించడము; దానిని తుడిచివేస్తూ కూర్చోవడము - ఇవన్నీ కూడ, ఇక్కడనుండే చేస్తూవుంటాడు. అందుకే, ఇక్కడ **"సదాశివరూపమై నీవు వున్నావయ్యా!"** - ఇక్కడనుండి; యెరుక మరుపులనేటువంటి - మలినమును పోగొట్టుకొని - నిన్ను ధ్యానించి - మనస్సును శుద్ధి చేసుకోవడమే!! ఇక్కడ **"మనస్సును శుద్ధి చేసేటువంటి లక్షణము"** - అని మనకు ఆగ్నేయ చక్రములో చెప్పి - ఇంక **"సద్గురు స్థానానికి"** పోతుంది ఆఖరుకి. ఇంక సహస్రార చక్రము - సద్గురు స్థానమును చెప్పుతున్నారు:

# సహస్రారచక్రము – సద్గురు స్థానము

60. సీ॥ సరసహస్రార చక్రము మూర్ధస్థలం బందుయుండు విలక్షణముగా నందు । వేయి రేకులింపొందుగా వర్తించు సాక్షిభూతము, సహజాత్మశక్తి । ఓంకార బీజము, ఝుంకారనాదము బహుచిత్రవర్ణము పరమభక్తి నమృతంబు । సెప్పుడు దతివృష్టిగా గురియు హంసలు దశశతంబాడుచుండు ॥ గీ ॥ నందు నిరుపమ సచ్చిదానందముగను । నీవు సద్గురు రూపమై నిలచినావు ॥ రమ్య ॥ "

ఇది మనకు **"సహస్రార చక్రమునకు మూర్ధని స్థానము".** అంటే, **"మెదడు స్థానము"; "1000** దళములు – **హంసలు";** వెయ్యి అని ఎందుకు చెప్పినారంటే? – ఇంక మొత్తము వుండేటువంటివి అక్కడనిండుకొని వున్నాయి కాబట్టి వెయ్యి అనేటువంటి పదాన్నే వాడాలి. సహస్రారం అనే పదము – ఇంక ఎంత అనంత పదాలకు అన్నిటికీ అదే వాడుతారు. ఇప్పుడు సహస్ర శీర్షం; పురుషం; సహస్ర అక్షం – అన్నప్పుడు – ఈ సహస్రమనే పదము, వెయ్యి తలకాయలు అన్నప్పుడు – వెయ్యి కన్నులు అని చెప్పకూడదు కదా! రెండు వేలు చెప్పాలికాని, వెయ్యి కన్నులే చెప్పుతారు. సహస్ర పాదము; సహస్ర బాహు – అంటే, అనంత నేత్రములు కలిగినవాడు; అనంతమైన తలలుగలిగినవాడు; అనంతమైన బాహు వులు కలవాడు అని చెప్పేకే తప్ప – సహస్రము అనేది వేరేకాదు కాబట్టి, ఈ సహస్రార చక్రమందున వెయ్యి దళములు; **"ఓం"కార బీజము – "మొట్ట మొదట శక్తి".** అందుకే, ఈ నాదము – మీరు చెవులలో వేళ్ళు పెట్టుకొని వింటేగాని – ఏ మాత్రము ఒక్క రెప్ప పాటు కూడ అది తెంపు లేకుండ అది అనర్గళముగా నడుస్తూ వుంటుంది. అందుకే, మొట్టమొదట – ఈ శరీరములోపల ప్రసరించేటువంటి శబ్దములు అన్నిటికీ మూల శబ్దము. అందుకే, దానికి **"ఓంకారము"** మొట్టమొదటి నాదము అని పేరు వచ్చింది – **"షట్కోణవర్తులాకారము".** ఇంక ఇక్కడ, ఏ కోణము లేదు. దీనికి వర్తులాకారమే స్వరూపము. కాని, అన్నింటిలోనికి అదే పోవాలి. ఆరు చక్రాలలోనికీ అదే పోవాలి; ఆరు కోశాలకు అదే పోవాలి; ఆరు అవస్థలలోనికీ అదే పోవాలి కాబట్టి; ఇదే **"సాక్షి**

భూతము; చిత్రవర్ణము; ఝుంకారనాదము; పరమభక్తి; సహజాత్మశక్తి." ఇంక – ఈ ఒక్క శక్తి, ఇతరులయొక్క ప్రమేయముతో వచ్చేది కాదు. **"సహజముగా; స్వయంభుగా వచ్చేటువంటి శక్తి అది."** ఇక్కడ **"1000 హంసలు"** ఆడుతూ వుంటాయి. ఈ అష్టదళ పద్మానికే, సహస్రారమని పేరు. ఎలాగంటే? ఎనిమిది దళాలకు – ఒక్కొక్క దళానికి 125 చిన్న దళములు కలిపి – 8 దళాలకు = 800; 8 x 25 = 200 (800 + 200 = 1000) కలిసి **1000** అనే పద్ధతిని పెట్టినారు. కాని, 72,000 నాడులకు శక్తి ఇచ్చేటువంటి **"ఘంటిక స్థానము"** – అక్కడేవుంది కాబట్టి, అక్కడ దానికి ఏ శక్తినైన స్వయముగా చెప్పాల్సి వస్తుంది కాబట్టి – ఇప్పుడు మనకు ఆడేటువంటి 21,600 హంసలతో వీటిని పంచినారు. ఆధార చక్రానికి – 600 హంసలు; స్వాధిష్టాన చక్రానికి – 6000 హంసలు; మణిపూరక చక్రానికి – 6000 హంసలు; అనాహత చక్రానికి – 6000 హంసలు; విశుద్ధచక్రానికి –1000 హంసలు; ఆగ్నేయ చక్రానికి – 1000 హంసలు; సహస్రానికి – 1000 హంసలు; ఇవి మనకు స్థూల శరీరములో నడిచేటువంటి హంసలు.

మనకు లోపల సూక్ష్మ శరీరములో స్వప్నము కలిగినప్పుడు – ఆ యొక్క సూక్ష్మ శరీరానికి పెట్టినారు. అది ఎంతకాలము వస్తాది అంటే, ఈ **2,200** కాలమే రెండు స్వప్నాలుగాని; మూడు స్వప్నాలుగాని రావాలి. ఇంక పూర్తి గాఢ నిద్రను అనుభవించేదానికి – కారణ శరీరమువుంటాది – దానికి 1200 హంసలు నడుస్తాయి. అంటే, ఈ **3,400 + 21,6600 = 25,000 హంసలు** ఖచ్చితముగా మనకు ఒక రోజుకు స్థూల; సూక్ష్మ; కారణ; శరీరాలలో – మూడు శరీరాలలో నడుస్తాయి అనే మాట. ఈ హంసను అనుసరించే లక్షణాలివి – **"కర్మయానము; పితృయానము; దేవయానము"** అని మూడు మార్గాలుగా – ఈ **"జీవుడు సంచరిస్తాడు"**. అంటే, శరీరముతో **"కూడి కర్మ చేస్తాడు"**; ఇంద్రియములతో కూడుకొని **"బీజాన్ని సృష్టింప జేసి"** – పితృ మార్గానికి దారిని కల్పిస్తాడు; మరియు దైవత్వాన్ని కూర్చి; ఇంద్రాది దేవతలను ఆరాధించి; వాటికి బలమునిచ్చి; దేవయానములో నడపిస్తుంది. ఇప్పుడు, ఈ లోక భ్రాంతిలో వున్నంతవరకూ – కర్మయానము. దేవతారాధన చేసేటపుడు – దేవయానము; ఈ ధర్మాలన్ని తెలిసుకోని – ఈ యొక్క **"జ్ఞాన**

**మార్గములో శిష్యప్రశిష్యుని చేయడము";** వంశాచారాన్ని నిలిపేకి పుత్రులను కనడము – ఇదంత పితృయానము. ఈ రకముగా – ఈ **"హంస",** ఈ శరీరములో పలవుండి – మూడు లోకాలకూ, నడిపేటువంటి యానము ప్రవర్తింప చేస్తుంది. కాబట్టి, ఈ యొక్క **"హంస లక్షణాన్ని"** ఇలా తెలుసుకొని – మనము **"తారకము – "మనస్సు శుద్ధి కారకము"** – అనే, తత్వాన్ని పొందాలన్నమాట. ఇంక ఆత్మజ్యోతి స్థానము చెప్పుతున్నారు – ఆత్మ ఎక్కడవున్నది?

## ఆత్మజ్యోతిస్థాన నిర్ణయము

**61. సీ॥ కొండమీదను పెద్ద గుండునొక్కటియుండు । గుండు నడుమను నల్లగుండ్లు రెండు । గుండ్ల మధ్యను నక్క కూతలు బెడుచుండు । కూతలనడుమను నూతియుండు । నూతి మధ్యంబున నాతియొక్కతెయుండు నాతిమీదను నొక్కకోతియుండు । కోతిమీదను పరంజ్యోతి వెల్గుచునుండు । జ్యోతియే జగమెల్ల జూచుచుండు ॥ గీ ॥ చూచుచుండేడిదానందు చోద్యమెరిగి నదియు తాననియున్నవాడాత్మవిదుడు ॥ రమ్య ॥**

ఇది కూట వేదాంతము. ఎందుకంటే, కొన్ని మరుగు పదాలు చెప్పే వేదాంతము ఒక్కటైనా పెట్టివుంటారు – ఏదైనాకాని అని:

**"ఇది వినుమయ్యా పరమ రహస్యం । ఎంతో చోద్యం పూని । వదలకనిల్పి నిజార్థంబెరిగిన వారికి మోక్షం దీని । పదములేకతోకయును లేనియొక పక్షి జగంబుల నేలా । పదపడిదానిని పట్టసెంచియొక బాలుడు పొంచెను చాల । అదిగని పారిటి వ్యాఘ్రములారిటి హరిణమొకటి దిగిమ్రింగె । కరికర పరువిడుఫణులను మూటిని కప్పవొకటి దిగిమ్రింగె । అదిగనిచను కరుణలసెనిమిటి మశకంబొక్కటి మ్రింగె । ఎంచ పంచ వింశతి భటులది పరికించి । తమకు ప్రభుపైన మించిన మానస రాజుని చేరిరి భీతిచెంది । మదిలోన వచ్చి పోయెడి వాని నిలయము జొచ్చి నాశమైరంత ॥ "**
– అనిచెప్పి ఒక కూటవేదాంతము. అందుకు :

**ఇంటియెనుక ఎర్రావుల దొడ్డి । కూర్చోని మేపరా కుందనపుగడ్డి ।**
**విప్పి చెప్పెరా వేమారెడ్డి । తెలియక పోతె తినరా గడ్డి అని ।**

ఇట్లా మనకు కూట పద్ధతిలో వేదాంతము చెప్పుతారు. దాని పద్ధతిలోనే - ఈ మహానుభావుడు కూడ - నాయన ! " **కొండమీద ఒక పెద్దగుండు**" అంటే, శరీరము అనేది ఒక "**పెద్ద హిమాలయ పర్వతములాంటిది**". అందులో, ఈ తలకాయ అనేటివంటిది ఒక పెద్ద గుండు - మేరుపర్వతములాంటిది - ఈ గుండు మధ్యన రెండు నల్లగుండ్లు అంటే - ఈ కన్నులు. ఈ కన్నుల మధ్యలో నక్క కూతలు పెట్టుతావుంది - ఇది జగమును చూచినప్పుడెల్ల, ఏదాన్ని చూస్తే - ఆ కూత పెట్టావుంటుంది లోపల - అది ఆత్మకూ వినపడుతాది, ప్రక్కనోళ్ళకు వినబడదు. నీ మనస్సు పెట్టే కూతలన్ని - నీకు బాగ స్పష్టముగా వినపడుతావుంటాయనే మాట. ఆ యొక్కకూతల నడుమన ఏమున్నది? నూతివున్నది; అంటే, అక్కడ "**జీవ జలమున్నది**" అక్కడే, ఆపోజలమున్నది "**ఆ నూతి మధ్యలో ఒక నాతివుంది**" - అది "**ఆనందానికి నిలయమైన విద్యలరాణి; ముక్తికాంత**". ఆ నాతిమీద - ఆ ఆనందాన్ని అనుభవించకుండా చెల్లా చదరము చేసె ఒక కోతివున్నది - అదే మనకు "**మనస్సు**" అనేటువంటి " **కోతి**". ఆ కోతిమీదనే - "**ఈ సృష్టినంతా వెలగించేటువంటి జ్యోతివున్నది**" - "**ఆ జ్యోతే**"- ఈ అంతర్బాహ్యములోవుండే ప్రపంచాన్ని అంతా చూస్తుంది. అట్లాచూస్తూవుండేదాని యందు చోద్యమెరిగి "**జ్యోతి స్వరూపమైన పరమాత్మనే నేను**" అని ఎవడైతే తెలుసుకొంటాడో - వాడు "**ఆత్మను**" తెలిసినవాడు - "**ఆత్మవిదుడు**" అని చెప్పి ఆత్మయొక్క జ్యోతి స్థానాన్ని నిర్ణయించినారు అన్నమాట. ఇంక పరమాత్మ స్థానమును చెప్పుతున్నారు:

## <u>పరమాత్మ స్థానము</u>

అది కూటు పద్ధతి కదా! ఇప్పుడు - జ్ఞానపద్ధతిగా "**పరమాత్మ స్వరూపాన్ని గురించి**" చెప్పుతారు:

62. సీ|| విమల చిన్మయనేత్రకమల మధ్యంబున । మార్తాండ సోమాగ్ని మండలములు । మండలంబులయందు మహనీయముగా నొక్క నీలమేఘంబుండు

నిజముగాను । మేఘమధ్యంబున మెరుపు మెరయుచు నుండు । నందు నీవారశూకాగ్రముండు । శూకాగ్రమున నతిసూక్ష్మ స్వరూపమై ।బహిరంతరంబులప్రజ్వరిల్లి ॥ గీ ॥ వెలుగుచున్నావు నేకమై పేరులేక నిర్మలాకార నిరుపమ నిర్మలాత్మ ॥ రమ్య ॥

ఇంక – **"చిన్మయనేత్రమధ్యమున"** – అంటే, జ్ఞాన నేత్రము మధ్యములో విమల చిన్మయుడు – మలినములేనివాడు – ఎప్పుడూ **"పరిశుద్ధమైనటువంటి తేజస్సు కలిగినవాడు"** – అన్నిటిని గురుతెరిగేటువంటివాడు – వీడు ఎక్కడవున్నాడు అంటే: **"విమల చిన్మయనేత్ర కమలమధ్యంబున"** – ఈ జ్ఞాననేత్రమనే కమల మధ్యములో – **"మార్తాండ సోమాగ్ని మండలములు"** – సూర్యమండలము; అగ్నిమండలము; చంద్రమండలము అనేటువంటి మూడు మండలముల మధ్యన **"మండలంబుల యందు మహనీయముగా నొక్క నీలమేఘంబుండు నిజముగాను"** – ఈ మండలముల మీద మనకు నీల మేఘము ఒకటి వున్నది – **"ఆకాశమువలే":** ఇది ప్రకృతి జన్యముగా నిద్రరూపములో, ఈ **"జ్ఞానమనే సూర్యునికి"** అడ్డమువస్తాది కొంత కాలము. ఇప్పుడు, జ్ఞానరూపములో **"మరుపు"**అనే రూపములో, ఈ మేఘము అడ్డము వస్తావుంటాది. **"ఈ మేఘమధ్యంబున మెరుపు మెరయు చునుండు"** – ఈ యొక్క మెరుపు లోపలనే – ఈ **"యెరుక"** మెరుస్తూవుంటాది. ఆ మెరుపు మధ్యములో వున్నటువంటియొక్క **"తత్వమది."** **"మేఘమధ్యంబున మెరుపు మెరయుచునుండు నందు నీవారశూకాగ్రముండు "** – అంటే, **"దూసరముల్లువలే"** – ఒక వరి అంటే, తోకవడ్లువరి – అంటే, ఆ కాలములోవుండేదేమో వాళ్ళకి; అది **"1000 భాగాలు చేసే"**, ఎంత చిన్నగా వుంటాదో? **"అంత చిన్నగా!" "ఒక వెంట్రుకను 1000 భాగాలుగా చీలిస్తే ఎంత అణురూపమైతుందో అంత సన్నగా!"** వుంటాది. **"శూకాగ్రమున నతిసూక్ష్మస్వరూపమై బహిరంతరంబుల ప్రజ్వరిల్లి"** – లోపల ప్రపంచాన్ని వెలిగిస్తూ; బైట ప్రపంచాన్ని వెలిగిస్తూ వెలుగుచున్నావయ్యా ఇట్లా; **"నిర్మలాకార నిరుపమ**

నిర్మలాత్మ" - నీవు నిర్మలమైనటువంటి ఆకారము **"ఆత్మ స్వరూపము"** అని చెప్పి **"ఆత్మయొక్క జ్యోతి స్థానము"** చెప్పినాక - ఇంక ప్రకృతి లక్షణము ఏమి? ఇప్పుడు ఆత్మవరకు, ఇలా ఎక్కి పోయినాము మనము. షడ్ చక్రాలమీదనుండి - సహస్రానికి పోయి, సహస్రారములో వుండేటువంటి ఆ **"చిన్మయ పరమాత్మ స్వరూపము"** ఎట్టిదని తెలిసికొన్నాము. ఇంక - **"ప్రకృతి క్షర లక్షణము"** ఎట్లావుంటాది? అనే దానిని తెలియజేస్తారు;

## ప్రకృతి క్షర లక్షణము

63. సీ॥ జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు ప్రాణాదులైదు శబ్దాదులైదు। ఘనమనోబుద్ధహంకార చిత్తంబులు నాల్గుగూడిరువది నాల్గుతత్వ । ములగూడి ధవళశ్యామల రక్తపీత వర్ణములు నాలుగు గల్గి నదియు ప్రకృతి । నది క్షరంబది క్షేత్రమది జడంబది దృశ్యమది యవిద్యాజ్ఞానమదియనాత్మ ॥ గీ ॥ నదియే జీవంబునది దేహమది జగంబు । నదియు సంసారమది బంధ నరకమదియు ॥ రమ్య ॥

ఇది **"ప్రకృతి క్షర లక్షణము"** - ఇప్పుడు జ్ఞానేంద్రియములు - ఐదు (5); కర్మేంద్రియములు - ఐదు (5); ప్రాణేంద్రియములు - ఐదు (5); విషయేంద్రియములు - ఐదు (5); అంతరింద్రియములు - నాల్గు కలిసి - ఈ 24 తత్వాలతో వుండేటువంటిదే **"ప్రకృతి". "ఇదే, జడము; ఇదే క్షేత్రము; ఇదే - మాయ; ఇదే - అవిద్యా; ఇదే - అజ్ఞానము; ఇదే - సంసారము; ఇదే - మనకు బంధము."** మనకు బయటవుండేటువంటి సంసారము పెద్దది కాదు; బయటవుండే, సంసారము ఎప్పుడో - ఒక పూట కలుస్తాము దాంట్లో - మాట్లాడుకోవడమో; తెలుసుకోవడమో వుంటాది. ఇది నిరంతరము నొసగనీకుండ, ఈ సంతానాన్ని చక్కపెట్టుకొనేదానికే - మనకు కాలమంత సరిపోతావుంది. అందువల్ల, ఇదే **"క్షరము"** **"నశించి పోయే వస్తువు"**. దీన్ని అభిమానించి, ఈ సంసారములోనె, మనము చిక్కుకున్నాము కాబట్టి - దీన్ని దాటియుండేటువంటి విధానము తెలుసుకోవాలి.

ఇంక ఇట్లా - క్షర రూపమైనటువంటిదానిలో, "అక్షరస్వరూపమైనటువంటి లక్షణము" ఎట్లావున్నది? **"ఆత్మ లక్షణము"** అనేది ఇంక తెలియజేస్తారు:

## అక్షరస్వరూప లక్షణము

64. సీ॥ శ్వేతరక్తాసిత పీతవర్ణంబుల । నడుమను నీలవర్ణంబు యుండు । నదినీలతో యదమగు దానినడుమ । నిర్వాతదీపము కాంతి రీతి యుండు । నదియు విద్యుల్లేఖనదియు నాపోజ్యోతి । నదియు నోంకారంబు నక్షరంబు । నది మేరుశిఖరంబు నదియు కైలాసంబు । నది సత్యలోకంబు నాశ్రయంబు ॥ గీ ॥ నదియు వైకుంఠ పదము తత్పదము నదియు । నదియు త్వంపద మంతరార్థంబు నదియు ॥ రమ్య ॥

ఇప్పుడు అక్షరస్వరూప లక్షణాన్ని తెలియజేస్తున్నారు - అంటే, "రక్త శ్వేత కృష్ణ పీతవర్ణముల నడుమ నిర్వాత దీపమువలే శుద్ధస్ఫటిక ముండును" - శుద్ధస్ఫటిక సన్నిభమైనటువంటిదని మనకు సద్గురు పాదకాస్త్రములో కాని; మిగతా ఉపనిషత్తు శృతులలోగాని తెలియజేస్తారు. ఎందుకంటే, దాని స్ఫటికత్వము అట్లాంటిది. దాని సన్నిధానములో - "సకలేంద్రియాలకు శక్తి" వస్తావుంది. అది **"విద్యుల్లేఖ"** అనే, మెరుపుతీగ - అదే, కరంట్‌యొక్క పవర్; అదే, **"ఆపోజ్యోతి"**; అంటే, **"నీళ్ళల్లో వెలిగే జ్యోతి".** ఇప్పుడు మనకు "నీళ్ళల్లో జ్యోతి వెలుగుతావుంటాది అని చెప్పి మనకు కరంట్(విద్యుత్) చెప్తారు". "కాని నీళ్ళలో వెలిగే జ్యోతి సృష్టి ఆరంభమునుండి ఇక్కడేవుంది". అందుకే, నేత్రస్థానమునందువుండే, నీరుకు **"ఆపో"** - ఈ నేత్రములో వెలిగే జ్యోతికి "ఆపోజ్యోతి ". **"ఆపో"** అంటే, "శుద్ధ జలము". ఈ శుద్ధ జలములో పలవెలిగేటువంటి జ్యోతే - ఈ **"ఆపోజ్యోతి".** ఇది **"ఓంకారము"** - **"అక్షరము"** - నశించనటువంటిది; **"మేరు శిఖరము; కైలాసము;**

సత్యలోకము; వైకుంఠము; తత్పదము; త్వమ్ పదము" అంతా కూడ ఇదే! "అసి పదము" అదే కాబట్టి - తత్త్వమసి మహావాక్యములచేత - జ్ఞాని నిత్యతృప్తుడై వున్న చోటునే - ఈ సృష్టినంత తనలో పూరించుకొని, దానియొక్క "నిజార్థమని తెలుసుకొని", ఎక్కడా పోకుండా "నిత్యానంద సుఖాన్ని; పరమానంద సుఖాన్ని" పొందుతాడంటే, కారణము ఏమంటే? ఇట్ల సూక్ష్మముగా దీనియొక్క నిజతత్వాన్ని దర్శించినాడు కాబట్టి - ఆ రకముగావుంటాడు. అందుకే, "జ్ఞాని అక్షర పురుషుడు" - "నశించనటువంటివాడు".

65. సీ|| శ్వేతరక్తాసితపీత నీలంబుల । నడుమ నివాసమైనావు నీవు । మానితా దిత్య సోమాగ్ని మండలముల । నడుమ నివాసమైనావు నీవు । పొందుగా కళ నాదబిందు త్రయంబుల । నడుమ నివాసమైనావు నీవు । విమల భగీరథీ యమునా సరస్వతీ । నడుమ నివాసమైనావు నీవు || గీ || అండపిండాండ బ్రహ్మాండ భాండములను । నడుమ యున్నావు నీవు యానందము గను || రమ్య ||

ఇట్లా - ఆత్మస్వరూపాన్ని - ఈ "త్రిపుటులన్నిటి మధ్యలోకూడ ఆయనే వున్నాడు. శ్వేత; రక్త; కృష్ణ; పీత; సునీలముల మధ్య - 5 రంగుల మధ్య; ఈ పంచ రంగుల మధ్యలో; సూర్యసోమాగ్ని మండలము మధ్యలో; నాదబిందు కళలకు మధ్యలో; గంగా, యమునా, సరస్వతి నదుల మధ్యలో; అండపిండ బ్రహ్మాండములకు మధ్యలో"; ఈ "అన్నిటియొక్క మధ్యస్థానములో నీవు పరమాత్మ స్వరూపమై వెలుగుచున్నావు". అంటే, ఇక్కడ కేవలము ఒక చోటనేవుండాడు అని చెప్పినట్లైతాది కదా! అక్కడ కొన్ని విమర్శలు వచ్చినాయి - ఏమయ్యా! పరమాత్మకు అంత చిన్న స్థానాన్ని ఇచ్చినారు "నీవారశూక వత్తన్వీ పీత భాస్వత్వనూపమ" అని చెప్పి - అంత "దూసరివల్లి ముల్లుకంటే చిన్నదా

**పరమాత్మ"** – అలా చెప్పకపోతే, ఇంక – ఎట్లు చెప్పాలంటూరు? కాని, అది సర్వగతము కదా! సూర్య చంద్రాగ్ని మండలములయందున; పంచభూతములయందున; ప్రపంచమందున – అంతలెక్కల వుంటేనే కదా పని జరిగేది – అట్లా సర్వగతముగా చెప్పాలి కాని, ఒక చోటనే చెప్పితే ఎట్లా? అంటే! తాను నిర్మించుకొన్నటువంటి సృష్టి అంతటా కూడా తానే నిండివున్నదని చెప్పి ఒక ప్రమాణాన్ని – ఒక శృతిని చెప్పినారు. అంటే, **"ఆత్మ సర్వగత లక్షణము"** – అన్నిటిలోపలవున్నది – అని చెప్తావున్నారు – "ఆత్మ సర్వగత లక్షణము":

## ఆత్మ సర్వగత లక్షణము

**"సర్వగతము"** అంటే, **"లోపల అని అర్థము"**. అన్నిటికి – అన్నివస్తువులకు లోపలవుండే తత్వము అని – అది ఎట్లావున్నది అంటే:

66. సీ॥ ధరణిలో తిలలందు తైలముండినరీతి । దారువుయందున్న దహనురీతి నాణెమౌ దధియందు నవనీతమున్నట్లు । పుష్పమందున గంధమున్న యట్లు । రంజిల్లు ఫలమందు రసము గల్గినభంగి । చేల మందున్నట్టి నూలు భంగి । తారహారాదుల దారముండిన తీరు । యిసుక రాళ్ళందున్న యినుముతీరు ॥ గీ ॥ నఖిల జగముల సకలదేహంబులందు నిండియున్నావు ఈ రీతి నిజముగాను ॥ రమ్య ॥

ఇప్పుడు – ఎట్లావుంటాడు అంటే! ఎన్ని ఉపమానాలు చెప్పినారో చూడండి! **"ధరణిలో తిలలందు తైలముండిన రీతి"** – నూగులలోవుండేటువంటి **"నూనెవలే"** అంతటావుండావు; **"దారువయందున్న దహను రీతి"**; కట్టెయందున్న **"అగ్నివలే"** అంతటావుండావు; మరి **"దధియందు"** – పాలయందువున్నటువంటి **"వెన్న/నెయ్యి వలే"** వుండావు; **"పుష్పమందున్న"** టువంటి **"గంధమువలే"** – అంతటా వుండావు; **"రంజిల్లు ఫలమందు రసముగలిగిన భంగి "** – మామిడి పండినపండ్లలో **"రసము నిండుగా"** ఎట్లావుంటుందో – ఆ రకముగా వుండావు; **"చేలమందున్నట్టి నూలు భంగి"**; గుడ్డయందున్నటువంటి **"నూలు ఓతప్రోతముగా"** – **"నిలువు–ప్రక్క"** అంతా అదిగా ఎట్లావున్నాదో, ఆ రకముగా;

"తారహారాదుల దారముండినయట్లు" – మణులహారమందున **"దారము"** వుండినట్లు; **"యిసకరాళ్ళందున్న"** టువంటి **"యినుము"** తీరుగా – అలా **"సకల జగములలో; సకల దేశములయందు; సకల శరీరములలో – నీవు ఈ రకముగా నిండివున్నావు"** అని చెప్పి – రః 84 లక్షలు జీవరాశుల సమూహము ఎంతైతే కనబడతావుందో – అంతలెక్కల గూడ నీవు ఇట్లువుండావని – అట్లా వున్నప్పుడు మనకు విలక్షణత్వము కనిపించదు కదా! కాబట్టి విలక్షణత్వాన్నే, **"ఆత్మకు ప్రతిపాదిస్తూ"** – మళ్ళీ ఆత్మసర్వగతముగా వుంటాది అనే విషయాన్ని తెలియజేస్తారు.

## దేహేంద్రియ విలక్షణము – ఆత్మసర్వగత లక్షణము

67. సీ॥ నా తల్లి నా తండ్రి నా సతుల్ నా సుతుల్ । నా పశుసంఘంబు నా గృహంబు । నా భూషణంబులు నా వాహనంబులు । నా క్షేత్ర పాత్రముల్ నా ధనంబు । నా ధాన్యమని పల్కినప్పుడు పురుషుండు । తానవిగాకవేరైన విధము । నా శరీరంబును నా యింద్రియంబులు । నా జీవధర్మముల నా గుణంబు ॥ గీ ॥ లనుచు బలికిన దేహేంద్రియాదులకును । నీవు వేరుగనుందువు నిశ్చయముగ ॥ రమ్య ॥

ఇప్పుడు – ఉపమానాలు ఇవి – చూడు, "నా తల్లి; నా తండ్రి; నా సతులు; నా సుతులు; నా పశువులు; నా గృహము; నా భూషణములు; నా వాహనములు; నా ఊరు; నా రాజ్యము; నా దేశము; నా ధనము" – అన్నప్పుడు **"వాటికి నీవు ఎట్లా వేరుగావుండావో"**– ఆ రకముగా, "నా శరీరము; నా ఇంద్రియములు; నా మనస్సు; నా ప్రాణము"; అని అన్నప్పుడు కూడా – ఇవన్నిటికంటే, నీవు విలక్షణముగా వుండేటువంటివివాటిని తెలిసికొంటూ వుండావుగాని – వేరే కాదు – అనేటువంటి విషయాన్ని, ఇట్లా **"ఆత్మ సర్వలక్షణ విలక్షణముగా"** వున్నది. "నా మనస్సు అన్నప్పుడు – మనస్సుకు వేరుగాను"; "నా చిత్తము అన్నప్పుడు, చిత్తమునకు వేరుగాను"; "నా శరీరము అన్నప్పుడు – శరీరముతో వేరుగాను"; అంటే,

ఇవన్ని "నీకు తెలియబడే జడ పదార్థములుగావుండాయి". నీవు ఇవన్నిటిని తెలుసుకొనేటువంటి "చైతన్య" – "తెలివిగా" వుండావు కాబట్టి, "నీవు వీటికి వేరుగావుండావు అనేటువంటి విలక్షణత్వాన్ని తెలియజేసినారు". అలాగే, ఈ పద్ధతిని అనుసరించి – ఇంక రెండు పద్యాలు వుండాయి – ఇట్లాంటివే, ఇప్పుడు చెపుతారు:

## యెరుక నిర్ణయము

68. సీ॥ యిది ఘటం బిదిపటం బిదిమఠం బిదిహటం। బిదిశఠం బిదిభఠం బిది యఠంచు । నిదిమనం బిదిజనం బిదిధనం బిదిఘనం । బిదిదినం బిదివనం బిదియటంచు । నిది హయం బిదిప్రియం బిదినయం । బిదిజయం బిదిభయం బిదియటంచు । నిదిశరంబిది కరం బిదిసరం బిదిపురం । బిదిపరం బిదిస్థిరం బిదియటంచు ॥ గీ ॥ నిదియునదియును నదియును నిదియటంచు । నెరిగియెరుగని యెరుకలో నెరుకనీవు ॥ రమ్య ॥

"ఘఠము ఇది; మఠము ఇది; శఠము ఇది; భఠము ఇది" – అని అన్నప్పుడు "వాటికి విలక్షణముగావుండావు". "ఇది జనము; ఇది ధనము; ఇది ఘనము; ఇది దినము; ఇది యనియు; ఇది హయము; ఇది ప్రియము; ఇది జయము – అన్నప్పుడు ( ఇవన్ని పదాలు – కవిత్వభావములో లేదు; పదాలు చెప్పుకుంటూ వచ్చినారు); ఇది అఫశబ్ధము; ఇది సుశబ్ధము" అని అన్నప్పుడు – దానకంటే, ఎట్లా "విలక్షణముగా వుండావో"; ఉష్ణము; శీతము; మృదుత్వము; శుక్లము; రక్తము; కృష్ణము; మధురము; ఆమ్లము; లవణము; సుగంధము; దుర్గంధము అని యెరిగినదే "యెరుక " సుమా "నీవు".

69. సీ॥ ఇది యపశబ్దంబు నిదిసుశబ్దంబని । యెరిగిన యెరుకలో యెరుక నీవు । యిది యుష్ణమిది శీతమిది మృదుత్వంబని । యెరిగిన యెరుకలో యెరుకనీవు । యిది శుక్ల మిది రక్తమిదియుకృష్ణంబని । యెరిగిన యెరుకలో యెరుకనీవు । యిది

మధుర మిది యామ్ల మిదిలవణంబని । యెరిగిన యెరుకలో యెరుకనీవు । యిది సుగంధంబు దుర్గంధమిదియటంచు । యెరుగుచుండిన యెరుకలో యెరుక వీవు ॥ రమ్య ॥

ఇప్పుడు – ఎందుకంటే, ఇవన్ని జ్ఞానేంద్రియ విషయాలు – ఇది అపశబ్దము; ఇది సుశబ్దము అనేది చేవులుతో వింటాము; మరి ఇది ఉష్ణము; ఇది శీతలముయని చర్మముతో చూస్తాము; ఇది మృదుత్వమో – ఇది కఠినత్వమో అని చర్మముతో చూస్తాము; ఇది శుక్లము; ఇది రక్తము; అని చెప్పే వర్ణములన్ని నేత్రములతో చూస్తావు; ఇది ఉప్పు; ఇది కారము; ఇది చేదు; ఇది ఒగరు అని నాలుకతో చూస్తావు; ఇది సుగంధము; ఇది దుర్గంధము అనేటువంటిదానిని నీవు ముక్కుతో చూస్తావు; అది–ఇది అని దేహజగత్తులోను; జగత్తులోపల–వెలుపల – **ఏ "యెరుక"** ఎరుగుచున్నదో, **ఆ "యెరుకే" – " ఆత్మ "** యని తెలియవలయును. ఇన్నిటి లోపలవుండి – ఏదైతే తెలిసికొంటావుందో అది **"ఆత్మ స్వరూపముగా గురుతెరగాలి".** ఇంక ఇప్పుడు మీకు **"ఆత్మ"** అంటే, ఏమో "దేహాది క్షర పదార్థములు" అంటే, ఎమో – ఇంతవరకూ అర్థమైవుంటుంది. ఇప్పుడు – అన్ని నీవు కావు అనేటువంటిదానిని తెలియజేసుకుంటా – **"నీ స్వరూపాన్ని మాత్రమే నిలిపి"** – మిగత జగత్తంతా నిరూపిస్తాను – **"నేతి నేతి యనేటువంటి మహావాక్యాలు"** వస్తాయి;

## "నేతి నేతి" యను మహావాక్య లక్షణము

**70.** సీ॥ నీవు పృధివియుగావు నీరగ్నులునుగావు । మారుతముగావు వ్యోమంబుగావు । శ్రోతత్వక్కులుగావు నేత్రజిహ్వలుగావు । ఘ్రాణంబు గావు వక్త్రంబుగావు । పాదపాణులుగావు పాయుపస్థలుగావు । ప్రాణముల్ గావు శబ్దంబుగావు । స్పర్శరూపులుగావు పరగరసమును గావు । గంధంబుగావు చిత్కళలు గావు ॥ గీ ॥ మానసాదులుగావు కర్మములుగావు । సచ్చిదానంద రూపాత్మ సాక్షి నీవు ॥ రమ్య ॥

ఇప్పుడు నీవు - ఇవన్ని కూడ ఇంక ఏమీకాదు - నీవు "సత్"-"చిత్"- "ఆనందస్వరూపమైన ఆత్మవు". "సత్" అంటే, మూడు అవస్థలలో తిరుగుతూవున్నా - ఏద్దైతే, మార్పు చెందకుండావుందో, అది "సత్ పదార్థము". అంటే, "ఆత్మ; సత్ పదార్థము". సర్వమును - ఏది గురుతెరుగుతావుందో - అలా అన్నింటిని తెలుసుకొనే "జ్ఞానము; చిత్ పదార్థము". "చిత్" అంటే, "జ్ఞానము" అని. ఈ "చిత్" అయినటువంటి "జ్ఞానము" "ఆనందస్వరూపమైన పరమాత్మమే కాని అన్యముకాదు" అని తెలుసుకొన్నప్పుడు - పొందేటువంటి "ఆనందమే నీవు". అట్లనే, "సకల విషయాల చేత - ఆనందాన్ని అనుభవించే లక్షణము నీది - ఆనంద లక్షణము నీ స్వరూపమైవున్నది కాబట్టి" - నీవు పృథ్వి; జలము; అగ్ని; వాయువు; ఆకాశము - అంటే, పంచభూతములు నీవుగావు; అంటే, శ్రోత; త్వక్కు; చక్షు; జిహ్వా; ఘ్రాణములు అనే, "జ్ఞానేంద్రియాలు నీవు కావు"; వాక్కు; పాణి; పాద; పాయు; ఉపస్థలనే "కర్మేంద్రియములు నీవు కావు". "ఇవన్ని కూడ నీవు కావు" అని చెప్పి - ఇంక "ఇంత యెరుక" అయ్యి, అన్నిటిలో "నీవు వుండినావు" అని చెపుతూ వచ్చినారు. షడ్ చక్రములలో ఏమి చెప్పినారు? ఆధార చక్రములో - నీవు గణపతి రూపమై నిచిలినావు; స్వాదిష్టాన చక్రములో నీవు బ్రహ్మరూపమై నిలిచినావు; మణిపూరక చక్రములో నీవు విష్ణురూపమై నిలిచినావు; అనాహత చక్రములో నీవు రుద్రరూపమై నిలిచినావు; విశుద్ధ చక్రములో నీవు జీవుడపై - అంటే, ఈశ్వర రూపమై నిలిచినావు; ఆగ్నేయ

చక్రములో నీవు సదాశివరూపమై నిలిచినావు; సహస్రారమందున నీవు సద్గురు మూర్తియై నిలిచినావు – ఎందుకంటే :

శిష్యునికి, ఈ విధమైన బోధ ఎందుకు చేసుకుంటూ రావాలి అన్నప్పుడు – **"వీడు కించజ్ఞత్వానికి అలవాటు పడివుంటాడు."** సామాన్యముగా, మనకు సర్వజ్ఞత్వము అంటె గిట్టదు. ఇప్పుడు మనకు **"వైష్ణవ సిద్ధాంతము వున్నది అనుకోండి – మహాపండితులు వుండారు – కాని కించజ్ఞత్వాన్ని ఒప్పుకొంటూరు."** సర్వజ్ఞత్వము అంటే, అన్నిటిని తెలుసుకోనువచ్చేమోగాని **"ఆత్మను నేను"** అని ఒప్పుకోలేరు – అంటే, అలవాటు బడిపోయినాము మనము. అందువల్ల, ఇప్పుడు ఏమి చెప్పినారు? ఇలా షడ్ చక్రాలన్ని చెప్పుకుంటూ; చెప్పుకుంటూ – అక్కడ బ్రహ్మ దేవుడుగా వుండాడు; అక్కడ విష్ణు దేవుడుగా వుండాడు అని చెప్పుకొంటూవస్తే – ఓహెూ! అక్కడ బ్రహ్మ దేవుడు వుంటాడంట; అక్కడ విష్ణు దేవుడు వుంటాడంట అనుకొంటూ వస్తాడేగాని – నిజముగా **" ఆ స్వరూపమే నేను"** అనేటువంటిదానిని తెలుసుకోలేడు. ఇట్లా పరోక్షముగా చెప్పుకొంటూ వచ్చి – ఇప్పుడు **"నీ స్వరూపాన్ని నిర్ణయము"** చేసిన తర్వాత, ఇట్లు చెపుతూ వచ్చినాడు అన్నమాట.

71. సీ॥ షట్చక్రములుగావు షడ్వర్ణములుగావు । కామాది శత్రువర్గములు గావు । షట్కోశములుగావు షడ్భ్రములును గావు । షడ్వికారంబుల సరణిగావు । షట్కసంపత్తులు షడ్గుణంబులుగావు । వరషడూర్ములుగావు క్షరముగావు । షణ్మతంబులుగావు షట్శాస్త్రములుగావు । షట్కర్మములు గావు సత్తుగావు ॥ గీ ॥ సప్తధాతువులునుగావు సప్తకోటి మంత్రములుగావు యానందమయుడవీవు ॥ రమ్య ॥

ఇంక – ఇక్కడ ఏదానిని కూడ అభిమానముగా నిలపనీయడు – అన్నీ కూడ; **"అన్నిటికి నీవు విలక్షణముగా"** వుండావనేటువంటియొక్క విషయాన్ని చెప్పుతారు.

**"ఇంక ప్రపంచములో, చెప్పునటువంటి వేదశాస్త్ర**

ములలో - ఎన్ని సంఖ్యలైతే వున్నవో - అన్ని సంఖ్యలు నీవు గావు." ఇప్పుడు - ఆరింట్లోవుండేటువంటివి చెప్పినారు కదా! ఇంక ఎనిమిదిటికి కూడ చెప్పుతారు - ఇక్కడ :

72. సీ॥ అష్టతనువులుగావు యష్టాత్మలునుగావు । అష్టాంగయోగాది నిష్ఠగావు । అష్టమూర్తులుగావు అష్టపురంబులు గావష్టమదములుగావు నీవు । అష్టాబ్జ ములుగావు అష్టపాశంబులు । అష్టస్థలంబులు నరయగావు । దశ రంధ్ర ములుగావు దశ నాడులును గావు । దశ వాయుగుణసమంధములుగావు ॥ గీ ॥ పంచశక్తులుగావాది ప్రకృతిగావు । సర్వపరిపూర్ణచైతన్య సాక్షివీవు ॥ రమ్య ॥

ఇంక - ఇప్పుడు, ఈ ఇట్లావుండేటువంటి అన్నీ కూడ నీవు కావు. దశరూపములవంటివి నీవు కావు. అంటే, ఇప్పుడు ఏమి అయినావు? **"పరిపూర్ణ చైతన్యమైన సాక్షి స్వరూపానివి నీవు".** మనకు సృష్టిలోవుండేటువంటి ప్రకృతులకు - అన్నిటికంటే, నీ స్వరూపము విలక్షణముగావున్నది. ఇక్కడ, ఒక సందేహము వస్తాది? ఆ సందేహము తీర్చేటువంటియొక్క లక్షణాన్ని - ఇంక **" సర్వం ఖల్విదం బ్రహ్మ "** అనే శృతి కావల్సి వచ్చింది.

ఇవన్నీ, నీవు కాదు కదా! మరి నీకు ఎవరైన నీ మీద ప్రేమచేత నీకు చేసి ఇచ్చినారా ఇవన్నీ! నీవే - అయినావంటే? ఇప్పుడు - **"ఉపాదాన నిమిత్త కారణము" తానే** కావాలి కాబట్టి - ఇప్పుడు **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అనే శృతి కావల్సివచ్చింది కాని - మొట్టమొదటనే, నీవు అన్ని అయినావంటే ఒప్పుకొంటాడా! అట్లా ఒప్పుకోడు. మొట్టమొదట **"నీవు పరమాత్మ స్వరూపము"** అంటే, ఒప్పుకొంటాడా! అది శక్తిచాలదు. ఇప్పుడు ఇట్లా సర్వలక్షణ విలక్షణుడిగా చెప్పుతూ వచ్చి - ఇప్పుడు **"నేను ఆత్మను"** అనేటువంటి సుఖాన్ని అనుభవించినాక - ఇంక **"సృష్టియంత నీ స్వరూపమే"** - ఇక్కడ ఒక్క వస్తువూ కూడ - ఒక్క **"అణువు"** కూడ **"ఆత్మని"** విడిచిపెట్టి ప్రక్కన లేదు - అని చెప్పినప్పుడు -

మనకు బేధ భావము నశిస్తాది! భ్రాంతి నశిస్తాది! **"అంతా ఏకాత్మభావన కలుగుతాది"!** అందుకు - " సర్వం ఖల్విదం బ్రహ్మ " అనేటువంటి విషయాన్ని తెలియచేస్తారు.

## సర్వంఖల్విదం బ్రహ్మ అనే శృతిపద్ధతి

73. సీ॥ తత్పదంబును నీవు త్వంపదంబును నీవు । నసిపదంబును నీవు నాత్మవీవు । అండాండములు నీవు పిండాండములు నీవు । బ్రహ్మాండములునీవు బ్రహ్మనీవు । సత్తు చిత్తులు నీవు సాక్షిరూపము నీవు । క్షరుడువు నీవు యక్షరుడవీవు । క్షేత్రంబులును నీవు క్షేత్రజ్ఞుడవు నీవు । కర్మంబులును నీవు జ్ఞానమీవు । స్థూలదీర్ఘంబులును నీవు సూక్ష్మమీవు । నీవు నేనను నీపైన భావమీవు ॥ రమ్య ॥

ఇప్పుడు - ఇక్కడ **"విశ్వరూపదర్శనము"** అయితాది - ప్రతియొక్కరికీ కూడ - ఇక్కడ ఎప్పుడైతే, **"సర్వము నేను"** అనే భావము వస్తుందో - అప్పుడు విశ్వమంత తనలో ఎలా నిక్షిప్తమైవుంది? ఈ **"విశ్వమంత కర్త ను-భోక్తను" " నేను "** అయ్యి వుండాను అనేటువంటి విషయము నిస్సందేహముగా తెలుస్తాది. ఇంక, వీడు సందేహ పడడు! చెప్తానే, అర్థము చేసుకోనేటువంటియొక్క అనుభూతి వస్తాది - అన్నమాట. అందువల్ల, ఇప్పుడు **"సర్వం ఖల్విదం బ్రహ్మ".** అంతవరకూ, **"నేనే సర్వకర్తంటే"** - నీవే సర్వకర్తవు స్వామి అని మ్రొక్కేవాడుగాని - ఆ ధైర్యము రాదు అనేమాట. అందువల్ల, ఇప్పుడు - "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శృతి ఎప్పుడు చెప్పాలి? **"ఇంత బోధైన తర్వాత "ఆత్మస్వరూపము"** అనుభవానికి వచ్చినపుడు చెప్పాలి ".

74 సీ॥ విశ్వసృష్టిని నీవు విశ్వేశ్వరుడవు నీవు। విశ్వవంద్యుడవీవు విశ్వమీవు। వేదవేద్యుడవీవు వేదాంతుడవు నీవు। వేదస్తుడ వీవు వేదమీవు। యజ్ఞకర్తవు నీవు యజ్ఞభోక్తవు నీవు। యజ్ఞరూపడవీవు। యజ్ఞమీవు। దేవదేవుడవీవు దేవాత్మకుడవీవు। ధైవజ్ఞుడవునీవు ధైవమీవు ॥ గీ ॥ శిష్యుడువు నీవు పరమదేశికుడ నీవు। సగుణనిర్గుణుడవు నీవు సాక్షివీవు ॥ రమ్య ॥ .

ఇక్కడ - "విశ్వసృష్టివి; విశ్వేశ్వరుడవు; విశ్వవంద్యుడవు నీవు; విశ్వమీవు" - ఇంక దీనికంటే, అన్యమైనటువంటి పదార్థము లేదు. "వేదవేద్యుడువీవు వేదాంతుడవు నీవు ; వేదస్తుడవీవు వేదమీవు" ; వేదము నీవే; వేదములో చెప్పబడినవాడవు నీవే; వేదము చదువపొందబడినవాడివి నీవే" ; - ఈ అంతా కూడ నీవే. ఇంక - "నీకంటే అన్యమైన పదార్థము లేదు"; "యజ్ఞకర్తవు నీవు; యజ్ఞభోక్తవు నీవు; యజ్ఞరూపడునీవు; యజ్ఞము నీవు" - యజ్ఞానికి కర్తవు ఎవ్వరు? యజ్ఞాన్ని ఎవరు చేయాల అనికోనివుండారు? ఆ చేసినవాడు యజ్ఞము అంటే - మల్లా కట్టెలు పెట్టిన యజ్ఞమని కాదు. ఈ "సృష్టి మహా యజ్ఞము" ఇది. "ఆత్మనుండి" ఎలా ఆవిర్భవించినదో - సృష్టి ఎప్పుడు యజ్ఞరూపము ధరించి - సుభిక్షముగా సృష్టి వున్నంత కాలము ఎలా జరుగుతూవుందో, ఈ యజ్ఞమునకు సృష్టించినటువంటి కర్తవు. ఈ "యజ్ఞస్వరూపముతో ప్రకాశించేవాడివి". ఈ యజ్ఞానివి - ఈ యజ్ఞముతోపొందే ఫలానివీ, కూడా నీవే. అన్యమైనటువంటిది లేదు.

"దేవదేవుడవీవు; దేవాత్మకుడవు; ధైవజ్ఞుడవు; ధైవమునీవే". ధైవజ్ఞుడువు అంటే, ధైవాన్ని తెలిసేవాడు; ధైవత్వాన్ని పొందినవాడు; దేవాత్ముడుగా వుండేటువంటివాడు; ఆ ధైవస్వరూపమైనటువంటి వాడు; "అంతా కూడ నీవే". నీవే భక్తుడు కావాలి! నీవే దేవుడుకావాలి! నీవే గురుడుకావాలి! నీవే శిష్యుడు కావాలి! నీవే జ్ఞానము కావాలి! నీవే జ్ఞానియును కావాలి! ఇంక, వేరె

వుండదు అన్న మాట. " **పరమదేశికుడు నీవే, శిష్యుడువు నీవే – గురువు నీవే; శిష్యుడు నీవే". " సగుణుడవు నీవు నిర్గుణుడవు నీవు సాక్షివీవు** " – ఈ అన్ని అయ్యీకూడ అన్నిటికీ సాక్షి స్థానములో, నీవే వుండావు. ఇట్లా ఆత్మ తత్త్వాన్ని బాగ అర్థము చేసుకోని – ఇవన్ని విడిచిపెట్టరాదు – వీటిని మననము చేయాలి ; మననము చేసినప్పుడే, ఆ **"అనుభూతి"** మీరు పొందుతారు. ఎట్లావుండాను నేనుయొక్క సర్వాత్మకుడై అనేటువంటి దాన్ని పొంది – ఆ తర్వాత నిర్ణయానికి రావాలి. మళ్ళ సందేహాలు పుట్టకూడదు; ప్రశ్నలు పుట్టరాదు – అప్పుడే, అది అనుభవము అయేది. మరల, నీవు ఇది–అది అని ప్రశ్నలు వేసికొంటూ – కోతిమాటలు మాట్లాడుకొంటావు అనుకో! అదేమిపట్టదు దానికి. దీనికి ఇంక పంచభూతైక్య నిర్ణయము చెప్పుతారు:

## పంచభూతైక్య నిర్ణయము

**75. సీ॥ అవని నీరంబులో నైక్యంబుగా జేసి నా నీరమగ్నిలో నైక్యపరిచి । నాయగ్ని వాయులో నైక్యంబుగాజేసి నావాయు గగనమం దైక్యపరచి । గగనంబు మహదహంకారంబులో గల్పి తదహంకృతియు మహత్తత్వమందు । నైక్యంబుగజేసి నా మహత్తత్వంబు నద్వయ బ్రహ్మమం దైక్యపరచి ॥ గీ ॥ నట్టి యోగీంద్రుడద్వయుండ ప్రమేయు । డప్రతర్క్యుండ వంతుడు నఖిలసముడు ॥ రమ్య ॥**

ఈ విధముగా పంచభూతాలను ఐక్యము చేసుకోవాలి. అంటే, "భూమిని – జలములోను; జలము – అగ్నిలోను; అగ్ని – వాయువులోను; వాయువు – ఆకాశములోను; ఆకాశము – మహదహంకారములోను; మహదహంకారము – మహత్తత్వములోను; మహత్తత్వము – అవ్యక్తమందును; ఆ అవ్యక్తము – అద్వయబ్రహ్మమందును ఐక్యముపరిచి;" **"తాను అద్వయస్వరూప బ్రహ్మమై వుండాలి".** ఇలాంటి భావము క్రమపద్ధతిగా ఎవరికైతే కుదురుతుందో, వాడు **"సృష్టి; స్థితి; లయాలకు కర్తయై",** ఏదాని

చేత బంధింపబడకుండా **"విలక్షణముగా వుండగలుగుతాడు"** అన్నమాట.

ఇవన్నీ అయిన తర్వాత – ఇంక శరీరదృష్టి – ఆవరణదృష్టి కూడా పోవాలి కదా! ఆవరణదృష్టి పోయినప్పుడే **"బ్రహ్మతత్వము సిద్ధిస్తుంది".** ఆవరణ దృష్టి వున్నంతవరకూ ఆత్మ స్వరూపకుడుగా వుంటాడుగాని, అన్నిటికీ కర్తగా – ఈ **"ఆత్మ"** సృష్టికి పూర్వము – ఈ సృష్టి లేనప్పుడు శాశ్వతముగా వుండేటువంటి **"పరమాత్మ స్వరూపమే"** అనేది ఖచ్చితముగా తెలియజేసుకొనేటు వంటిదానికి **"జ్ఞానియయ్యే"** లక్షణాన్ని ఇక్కడ చెపుతారు.

## జ్ఞానియయ్యే లక్షణము

76. **సీ॥** బ్రహ్మమందాత్మైక్యభావంబు దెలిశితే నజ్ఞాన వృత్తులు నణగచుండు । నజ్ఞాన వృత్తులు నణగిన పిమ్మట నవివేక వృత్తులు నణగుచుండు । నవివేక వృత్తులు నణగినపిమ్మట నభిమానవృత్తులు నణగుచుండు । నభిమానవృత్తులు నణగినపిమ్మట రాగాదులెల్ల విరాగమౌను ॥ గీ ॥ రాగములు బోయినపుడు కర్మములు దొలగు । కర్మములు దొలగ నిర్మల జ్ఞానియగును ॥ రమ్య ॥

ఇంక – " **బ్రహ్మమందాత్మైక్యభావంబు దెలిసితే"** – ఇప్పుడు ఆత్మసర్వగతుడై; ఆత్మపంచభూత రహితమైనటువంటి స్వరూపముగా నిలబడినాడు కదా! ఇప్పుడు ఈ **"ఆత్మ" – " అయం ఆత్మ బ్రహ్మ"** – బ్రహ్మమంటే ఏమి? సృష్టికి పూర్వము; స్వయంబుగా; స్వయం శక్తిగా వుండేటువంటిది; సర్వవ్యాపక మైనటువంటిది; నిర్గుణ స్వరూప మైనటువంటిది; ముల్లుకుచ్చేకి సందులేక వుండేటువంటి" వస్తువును **"బ్రహ్మము"** అని అంటారు. ఆ బ్రహ్మమునందు – ఈ ఆత్మను ఐక్యము చేయాలి. అంటే, **ఈ "ఆత్మ" – ఆ "శాశ్వతమైన బ్రహ్మమే"** గాని వేరేదికాదు. వేరే లేదు అనేటువంటి – **"ఈ ఆత్మకూ; బ్రహ్మతత్వానికి"**

భిన్నత్వము తొలిగిపోయి – "**ఆ బ్రహ్మమే తానైయుండే**" వారికి ఇంక అజ్ఞాన వృత్తులు వుండవు! అవివేక వృత్తులూ వుండవు! అభిమాన వృత్తులు కూడా వుండవు! రాగాదులూ వుండవు! కర్మము కూడా వుండదు! ఎప్పుడైతే, ఇవన్నీ నశించి పోతాయో – అప్పుడు వాడు ఎట్లా వుంటాడంటే? "**నిర్మల జ్ఞాని**" అయ్యివుంటాడు.

ఇట్లు, నిర్మల జ్ఞాని అయ్యేటువంటి లక్షణాన్ని పొందిన తర్వాత, మనకు నిజ ధర్మము తెలియ బడతాది. కాబట్టి, "అంతవరకూ కూడ – శ్రవణ; మనన; నిధిధ్యాసము – బాగ చేయాలి. గురువు దగ్గర విద్య పరిపూర్తియై; సందేహరహితుడయ్యేవరకూ – ఇతర శాస్త్రముల దగ్గరకు కాని; ఇతర గురువుల దగ్గరకు కాని పోరాదు – అది **నియమము**". అది ఎందుకు పెట్టినారంటే? ఇతనికి మనస్సు ఇదిగో అంటే చలించిపోతుంది! అదిగో అంటే చలించిపోతుంది! మళ్ళీ వాని మనస్సును సక్క పెట్టాలంటే, గురువు కొండంత రాగము తీయవల్సి వస్తూంది కాబట్టి – ఇదంతా అవిద్యా పద్ధతి కాబట్టి, అవిద్యపూర్తిగా తొలిగిపోయి – పూర్ణవిద్యావంతుడయ్యేవరకూ గురువు దగ్గర క్రమ శిక్షణతో బోధ వినాలి. అలా విన్నప్పుడే – "**ఆత్మసాక్షాత్కారము**" అవుతుంది.

ఇప్పుడు – మనకు వేదాంత శాస్త్రములో పొందదగిన ధర్మాలు తెలిసుకొంటూ వచ్చినాము. ఇంక "**నాలుగు మహావాక్యములు**" వున్నావి – ఇవి ప్రాచీన ఋషులు నాలుగు వేదములలో, వేదసారమునంత తీసి – ఒక వాక్యముగా జేసుకుంటూ వచ్చినారు. ఈ వేదాంత సారానికంతా మూలస్థానమైన స్వరూపము ఏదో, ఈ "**మహావాక్యాలు**" మనకు తెలియచేస్తాయి. ఇక్కడ నాలుగు మహావాక్యాలలో – "**ఋగ్వేద జ్ఞానకాండము;** ఐతరేయోపనిషత్తులో "**ప్రజ్ఞానం బ్రహ్మ**" అని చెప్పింది. ఇప్పుడు, ఉపాసనకాండ; కర్మకాండ; జ్ఞానకాండ; అనే కాండములు ప్రతివేదములోను మూడు వుంటాయి. అందులో, ఉపాసనకాండ; కర్మకాండ; అయిపోయింది కాబట్టి – ఇప్పుడు జ్ఞానకాండలో, ఆత్మస్వరూపాన్ని "**నిన్ను**" గూర్చి ఏమని చెప్పింది? ఇంక ఋగ్వేదములో – ఐతరేయోపనిషత్తులో – ఏమని చెప్పిందో – ఈ ప్రజ్ఞానం బ్రహ్మ మహావాక్యమును తెలియజేస్తారు.

# నాలుగు మహావాక్యములు
## 1. ఋగ్వేద జ్ఞానకాండము (ఐతరేయోపనిషత్)
## "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే శృతి

77. సీ॥ శ్రవణేంద్రియంబుల శబ్దముల్ వినుచుండు । చర్మేంద్రియంబుల స్పర్శలెరుగు । చక్షురింద్రియముల వీక్షించు రూపముల్ । రూఢిగా జిహ్వచే రుచుల నెరుగు । ఘ్రాణ రంధ్రంబుల గంధమాఘ్రాణించు । వాక్కుల వచియించు వాక్యములను । యేజ్ఞానమున నిన్ని టెరిగే నాజ్ఞానంబు ప్రజ్ఞానమని శృతుల్ బలుకుచుండు ॥ గీ ॥ నట్టి ప్రజ్ఞానలక్ష్యార్థమనుభవంబు నీ స్వరూపంబు నిక్కంబు నిజపథంబు ॥ రమ్య ॥

"నీ స్వరూపంబు నిత్యంబు నిజపథంబు" - అంటే, ఈ జ్ఞానముచేత - శ్రోతము ద్వార శబ్దములు వింటున్నాము; చర్మముచేత - స్పర్శము ఎరుగుతున్నాము; నేత్రములచేత - రూపాలు ఎరుగుతున్నాము; జిహ్వచేత - రుచులు ఎరుగుతున్నాము; ఘ్రాణముచేత - వాసన చూస్తున్నాము; ఆ జ్ఞానమే **"ప్రజ్ఞానము"** - అదే, ఈ శరీరములో **"బ్రహ్మతత్వము"**.

ఇప్పుడు - ఏది బ్రహ్మము అని ఒక సభజేసి జనకులవారు - జ్ఞానులందరినీ కూర్చోబెట్టి - **"బ్రహ్మతత్వాన్ని"** గురించి చెప్పమని అన్నారు. అంటే, ఆ ఆత్మను గురించి - ఏమీ ప్రత్యక్ష అనుభవముగావుండేది అని అడిగినారు. ఒకాయన లేచి అంటాడు - ఈ **"దేహమే బ్రహ్మము"** అనెను. సరి ఈయన - అనుభవములో వుండేదికదా - చెప్పాల్సివుండేది సరి - ఇది న్యాయమే అన్నాడు - ఒక పాయింట్ వాళ్ళది.

మరి ఇంకొకాయన లేచినాడు - ఇది నిజమైనటువంటి బ్రహ్మము కాదయ్యా, ఈ శరీరము జడము - దీనికి **"బ్రహ్మము"** అంటే, నేను ఒప్పుకోను - ఈ ఇంద్రియములతో కూడిన, ఈ శరీరము బ్రహ్మము కాదు అన్నాడు. మరీ ఏది బ్రహ్మము అన్నాడు? ప్రాణమువుంటేనే శరీరము పని చేస్తాది కాబట్టి, ప్రాణము లేకపోతే -

శరీరము పని చేయదు కాబట్టి, **"ప్రాణమే బ్రహ్మము"** అని నేను అంటాను అన్నాడు. సరి అది కూడ ఒక ఆలోచన చేస్తే, ప్రాణము లేకపోతే – శరీరము పని చేయదు కదా అన్నాడు.

ఇంకొక ఆయన లేచినాడు – ప్రాణము బ్రహ్మము అంటే నేను ఒప్పుకోనయ్యా – ఈ శరీరము; ఈ ప్రాణము – నిద్ర పోయినప్పుడు రెండూ కూడ జడములుగానే వుంటాయి. ఇందులో, దీనికి ప్రజ్ఞేలేదు కాబట్టి – ఈ **"ప్రాణమును నేను బ్రహ్మము"** అంటే, నేను ఒప్పుకోను. అట్లైతే ఎవరు బ్రహ్మము అన్నారు? అంటే, దీనికి మనస్సు వుండాల – మనస్సే దీనినంత నడపిస్తావుంది. **"మనస్సే బ్రహ్మము"** అని నేను సిద్ధాంతము చేసినాను అంటాడు.

సరి, ఇంకోకాయన లేచినాడు – మనస్సు బ్రహ్మము కాదయ్యా – అది సంకల్ప-వికల్పాలు వుండేది. ఒక అవస్థలోవుంటే – ఇంకో అవస్థలో వుండేదికాదు కాబట్టి – ఇది మనస్సు; ఇది ప్రాణము; ఇది శరీరము; అని ఏద్దైతే తెలిసి కొంటావుందో, **"ఆ జ్ఞానమే బ్రహ్మము"**. **"బ్రహ్మమంటే పెద్ద వస్తువు అని అర్థము"**. ఇక్కడ, ఈ శరీరములో అన్నిటికంటే పెద్దది. ముఖ్యమైనటువంటి వస్తువు ఏది అంటే, మనకు ఏమి అర్థమైతాది? ఈ **"ప్రజ్ఞానమే"** అన్నిటికంటె పెద్దది అని అర్థమైతాది. కాబట్టి, ఈ **"ప్రజ్ఞానం బ్రహ్మము"** అని చెప్పినారు. అందుకే, శృతి కూడ :

శ్లో॥ యెనేక్షతే శృణోతీదం । జిఘ్రుతి వ్యాకరోతీచ ।
స్వాద్వాస్వాదు విజానాతి । తత్ప్రజ్ఞాన ముదీరితం ॥

**ఏద్దైతే, ఇవన్ని చేస్తావుందో – అది "ప్రజ్ఞానము" అని చెప్పబడివుంది.**
ఇంక :

78. సీ॥ భారతీపతి రమాపతి పార్వతీపతి । వాసవాద్యఖిల దేవతలయందు । మానవాశ్వ గవాది మశక పిపీలికాంతము జీవులందు చైతన్యమొకటి । యట్టిచైతన్యమే యాత్మ బ్రహ్మంబనే । పదమునకు లక్ష్యార్థభావ మిదియు । కమలజాది పిపీలికాంత

శరీరముల్ । వాచ్యార్థమని వాటి వదలి తేను ॥ గీ ॥ యా పరబ్రహ్మ చైతన్యమాత్మలనేటి । వార్త భేదంబులేకాని వస్తువొకటి ॥ రమ్య ॥

ఇంక - బ్రహ్మ; విష్ణు; రుద్రుడు; ఇంద్రాది దేవతలును - మనష్యులు; అశ్వములు; పశువులు; మొదలైన - దోమలు చీమలు అనేటువంటి - ఇవన్నీ కూడ ఉపాదులు ఇవి. ఈ ఉపాదులన్నిటిని గురుతెరిగేటువంటి **"చైతన్యమే ఆత్మ స్వరూపము".** ఈ ఉపాదులన్ని తీసి చూస్తే - **"ఆత్మ" - "బ్రహ్మ"** అనే రెండు పదాలే తప్ప వస్తువు మాత్రము రెండుగా లేదు. వున్నది ఒక వస్తువే కాబట్టి - **"ప్రజ్ఞానం బ్రహ్మ"** మని విచారించేటువంటివాడు పిపీలికాది బ్రహ్మ పర్యంతము - సృష్టిలోవుండే, ఉపాదులన్ని విమర్శించి చూస్తే - అందులోవుండే, **"చైతన్యమే"** బ్రహ్మ స్వరూపముగా వుంది. ఇంక ఇక్కడ వాద భేదములకు చోటు లేదు అని చెప్పుతారు.

శ్లో॥ చతుర్ముఖేంద్ర దేవేషు । మనుష్యాశ్వ గవాదిషు ।
చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యాపి ॥

## 2. యజుర్వేద జ్ఞానకాండము (బృహదారణ్యా కోపనిషత్)

### " అహం బ్రహ్మోస్మి " అనే శృతి

ఇంక - తర్వాత - "అహం బ్రహ్మోస్మి" అనేటువంటిది - యజుర్వేద జ్ఞానకాండము; బృహదారణ్యా కోపనిషత్ - ఇది **"యాజ్ఞవల్క్య మహాఋషి"** చెప్పినారు. **" అహం "** అనేటువంటి వస్తువే, **"బ్రహ్మము"** అని, ఈ యజుర్వేద జ్ఞానకాండములో ప్రబోధించినారు:

79. సీ॥ పరిపూర్ణమయ్యున్న పరమాత్మ బ్రహ్మ విద్యకు యోగ్యమైన కాయంబునందు । బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది । యహమనే పదమున కర్థమగును । ప్రతిలేనిద్వైస్వతః పరిపూర్ణపరమాత్మ । బ్రహ్మశబ్దమున కర్థంబునిదియు । అహమేవ బ్రహ్మ బ్రంహ్మైమ్మవాహమనియన్న । యస్మ్యసేపదమున కర్థమనుచు ॥ గీ ॥ నెరిగి వాచ్యార్థములనెల్ల పరిహరించి । యనుభవజ్ఞానిబొందు లక్ష్యార్థమందు ॥ రమ్య॥

ఇందులో, "బ్రహ్మవిద్యకు" అధికారియైన దేహముండాలి దీనికి. మానవ జన్మము ఎత్తేదే కాదు – మానవ జన్మలో కూడ బ్రహ్మ విద్యకు యోగ్యమైనటువంటి శరీరము వుండాలి. అప్పుడు, దేహమందు బుద్ధికి సాక్షియై స్ఫురింపుచున్నది ఏదో, అదే **"అహం"** అనేటువంటి పదము.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః । ఇంద్రియేభ్య పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యోః । బుద్ధేః పరతస్తు సః ॥

ఈ ఇంద్రియములకంటే – ప్రాణేంద్రియములు గొప్పవి; ప్రాణేంద్రియములకంటే మనస్సు గొప్పది; మనస్సుకంటే – బుద్ధిగొప్పది; ఆ బుద్ధికంటే – ఆత్మగొప్పది; అంటే, ఈ బుద్ధిని – ఏదైతే తెలిసికొంటూవుందో – అది **"అహం"** అనే పదానికి అర్థము. అందుకే, **"అహం"** – అనే పదానికి మూడు – అర్థాలు వున్నవి. మిథ్యార్థము; గౌణార్థము; ముఖ్యార్థము; అని మూడు పద్ధతులలోవుంటూది. ప్రతి ఒక్కడు " **నేను**" అన్నప్పుడు – ఈ స్థూల శరీరాన్ని చూపిస్తూవుండాడు కాబట్టి – ఈ స్థూల శరీర ధర్మములో **"అహం"** అనే గుణము దీనికి లేదు కనుక – ఇది మిథ్యార్థము. నశించిపోయేటువంటిది. ఒక అవస్థలోవుంటే, ఇంకొక్క అవస్థలో – కనబడదు అనేటువంటి, ఈ **"శరీరమును నేను"** అనుకోవడము అది సరియైన అర్థము కాదు – విచారిస్తే, లేని అర్థము.

ఇంక – సూక్ష్మ శరీరాన్ని అభిమానిస్తాము; **"నేను"** ఏ జన్మములో – ఏ పాపము చేసినానో – ఈ జన్మములో అనుభవిస్తూవుండాను. ఈ జన్మలోజేసివుండేది ముందు

జన్మలో అనుభవిస్తాను అని, సూక్ష్మ శరీరాన్ని అభిమానిస్తాడు. ఇది కూడ "అహం" అనే పదానికి సరియైన అర్థము కాదు – గౌణార్థము. అంటే, అనుకోవచ్చును – అన్నట్లుగా కొంచెము. ఇంక – ముఖ్యార్థము ఏది అంటే? ఈ దేహము; మనస్సు; స్థూల;సూక్ష్మ;కారణ శరీరాలన్నిటినీ కూడ గురుతెరుగుతూ –"అహం" అనే పదానికి ఏదైతే అర్థమైవుందో – అది "అహం" అనేటువంటి పదానికి "లక్ష్యార్థము. "ప్రతిలేనిదై స్వతఃసిద్ధమై పరమాత్మయైన వస్తువు బ్రహ్మమనే పదమునకు అర్థమగును" – అంటే, దానికి ప్రతిలేనంటివంటిది – ఇంకొదానియందు ఆధారపడకుండ – తనుకు తానే స్వతః సిద్ధముగావున్నటువంటి వస్తువు ఏదైతేవుందో, అది బ్రహ్మమనేటువంటి పదానికి లక్ష్యార్థము అన్న మాట. ఆ "అహంమేత్వం" "అదే నేను"; " నేనే అది" అనేటువంటియుక్క భావమే " అస్మి" అనే పదానికి అర్థము. అందువల్ల, "అహం బ్రహ్మోస్మి" అంటే, ఈ ఒక దేహేంద్రియ–బుద్ధి ఇంద్రియములకు – అన్నిటికీ సాక్షిగావుండి ఏదైతే " నేను నేను " అని పలుకుతూవుందో అది "అహం". సృష్టికి పూర్వము వున్నటువంటి "చైతన్యము" స్వయం సిద్ధమైనటువంటి "బ్రహ్మము". "బ్రహ్మము" అనే పదానికి – ఈ ఒక జ్ఞానము చేత – ఈ "నేనే" ఆ బ్రహ్మము అనేటువంటి భావము – ఐక్యభావము తెలియడమే – " అసి " అనే పదమని "అహం బ్రహ్మోస్మి " అనే స్థితిని తెలియజేసినారు.

శ్లో॥ పరిపూర్ణ పరాత్మాస్మి । దేహి విద్యాధికారిణి ।
బుద్ధేసాక్షి తయాస్థిత్వా । స్ఫురం న్నహమితీర్యతే ॥

శ్లో॥ స్వతః పూర్ణః పరాత్రాత్మ । బ్రహ్మశబ్దేన వర్జితః ।

అస్మిత్యైక్య పరామర్శ । నైన బ్రహ్మ భవామ్యహం ॥

ఇది శృతి చెప్పినటువంటి పద్ధతి.

## 3. సామవేద జ్ఞానకాండము ( ఛాందోగ్యోపనిషత్ ) "తత్వమసి" - అనే శృతి

ఇంక - సామవేద జ్ఞానకాండము - ఛాందోగ్యోపనిషత్ - **"తత్వమసి" "మహావాక్యము"** - ఇది **"ఉపదేశవాక్యము"**. ఇదే, మొట్టమొదట రావాలి. ఈ వాక్యము మొదట చెప్పి, బోధ విన్న తర్వాత అదే అనుభవానికి తెచ్చుకోవాలి. యావుది? అది **"ప్రజ్ఞానం బ్రహ్మ"** మని; **"అహం బ్రహ్మాస్మి"** అని; **"అయమాత్మ బ్రహ్మ"** మని; ముందు గురూపదేశవాక్యమైనాకనే రావాలి. కాని వేదములలో, ఋగ్వేదము - మొదటిదని చెప్పి - ఇట్లా తీసికొంటూవచ్చినారు. ఈ **"తత్వమసి వాక్యము"** - **"శ్వేతకేతు-ఉద్ధాలకులయొక్క"** సంవాదము - ఛాందోగ్యోపనిషత్తులో వున్నది - **"సామవేద - జ్ఞానకాండము"**

80. సీ॥ మరియు సృష్టికి పూర్వమందద్వితీయమై । నామరూప క్రియ లేమిలేక । ఏకమై యచలమై ఏదియుండునొనది । తత్పద లక్ష్యతాత్పర్యమిదియు । తన వివేకమున సాధన చతుష్టయములు । గలిగిన పూర్ణాధికారియందు । ధీమనో చిత్తాది దేహేంద్రియములక । తీతమై సాక్షియై తేజరిల్లు ॥ గీ ॥ నదియు త్వంపద లక్ష్యార్థమనగ నొప్పు । నసిపదార్థంబు నీరెంటికైక్యమరయ ॥ రమ్య ॥

ఈ తత్వమసి మహావాక్యానికి లక్షణత్రయాలు వున్నాయి. **"జహర్ లక్షణము; అజర్ లక్షణము; జహర్ అజర్ లక్షణము"** - అంటే, **"విడిచిన లక్షణము"; "విడువని లక్షణము"; "విడిచీ-విడువని లక్షణము"**; అనేటువంటి పద్ధతులలో - ఇది వుంటాది కాబట్టి - ఈ మూడు లక్షణాలన్నీ కూడ - ఈ తత్వమసి మహావాక్యములో వస్తాయి . దీనియొక్క లక్ష్యార్థము ఏమంటే, **"తత్"** - అంటే, **"సృష్టికి పూర్వము స్వతః సిద్ధమైనటువంటి వస్తువు ఏద్దైతేవుందో"**, అది **"తత్ పద**

లక్ష్యార్థము"; "త్వమ్" - అంటే, "దేహేంద్రియములకు సాక్షిగావుండి, ప్రత్యగాత్మ స్వరూపమే - సర్వమును గుర్తెరుగుతూవుండే, ఏ వస్తువైతేవుందో" - అది "త్వమ్ పద లక్ష్యార్థము" "అసి" - పదము అంటే, "ఈ ప్రత్యగాత్మ - ఆ పరమాత్మ స్వరూపమేగాని అన్యము కాదు అని తెలిసినప్పుడు" - "అసి పదము సిద్ధిస్తాది". ఇట్లు "తత్వమసి మహావాక్యాన్ని" గురించి మనకు "ఈ సామవేదములో - ఛాందోగ్యోపనిషత్తులో" - తెలియజేసినారు.

భద్రాద్రి రామ శతకమందున - సృష్టి విధానమును - ఈ క్రమవిద్య - ఎట్లు వుంటుంది? "నిత్యనిరాకార స్వరూపమైన - నీ స్వరూపము" "సృష్టిని; బ్రహ్మాండమును-పిండాండమును" చేసుకోని, దానియందున అనేకమైనటువంటి మెలికలు పొందుతూ, అనంత కాలము గడిచిన తర్వాత - తన "నిజస్వరూపాన్ని" తెలుసుకొని, తాను ముక్తుడు కావాలనే కోరిక పుట్టినప్పుడు - మరల, ఎలా దీనిని "ఆరోహణ" చేయాలి అనేటువంటి విషయాన్ని తెలియజేసుకొంటూ వచ్చినాము.

ఇప్పుడు, అన్ని పద్యాలై - వేదములో, మహాఋషులు ఆ "నేను" గురించి విచారించిన ధర్మాలన్నీ - ఒక్కొక్క వేద శాఖ ఎట్లు చెప్పిందో, అట్లు నాలుగు "వేదముల మహావాక్యాలను" చెప్పుకొంటూ వచ్చినాము. ఈ వాక్యములు "విధి వాక్యములు అని"; "అనుభవ వాక్యములు అని" ; ఈ మహావాక్యములకు నాలుగు పేర్లు వున్నాయి. అందులో, సహజముగా మిగతా వాక్యములన్ని "ఓమిత్యాక్షరం బ్రహ్మ"; "సర్వం ఖల్విదం బ్రహ్మ"; "నేహ నాస్తి కించన" - ఈ అన్ని వాక్యములకంటే కూడ - "మహావాక్యములు

**ముఖ్యమైన పాత్ర"** ధరించివుండాలి. ఆ మహావాక్యములులో, చెప్పినటువంటి ఋగ్వేద వాక్యము - జ్ఞానకాండలో, ఐతరేయోపనిషత్తులో చెప్పినటువంటి **"ప్రజ్ఞానం బ్రహ్మను"** గురించి చెప్పుకొన్నాము; తర్వాత, యజుర్వేదములో జ్ఞానకాండాన్ని అనుసరించినటువంటి అనుభవవాక్య మైనటువంటి **"అహం బ్రహ్మోస్మి"** వాక్యాన్ని కూడా చెప్పుకొన్నాము.

సామవేద వాక్యములో - ఛాంద్యోగోపనిషత్తు చెప్పినటువంటిదానిని ఇప్పుడు మనము తత్వమసి మహావాక్యమును చెప్పుకొంటూవుండాము. కాని **"దానిని జహర్ లక్షణము; అజర్ లక్షణము; జహర్ అజర్ లక్షణము - అనేటువంటి లక్షణాత్రయాల చేతనే, ఈ మహావాక్యాన్ని బోధించాలి".**

ఇప్పుడు - మనకు జీవేశ్వరైక్యము కుదరాలాంటే, **"ఈశ్వరునికి - సర్వజ్ఞత్వ గుణాలు" ; "జీవునికి - కించజ్ఞత్వ గుణాలు"** కలిసివుంటే - ఐక్యముచేసేకి ఎవరితోను కాదు కాబట్టి - ఇది విడిచిన లక్షణములోగాని; విడువని లక్షణములోగాని ఐక్యము కుదరదు. జహర్ లక్షణము అంటే, విడిచిన లక్షణము - ఏమిటిని విడవాలి? "అక్కడ మాయను; మాయాకార్యములైన పంచభూతాలు; అష్టప్రకృతులు; సర్వాజ్ఞాది గుణాలు; సర్వసృష్టిత్వము; సర్వపాలకాదియొక్క లక్షణాలు అన్ని కలిసివుండాయి **ఈశ్వరునిలో."** "ఇక్కడ కించజ్ఞత్వమైనటువంటి **జీవునికి** - పంచకోశాలు; అవస్థాత్రయాలు కలిసివుండాయి". ఇవన్నిటిని విడిచిపెట్టితే - అన్నిటిని విడిచిన లక్షణములో పదార్థము - అక్కడ **"ఈశ్వరుడు"** గాని; ఇక్కడ **"జీవుడు"** గాని చిక్కడు. అన్నీ విడిచిపెట్టితే - జీవేశ్వరులనే వాళ్ళు వుండరు కాబట్టి ఐక్యము కుదరదు; విడువకుండ అట్లే, పెట్టుకొందామంటే - అక్కడ **"సర్వజ్ఞత్వాది గుణాలు"**; ఇక్కడ **"కించిజ్ఞత్వాది గుణాలు"**; ఇవి రెండు కలిసేటివి కాదు కాబట్టి - విడువని లక్షణములోను కుదరదు. అందుకు, **"విడిచీ - విడువని లక్షణము"** అనేటువంటిది ఒక దానిని పెట్టినారు. ఎట్లా పెట్టినారంటే? అక్కడ విడువబడిన పదార్థాలు కొన్నివున్నాయి - సర్వజ్ఞత్వ గుణాలు, పంచభూతాలు, అష్టప్రకృతులను

అక్కడ విడవాలి. అక్కడ "పరమాత్మ చైతన్యాన్ని" మాత్రమే తీసుకోవాలి. ఇక్కడ "పంచకోశాలు; అవస్థాత్రయాలు; త్రిగుణాలను "- ఇక్కడ విడిచి పెట్టాలి.

ఇక్కడ - దీనికంతా ఆధారభూతముగావుండే, "ప్రత్యగాత్మ"ను మాత్రమే, తీసుకోవాలి. అప్పుడు, ఈ "చైతన్యము" - ఆ "చైతన్యము" - "ఉపాధి భేదమే తప్ప వస్తు భేదము వుండదు" కాబట్టి "దీనికి జీవేశ్వర ఐక్యము కుదురుతాది అని" - "విడిచీ - విడువని లక్షణములో మాత్రమే జీవేశ్వర ఐక్యమువున్నది అని - తత్వమసి మహావాక్యమును మనకు సంపూర్ణ ముగా బోధించారు". అట్లైన తర్వాత, శిష్యుడు చాలా కాలము శ్రవణముజేసి - ఆ తత్వమసి రూపమైనటువంటి బ్రహ్మమును అనుసంధానము చేసుకొనే, ఒక ఖచ్చిత నిర్ణయానికి వస్తాడు. అందుకే, ఇది "అథర్వాణ వేదములో జ్ఞానకాండము; మాండూక్యోపనిషత్తు" - ఈ మాట చెప్పింది. "అయమాత్మబ్రహ్మ" - ఇది "సాక్షాత్కార వాక్యము". ఇంక దీని మీద ఏమి వుండదు. ఈ "ఆత్మ" సృష్టికి మూలమైనటువంటి; ఆధార రూపమైనటువంటి "చైతన్యబ్రహ్మమే" కాని, ఇది దానికంటే అన్యము కాదు. ఇంక, ఈ విషయములో సందేహమేలేదు అని - తెలుసుకొన్న తర్వాత - ఈ "అయమాత్మ బ్రహ్మ" అనేది "సాక్షాత్కార వాక్యము".

ఇది - "అయమాత్మ బ్రహ్మ" - "సాక్షాత్కార వాక్యము"; "తత్వమసి" - ఉపదేశవాక్యము; "అహం బ్రహ్మోస్మి" - అనేటువంటిది అనుభవ వాక్యము; "ప్రజ్ఞానం బ్రహ్మ" - అనేటువంటిది విధివాక్యము". అంటే, దాన్ని పరోక్షముగా తెలిసికొనేటువంటిది. ఇట్లా ఈ విధముగా "నాలుగు మహావాక్యములు" - నాలుగు శాఖోపశాఖలుగావుండే - ఈ "భారత దేశములో" వీటికి అత్యంత ముఖ్యమైనటువంటి లక్షణాలు, ఈ

మహావాక్యాలకు" వున్నవి. ఇంక "అయమాత్మ బ్రహ్మ" యనే శృతి లక్షణము చెప్పుతారు.

## 4. అధర్వణ వేదజ్ఞానకాండము ( మాండూక్యోపనిషత్) "అయమాత్మ బ్రహ్మ" అనే శృతి

81. సీ॥ స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశంబునై । యపరోక్షమై సదా యమల మగుచు । నాద్యంత రహితమై యచలమై నిత్యమై । శుద్ధమై బుద్ధమై సిద్ధమగుచు నిర్వ్యాజ్యమైనట్టి నిర్గుణం బయమాత్మ । పదముకు లక్ష్యతాత్పర్య మిదియు । ప్రతిలేనిదై నిరుపద్రవంబై స్వతః । పరిపూర్ణమై బట్టబయలు నగుచు ॥ గీ ॥ జగదధిష్టానమై చరాచరములందు । బాధితములేక యున్నదే బ్రహ్మమగును ॥ రమ్య ॥.

ఇది బ్రహ్మముయొక్క లక్షణము. ఇది "స్వచ్ఛమై; సత్యమై; స్వప్రకాశమై;" - అంటే, దీనికి మరుగొకటిలేకుండ - ఇంకొక్కదాని ప్రమేయము లేకుండ - "తనకు తాను ప్రకాశింపచేసేటువంటి వస్తువు ఏదైతెవుందో" - అది, ఆ "బ్రహ్మము" అనే పదానికి అర్థమైతాది అనే మాట. దానికి "పరిపూర్ణమని"; "పరిపూర్ణ పరబయలు" అని తెలియనప్పుడు - ఈ సృష్టియంత - ఏ ఒక్క తెరమీద ఆధారపడివుందో - ఆ తెరను దానిగా చెప్పేవారు. అందుకే, శిష్య విజ్ఞాపనచేసేటప్పుడు శ్రీ కృష్ణదేశికుల వారన్నట్లుగా:

"గురువర మీనాసందున - యెరుకనె తెర కలిగియుండె ఇన్నాళ్ళవలెన్;
కరుణా రసేక్షణమను తెర దీసితిరి - యెరుక మాట తీరె ఇక్కడికి"

ఇక్కడే, ఈ "అయమాత్మ బ్రహ్మ" అనేటువంటి తెరమీదనే మొత్తము మూడు అవస్థలు; మూడులోకాలు"; ఆడుతూవుండాయి. "ఈ తెరతీసినప్పుడు మాత్రమే - ఈ మూడు అవస్థలు; మూడు లోకాలు లేకపోతాయిగాని మిగతా రకముగా పోదు అది". అందువలన, "దేహేంద్రియాతీతము స్వచ్ఛమై;స్వప్రకాశమై; అపరోపక్షమై; ఆద్యంతశూన్యమై; శుద్ధమై; బుద్ధమై;

సిద్ధమైవున్నటువంటియొక్క "నిర్గుణ బ్రహ్మమే – అయమాత్మ" – అనే పదమునకు లక్ష్యార్థము.

ఇప్పుడు – "అయమాత్మ" – అంటే, దీంట్లో రెండు రకాలుగావుండాయి. "ఇప్పుడు ఆత్మ శుద్ధిలేని ఆచారమది ఏల? – భాండ శుద్ధిలేని పాకమేల?" అన్నట్లు "ఆత్మ శుద్ధి" అంటే ఇక్కడ మనస్సు శుద్ధికొరకు చెప్పిన మాటేగాని – ఈ "చైతన్యరూపమైన ఆత్మశుద్ధి కొరకు" కాదు. "చైతన్యమైన ఆత్మ" ఎప్పుడూ శుద్ధముగానేవుంటాది, "ముమ్మాటికీ శుద్ధముగానే వుంటుంది" – ఇప్పుడు మనస్సుకు కూడ "ఆత్మ" అనే పేరువస్తాది కాబట్టి – ఇక్కడ శుద్ధిచేయవల్సినది మనోరూపమైనటువంటి ఆత్మనే! అందువలన – ఈ "అయమాత్మ" అనే పదానికి – ఏది అంటే, ఈ మనస్సు అనేటువంటి అంతఃకరణకు కూడ "ఆత్మ" అనేపదము చెప్పబడుతుంది. కావున, దానికి సరియైన అర్థము ఇది కాదు. ఇది శుద్ధమైనటువంటిది – దీనికి కూడ ఆధారభూతముగా వుండేటువంటిది "బ్రహ్మము" అనే పదముచేత చెప్పబడివున్నది.

ఇంక – "జగదాధిష్టానమై; చరాచరజగత్తుగా వుండేటువంటిది ఏదైతేవుందో" – "బ్రహ్మాదిపిపీలకాది పర్యంతము" – అటువంటి అధిష్ఠానచేతన మైనటువంటిదే "ఈ ఆత్మ" – "ఆ బ్రహ్మము". ఈ ఆవరణము అనేటువంటిది వుండడమువల్ల "ఇది ఆత్మ" అని, ఆవరణలేకుండవుండే "చైతన్యానికి" – "బ్రహ్మ" అని పేరు. ఈ ఆవరణమును జ్ఞానరూపములో తీసేసుకొంటూ వుంటాడు కాబట్టి – ఈ "ఆత్మ" – "ఆ బ్రహ్మము" కంటే, "భిన్నము కాదు". "రెండు ఏకమే". ఇప్పుడు ఇల్లు

కట్టినాము కాబట్టి - ఇది "మఠాకాశము" అంటున్నాము. అంటే, ఇది "మహాకాశరూపములో వుండేటువంటిదానికి ఒక ఆవరణ కట్టినప్పుడు", దానికి పేరు వస్తాది. ఈ ఆవరణపోయిన తర్వాత, తిరిగి - ఆ పేరువుంటాది. "పరిపూర్ణమైనటువంటి వస్తువుగానే వుంటాది" కాబట్టి ఇట్లా అది "బట్టబయలైవున్నదే బ్రహ్మమునకు" అర్థమౌను. ఈ రెండూ ఒక్కటే అని తెలియవలెను - "అయమాత్మ". ఆ సృష్టికి ఆధారముగావుండేటువంటి " బ్రహ్మము" రెండూ ఒక్కటే అని తెలియడమే దీనికి పద్ధతి అనే మాట. దీనికి శృతులు:

శ్లో॥ స్వప్రకాశ పరోక్షత్వం । అయమిత్యుక్తితోమతం ।
అహంకారాది దేహాంతః । ప్రత్యగాత్మైతి గీయ్యతే ॥

శ్లో॥ దృశ్యమానస్య సర్వస్య । జగస్తత్వ మిత్యతే ।
బ్రహ్మ శబ్దేన తద్బ్రంహ్మ । స్వప్రకాశాత్మ రూపకం ॥

వీటికి, ఇన్ని రకాలుగా విచారించుకొంటూవచ్చినా కూడా! ఇక్కడ "నీ స్వరూపాన్ని" తెలిసి - ఇంక "నీకంటే భిన్న పదార్థము ఇంకొక్కటి వుండకూడదు". ఇంకొక్కటి వున్నది అంటే, అది "జ్ఞానము" కాదు. అది "వేదము" కాదు. వానికి ఇంక ప్రయత్నమే మిగులుతుంది; సాధన మిగులుతుంది; కోరిక మిగులుతుంది; లేని తిప్పలన్నీ పడుతాడు; అందువల్ల, ఇక్కడ "ఏకాత్మ పద్ధతిని నిరూపిస్తూ" - దీన్ని ప్రస్తావిస్తున్నారు.

82. సీ॥ అల చతుర్వేద మహావాక్యములయందు । నీవే బ్రహ్మవు బ్రహ్మ నీవేయనుచు । యుపనిషద్భాష్యంబు లూహించి వెదకిన నీవే బ్రహ్మవు బ్రహ్మ నీవేయనుచు । యోగ శాస్త్రములలో యుక్తి సాధించిన నీవే బ్రహ్మవు బ్రహ్మ నీవెయనుచు । మంత్ర శాస్త్రంబుల మర్మముల్ దెలిసిన నీవె బ్రహ్మవు బ్రహ్మ నీవెయనుచు । ॥ గీ ॥ వేద వేదాంత సిద్ధాంతవేత్తలెల్ల । నిశ్చయింతురు నిత్యంబు నిగమవినుత ॥ రమ్య ॥ .

ఇప్పుడు – ఇన్ని రకాలుగా విచారిస్తూవస్తున్నాము. ఇన్ని రకాలుగా విచారిస్తే, ఏమని తేలింది? అంతా "నీవే" అని తేలింది కదా! అందుకే, "నిగమవినుత" – "నిగమములు" అంటే, వేదములు. "వేదములచేత వినుతింపదగినవాడు; కీర్తింపబడినవాడు" – ఎవడు? రాముడు అనుకోండి "గురు" – అటువంటియొక్క "గురువే", శిష్యున్ని ప్రబోధిస్తూ, ఈ ఒక్క మాటను – ఆయన రామునికి ఎట్లా సంబోధించి చెప్పినాడో, ఇప్పుడు శిష్యునికి బోధ – ఈ రూపములో చెప్పాలి కాబట్టి – "నాయనా!" "అల చతుర్వేద మహావాక్యములను విచారించిన నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయని తేలింది"; "ఉపనిషత్తుభాష్యాలన్ని ఊహించి వెదకిన, నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయని తేలింది"; "యోగ శాస్త్రములలో అన్ని యుక్తులను సాధించి చూసిన" – "నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయని తెలిసిపోయింది"; మంత్రశాస్త్రములలో తెలిసిన – ఈ అన్నిటికి "నీవే కర్తవు; నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయని తేలింది". ఇది ఎవరు చెప్పింది? సామాన్యుడు; మూర్ఖుడు చెప్పినటువంటి మాటలుకాదు; "వేదవేదాంత – సిద్ధాంత వేత్తలైనటువంటి మహాత్ములు చెప్పినటువంటి భావము". ఇక్కడ "నీయొక్క స్వరూపము" తెలియబడింది. దీనియొక్క ఆ స్వరూపము ఎట్లావుంటాది అంటే? – ఇంక ఏదాన్ని కూడ అభిమానించకూడదు. ఇంక "నీవు నీవుగానే వుండాలి". నీవు

ఇంకొక్కటిగా మారి - **"నేను బ్రాహ్మణుడు; నేను శూద్రుడు; నేను మాదిగోన్ని; మంగలోన్ని"** - అంటే, వాడు చెడిపోతాడు. అందుకు, అట్లా కలగకుండవుండే దానికి - ఇంతగా దిగ్బంధన చేశారు.

83. సీ॥ వరబ్రహ్మ క్షత్రియ వైశ్యాది వర్ణముల్ నీకు నెన్నడు లేవు నిశ్చయముగా । నలబ్రహ్మచర్యాది యాశ్రమ ధర్మముల్ నీకు నెన్నడు లేవు నిశ్చయముగ । స్వగత విజాతి స్వజాతి భేదంబులు నీకు నెన్నడులేవు నిశ్చయముగ । కులనామ రూపముల్ గోత్రసూత్రంబులు నీకు నెన్నడులేవు నిశ్చయుముగ । ॥ గీ ॥ ఖేదమోదంబులును । వాద భేదంబులును । నీకు నెన్నడులేవయా నిశ్చయముగ ॥ రమ్య ॥.

ఈ మాటమీద గురిపెట్టికొని వుండాలి. ఇక్కడ ఎప్పుడు - **"బ్రహ్మతత్వ భావము స్థిరపడివుందో" - "బ్రహ్మ తత్వము నేను"** అని - ఇంక **"బ్రాహ్మణ; క్షత్రియ;వైశ్య; శూద్రాదులు - అనేటువంటి వర్ణములు లేవు". "గురువు"** చెప్తావుండాడు నాయనా! నీకు ఇవి ఏమీ లేవు - నీవు అభిమానిస్తావుండావు తప్ప - వాస్తవముగా **"బ్రహ్మస్వరూపమైన"** నీయందు ఇవి లేవు.

ఇంక - ఆ రకముగానే, **"బ్రహ్మచర్యము; గృహస్థము; వానప్రస్థము; సన్యాసము; అవధూతము;** అనేటువంటి ఆశ్రమ ధర్మాలు నీకు ఎన్నడూ లేవయ్యా"; ఇది **"నిశ్చయమైనమాట".** ఇది ఊరికే, చెప్పేటువంటి మాట కాదు. **"స్వజాతీయ; విజాతీయ; స్వగత భేదములు నీకు ఎన్నడూ లేవు నిశ్చయముగ".** ఎందుకంటే, ఈ **"ఆత్మయందున"** ప్రతి ఒక్కరికి - స్వజాతి-విజాతి స్వగతభేదాలు ఎక్కువవుంటాయి. ఇది జయించడము మహాకష్టమైపోతావుంది; ఇప్పుడు - నలుగురు బ్రాహ్మణులు కలిసితే **"స్వజాతి"**; బ్రాహ్మణులు - వైశ్యులు కలిసితే **"విజాతి"**; మరి **"ఒకే చెట్టుయందున - ఆకులు; కొమ్మలు; పూవులు; కాయలు; సర్వమువుండేటువంటిదంత స్వగతభేదము".** అట్లా - ఇందులో, **"బ్రహ్మతత్వము పొందిన తర్వాత - దానికి ఇంక వైశ్య శూద్రాది భేదములు చెప్పకూడదు".** ఎందుకంటే, ఇది అన్నిటిలోపల కూడ - ఈ

"చైతన్యరూపమైన ఆత్మ" యే వుంటాది కాబట్టి "వాటిని అభిమానించరాదు".

ఇంక - "స్వజాతి-విజాతి" - వుండదు; ఒక్కటే "బ్రహ్మజాతి"- ఒక్కటే "ఆత్మ స్వరూపము" - ఇంక దీనియందున - కల్పన చేస్తావుండాము - అంటే, ఇది మల్లా భ్రాంతి మార్గమే - తప్ప వేరె మార్గము కాదు, కాబట్టి - ఇట్లా నీకు "ఆత్మ ఒక్కటి స్వజాతి; "ఆత్మ-అంతఃకరణము" కలిసితే "విజాతి". "అంతఃకరణము శరీరము కలిసితే "స్వగతభేదము". శరీరములో, అనేక భేదములువుండాయి - "కాళ్ళు; కన్నులు; చెవులు; చేతులు; ముక్కు" అనేటువంటి పేర్లు ఎక్కువవుంటాయి. "ఆత్మ" దగ్గరికి పోతే - ఇవన్ని వుండవు. ఒక్కటే, వుంటాది. అదే, అంతఃకరణలోనికి పోతే, నాలుగు వుంటాయి - "మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు" అని - ఇట్లు స్వజాతి; విజాతి, స్వగత భేదములు అన్నీకూడాను, నీకు అంతఃకరణ దేహమందునే వస్తాయి. కాని, "చైతన్య" మైనటువంటి ఆత్మ" స్వరూపముగా ఇవి వుండవు" - కాబట్టి, "నిశ్చయముగా ఇవి నీకు లేవయ్యా; " "కుల నామ రూపములు; గోత్రసూత్రములు - నీకు ఎన్నడూ లేవు"; ఆ రకముగానే, "ఖేద మోదంబులు వాద భేదంబులు నీకు ఎన్నడూ లేవు". కాబట్టి, "జ్ఞానియైనవాడు వాదము చేయరాదు" - వాదము చేస్తాడంటే, నా కంటే "అన్యమైనటువంటి పదార్థము". అందుకే, మహాలయకారుడు అంటాడు; "వేదాంతికి నరకము కావాలంటే, తర్కమేనయ్యా ". "తరకమే, వానికి నరకము". ఇంక వానికి వేరె ఏమీ కాదు. నీకు తెలిసినటువంటిది చెప్పడమే నీ ధర్మము - ఇక ప్రశ్నించడము; ఇంకొకరిని తర్కించడము - నీకు ధర్మము కాదు. అది ఎందుకంటే? ఇదిగో ఇదే - నీవు అవును అంటే వాడు కాదు అంటాడు; వాడు కాదు అంటే - నీవు అవును అనేది నిర్ణయము లేకుండ అయిపోతాది అన్నమాట. ఇట్లా, ఈ రకముగా - నీకు ఇటువంటి బంధవిముక్తులన్నీ కూడా విడిపించేసి; ఈ స్వరూపము నీకు, అర్థమైన తర్వాత - నీవు అంటీ అంటని లక్షణముగా వుండాలని - చక్కని ఉపమానముల చేత ఒక పద్యము చెప్పినారు.

"నిజగురుస్వామిచే ద్వాదశి – షోడశిరీత్యా విచారించక"
"ఏ మహావాక్యములచేతగాని"; "ఏ సప్తకోటి
మహామంత్రములచేతగాని భ్రాంతిరహితము కాదు"

శృతి॥ క్షేత్రా క్షేత్రజ్ఞయో రహస్యం । నామరూప వివర్జితః ।
సదా త్రిపుటిరహితం । సర్వద్వంద్వవివర్జితం ॥

శ్లో ॥ సమూలం నాస్తి ప్రజ్ఞానం । శరీరం కారణం సదా ।
కర్మకారణ రూపాణాం । ప్రపంచం నాస్తి సర్వదా ॥

శ్లో ॥ ఉచ్చ నీచర్ద్వయోబీజం । భక్తియోగ సమిష్టికం ।
జ్ఞానాజ్ఞేయం స్వభావాన్న । ప్రపంచం నాస్తి సర్వదా ॥

శ్లో ॥ యథా నాహం తథా శుద్ధం । తన్మాశుద్దేన నిర్ణయః ।
యథా అహంవృత్తి జాయతే । అధచండాల ః ।
అహంవృత్తినాస్తిత్వాత్ । సర్వప్రపంచం శూన్యమేవ ॥

" ఇతి శృతిః "

అహమేవబంధః । అహమేవమోక్షః । అహమేవభ్రాంతిః । అహమేవస్థూలః । అహమేవసూక్ష్మః । అహమేవకార్యః । అహమేవకారణః । అహమేవ మహాకారణః । అహమేవజీవః । అహమేవ ఈశ్వరః । అహమేవసంశయః । అహంవృత్తి రహితత్వాత్ । పూర్ణమేవ స్వతసిద్ధః ॥ "పూర్ణమే వుంటుంది" – ఇతి శృతి వాక్యతః "

ఇంక – శ్రద్దగా విను, ఈ బోధ క్రమము ఎట్లా వుంటాది? అనేది బాగ అర్థము చేసుకోవాలి. ఇక్కడొక మాట – అక్కడొక మాట – **30 యేండ్లు విన్నాము; 50 యేండ్లు విన్నాము అన్నది కాదు లెక్క. నీవు ఎంత తక్కువ కాలములో వినినా; వరుసక్రమముగా వుండే బోధే వుండాలి.** ఇప్పుడు, ఎట్లా వచ్చినాడు చూడు – అట్లా అన్నీ, ఈషణత్రయాలన్ని; వాసనత్రయాలన్ని – విడిపించికుంటూ– విడిపించుకుంటూ వచ్చి ; మరి తారక బోధను తెలుసుకొని, మరి మహావాక్యాలను

విచారించి, తన స్వరూపాన్ని ఏర్పరచుకుంటాడు. **"ఇంక తాను తానుగానే వుండాలి".** ఎట్లా వుండాలి? అంటే, ఇట్లా వుండాలి – " నీవు జగత్తును విడిచిపెట్టివుండలేవు కదా! దీనియందు నీవువుండాలి! వుండాలి అన్నప్పుడు ఎట్లా వుండాలి !? **"అంటీ కూడ అంటని లక్షణముగావుండాలి".**

## అంటీయంటని లక్షణము

84. సీ॥ జలజపత్రమునందు సలిలమంటనియట్లు । నద్దమందున రూపమంటనట్లు । బురద యాకుమ్మరిపురుగు కంటనియట్లు । నాజ్యంబు జిహ్వాయందంటనట్లు । భువిచింతపండుపై బొబ్బరంటనియట్లు । బలుచల్లలో వెన్న గలియనట్లు । చిత్రభానుండును చీకటంటనియట్లు । నాకాశమును వాయువంటనట్లు ॥ గీ ॥ బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు । నఖిల వ్యవహారములుజేసి యంటరధిప ॥ రమ్య ॥

ఈ రకముగా – మనము జీవించే విధానాన్ని, అవధూతగారు తత్త్వముల కూడ ఇదే **"జలజపత్రములనందు సలిలమంటనియట్లు"** వుండేటువంటి పద్ధతినే – ఆయన చెప్పినాడు అని చెప్పినారు. అంటే, తామరాకు ఎక్కడ వుంటాది? నీళ్ళలోనే పుట్టుతాది – నీళ్ళలోనే వుంటాది; **"కాని నీళ్ళకు అంటదు". "ఇక్కడ సన్యాసము తీసుకోని దూరముగా పొమ్మని కాదు"** – నీవు సంసారములో పుట్టి; సంసారములోవుండినా! ఇదిగో, ఈ రహస్యమును తెలుసుకోని – ఈ రకముగా అంటకుండావుండాలి.

**"నద్దమందున రూపమంటనట్లు"** – అద్దమందున ఎన్ని రూపాలు వచ్చిపడిన దాంట్లో, ఏమైన అంటుకొంటుందా! **"అట్లా – హృదయమనేటువంటి అద్దములో ఈ సర్వజగత్తు ప్రతిబింబించిన, దానికి అంటనట్లుగావుండాలి".** అది మన హృదయాన్ని చేసుకొనేటువంటి పని.

**"బురదయా కుమ్మరిపురుగు కంటనియట్లు"** – కుమ్మరి పురుగుని చూసినారు కదా! కొంతమందియైన చూసియుంటారు; ఎట్లాంటె – అది "బురదలోనుంచి వచ్చేటపుడు నిగనిగలాడుతాది – ఏమీగాని అంటదు; మిర మిర

మెరుస్తూవుంటది"; "అట్లా మనకు ఈ 96 తత్వాలు అంతర్బాహ్య ప్రపంచమనేటువంటి బురదలోవున్నా - ఏ మాత్రము అంటకుండ కుమ్మర పులుగువలే వుండాలి".

"నాజ్యంబు జిహ్వాకుయందంటనట్లు" - నెయ్యి ఎంత జిడ్డు గావున్నకూడ - నాలుకకు అంటదు కదా! అన్నిటికి అంటుతాది కాని - జిడ్డును నాలుక అంటనీయదు. అట్లా, నీవు నాలుకలాగవుండాలి. "ఈ ప్రపంచము నెయ్యిలాగావున్నా; ఈ సంసారము నెయ్యిలాగావున్నా - నీవు మాత్రము నాలుకలాగ వుండాలి".

"భువిచింతపండుపై బొబ్బరంటనియట్లు" "చింతపండు మీద మొట్టమొదట బొబ్బర అంటుకోనే పుట్టుతాది కదా! రెండు కలిసేవుంటావి - బొబ్బరను - ఆ పండు". అది "పరిపక్వదశ అయ్యి - లోపల విత్తనము ఏర్పడే వేళకు దానిమీద కారణ శరీరము; స్థూల శరీరము; సూక్ష్మ శరీరము; మహాకారణ శరీరము; అన్ని విడబడతాయి". అంటే, అవి అట్లా అంటీ అంటనట్లు "నీవు పరిపక్వ దశను గురువు చేత పొందిన తర్వాత - ఆ చింతపండువలే వుండాలి."

"బలు చల్లలో వెన్నగలియనట్లు"- ఎక్కడ పుట్టుతాది వెన్న? ఆ మజ్జిగలోనే పుట్టుతాది - ఆ మజ్జిగలోనే వేసిన కూడ అది అంటదు; ఎందుకంటే, ఈ పరిణామ దశను చక్కగా అర్థముచేసుకోవాలి. ఖచ్చితముగా మిగతా ఉపమానాలు ఎట్లావుండునో గాని - మనకు "ఈ వెన్న అనే ఒక్క పరిణామ దశ " - వేదాంతికి చక్కగా వర్తిస్తుంది. మొట్టమొదట అంతా కలిసి, "పాల మాదిరి వుంటాది"; తర్వాత మెత్తగా (నిదానముగా) మంత్ర అనుష్టానము; ధ్యానము చేసుకొంటూ - రాను రానూ అది పెరుగ్గతాది అనే మాట. పెరుగైన తర్వాత "గురువు వాక్యము" అనే "కవ్వమేసి" చిలుకుతాము; చిలికిన తర్వాత "96 తత్వాలు అనే పాలు"; అందులో, చైతన్య రూపమైనటువంటి "ఆత్మ" అనే "వెన్న" - ఇవి విడిపడుతాయి. "విడిపడిన తర్వాత విచారణలో మరల అదే మజ్జిగలో వెన్నవేసిన కూడ - ఆ వెన్న

ఎట్లా కలియదో!" ఇప్పుడు, ఇదే 96 తత్త్వాల్లోను వుండినప్పటికీ కూడ - దీనికి అంటుకుండవుండేటువంటి స్థితి వస్తాది కాబట్టి - ఇవన్నీ మనకు ఉపమానాలు చక్కగా - ఇది పరిణామదశ. **"పాలు" పెరుగైతాది; "పెరుగు" - "మజ్జిగ" అనే "96 తత్త్వాలు" - "వెన్న అనే ఆత్మ" అయితాది; "వెన్న నెయ్యైతాది"** [వెన్న నెయ్యిగా మారుతాది]. ఇంక నెయ్యి అయ్యేవరకే, ఈ పరిణామములన్నీ **"నెయ్యి అయ్యిన తర్వాత"** - ఇది ఇంక ఏదాంట్లోనూ కలియదు. అన్నింట్లోనూ కల్సుకొంటాది. నీ ఇష్టము వచ్చిన వంటలు చేయి - నెయ్యి వాసనే వస్తాది కాని, వేరేవన్నీ రానీయదు. అట్లా - మొత్తమంత నీవు ఓతప్రోతముగా - ఈ సృష్టియంత నీవే నిండినిబిడీకృతముగా అయ్యిపోతావు నెయ్యిలాగ. అది మనకు సరియైనటువంటి పరిణామదశ - ఆ రకముగా వుండాలి.

**"చిత్రభానుండును చీకటంటనియట్లు"** - సూర్యునికి ఎప్పుడూ కూడచీకటి అంటదు కదా! ఇక్కడ చిత్రభానుడు అంటే ఏమి? చిత్రములో వ్రాసినటువంటి సూర్యుడు అని అర్థము వస్తాది, అది కాదు. **"మనకు వెలిగేటువంటి సూర్యునికి ఎప్పుడూ కూడ చీకటి అంటదు".** భూమితిరుగుతూవుంది కాబట్టి; భూమికంటే - సూర్యుడు పెద్దదికనుక; సూర్యునికి-మనకు దూరము ఎక్కువకనుక; మధ్యలో చీకటి అనేది తోస్తాది కాని - సూర్యునికి ఎప్పుడూ చీకటి లేదు. అందుకే, **"గురువు"** - సంధ్యావందనము చేయి అంటే, శిష్యునికి - సంధ్య నాకు కనబడలేదు కదా స్వామి! ఇంక సంధ్యావందనము ఎప్పుడుజేసేది అన్నాడు శిష్యుడు? ఇప్పుడు సంధ్య కలిగితే కదా! ఇప్పుడు ప్రొద్దుపుట్టేటపుడు సంధ్య; అప్పుడు దానినందు చేయుమంటే సంధ్యావందన చేస్తాడు. ప్రొద్దు మునిగినపుడు సంధ్య - అప్పుడు చేస్తాడు. **"ఈ జ్ఞాన భాస్కరుడు ఒక్క సారి వెలిగినాడు అంటే, ఎప్పటికీ ఇంక ప్రకాశిస్తావుంటాడుకాని"** - ఇంక నాకు ఎప్పుడు దానికి చీకటి వచ్చింది? ఎప్పుడు నేను సంధ్యావందన చేసేది? అంటే, గురువు దగ్గర బోధ వినేటపుడు ఎట్లావుండాల స్వభావము అంటే, **"పాషాణ పాక న్యాయ శిష్యుడు"** లాగ వుండాలి. ఒక్క సారి తొలపెట్టి కొట్టితె - ఇంక అది పగలడమే తప్ప మల్లా - అది ఎట్లా

కరచుకోదో, ఆ రకముగా మాట చెప్పుతానే, భావము చక్కగా అర్థమై దృఢముగావాల్నే గాని – మల్ల సందేహ పడరాదు అన్నమాట. అట్లా సూర్యునికి ఏ కాలములోను చీకటి అంటదు కదా!

"ఆకాశమును వాయువంటునట్లు" – ఆకాశానికి వాయువు అంటేనట్లుగావుంటే, ఇంక కదులుతుంది; అది – బంధిస్తాది; **"కాని ఆకాశము ఎప్పుడూ కూడ, ఏ దాన్ని పట్టుకోదు"** కాబట్టి, దానియందున వాయువు అంటునట్లు నీవు దీనికి అంటుకోకుండ వుండాలి.

**"బ్రహ్మవేత్తల మాయా ప్రపంచమందు నఖిల వ్యవహారములు జేసి యంటరధిప" "బ్రహ్మ జ్ఞానులు"** ఈ మాయా ప్రపంచములో – అందరివలే వ్యవహారము చేస్తావున్నప్పటికీ కూడ వాళ్ళు, ఏ దానికి అంటరు చూడండి – దీన్ని మీరు బాగ గమనించి మననము చేయాలి. ఈటికి **"ఆత్మవేత్త"** రావాలి. ఇక్కడనుండి, **"పరిపూర్ణబోధ మొదలైతాది".** ఇంతవరకూ, **"ఆత్మవేత్త"** గాకుండ – అది మాయ; ఇది మాయ; అని వట్టిమాటలు అంటూవుంటారు అనుకో; వారికి ఏ బోధ పట్టదు – వట్టి మాటల వేదాంతము మిగిలిపోతాది. ఇంక ఇక్కడనుండి తురియాతీతమును ప్రతిపాదించే మార్గమును **"దృష్ట ద్రాష్టాంతకముల చేత ద్వాదశియును – షోడషియును పరిష్కారమైతే"** సరి.

ఇంక – ఇప్పుడు నీవు ఏమైనావు? శుద్ధమైనటువంటి **"పరమాత్మ స్వరూపుడవు"** అయ్యినావు. **"సృష్టికి ఆధారభూతమైన – అధిష్టానచేతన బ్రహ్మమైనావు".** ఇంక, దీనియందున – ఏ మార్పువుండకూడదు. ఇంక ఇక్కడ విచారించతగినటువంటిది – ఇంక సృష్టిని విచారించేటి అవసరము ఏమీలేదు. ఇంక **"నిన్ను"** నీవు ఏ దానియందు తోచి వ్యవహారము చేస్తావుండావో, ఆ **"పరిపూర్ణాన్ని".** ఇవి రెండే, నీవు విచారించాలి; సత్యమైన అంశాలు ఇక్కడ రెండే వుంటాయి – ఇంక దానియందున అనేకములు వుంటాయి. ఇప్పుడు మీరు విన్నదాంట్లో వేదశాస్త్ర పురాణాలు దిక్కు లేకుండ - 96

తత్వాలు; పిండ–బ్రహ్మాండాలన్నీ వచ్చినాయి; అన్ని చేస్తేనే, "**నీ స్వరూపము**" బైట పడేది. ఇప్పుడు, నీ స్వరూపము తెలియబడిన తర్వాత – ఇప్పుడు "**పరిపూర్ణ బోధ**" విషయాన్ని విచారించాలి.

## పరిపూర్ణబోధ

### తుర్యాతీతమును ప్రతిపాదించే నిశ్శబ్ద మార్గము.

85. సీ॥ సకల దేశములందు, సకల కాలములందు, సకల వస్తువులందు చలనలేక । చావుపుట్టుకలేని ఈ వుత్త బట్టబైలేకాని రెండోది లేదు లేదు । కలలోనగనుగొన్న గజము మేల్కొనిచూడ లేశమైనను ఏమిలేని భంగి । భ్రమయుక్తమైన మూలములేని ఈ గురుతెరిగే శరీరము ఏమిలేదు ॥ గీ ॥ యిదియు గురువాక్యపద్ధతి విదితముగను । విమరిశించినవాడు వివేక ఘనుడు ॥ రమ్య ॥ .

ఇక్కడ, ద్వాదశి – షోడషి చెప్పుతావుండారు. ఇంతవరకూ, మహావాక్యములతో – మనస్వరూపము ఎట్లా తెలియబడివుందో – ఇప్పుడు నిజగురు వాక్యము కావల్సివచ్చింది. దీన్ని "**ఈ వుత్త బట్ట బయలే ఏమి లేదు**" – అనేటువంటి "**ద్వాదశాక్షరిని**"; "**కలదోచిన శరీరాలు ఏలాగో అలాగే**"; అనే "**పంచదశి దృష్టద్రాష్టాంతం**"; "**మూలం లేని యి గుర్తెరిగే శరీరం ఏమి లేదు**" అనేటువంటి యొక్క "**షోడషాక్షరిని**" బాగా విచారించాలి. భ్రమయుక్తముగా తోచినటువంటి కల ఎట్లావచ్చింది? నేను ఎట్లా వచ్చినాను? ఇప్పుడు మనకు ఏమి కాబట్టి వచ్చింది? శుద్ధమైనటువంటి "**యెరుకను**" బైటికి తీయాలి. అంటే, "**కలదోచిన శరీరాలు ఏలాగో అలాగే**" – "**యెరుకకు**" తోచిన జగత్తును తీసివేయాలి. ఇప్పుడు "**యెరుకకు**" తోచినటువంటి జగత్తునంత తీసివేసినాక ఇప్పుడు ఏమి మిగిలింది? "**శుద్ధ యెరుకే మిగిలింది**". ఇప్పుడు, ఈ "**యెరుకను**" "**షోడషాక్షరి మంత్రము**" చేత తీసేయాలి. అందుకు, దృష్టాంతము "**యెరుకకు**" తోచిన జగమును తీసేదానికే పనికివస్తాది కాని, యరుకను తీసేదానికి పనికి రాదు. ఇప్పుడు, యరుకను తీసేయాలి – అంటే, "**మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి**

లేదు" - అనే దానిని దృఢముగా తీసేయాలి; మరి ఏమి లేదు అని - అన్నిటిని "శూన్యము" చేసుకొని పోయి - "శ్యూన్య సిద్ధాంతమా" ఇది అంటే, కాదు. " ఈ యెరుక - జగత్తును తీసుకొని ఏ దానియందువచ్చి పోతావుందో, ఆ వున్న వస్తువుని నిలుపేటువంటి" **"పూర్ణ సిద్ధాంతము"** ఇది. **"శూన్యవాదము" కానే కాదు** - ఇది అన్న మాట - కాబట్టి:

86. సీ॥ ఈ వుత్త బట్టబైలేమి లేదనుచును ద్వాదశాక్షరిచాల దరుచవలెను । మూల మింతయులేక మేలుగా నెరిగెడి ఈ శరీరద్వయమేమిలేదు । యని గురువాక్యంబు విని సంతతము యాది నుంచంగవలెనిది కొంచమనక । నది నిశ్చయముజేసి యిది విడిపించితే పరిపూర్ణమైయుండు బాధ లేక ॥ గీ ॥ రాకపోకలు రెండును లేకయుండు । నట్టిసూత్రంబు దెలశిన నచలమగును ॥ రమ్య ॥

ఇది - పద్ధతి ప్రకారము - సాంప్రదాయము అంటే, ఎట్లా వుంటాది అనేది - ఇక్కడనే, మనకు బోధపడతాది. ఈ వుత్త బట్టబయలు ఏమి లేదు అని ద్వాదశాక్షరిని ఎప్పుడూ కూడ దలచాలి. దీక్షితుల వారు ఏమన్నారంటే? ఇదేరా! ఆ బయలు అనేవారు కొందరు; దీనియందు భూతాలన్ని వుండాయి - కాకులు, గద్దలువుండాయి - అనేవారు లోకములో వుండారు కదా! ఈ బయలు తీసివేసి - ఇంకొక్క బయలు తెచ్చిపెట్టే దానికి ఆస్కారముంటే - నీకు పరముగావుంది కాబట్టి, **"పరబయలు"** అన్నారు. **"పరం"** అంటే, ఈ బయలుకి అవుతల ఇంకొక్క బయలువుంది అనేది కాదు **"బయలు"** ఒక్కటి తప్ప రెండు ఎప్పడూ కూడ వుండవు. రెండు "బయలు" ఎప్పుడూ పట్టేకి లేదు; చూసేకీ లేదు. కాని, ఈ శరీరమనే ఆవరణమువున్నప్పుడు - ఈ సర్వప్రపంచము నీయందే తోస్తావుంది. **"ఈ బయలుయందున - నీవు లేకనే తోచినావు"**. ఇదే, దీనికి **"సిద్ధాంతము".** కాబట్టి ఇది కాదు "బయలు" అని చెప్పేటువంటిది కాదు.

"లేదనకు వున్నది అదుగో ; నే దెలిసితిని ననకు; దీన్ని నీవెరగేవా - కాదు అది నీచే తెలియును; ఏదిరా తన్మాత్ర సమితి; ఈ బట్ట బైట దీనికి సాటియేది? ఎ చ్చోట వాదేలా లేనియెరుకతో! దీన్ని కనిపెట్టి - పోగొట్ట యెరుక; ఇంకే ది పట్టదు - చాలు".

ఏదిరా తన్మాత్ర సమితి? నేను నీకు తెలిసినది నీకంటే; నీవు పుట్టిననాటినుంచి తెలిసికొంటూవుండావు - తన్మాత్రలనే తెలిసికొంటూవుండావు; నాలుకతో రుచిని తెలిసికొంటూవుండావు - కాని నీకు తెలిసేవి -ఈ ఐదు మాత్రమే. అందువల్ల, ఈ ఐదు ఇంద్రియములతో, నీవు తెలియలేవు. ఇప్పుడు, లేని యెరుకతో నీవు - దీనిని కనిపెట్టాలి. అంటే, లేని యెరుకగా నిన్ను అర్థము చేసుకొన్నప్పుడు - బయలును కనిపెట్టి; పోగొట్టి యెరుక - ఇంక ఏది పట్టదు చాలు అనేటువంటిదాన్ని - ఇట్లా "**ఈ వుత్త బట్టబైలేమి లేదనుచును ద్వాదశాక్షరి చాల దరుచ వలెను**" - "**పూటకు - పెయ్యి చెప్పునా**" - అన్నారు **"దీక్షితులవారు"**. "ఉదయము; మధ్యాహ్నము; సాయంత్రము **"ఒక్కొక్క పూటకు పెయ్యి పెయ్యి చొప్పున"**. "**ఈ బట్టబయలు తప్ప ఏమి లేదు**" అనేటువంటి దానిని చక్కగా అర్థము చేసుకోవాలని అన్నారు.

"కనరానిదాన్ని శూన్యమని ననదగునుగాని; బయలును ననదగదు సుమి; కనవచ్చునన్న ఇందులో కనుగొనుటకు యెరుక లేదు కనుగొనరాద; యెరుకనే శ్యూన్యమని అనరాద! కనవచ్చునా లేదా; కనుగొంటి లేదని - అనరాద! భయమేమి? అనుమానించకు; ఇదిగో కనుగొనరాదా ".

అని చప్పి దాన్ని - ఎందుకంటే, ఎక్కడో వున్నది అనేటువంటి వస్తువు పరిపూర్ణవస్తువు కాదు. ఎక్కడ జూసిన సందు లేకుండవుండే వస్తువే, "**పరిపూర్ణ వస్తువు**" ముల్లుగుచ్చేకి సందు లేదు అనేదానికి - సూపు పెట్టేకిలేదని ఒకడు - ఇట్లా వాదము చేస్తావుంటూరు - "**గురు వాక్యాన్ని**" దృఢముగా నమ్మేటివంటి పద్ధతి లేకుండ - కాబట్టి, మరి మూలము ఇంతకు లేనటువంటి - "**మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి లేదు**" - అనేది ఎప్పుడూ మరువకుండ వుండాలి. అంటే, "**జ్ఞాపకము**" **"మరుపు"** రాకుండ చూడాలి. అట్లా, అది నిశ్చయముజేసి - "**పరిపూర్ణము వున్నది**" - అనేటువంటిది బాగా నిశ్చయముకావాలి. మాట మాత్రము చేత వేదాంతము ఎప్పుడూ కూడ నిర్ణయానికి రాదు. అందుకే, **"వాచ్యార్థము; లక్ష్యార్థము; అనుభవార్థము; నిర్ణయార్థము"** - నాలుగు పద్ధతులలో వుంటుంది. నిర్ణయము అనేది ఒక్క సారి బాగ జరిగిందంటే, ఇంక

"బ్రహ్మాదులు" వచ్చి చెప్పిన కూడ – ఆ "నిర్ణయము మారకూడదు" "<u>అట్లా మార్పులేనటువంటియొక్క సిద్ధాంతమే</u> – <u>ఇది</u>." కాబట్టి – ఇంక దీనిని – ఈ రకముగా "అది వున్నది అని నిశ్చయముజేసి" – "ఇది లేనిది అని విడిచి పెట్టితే" "పరిపూర్ణమైయుండును". ఇంక కేవలాత్మ లక్షణము – ఆ పరిపూర్ణ లక్షణానికి ఒక ఐదారు పద్యాలు చెప్పినారు పెద్దలు – వాటిని వినండి:

## కేవలాత్మ లక్షణము

87. సీ॥ అవనిలో నీరులో నగ్నిహోత్రంబులో । మారుతమందు వ్యోమంబులోను । సురులలో నరులలో గిరులలో చరులలో । తరులలో హరులలో కరులలోను । యూళ్ళలో గూళ్ళలో రాళ్ళలో రోళ్ళలో లేళ్ళలో కోళ్ళలో తేళ్ళలోను । గొడ్లలో గుడ్లలో బుడ్లలో వడ్లలో । చీమలో దోమలో పాములోను ॥ గీ ॥ యచలమై యుండు కాలత్రయంబులందు । బాధితములేక కేవల బ్రహ్మముండు ॥ రమ్య ॥

వాళ్ళ కవిత్వ భావము ఎట్లావుంటాది అంటే, ప్రాస పద్ధతిలో – ఇన్ని రకాలుగా; అంటే, ఎక్కడజూసిన "సకలదేశాలలో; సర్వకాలాలలో; సకల చరాచర జంతుజాలమనేటి పద్ధతి." పృథ్వి; జలము; అగ్ని; వాయువు; ఆకాశములోను; సురులు; నరులు; గిరులు; చరులు; తరులు; హరులు; కరులలోను; ఊళ్ళలో; గూళ్ళలో; రాళ్ళలో; రోళ్ళలో; లేళ్ళలో; కోళ్ళలో; తేళ్ళలోను; గొడ్లలో; గుడ్లలో; బుడ్లలో; వడ్లలోను. చీమలో; దోమలో; పాములోను – సకలచరాచర జంతుజాలములయందును – చలించక త్రికాలముల యందును – ఉపాధులనుజెందక"– "అచల పరిపూర్ణమైయున్నది కేవలాత్మయనుబడును".

ఇట్లా – శిష్యునికి క్రమపద్ధతిగా, "ఆత్మ బ్రహ్మల" ఏకత్వము బోధించిన తర్వాత – పరిపూర్ణ బోధ బోధించితే ఎట్లావుంటాది? అన్నప్పుడు – ఇదిగో, ఇది పద్ధతి అన్నమాట. ఇది నిజమైన వార్థిక పద్ధతి – బాగ అర్థమైతాది. అమనస్కుడు ఎట్లైతాడు? అశరీరుడు ఎట్లైతాడు? అన్నప్పుడు – భావచలనము లేకుండ –

ఏదాన్ని కూడ మనస్సు సందేహించకుండ – ఎప్పుడూ, నిశ్చలమైనటువంటి స్వభావము చేతవుండే, పద్ధతి ఇది. ఇట్లనే :

88. సీ॥ సృష్టికి పూర్వంబు సృష్టికి పరమందు । సృష్టి యున్నప్పుడు సృజనలేక । సకల దేశంబుల సకల కాలంబుల । సకల వస్తువుల చంచలములేక । ప్రాగ్దక్షిణంబుల పశ్చిమోత్తరముల । నాల్గు మూలలమీద నడుమ క్రింద । అచలమై సత్యమై యాద్యంత శూన్యమై । పరిపూర్ణమై బట్టబయలుగాను ॥ గీ ॥ ఏకమైయుండు ఏ బాధ లేకయుండు । నట్టి వస్తువు కేవలాత్మనగ బడును ॥ రమ్య ॥

ఇది – "**సృష్టికి పూర్వమందు – సృష్టికి పరమందు**" – అంటే, సృష్టి పుట్టక – సృష్టినశించిన తర్వాత; సృష్టివున్నప్పుడు – ఏ మాత్రము సృష్టిచంబడినటువంటి వస్తువులు ఎన్ని రకాలుగా చలించినా కూడ – తాను చలించకుండ వున్నది. ఇప్పుడు, కొండలను మనము అచలము అంటాము; భూమినంత అచలమంటాము. సైన్స్ (విజ్ఞానము) ప్రకరాముగా చూస్తే, భూమి ఒక క్షణము కూడ ఊరికేవుండదు – తిరుగుతావుంది అంటారు. సూర్యగ్రహమంటే, అది బట్టబయలుయందున ఏమీ ఆధారము లేకుండవుంది కాబట్టి, అది కదుల్తానేవుంటాది. ఇప్పుడు, కాకున్న ఎప్పుడైన కదలతాది అది. చంద్రుడు కదలతావుండాడు. గ్రహాలన్ని కదులుతూవుండాయి. ఇంక నక్షత్ర మండలమంత మార్పులు చెందుతావుంది కాబట్టి, **"ఈ సృష్టివచ్చిన తర్వాత సృజింపబడిన ప్రతి వస్తువుకూ కదలికవుంది. కాని"**, మరి ఈ "**పూర్ణమైనటువంటి పరబయలు**" ఏ మాత్రము కూడ కదలిక లేకుండ వుంటాది అనేటువంటి విషయాన్ని తెలుసుకొని – ఇది "ఆద్యంతములయందు సకలదేశములలో; సర్వకాలాలలో చంచలమనేటువంటిది లేకుండ" – ఇంక "నీకు ఎనిమిది దిక్కుల ప్రాక్దక్షిణముల; పశ్చిమోత్తరముల; నాల్గుమూలలా, క్రింద మీద – ఈ దశ దిశలయందు కూడ – ఈ "**పరిపూర్ణమైనటువంటి**" వస్తువే వున్నదని భావము. ఎందుకంటే, నీకు కొన్ని గుణాలు వుంటాయి. కొంతసేపు సగుణముగా; కొంతసేపు నిర్గుణముగా వుండే గుణాలు. ఇలాంటి గుణాలు **"పరిపూర్ణానికి"** వుండవు అని తెలియజేస్తారు ఇక్కడ.

ఇప్పుడు – సృష్టికి పూర్వము నీవు నిర్గుణముగావుండినట్లే వుంటావు – మరి అట్లే, నిర్గుణముగావుంటే – ఈ బాధేలేదు కదా! సృష్టిచేసుకుంటావు; మళ్లా నిద్రలోకి పోతావు – నిద్రలో నిర్గుణముగా వుంటావు; పోనీ అట్లే, ఆనందముగావుంటుంది కదా! అట్లేవుండమంటే, అట్లావుండలేవు. ఆ పైన ఒక అర్ధగంట కూడ ఎక్కువ సేపుపండుకోలేవు – దాని సమయము ప్రకారము పడుకుంటావు, లేస్తావు. అంటే, నీకు సగుణమయేది – నిర్గుణమయ్యేది, నీకు స్వభావమైవుంది. కాని – **"పరిపూర్ణానికి"** ఒకప్పుడు సగుణముగా – ఇంకోకపుడు నిర్గుణముగానయ్యే గుణములు లేవు కాబట్టి:

89. సీ॥ సగుణ నిర్గుణములు సదసత్తులును నిరా । కార సాకారముల్ గానిదేదొ । క్షేత్రజ్ఞ క్షేత్రముల్ జీవ జగంబులు । కారణ కార్యముల్ గానిదేదో । పాపపుణ్యంబులు బంధమోక్షంబులు । జ్ఞానకర్మంబులు గానిదేదో క్షరమ క్షరంబులు సత్యమసత్యముల్ – ఖండమ ఖండముల్ గానిదేదో ॥ గీ ॥ రాక పోకలు జెప్పంగ రానిదేదో । నదియు కేవల పరిపూర్ణమనగనొప్పు ॥ రమ్య ॥.

యెరుకయందునే, ఈ ద్వంద్వాలన్నీవుంటాయి. యెరుకయందున ద్వంద్వాలు ఎప్పుడూ కూడ – ద్వంద్వసమాసముగానే వుంటాయి. "సగుణ–నిర్గుణములు; సద – సత్తులు; నిరాకార – సాకారములు; క్షేత్ర – క్షేత్రజ్ఞులు; జీవ – జగంబులు; కారణ – కార్యములు; పాపపుణ్యములు; బంధ – మోక్షములు; జ్ఞాన – కర్మములు; క్షరా – క్షరములు; సత్యా – సత్యములు; ఖండా – ఖండములు; రాక – పోకలు"; – ఇవన్నీ కూడ ద్వంద్వాలు. **"పరిపూర్ణ వస్తువుకు "** వీటితో పని ఏముంది? రాకపోకలు ఎక్కడ జరుగుతాయి? పరిచ్ఛిన్నముగావున్న వస్తువందే, రాకపోకలు జరుగుతాయి కాని – ఎక్కడ జూసిన సందులేనిది; ఎక్కడికి వస్తాది? ఎక్కడికి పోతాది? అంతట అదే వుంటాది కాబట్టి – రాకపోకలు దానికి చెప్పరాదు.

"క్షరాక్షరములు" – క్షరము – 24 తత్వములు; అక్షరములు – 25వ తత్వమని, ఇంతకు మునుపు చెప్పుకొన్నాము. ఇట్లా – ఈ తత్వాలుగా మారడముగాని; క్షరరూపములోవుండి నశించిడముగాని; అక్షరరూపములోవుండి వుండడముగాని; **"పరిపూర్ణానికి"** ఎప్పుడూ వుండదు. కాబట్టి, ఇవన్ని కూడ ఆత్మయందున ద్వంద్వగుణాలు వుంటాయేగాని, **"పరిపూర్ణ"** మందున – ఈ ద్వందములు లేవు

కాబట్టి, అది ఎక్కడ కూడ ప్రత్యేకముగా వుండవలసినిది; పోవలసినది ఏమీలేదు అని – మరి అన్నిటిలోపల ఎట్లున్నది అనేది – ఇంక తెలియజేస్తారు.

90. సీ॥ వసుధలో నణగదు వార్ధిలో మునగదు । గాఢాగ్నిచేత దగ్ధంబుగాదు । గాలికి గూలదు కరముల జిక్కదు । పాషాణములనైన పగిలిపోదు । వానకు దడియదు వడగండ్ల నొవ్వదు । యస్త్ర శస్త్రంబుల హతముగాదు । యెండకు యెండదు యుండ నీడకు రాదు । ఘనపాశములనైన గట్టుపడదు ॥ గీ ॥ చలికి వణకదు భయములకులికిపడదు । యచలమైయుండు పరిపూర్ణమమలచరిత ॥ రమ్య ॥.

ఓ! మలినములేని చరిత్రగలవాడా! **"పరిపూర్ణము"** ఎట్లవుంటాదంటే, ఇట్లావుంటాదని. మరి రామునికి ఏమిచేస్తే! రామునికి బోధతెలియనట్లు – మనకు తెలిసినట్లునా! రామునికి కాదు – ఇది చెప్పేది – శిష్యునికి మాత్రమే చెప్పుతావుండారు. ఎట్లావున్నది అది? **"వసుధలో నణగదు"** – అంటే, వసుధలో లేదా! (భూమిలో) ఆ స్వామి! వసుధులోవుండదని కాదు దాని అర్థము – వసుధలో అంతలెక్కల కూడ అదేవున్నది. అంటే, భూమిచేత మూయబడదు అది – అంటే, అంత మాత్రమే కాదు – దాని ప్రమాణము; **"వార్ధిలో మునగదు"** – అంటే, సముద్రములో మునిగిపోదు. అంటే, దానికి మునుగుట అనేటువంటిది నీళ్ళలో ప్రమాణముగా కనబడవలసినదే గాని – నీళ్ళకు లోపల – బైటవుండేవస్తువు నీళ్ళలో మునిగింది అని చెప్పంాదు. అట్లా **"గాఢాగ్ని చేత దగ్ధముకాదు"** – ఈ పదము ఎందుకు వచ్చిందంటే, **"పరిపూర్ణమైన వస్తువు"** – ఇటువంటి పంచభూత వికారాలకు – ఎప్పుడూ కూడ చెడదు అని చెప్పడానికి మాత్రమే – అందుకే;

## భగవద్గీత

శ్లో ॥ నైనం ఛిందంతి శస్త్రాణి । నైనం దహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపోన । శోషయతి మారుతః ॥

అచ్ఛేద్యో యమదహ్యో । యమక్లేద్యో శోష్య ఏవచ ।
నిత్యం సర్వగతః స్థాణురచలోయం సనాతనః ॥

అంటే, అన్నిటికి ప్రమాణాలు - ఎందుకు చెపాల్సివచ్చిందంటే, ఈ ప్రమాణబద్ధముగా **"పరిపూర్ణమైన దైవాన్ని" - "సూచనచేస్తే"** గాని - శిష్యునికి సందేహం నివృత్తి జరగదు కాబట్టి - ఇన్ని చెప్పవల్సివచ్చింది. ఒక్క సారి శిష్యునికి చక్కగా అర్థమైయింది అంటే; " అదే శిష్యునికి, ఆ శేరు ఇక్కడికి తీసుకోని రాపోరా - బయలును కొల్వాల అన్నాడు గురువు. శిష్యునికి అర్థమైయిందా లేదా! అని కనుగొనేకి. వీనికి సూచన కాకపోతే, పరిగెత్తిపోయి శేరు ఎత్తుకోని వస్తాడు. మరి, వీనికి సూచనైయుంటే - ఆ శేరులో వుండేటువంటి బయలును ఎక్కడపేసి రావాల స్వామి? అని అడుగుతాడు"; అంటే, అప్పుడు గురువుగారికి ఏమి అర్థమైతాది? ఓహా! వీడు సర్వత్రమండగలిగినాడు - ఈ వస్తువును. ఇంక ఏ బాధవుండదు అనేటువంటి విషయము బోధపడతాది కాబట్టి, ఈ రకముగా పంచభూతములతోగాని; గ్రహాలతోగాని - ఏ మాత్రమైన బాధితములేకుండవుండే **"పరిపూర్ణమైన బ్రహ్మము".**

91. సీ॥ బాధితంబైన ఈ ప్రకృతి ద్వయములేని । కేవల పరిపూర్ణ భావమునకు । స్థూల దేహములేదు సూక్ష్మ దేహములేదు । కారణ దేహ సంఘటనలేదు । ఘనమహాకారణ ఘటము లేనే లేదు । లేదు జాగ్రదవస్థ లేదు లేదు । లేదు స్వప్నావస్థ లేదు నిద్రావస్థ । లేదు తుర్యావస్థలేదు ॥ గీ ॥ సర్వమీశ్వరతను చతుష్టయములేదు । విశ్వతైజస ప్రాజ్ఞాది విభులులేరు ॥ రమ్య ॥

ఇవన్ని **"పరిపూర్ణమందునే"** వుండాదేమో - అనేటువంటి ఊహాపోహ శిష్యునికి కలుగొచ్చు - ఎందుకంటే, ముందు **"పరిపూర్ణమైన బ్రహ్మమందున"; "శుద్ధ చైతన్యమైన" "ఆ స్వరూపమైన బ్రహ్మమందున"** మాయగలిగి - మాయయందు ప్రతిఫలించిన - ఆ **"చైతన్యము" - "ఈశ్వరుడై"** - పంచభూతాది ప్రపంచాన్ని జేసుకొన్నట్లుగాను; అదే అవిద్యయందు ప్రతిఫలించి పిండాండరూపములో **"జీవుడై"**; పంచకోశాది శరీరాలను చేసుకొన్నట్లుగా; త్రిగుణములు - విశ్వతైజసప్రాజ్ఞ ప్రత్యగాత్మలు; విరాట్ హిరణ్యాగర్భ అవ్యాకృత పరమాత్మలు - ఇవన్ని, ఆ బ్రహ్మమందు పుట్నాయి అని చప్పినారు కదా! మరి ఆ **"బ్రహ్మము" - ఈ "బ్రహ్మము"** ఒక్కటేనని వాదము

ఇప్పుటికీ కూడ – **"యెరుకే"– "పరిపూర్ణము"** అని వాదించేవాళ్ళు దేశమంతటా వుండారు కదా! ఆ దోషాన్ని పోగొట్టు నిమిత్తమై – రఃయన, రః పదాలను వాడినారు.

**నాయన** ఇవన్ని ఏమిలేదురా! విశ్వతైజసప్రాజ్ఞప్రత్యగాత్మలు లేరు – విరాట్ హిరణ్యాగర్భ అవ్యాకృత పరమాత్మలు లేరు; దీనికి పంచకోశశరీరము లేదు – దానికి పంచభూత శరీరములేదు; కాబట్టి ఈ ఒక్క అవస్థలన్ని ఏవీ లేవు అని చెప్పడానికే – ఈ ఒక్క **"పరిపూర్ణవస్తువును"** గూర్చి తెలియజేస్తున్నారు:

92. సీ॥ పుట్టదు గిట్టదు పట్టదు ముట్టదు । కొట్టదు తిట్టదు కట్టు పడదు । యెరుగదు మరువదు కరగదు యెరగదు । పెరగదు విరగదు తరుగుబడదు । యాడదు పాడదు వాడదు యోడదు । వేడదు గూడదు జూడబడదు । యదరదు బెదరదు గదరదు చదరదు । ముదరదు వదరదు గదలబడదు ॥ గీ ॥ జనదు పెనగదు చినగదు వినదు కనదు । ఖేదమోద ద్వయములేని కేవలాత్మ ॥ రమ్య ॥ .

"పుట్టదు గిట్టదు పట్టదు ముట్టదు కొట్టదు తిట్టదు కట్టుబడదు । యెరుగదు మరువదు కరుగదు మొరగదు పెరుగదు విరుగదు తరుగుపడదు "

ఇవి – ఎందుకంటే, ప్రపంచములో – ఈ లక్షణాలువున్నాయి. అంటే, కుక్కలాగ మొరగదని; చెట్టులాగ పెరుగదని; కట్టెలాగ విరగదని; మరి పరిణామము చెందదని – ఈ రకముగా **"పరిపూర్ణము"** లో, ఏ దోషము కల్పించిన, మళ్లా దోషానికి దారితీస్తాది కాబట్టి – మన అనుభవములో వుండేటువంటివి – ఏమిటివీకూడ **"పరిపూర్ణానికి లేవు"** అని; దృఢముగా తెలియజేసేదానికే – ఇన్ని మాటలు చెప్పవల్సి వచ్చింది.

" యాడదు పాడదు వాడదు యోడదు వేడదు గూడదు జూడబడదు । యదరదు బెదరదు గదరదు చెదరదు ముదరదు వదరదు కదలబడదు । జనదు పెనగదు చినగదు వినదు కనదు ఖేదమోద ద్వయములేని కేవలాత్మ "

ఇవన్నీ కూడ పరిచ్ఛిన్న పదాలు – చిన్న చిన్న వస్తువులకు చెప్పినట్టివే కాని – "పరిపూర్ణమైన వస్తువుకు" చెప్పే పదాలు ఇందులో ఏమీ లేవు. అట్లు చిన్న పదార్థము కాదని "అపరిచ్ఛిన్నమై పరిపూర్ణమైనటువంటి పరిపూర్ణ బ్రహ్మము" ఇట్లు వుంటాది అని – ఒక్క మాటతో దృఢమైతే – ఇంక "గురువుకు" చెప్పే బాధగాని – మరి ఏమి వున్నది. అది – లేనిది ఇది, అని – శిష్యునికి వినే గొడవగాని వుండదు. కాని అంత సూక్ష్మ ప్రజ్ఞ లేదు కాబట్టి – పదే పదే చెప్పాల్సివచ్చింది. "యెరుకకు" సహజముగా మరుపు వెంటాడుతూ వుంటాది కాబట్టి – "మరుపు" అనే పెను భూతములో పడి – మల్లా వీడు పూర్ణభావాన్ని మరిచి పోతాడు అనేటువంటి ఉద్దేశము చేత "గురువు" పదే పదే నొక్కి చెప్పవల్సి వచ్చింది.

93. సీ॥ సర్వకాలము చలించక నొక్కతీరుగా । పరిపూర్ణమైయున్న బట్టబయలు । పతిగాదు సతిగాదు రతిగాదు ప్రతిగాదు । స్తుతిగాదు యుత్పత్తి స్థితియుగాదు । మృతిగాదు స్మృతిగాదు శృతిగాదు ధృతిగాదు కృతిగాదు వికృతిహంకృతులుగాదు క్షితిగాదు । మతిగాదు మితిగాదు ద్యుతిగాదు । యతిగాదు మూల ప్రకృతియు గాదు ॥ గీ ॥ గతియు దుర్గతిగాదు సద్గతియు గాదు । గతము విగతముగాదు యాగతముగాదు ॥ రమ్య ॥

ఇవి – అన్నీ కూడ మనము చేసే పనులు ఇవి. ఎందుకంటే, సర్వకాలములో చలించకవుండే, ఒక్క పరిపూర్ణమైనటువంటి వస్తువు, ఏ పదార్థముగా కాదు. మరి, ఇది ఏమైనాడు? "యెరుక" ఒకటే కదా స్వామి! – జగత్తును ఎట్లా పుట్టించింది? అంటే, ఒక్కటి ద్వంద్వరూపమైతాది; ఏకము – అనేకమైయ్యే గుణము దీనియందున వుండాది అని చెప్పి అని – మనకు శ్రీ కృష్ణ ప్రభువులవారు చెప్పేటపుడు:

" తల్లితండ్రులు; జీవేశులు; ఇలయోమము నేను మేను; యెరుక మరుపులు; కలమేల్కలు; శుక్లాశ్రంబులు; నీరాన్నములు; ప్రకృతి పురుషుడు; ఆలుమొగడు గానయై యెరుకకు యెరుకగానబడు"

ఎట్లా కనబడతాది ఈ యెరుక ఒకటే? ఇట్లైతుందంట అది. ఒకటే రెండు అయితాది కాబట్టి – కనబడతాది. అందువల్లనే, ఆ ఒక్కటి రెండుగా అయ్యే గుణమువుండేయొక్క దోషాలు వుంటాయేగాని – ఈ ఒక్కటి ఒకటిగానే ఎప్పుడూ వుండేదానికి, ఏ దోషమువుండదు కాబట్టి – ఇవన్ని కాదు నాయన! అటువంటి యొక్క సర్వకాల – సర్వావస్థలయందు – చలించక **"పరిపూర్ణమైయున్న బట్టబయలు"** పతిగాని; సతిగాని కాదు. ఇప్పుడు మనకు ప్రకృతిలో, ఎట్లా బోధిస్తారు? **నాయన!** అర్ధనారీశ్వరుడు – **"ఈశ్వరుడు"**. అర్థము **"ప్రకృతి;"** అర్థము **"పురుషుడు."** ఇట్లావుంటానే, సృష్టి అవుతుందియని మనకు ప్రకృతి పురుషులయొక్క సంయోగాన్ని అర్ధనారీశ్వరునిలో చూపించి చెప్పుతారు. అట్లానే, ఈ శరీరము ప్రకృతి – ఈ పురుషుడు – ఇద్దరు కూడితేనే – జీవితమువుందిగాని, **"ప్రకృతి విడిచి జీవుడుగాని"; "జీవుని విడిచి ప్రకృతిగాని"** ఎప్పుడూ కూడ వుండదు అన్నమాట. ఇది దానియొక్క లక్షణము. ఇది ఏకము – ద్వంద్వమైతాది; ఏకము – అనేకమైతాది; అనేకము – ఏకమైతాది.

ఇప్పుడు – నిద్రలో ఏకమైనాము కదా; నిద్రలో ఒక్కటి తప్ప రెండో పదార్థము లేదు. స్వప్నము కలిగింది ఏకము ఏమైయింది? – అనేకమైయింది. మరల నిద్రలోకి పోతే ఏకమైయింది. అట్లా, **"జాగ్రతలోకి వస్తే, ఏకము – అనేకమైతాది;" "మరల మూర్ఛలోకి; మరుపులోకి; నిద్రలోకి పోతే – ఏకమైతాది."** ఇట్లా – ఏకము అనేకము అయ్యేగుణము దీనికివుండే తప్ప **"పరిపూర్ణమైన వస్తువుకులేదు."** ఎట్లావుంది ఇంక? ఏ ఇంద్రియములకైన వశమైతుందా? అంటే, దానికీ కూడ అది అంటదు – అనే విషయాన్ని తెలియజేస్తావుండారు. ఇంక ఇంద్రియాతీత లక్షణము చెప్పుతారు.

## ఇంద్రియాతీత లక్షణము

94. సీ॥ నేత్ర జిహ్వా ఘ్రాణ శ్రోతత్వగింద్రియం। బుల కేవలాత్మను దెలియరాదు। శ్వేతవర్ణముగాదు పీతవర్ణముగాదు । రక్తనీలాది వర్ణములుగాదు । కటులవణామ్లతిక్త కషాయ మధురాది । రసరుచి వస్తువర్గములుగాదు । వీణారవము గాదు వేణునాదము గాదు । తాళమృదంగాది ధ్వనులుగాదు ॥ గీ ॥ విమల పరిమళ మిళిత ద్రవ్యములుగాదు । కఠిన శీతోష్ణ మృదుసదాగతులుకాదు ॥ రమ్య ॥ .

ఇంక - ఇంద్రియముల చేత ఏమైన తెలిసికొనవచ్చునంటే, నేత్రము; జిహ్వా; శ్రోతము; ఘ్రాణము; చర్మము ఇవి కదా మనకు - ఇంద్రియాలువుండేది. **"జ్ఞానేంద్రియాలు"** - వీటితో తెలిసికొనేదానికి **"పరిపూర్ణము"** లో ఏ గుణాలు లేవంట. **"నేత్రములతో"** - తెలుసుకోవాలంటే, దశవిధ రూపాల్లో, ఏ రూపమూ కూడ **"పరిపూర్ణానికి"** లేదు కాబట్టి - నేత్రములతో తెలియబడదు. **"శ్రోతములతో"** - తెలియబడేదానికి ఏమైన వీణ; మృదంగ; తాళ మేళాది ఒక ధ్వనిలావుందా! **"పరిపూర్ణము"** - అట్లావుంటే, చెవులతో పట్టేసుకోవచ్చు కదా దానిని అనుకొంటే - అట్లా చెవులకు - ఆ నాదాల లాగ - ఏ నాదముగా కూడ **"పరిపూర్ణము లేదు."** అందువల్ల, చెవులకు చిక్కలేదు అది.

ఇంక - **"చర్మానికి"** చిక్కుతుందేమో అనుకొంటే! దీనికి మృదుత్వ - కఠినత్వాదియొక్క గుణాలు **"పరిపూర్ణానికి లేవు".** ఏదో, ఒక రాయిలాగ తగలడమో; ఒక చెట్టు కట్టెలాగ తగలడమో; ఎందుకంటే, **"శేషాచల స్వామి వాళ్ళు అనేవారు - ఆకులు విసుర్తావుంటే, ఈ బయలేవుంది, ఈ బయలేవుంది అని చెప్పుతావంటూ - ఆకులు గాలికి."** ఎందుకూ అట్ల? ఏదైన ఒక వస్తువులో, **"నీకు బయలు గురువు సూచన చేసినాక"** నీవు ఏమిటితోనైన చూడగలవుకాని - మొట్టమొదట ఇంద్రియాలకు తెలిసే లక్షణము దానియందు లేదు. అందువల్ల, **"కఠినత్వముగాని; మృదుత్వముగాని; శీతలముగాని ; ఉష్ణముగాని "** - ఇట్లా గుణాలు **"పరిపూర్ణమందు"** లేవు, కాబట్టి నీవు చర్మముతో **"పరిపూర్ణాన్ని తెలియలేవు".** పోనీ, నాలుకతో ఏమన్నా **"పరిపూర్ణము"** "తీయగా; ఉప్పుగా; చేదుగా; కారముగా; పులుపుగా; ఒగరుగా" : ఏమైన - అట్లా రుచుల పద్ధతిలో వుంటేగనుక **"నాలుకతో**

పట్టివేయచ్చు" - ఓహో! "పరిపూర్ణము" పులుపుగావుంది; తీయగావుంది - అంటే, "పరిపూర్ణము" నాలుకకు కూడ ఎట్టి పరిస్థితులలో తెలియబడదు.

ఇంక - "ఘ్రాణమునకు" - సుగంధ; దుర్గంధాదియొక్క పరిమళ మిశ్రితమైనటువంటి గంధాలుగా "పరిపూర్ణము" ఏమైనావుంటే, ముక్కుతో పట్టేసుకోవచ్చు - కాబట్టి, నీ పంచేంద్రియములకు విషయములైన గుణాలు ఏవీ కూడ, ఈ "పరిపూర్ణమందు లేవు" కాబట్టి - నీవు దీన్ని తెలియలేవు. అందుకు, దీనికి "గురుడే" కావాలి చూపించేదానికి. చూపించినాక - మల్లా అంతాకూడ అదే వుంటాది - మల్లా వేరె వుండదు అన్నమాట. ఇంక పరిపూర్ణ లక్షణము - దానియొక్క లక్షణాన్ని చెప్పుతారు:

## పరిపూర్ణ లక్షణము

95. సీ॥ ఆద్యంతములు లేని యచలము రెండో ప్రకారంబు నెన్నడు గాకయుండు । క్రిందటగాలేదు ముందరగాబోదు । ఇప్పుడుగాలేదు యికనుగాదు । సర్వకాలంబేక సరళిగా కదలక । మెదలక వదరక బెదరకుండు । ఈ ప్రపంచంబునకు పరిపూర్ణంబు । నకును సంబంధ మెన్నటికిలేదు ॥ గీ ॥ చావు పుట్టుక లలరె నీ జగమునకు । చావు పుట్టుకలేనిది కేవలాత్మ ॥ రమ్య ॥.

సర్వలక్షణ-విలక్షణముగా, దీని గుణము - దానిగుణము లక్షణాన్ని చెప్పుతావుండారు. మరి ఆద్యంతము లేని అచలము రెండోప్రకారముగా ఎన్నడూ కాలేదు. "జీవుడు" అయినాడని; "ఈశ్వరుడు" అయినాడు అని; వాదించే వాదము ఇక్కడ పనికి రాదు. ముందరకాలేదు - ఇప్పుడు కాదు; ఇంకప్పటికీ కూడ కాలేందు; ఇక్కడ మల్లా కాదు. "సర్వకాలంబు ఏక సరళిగావుంటుంది

– అందుకు, కదలక మెదలక బెదరక వుండేటియొక్క స్వరూపము అది.”

ఈ ప్రపంచానికి – ఈ పరిపూర్ణానికి ఎట్టి పరిస్థితిలో సంబంధము లేదు. ఎందుకు సంబంధము లేదు అంటే, “చావు పుట్టుకలచేత ప్రపంచముంది;” “చావుపుట్టుకలు లేకుండ పరిపూర్ణమువున్నది" కాబట్టి సంబంధాన్ని ఎప్పుడూ కూడ చెప్పకూడదు. ఎందుకంటే, ఒక దాని గుణము – ఇంకొకదాని మీద ఆరోపిస్తే దోషము వస్తాది. అట్లా దోషము వచ్చేటువంటి జ్ఞానము ఎప్పుడూ కూడ "యదార్థ జ్ఞానము" కాదు. అది "భ్రాంతి–జన్య జ్ఞానమైతుంది" కాబట్టి – ఇంక ఇంత "పరిపూర్ణమును " చెప్పిన తర్వాత, ఇంకా "యెరుకను" నిలుపుకుంటే, మళ్లా మొదటికే వస్తాది కదా! "యెరుక" ను నిరసించకుండ "పరిపూర్ణబోధ తెలిసితే" “దీక్షితులవారు అంటున్నారు”:

“బయలు నిరూపిస్తే – యెరుక మరి కోతిలాగ అవుతుందంట".
ఎందుకంటే, ఎవరికి తెలియంది నాకు తెలిసింది కదా! ఇది ఎవరికీ తెలియదు అని – కోతి చేష్టలు చేస్తుందట. అందువల్ల, "పరిపూర్ణమును తెలిసిన తర్వాత యెరుకను విడవడమే, దీనియొక్క సిద్ధాంత ధర్మము" – అందుకు ఇప్పుడు యెరుక నిరసన లక్షణము చెప్పుతారు.

## యెరుక నిరసన లక్షణము

96. సీ॥ ఆదిమధ్యాంత శూన్యం బైనదానందు । పంచభూతములు జన్మించలేదు । బంధముక్తులులేని పరిపూర్ణమందు ఈ పంచకోశములుద్భవించలేదు । జ్ఞానకర్మంబులులేని వస్తువుయందు । ప్రకృతి ద్వయంబులుత్పత్తిలేదు । యచలము

నందు మాయావిద్యలాది యు । పాధిద్వయంబులుద్భవములేదు ॥ గీ ॥ జగము జీవులు స్థావరజంగమములు । బట్టబయలందు నెన్నడు బుట్టలేదు ॥ రమ్య ॥ .

"యెరుక" నిరశన లక్షణాన్ని చెప్పేటపుడు - "యెరుక పరివారము" ఎంత్రైతేవుందో "అన్ని బట్టబయలందు పుట్టలేదు" అన్నప్పుడు - నాకు "మూలం లేదు " అనేది తనకు తాను అర్థమైతాది. మరి ఆదిమధ్యాంతము శూన్య మైనటువంటి యొక్క "పరిపూర్ణము" దానియందు పంచభూతాలు పుట్టలేదు; పంచభూతములు ఎవరు? "ఈ శరీరమిది - ఈశ్వరునియొక్క శరీరము." ఈ పంచభూతములతో, పుట్టినటువంటి ఈశ్వరుడు పుట్టలేదు - అంటే, పంచ కోశములు పుట్టనేలేదు. అంటే, దానియందు పుట్టినటువంటి పిండాండానికి పంచ భూతాంశ గుణములైనటువంటివి; పంచ భూతాంశ గుణములైనటువంటివి పంచకోశములు. ఇది జీవునికి ఆవరణ శరీరము కాబట్టి, ఇదిలేదు. ఎప్పుడు, ఈ పంచకోశములైనటువంటి శరీరము లేదు అని తెలుస్తుందో, "జ్ఞానకర్మ స్వరూపమైనటువంటి ప్రకృతి - ద్వయమువుండదు". ప్రకృతి ద్వయము ఎట్లావుంటాది? అంటే, "జ్ఞానకర్మచేతవుంటాది". అంటే; "యెరుగుట జ్ఞానము; దానను జరిగే పని కర్మ మనచు; యెరిగించ బడును" - ఇప్పుడు, నీవు జ్ఞానముతో, యరిగితే కదా కర్మము చేస్తావు! అందువల్ల, కర్మ ఎక్కడ అంటుకోనుంది? "జ్ఞానమునే అంటుకోనివుందిగాని ప్రక్కనలేదు". అందువల్ల, "ఈ ప్రకృతి జ్ఞాన కర్మములు లేని వస్తువుయందు ప్రకృతి ద్వయంబు లేనే లేదు". ప్రకృతి ద్వయములు అంటే, ముందరనే చెప్పినాము కదా! "పాపము; పుణ్యాము; బంధము; మోక్షము; జననము; మరణము - ఈ అన్నీ, కూడ ద్వంద్వపద్ధతిలో చేసేటివి అన్నీకూడ." అందువల్ల, "అచలమునందు" మాయావిద్యలు; ఉపాధిద్వయములు లేవు. "మాయ" అనే, ఉపాధి లేదంటే - "ఈశ్వరుడు లేనేలేడు; ఈశ్వరుడులేడంటే - సర్వజ్ఞాది ప్రపంచము

కూడ పరిపూర్ణ మందు పుట్టలేదు". అవిద్య లేదు అంటే, అవిద్యోపాధియైనటువంటి "జీవుడు" లేడు - "ప్రత్యగాత్మ" లేదు. ఇంక దాని చేత జరుగేటువంటి వ్యవహారమంత కూడ లేదు. "స్థావరజంగములు బట్టబయలందు పుట్టలేదు." "<u>స్థావర జంగమాత్మకమైనటువంటి జగత్తు పరిపూర్ణపరబయలందు పుట్టలేదు అనేటువంటిదే నిర్ణయము.</u>" కాని, ఇది మొదట తరగతిలో వినే వాళ్ళకు కొంచెము తడబడగా వుంటాది - మల్లా అనుభవము రాగ రాగ - అది దృఢమైతావుంటాది. ఇంక దృష్టాంత లక్షణములు చెప్పుతారు.

## <u>దృష్టాంత లక్షణము</u>

97. సీ॥ సురులు రాక్షసులు భూసురులు వైశ్యులు శూద్ర నరులు మౌనులు దిగంబరులు ఋషులు। యోగులు భోగులు రోగులు త్యాగులు। తరులు ఖేచరులు వానరులు గిరులు। రాజులు మంత్రులు రథ తురగంబులు। శరచాపధరులు భీకరులు కరులు। కలలో ననేకమెక్కడినుండి వచ్చెనో। గాని మేల్కొనిన నొక్కటియులేదు ॥గీ॥ నీ ప్రపంచంబు నా రీతి నేమిలేదు। బట్టబయలైన యచల మెప్పటికినుండు ॥ రమ్య ॥.

జగత్తును చెప్పాలంటే, "స్వప్న దృష్టాంతమే తప్ప" - "వేరే దృష్టాంతము కాదు". అందుకే, "కృష్ణ దేశికులు" కూడ - "దృష్టాంతము యెరుక ఏదని; యోష్టము కదలించగానే ఎరుకలు కలనుచు " - కలను జెప్తారు. అందుకే, ఈ కలలో - వాళ్ళకు రాజుల కాలములో, మనకు ఇప్పుడు - రాజులులేరు కాబట్టి, మనకు రాజులురారు కలలో. ఇప్పుడు మనకంటే, పరివారము వస్తారు. అప్పుడు వున్నటువంటి కాలములో "ఎక్కువ రాజులు; భీకరులు; నిరంతరమూ యుద్ధాలూ - ఎప్పుడూ చావడాలు; ఊర్లు విడిచిపెట్టి పారిపోవడాలు ఇవే, వుండేవి" - ఆ కాలము అట్లాంటిది. "కృష్ణుడు అందుకే, అంటాడు - 27 సార్లు యుద్ధము జేసి - అలసి ఓడిపోయి - సర్వనాశనమైనాము - ఈ

బాధలు పడేదానికంటే, ఎక్కడైన సముద్రములో ఊరుకట్టించుకొంటే, బాగుంటాది అని మయుడిని పిలిపించి, సముద్రములో ద్వారక కట్టించుకొన్నాడు". ఎప్పుడూ కూడ - ఈ యుద్ధాలు ఇవే కనపడేవి కాబట్టి అప్పుడు సంబంధిచినవే, వాళ్ళు కలలో వ్రాసినారు. వాళ్ళ కలలయొక్క దృష్టాంతము వ్రాసేపుడు - రాజులు; భీకరులు; ఒంటెలు; ఏనుగులు; రథతురంగాలు - ఇవన్నీ ఎక్కడనుండి వచ్చినవో? చూస్తూవుండుగానే - మేల్కొంగానే, మరి ఎక్కడికి పోయినవో? ఎవ్వరికి తెలియదు. ఆ రీతిగా "ఈ ప్రపంచము వచ్చింది". ఆ కలవచ్చి పోయిందని చెప్పేదానికి - ఇంక బోధేమి అక్కరలేదు కదా! ఆ కలను మనము సాపేక్షముగా చెప్పుకుంటున్నాము. అంటే, ఇక్కడ ఏదో ఒక్క ప్రయోజనాన్ని ఆశించి చెప్పుకోవాలి. ఇక్కడ ప్రయోజనము ఏది? మనము ఇప్పుడు చూసేటువంటిదంత కల అని తెలుసుకోనేదానికే - ఆ దృష్టాంతము చెప్పవల్సివచ్చింది కాని, వేరే రకముగా కాదు. ఇంక - రెండుగా వుండేటువంటి సృష్టిరహితము చెప్తారు:

## ప్రకృతిద్వయ సృష్టిరహితము

98. సీ॥ క్షరమక్షరంబులు సగుణ నిర్గుణములు । సత్యమసత్యముల్ సత్తుచిత్తు। కారణ కార్యముల్ జ్ఞానకర్మంబులు । పురుషుండు ప్రకృతియు యెరుక మరుపు । పాపపుణ్యంబులు బంధమోక్షంబులు । జనన మరణములు జడమజడము । క్షేత్రజ్ఞ క్షేత్రముల్ జీవదేహంబులు । మానాభిమానముల్ మంచి చెడుగు ॥ గీ ॥ యిట్టి ప్రకృతి ద్వయంబులు గట్టిగాను । బట్టబయలందు యెన్నడు బుట్టలేదు ॥ రమ్య ॥ .

ఆ కల దృష్టాంతముగా చెప్పిన తర్వాత - ఇక్కడ మనకు తోచేటువంటి ద్వయము ఎట్లావుంటాది? అంటే - ఇది కూడ మనకు "బట్టబయలందు పుట్టలేనటువంటి కలేగాని వాస్తవము కాదు." అది ఎప్పుడూ బయలైన - మేల్కొపొందిన తర్వాతనే, ఇది కల అని తెలియాలి. ఊరికే మాట మాత్రముచేత తెలిసితే ప్రయోజనమువుండదు. ఇది ఎట్లా వుండాది? "క్షరాక్షరముగా" వున్నది. అంటే, "క్షరపురుషుడు" అంటే, "జీవుడు" - "అక్షరపురుషుడు"

అంటే - "ఈశ్వరుడు". "సగుణ-నిర్గుణములు" - "సగుణము" అంటే, "ప్రకృతి"; "నిర్గుణము" అంటే "పరమాత్మ"; "సత్యమసత్యములు" "జగత్తు - అసత్యము"; "బ్రహ్మాస్థానము - సత్యము". "సత్-చిత్" - "సత్" అయినటువంటిది - "చైతన్య పరమాత్మ" - "చిత్" - అయినటువంటిది "జ్ఞానము" గా కనబడతాది.

"కారణ కార్యములు" - కారణోపాధి - "ఈశ్వరుడు"; కార్యోపాధి - "జీవుడు"; ఇట్లా - "జ్ఞాన కర్మంబులు" - "జ్ఞానము" - "యెరుగుట"; దానితో చేసేటువంటి పని - "కర్మము". ఇట్లా "పురుషుడు" - "ప్రకృతి"; "యెరుక - మరుపు" "పాపము- పుణ్యము"; "బంధము - మోక్షము" ; "జననము - మరణము"; "జడము - అజడము"; "క్షేత్రము - క్షేత్రజ్ఞుడు"; ఇటువంటియొక్క - "దేహి - దేహములు"; "మానాభిమానములు" మొదలుగా కలిగినటువంటి - ఈ ప్రకృతి ద్వయము "బట్టబయలందు పుట్టలేదు". ఇట్లా, మనకు - ఆ "ప్రకృతి" ద్వయముయొక్క లక్షణాలన్ని చెప్పినాక - ఇంక మాయా నామాలు తెలుపుతున్నారు.

## మాయా నామాలు

99. సీ॥ చైతన్య మనియన్న క్షేత్రజ్ఞుడనియన్న జ్ఞానమన్నను నహంకారమన్న । సద్రూపమనియన్న చిద్రూపమనియన్న । సస్వరూపంబన్న సాక్షియన్న । ఈశ్వరుడనియన్న నిలవిష్ణువనియన్న । పరమాత్మయనియన్న బ్రహ్మమన్న । యాదిశక్త్యనియన్న యానందమనియన్న । పరమ పదంబన్న ప్రకృతియన్న ॥ గీ ॥ మాయకీయిన్ని బహునామ ధేయములును । బట్టబయలందు నొకపేరు బుట్టలేదు ॥ రమ్య ॥ .

ఇప్పుడు చూడండి, ఈ యొక్క "ఆత్మకు" మాయా నామాలు అని ఎన్నో పేర్లు పెట్టుకొనింది. ఎందుకంటే, ఇన్ని పేర్లతో వ్యవహారించేది. మనము ఇప్పుడు చెప్పుకొన్నామే - ఇంతకంటే, "ఇంకా వేల శాస్త్రాలు; వేన వేల సిద్ధాంతాలు;

చేసిపెట్టికొంది". కాని, ఇవి నిలబడడములేదు - **"సత్యముగా ఏవీ నిలబడలేదు".** అన్ని చేసుకొనివున్నంత కాలము ఆనందపడి పోవల్సిందేగాని - నిలుపుకొనేకి ఏదానికి శక్తిలేదు. అందువల్ల, ఇది నిలవకుండ పోయేదాన్ని **"మాయ అంటే, తప్పేముంది అని దీక్షితులవారు గట్టిగా వాదించినారు".**

ఊరికే, భ్రాంతులు పెంచుకోవడము ఎందుకు? మాయయందు భ్రాంతులు పెంచుకోని బాధ పడేదానికంటే, లేనిది లేనట్లనుకుంటే, మంచిది కదా! అని దీనికి - "చైతన్యమన్న"; "క్షేత్రజ్ఞుడన్న"; "జ్ఞానమన్న"; "అహంకారమన్న"; "సద్రూపమన్న"; "చిద్రూపమన్న"; "సస్వరూపమన్న"; "సాక్షియన్న"; "ఈశ్వరుడన్న"; "బ్రహ్మమన్న"; "ఆదిశక్తియన్న"; "ఆనందమన్న"; "పరమపదంబన్న"; "ప్రకృతియన్న"; ఇవన్నీ కూడ - ఈ మాయకే

లేకుండవుండేటివి - పుట్టనటువంటివి **"మాయకే ఇన్ని పేర్లు పెట్టుకొని వున్నది."**

ఇంక - కాలాతీతమైన లక్షణాన్ని చెప్పుతావుండారు - **"పరిపూర్ణానికి"** - ఎప్పుడైన కాని, కాలముకానిదానికి కాల దోషము పడుతుందంటే? సిద్ధాంతాలకు కాల దోషము పడుతుంది. **"సతీ సహగమనము పెట్టిరి"** అది ఇప్పుడుందా! లేదు; **"బాల్యవివాహము"** - పెట్టినారు కదా! అది వుందా? ఇప్పుడు లేదు; ఇంక - **"యజ్ఞయాగాదులకు"** బహు ప్రాముఖ్యము ఇచ్చివుండిరి - అవి కూడా ఇప్పుడు లేవు. మరి కొన్ని మత సిద్ధాంతాలు - కాపాలికాది మతాలువుండేవి, అవీ ఇప్పుడు లేవు. అంటే, కొన్నిటికి కాలదోషము పట్టుతాది. కాని, కాలదోషము పట్టకుండా వుండే వస్తువు

ఏది? ఏ సిద్ధాంతము చేసినా ప్రతి వస్తువుకూ కాల దోషము పట్టుతుంది – కాని కాలదోషము పట్టకుండా వుండేదానికి కాలాతీత లక్షణాన్ని చెప్పుతారు.

## కాలాతీత లక్షణము

100. సీ॥ బ్రహ్మకల్పంబులు ప్రతియుగంబులు గాదు । సంవత్సరములు మాసములుగాదు । పక్షముల్ తిథివార నక్షత్రములుగాదు । గ్రహయోగకరణ లగ్నములుగాదు । పర్వముల్ ఋతువులు పగలు రాత్రులు గాదు । వెలుగుచీకటి మేఘములును గాదు । ఉదయాస్తమయములు నుపరాగమునుగాదు । త్రివిధకాలముగాదు దిశలుగాదు ॥ గీ ॥ నాదబిందువు కళగాదు నభముగాదు । జీవనిర్జీవులుగాదు కేవలాత్మ ॥ రమ్య ॥".

మనకు కాలము ఎట్లా మొదలవుతాది అంటే, రెప్ప పాటుతో కాలము మొదలైతాది. రెప్పతో ఇట్లా మొదలై దీన్ని – విగడియలు; గడియలు; మరి కాలము; – దినములు; వారము; నక్షత్రాలు; ఋతువులు; అయనాలు; ఉత్తరాయణ; దక్షిణాయన' సంవత్సరము మరి, ఆ రకముగానే – యుగాలు; బ్రహ్మకల్పాలవరకూ – కాలము ఇట్లావుంది. అంటే, ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క రకమైన పరివర్తన పరిణామమువుంది.

కాని, ఇట్లా ఏ కాల స్వరూపము కానటువంటిది "**పరిపూర్ణమైన పరబయలు** " అని చెప్పి – ఇంతగా ఎందుకు చెప్పవల్సివచ్చిందంటే – విజ్ఞానం వికసించటానికి రెండు పద్ధతులు వున్నాయి. "**బోధ దృఢమయ్యే కొరకు** " ఒక మార్గము; "**మోదమున ప్రొద్దు పోకకు**". మనకు ఇంత తీరుకే ధర్మము తెలిసింది కదా! ఇంక మరి "**సంతోషముగా శేష జీవితము గడపేదానికి అనుకూలమవుతుంది**".

మోదమున ప్రొద్దు పోకకు; వాది ప్రతి వాదులగుచు; వరగురు శిష్యులు వాదించిరనుచు; నొక సంవాదంకల్పిస్తి; కలగా వదలాక వినుడీ; మొదటినుండి తుదవెల్ల గనుడీ;

**శ్రీ కృష్ణప్రభువులవారు ఒక మాట అన్నారు** - ఎందుకంటే, విషయము తెలిసిన తర్వాత మరి విద్యకు కాలదోష పరిస్థితుల ప్రభావము పట్టి - మనస్సు చదరకుండేవుండే దానికి, పదే పదే దీనిని అనుకోవాలి. ఇప్పుడు - చాలా మంది; మనము కొంత కాలము విద్యను శ్రద్ధగా విని - కొంత కాలము తర్వాత, మళ్ళీ సంసార బాధల్లో పడో; పరిస్థితులు బాగలేకనో; దాన్ని మనము మరిచి పోతాము. మరిచిపోయినప్పుడు మళ్ళీ మనకు మబ్బు ఆవరిస్తుంది. అలా కాకుండ వుండేదానికి, ఇవన్నీ చప్పుకోవల్సి వచ్చింది. ఇలా సర్వాతీతమైనటువంటి సర్వకళలకూ, మూల సూత్రమైనటువంటి - రః **"యెరుక లేదు అని తెలిసికొన్నప్పుడే, సర్వము పోతుంది."** మరి ఇవన్ని, ఎందుకూ అంటే? ఇవన్నీ కూడ **"విద్యావిధానము చక్కగావుండే దానికి" - "శేష జీవితము సజావుగా; సుఖకరముగా; ఆనందదాయకముగా గడిపేదానికి చెప్పవల్సి వచ్చింది".** ఇంక హేతృత్వ రహితము చెప్పుతున్నారు:

## హేతృత్వ రహితము

101. సీ॥ కర్తృత్వ భోక్తృత్వ స్మర్తృత్వ మంత్రత్వ । ములు కేవలాత్మకు గలుగవెపుడు । జ్ఞాతృత్వ శ్రోతృత్వ ఘ్రాతృత్వ వక్తృత్వ । ములు కేవలాత్మకు గలుగవెపుడు । ధ్యాతృత్వ వేతృత్వ ధాతృత్వ పాత్రత్వ । ములు కేవలాత్మకు గలుగవెపుడు । శత్రుత్వ మిత్రత్వ జైత్రత్వ భేతృత్వములు కేవలాత్మకు గలుగవెపుడు ॥ గీ ॥ గోత్రసూత్రా పవిత్రగాత్ర । ములును నిజకేవలాత్మకు గలుగవెపుడు ॥ రమ్య ॥.

**"కేవలాత్మకు - కర్తృత్వము; భోక్తృత్వము వుండదు".** ఇప్పుడు మనము వంట చేసేకి మనము కర్తలము - భోంచేసేకి - మనము కర్తలము. అంటే, చేసుకోనేకి మనము కర్తలము - భుజించేకి కర్తలము. ఒక్కొక్క సారి చేసేకి కర్తలము -భుజించేకి వేరేవాళ్ళు వస్తారు. **"అంటే, కర్త ఒకరైతే - భోక్త ఒకరైతారు."** ఆ రకముగానే, రెండు రకాలు దీనియందువుంటాయి. **" స్మర్తృత్వ మంత్రత్వములు"** - స్మృతియుక్తమైన పద్ధతిలోను - జ్ఞాపకము చేసుకోవడము - మంత్రాలు చప్పడములోను - దీనికి గుణమువుంది. అట్లే, **"జ్ఞాతృత్వ; శ్రోతృత్వములు"** - వినేవాడు- చప్పేవాడు. ఇవన్నీ కూడ హేతృత్వ లక్షణములో అనేక పద్ధతులు మనకు

ప్రపంచములోవున్నాయి. కాని, ఇటువంటి లక్షణాలు ఏవీకుండ "పరమాత్మ" – నిజ కేవలాత్మ "అది కర్త కాదు; – భోక్తా కాదు". అందువల్ల, కర్తృత్వ – భోక్తృత్వములో లేనటువంటి వస్తువందున – ఆ వెనకవుండేటివి ఏవీ చెప్పనవసరములేదు. అన్నీ, ఈ కర్తృత్వ – భోక్తృత్వమనే రెండు పదాలకిందనే వుంటాయి. అందుకే, ఒక్కొక్క సారి "మహాత్ములు" ఇంటికి వస్తే అనేవారు; మేము చేసేదానికి కర్తలు స్వామీ! భుజించేకి మేము కర్తలము కాదు – మహాత్ములు మీరు ఎక్కడనుండో వచ్చారు మీరు కర్తలు, అని చెప్పినారు. "మేము రానప్పుడు – చేసే కర్తలు మీరే! భుజించే కర్తలు కూడా మీరే!" మేము వచ్చినప్పుడు కర్తవు – భోక్తవు; వేరైనట్లుగా – అట్లా సృష్టిలో – ఒకరు కర్తృత్వము; ఒకరు భోక్తృత్వము వుంటాది. ఇవన్నీ ప్రకృతి ద్వయాలు చెప్పేయొక్క పద్ధతి. "శతృత్వ మిత్రత్వ" – మరి శతృత్వమూ వుంటాది – మిత్రత్వమూ వుంటాది; మనకు "మిత్రులతో సాంగత్యము బాగవుంటాది" "శతృవులతో విరోధము కూడా అలాగే వుంటాది". "జైతృత్వము" 'జైతృత్వమువుంటాది" – వాళ్ళను జయించాలి అనేటువంటి లక్షణమువుంటాది. ఈ రకముగా "నామకులగోత్రాదులయొక్క పద్ధతులలో అనేక లక్షణాలు వుంటాయి నాయన!" అట్లానే ఇంక విషయరహిత లక్షణములు చెప్తున్నారు.

## విషయరహిత లక్షణము

102. సీ॥ దయభయధైర్య శ్రద్ధా లజ్జా శమ దమ । దర్పాహంకారేచ్ఛ దంభదైన్య । మదలోభమోహ కామక్రోధ మాత్సర్య । సుఖదుఃఖ క్షయ వృద్ధి క్షుత్పిపాస । సంశయ నిశ్చయ సంకల్ప వికల్ప । కంప నాకుంచనా గమన చలన । శ్వాస నిశ్వాస విసర్గ వ్యాపకరాగ । ద్వేష కుటిల గర్వ వేషభాష ॥ గీ ॥ వినయ మానాభిమానాది విషయసంఘ। ములును నిజ కేవలాత్మకు గలుగవెపుడు ॥ రమ్య ॥ .

ఇవన్నీ, ఎట్లావుంటాయి అంటే – **"దయ; భయ; ధైర్య; శ్రద్ద; లజ్జ"; –** ఇవన్ని **"అంతరేంద్రియాల లక్షణములు"** – ఇవన్నీ దానికివుంటాయి. ఇంక – **"దర్ప; అహంకార; ఇచ్ఛా; దంభాది పద్ధతులు; మోహము; కామక్రోధాదులు"** – **"మనస్సు యొక్క లక్షణములివి"** – ఇవి దానికివుంటాయి. మరి, "సుఖము-దుఃఖము; క్షయ–వృద్ధి; ఈ దేహ ధర్మాలు దీనికివుంటాయి". "క్షుత్పిపాస" – "క్షుత్తు – పిపాస; అంటే, ఆకలి–దప్పికలు; సంశయ–నిశ్చయములు; సంకల్ప–వికల్పాలు; గమన-చలనములు; శ్వాస–నిశ్వాసలు; ఇవన్నీ కూడ దీనియందువుంటాయి" కాబట్టి

**"ఇట్లా లక్షణాలు కేవలాత్మయైన పరిపూర్ణానికి లేవు."**

ఇంక, ఈ నిజము తెలిసినట్టివారు ఎట్లావుంటారు? అనేదానికి – ఇప్పుడు బోధస్థితి లక్షణమును తెలుపుచున్నారు.

## <u>బోధస్థితి లక్షణము</u>

మనకు బోధస్థితి లక్షణములో – అమనస్క యోగములో ఒక రకముగాను; వార్థికములో ఒక రకముగాను; పరిపూర్ణ బోధలో ఒక రకముగాను; చెప్పినారు. బోధస్థితి ఎట్లావుంటాది అంటే? పరిపూర్ణబోధవుంది – ఆ బోధలోవుండే, ఆంతర్యాన్ని గ్రహించి, ఆ స్థితిలో ఎట్లావుంటాడు? **"శరీర ప్రపంచము అపద్ధము అని" "నేను సత్యము"** అని అనేటువంటివాడు – అనేదానికి **"అమనస్క యోగములో దాన్ని; పరిపూర్ణబోధలో – దీన్ని తెలియజేస్తారు"** కాబట్టి – ఇక్కడ బోధస్థితిని తెలియజేస్తున్నారు.

103. సీ॥ ఈ వుత్తబట్టబైలేమీ లేదనువాడు రాగిగాడతడు విరాగిగాడు । యెరిగే శరీరము ఏమి లేదనువాడు జ్ఞానిగాడతడు యజ్ఞానిగాడు । యున్న దున్నట్లుగా నుండ జూచెడు వాడు కర్మిగాడతడు దుష్కర్మిగాడు । లేనిమాయా విద్యలేమి లేవనువాడు ఘనుడుగాడతడు కించనుడుగాడు ॥ గీ ॥ అనృతమైనట్టి జగము లేదన్నవాడు । బంధ మోక్షద్వయంబుల బడని వాడు ॥ రమ్య ॥ .

ఇట్లు వుంటాడు. ఈ వుత్త బట్టబయలు ఏమీలేదు అని తెలుసుకొన్నటువంటి మహాత్ముడు "వాడు రాగి కాడు విరాగి కాడు"; "ఒక దాన్ని కావాలని కోరడు - వద్దు అని వదలడు" - ఆ రకముగానే, " సరిపడు సరిపడ దనకను । సరిగావర్తింపుచుండు సమరస బుద్ధిన్ ॥".

ఇంక - గుర్తెరిగేటువంటి "జ్ఞానశరీరము" - "యెరుక" లేదనేటువంటివాడు - "జ్ఞానిగాడు - అజ్ఞానిగాడు" అంటే, తాను తెలియనివాడు - తెలిసినవాడు రెండూ కూడ కాదు. ఎందుకంటే, "యెరుక" - "మరుపులకు" రెంటికి మూలము - "యెరుకే కాబట్టి - యెరుక లేదు అనేవాడు" - "యెరుక కాడు - మరుపు కాడు"; "యెరుక" అంటే - "జ్ఞానము"; "మరుపు" అంటే - "అజ్ఞానము". యెరుకతోనే, ఇవి రెండు పోయినవి కాబట్టి - ఇవి లేదనేటివాడు, ఈ రెండు దోషాలు లేనివాడు.

"యున్నదున్నట్లుగా నుండజూచెడు వాడు కర్మిగాడతడు దుష్కర్మిగాడు" - "వున్నది వున్నట్లుగా" - "ఇది లేనిది; ఇది వున్నది" అని నిజము తెలిసినటువంటి "మహానుభావుడు వాడు" - "కష్టము అని కర్మములు చేయడు" " దుష్కర్మల పాలు కాడు". ఎందుకంటే, ఈ వేదాంతము తెలిసితే - "ఒక దుర్బుద్ధి వస్తాది"; అక్కడే, అందరూ చెడిపోతూ వుండారు. ఇంక ఎవరికీ తెలియనిది, వున్నది వున్నట్లుగా తెలిసింది కదా! ఇంక ఏమి చేస్తే ఏముంది? "పాపము లేదు" - "పుణ్యము లేదు" కదా! అనిచెప్పి ఇంక "దొంగతనము; వ్యభిచారము; తాగడము" - మొదలైనటువంటి పద్ధతులు వున్నవి - అందుకు, ఇక్కడ ఏమి చెపుతున్నారంటే - అటువంటివాటిలో పడిపోకుండ వుండేదానికి; "వాడు కర్మిగాడు - దుష్కర్మిగాడు" - దీన్ని బాగ "విడుచునటువంటివాడు". అందుకే, "ఆత్మలింగ శతకములో"

కూడ - **" ఏమిలేదనువాడు - ఏమిలేదన్నట్లే వుండాలగాని; అన్నివున్నట్లువాడు చేస్తాడా ! అట్లా అన్నివున్నట్లు చేస్తే - వాడు లేనివాడు ఎట్లైతాడు? వాడు భ్రాంతికుడే కదా!"**

ఎందుకంటే, ఇప్పుడు ఈ సంధిలో చాలామంది చెడిపోయారు. ఎలా చెడిపోయారంటే? మొట్టమొదట వేదమతము వున్నింది. ఈ **"వేదమతము ప్రపంచములో విస్తారముగా వున్న కాలములో"** "ఇంక మేము సర్వమూ తెలిసినవాళ్ళము; మేమే శాసన కర్తలము - రాజులు కూడ మా మాటే వింటున్నారు కాబట్టి - మేము ఏమి చేసిన పాపము లేదని" - **"చాతుర్వర్ణ స్త్రీలను మేము అనుభవించవచ్చు అని బ్రాహ్మణులు"** లిఖించుకొని, వాళ్ళ ఇష్టానుసారముగా ప్రవర్తించినారు. ఈ **"వేదమతములో వుండేటువంటి దురాచారాలను"** బాగా కనిపెట్టి **"బుద్ధుడు"** - ఈ రకముగా ప్రజలను ఉద్ధరించటానికి ప్రయత్నించినాడు.

**"బుద్ధుడు"** "ఇంక ప్రజలు అన్యాయమైపోయారు - వీళ్ళు దోపిడికి గుర్రైపోతున్నారని చెప్పి"; ఆ వేదమతమును ఖండించేదానికి ప్రయత్నించాడు. అప్పుడు **"బ్రాహ్మణులు"** ఒక మాటన్నారు - మేము సత్యమైనటువంటి యజ్ఞములు - మంత్రాలు చేస్తావుండాము కాబట్టి - అగ్నిలో పురుగులు పుట్టినవి అన్నారు. అంటే, ఎక్కడైన **"సంయోగముంటే"** పుట్టుతాయయ్యా! మీరు యజ్ఞయాగాదులు - నెయ్యిపోసి చేస్తే పుట్టినవి అంటున్నారు కదా! మేము ఏమీ వేయకుండానే పుట్టిస్తాము చూడు అని చెప్పి, పట్టి కట్టెలు - ఒక ఐదారు బండ్లు తోలి కాల్పించేసి - ఒక ఐదారు రోజులు గడిచాక - ఇంతింతలావు పురుగులు పడినవి చూడండి - కాబట్టి, మీ మహత్తు ఇందులో ఏమీలేదు. ప్రజలను మోసము చేస్తున్నారు **"యజ్ఞాలు లేవు - స్వర్గాలు లేవు; మీరు చూసివుండేది లేదు - చేసిండేది లేదు ; మీరు ప్రజలను మోసము చేస్తున్నారని చెప్పి ఖండించేసారు"; ఎందుకూ???** వేద మతములో అరాచకము పుట్టింది కాబట్టి.

తర్వాత, "బౌద్ధమతము వచ్చిన" తర్వాత – "దీంట్లో కూడ స్వామి ఇంక ఏమి లేదు అన్నాడు కదా! ఇంక ఏమి చేస్తే ఏముంది? అని చెప్పి – వీళ్ళు మొదలుపెట్టారు." ఇంక దీంట్లో కుళ్ళు బయలుదేరి వాళ్ళకు – ఇంతలో పోయేది ఇంకా పెద్దబాధైపోయినే అని చెప్పి – మళ్లా ప్రపంచానికి అరిష్టము వచ్చి చుట్టుకోనివుంది అని వీళ్ళు వాదులాడుకోవడము; వాని శిష్యున్ని వీడు – వీని శిష్యున్ని వాడు; చేసుకొనేసి – మీ గురువుకు తెలియదు అని చెప్పి ఒకరు – మా గురువుకు తెలియదా అని చెప్పి వాదాలు జేసుకొంటూ – "సంఘాన్ని భ్రష్టు పట్టించినారు".

మళ్లా – కాపాలికాది "దుష్ప్రచారమైన మతాలు దేశములో ఎక్కువైనాయి". మళ్లా ఇంక సంఘానికి అరిష్టము వచ్చి చుట్టుకొనివుంది కదా! అని చెప్పి – మళ్లా "శంకరులు వచ్చి అద్వైత మతాన్ని స్థాపించారు." "నీవే దేవుడు; నీవే బ్రహ్మము అని" వీళ్ళు "అహంబ్రహ్మోస్మి" అని ఆడికివచ్చేసరికి – ఇంక "నేనే బ్రహ్మము" కదా! ఇంక – " న పుణ్యము; న పాపము; న మంత్రము; – న వేదము; న యజ్ఞము; న తీర్థము; ఇంకేమి లేదనుకొని" – నేను ఏమిచేస్తే ఏముందని? వీళ్ళు కూడా అదే పని చేసినారు.

మరల అరాచకము ప్రబలమయింది – ఇవన్ని జూసి "పొరజూసినారు దీక్షితులవారు!". ఈ "యెరుక" అనే భ్రాంతిని నిలబెట్టితే – ఇట్లా దీని చేష్టలు మార్తానేవుంటాయి; దీని మూలాన్ని తెగనరకాలని – అప్పుడు వీళ్ళు "లేనిది కల్పన చేసుకొని" – ఇందులో లేనివి ఏమిటికి పుట్టించుకొంటారని – ఈయన వచ్చి దీన్ని "లేనిది అని తెలిపి " – "ఈ సిద్ధాంతము చేసినారు". చేస్తే – మరి దీంట్లో చక్కనైన పద్ధతి వచ్చింది. వస్తే, వీళ్ళు కూడా ఏమైనారు ఇప్పుడు? "అవాంతర వేదాంతులు అయినారు కదా! " – "క్రమ పద్ధతిగా;

భయభక్తిగా; పాప-పుణ్యాల భీతిగా విద్యను అభ్యసించి వచ్చినవాళ్ళు కాదు. అవాంతరముగా వచ్చినవాళ్ళు; వీడు కూడ "అచలుడు నేను" - "లేని యెరుక" - "నేను ఏమి చేస్తే ఏముందని చెప్పి - వీరు కూడ మొత్తము చెడిపోయినారు" - అందుకు వీళ్ళకు కూడా పాదరక్ష ప్రయోగమే - ఇంకేమి వుండదు అన్న మాట.

అందువల్ల, ఇటువంటి "దురాచారములను అరికట్టేదానికి" - ఇవన్నీ కావల్సివచ్చింది కనుక "ఆతడు కర్మిగాడు దుష్కర్మిగాడు". అంటే, భావము దృఢమైనటువంటివాడు - కర్మలు కోరి చేయడు. అటువంటి పద్ధతి వుంటాది వానికి.

"లేనిమాయ అవిద్యలేమి లేవనువాడు ఘనుడుగాడతడు కించనుడుగాడు"- మాయా విద్యలు వున్నాయి, అనేవాడు - మాయేవుండాది అన్నవాడు "సర్వజ్ఞుడైతాడు" - మాయావిద్యలు లేనివని - అవిద్యవుంది అన్నవాడు "కించజ్ఞుడైతాడు"; "మాయా విద్యలే లేనివని చెప్పి తీర్మానము చేసుకోనేటువంటి "మహానుభావుడు" సర్వజ్ఞుడు కాదు - కించజ్ఞుడు కాదయ్యా! ఆయన ఆ రకముగా వుంటాడు.

"అనృతమైనట్టి జగము లేదన్నవాడు । బంధమోక్షద్వయంబుల బడని వాడు" – "అనృతమైనట్టువంటి మాయాజగము లేదనేటివంటివాడు" – ఇంక "బంధము లేదు వానికి - మోక్షము లేదు." అట్లా సర్వరహిత - విరహిత పద్ధతిని అనుసరించి నిర్మలుడుగా వుంటాడు" -

"పరిపూర్ణుడని" చెప్పి అంటూవుండారు అన్న మాట. ఇంక, ఈ రకముగా బోధ స్థితి లక్షణాన్ని తెలియజేస్తూవున్నారు:

104. సీ॥ ఈ వుత్త బట్టబైలేమిలేకను సదా పరిపూర్ణమైయ్యుండు ప్రకృతిలేదు । కలలోన గనుగొన్న గజమేమి లేనట్టు యెరిగె శరీరము ఏమీలేదు । యిదియే సద్గురువాక్యంబు యింతకంటెను యెక్కువైన వాక్యంబు యెంద్దైనలేదు. యిది రాజమార్గంబు యిది యనాయాసంబు యిది భ్రాంతిరహితంబు యిది స్థిరంబు ॥గీ॥ యిదియు నమ్మిన వారల కేమిబాధ । లేదు జన్మంబు మరణంబు లేదు లేదు ॥ రమ్య ॥.

తీర్పు వాక్యము ఇది - "సుప్రీమ్ జడ్జమెంట్" వున్నట్లు - "ఈ వాక్యము". ఎందుకంటే, "ఈ వృత్త బట్టబయులు ఏమి లేదు అనేటువంటివాడు - సదా పరిపూర్ణము ఎట్లావుంటే ఆ రకముగా వుంటాడు" - ప్రకృతి ద్వయము లేదు.

"కలలో గనుగొన్న గజము మేల్కొని చూడ లేశమైన లేనిది" అని ఎట్లైతే తెలుసుకొనివుండాము, ఆ రకముగానే - "మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి లేదు" - అనేటువంటివాడు అటువంటి స్థితిలో వుంటాడు.

"ఇంతకంటే, ఎక్కువైన గురువాక్యము సృష్టిలో ఏమీ లేదు" - ఇంక, "నీవు ఏమంత్రమన్నా కనుక్కో; ఏమన్న అనుకో; "యెరుక" అనే ఆవరణలోనిదే - ఇదే దేవుడైతాది! ఇదే భక్తుడైతాది! ఇదే నామాలు పెట్టుకొంటాది! ఇదే గోలలు చేయాల్సిందే తప్ప - ఇంక ఇంతకంటే, "గురు వాక్యము సృష్టిలో ఎక్కడలేదు". "ఇది భ్రాంతి రహితము"; "ఇది స్థిరం"; "ఇది అనాయాసం" - ఏ బాధ లేకుండ

తెలుసుకొనేది - ఏ సాధన లేకుండవుండేది కాబట్టి - దీన్ని నమ్మినవారికి - "జనన-మరణాలు లేవని చెప్పి తీర్మానము జేసినారు అన్నమాట". ఇంక, గ్రంథఫలము చెప్పుతారు - ఎందుకంటే, ఫలశృతిలేని గ్రంథాన్ని ఎవరు చదువరు అని పూర్వమంత చెప్పేవారు - కాని దీనిని "ఆధ్యాత్మికముగా ఆలోచిస్తే - ఈ ఫలితాలన్ని కూడ వుండాయి".

## గ్రంథఫలము

105. సీ॥ బ్రాహ్మణోత్తములైన పరగ క్షత్రియులైన వైశ్య శూద్రులునైన వాంఛగలిగి। ఈ నూరు పద్యమ్ములింపుగావిని వ్రాసిచదివిన జనులకు సౌఖ్యములును । ధనధాన్యములు వస్త్ర కనక భూషణములు సతి సుతుల్ హితబంధు సంఘములును । గజతురగంబులు ఘనమైనపశువర్గ మాండోళనము శుభం బతిధిపూజ ॥గీ॥ లాయురారోగ్య భాగ్యంబు లమరి సుఖము। గలుగు నిజము ॥ రమ్య ॥

అంటే, ఇవన్ని కలిగితే - ఎంత ఆనందమో - అంతకంటే గొప్ప ఆనందమే మనకు విద్యలోవుంది. అంటే, ఫలశృతి ఆశించి చదువుతారంటే "ఫలశృతికి ఆశించి పూర్ణులైనటువంటివాళ్ళు చదువరుగాని" - సామాన్యుడు చదివితే ఏమి వస్తాది? అనే వాడు ప్రతిదానికీ - మీ ఇంటకి వస్తే ఏమిస్తావు? మా ఇంటకి వస్తే నాకేమితస్తావు? అనే జాతివుంది కదా! ఈ లోకములో, అటువంటివాళ్ళ కొరకు ఫలశృతిని పెట్టాలి. ఎందుకంటే, "బ్రాహ్మణ; క్షత్రియ; వైశ్య ;శూద్రులు; అయినట్టివారు వాళ్ళు - ఎవరైనగాని దీనియందు ప్రేమగలిగి" - "ఈ నూరు పద్యములను చదివి వ్రాసి - ఇతరులకు ఇచ్చేటువంటివారు". వీళ్ళు వ్రాసిన కాలములో, ప్రింట్ లేని కాలము అది - "మల్లా ఇతరులకు వ్రాసి ఇయ్యాల అది" - "అట్లాంటి కాలము అది." అట్లా సౌఖ్యములను పొందుతారు. ధన ధాన్యములు; వస్త్ర కనక

వస్తువాహనాదియుక్క మాండోలనములు; పల్లకులు కూడ కలుగుతావని చెప్పిరి". అంటే, ఈ నాడు – ఇదే ఒక జగద్గురు స్థానములోవుండి చేస్తే, వాళ్ళకు పల్లకి ఉత్సవాలే కదా! ఇంకేమివుంటాయి కాబట్టి, ఇట్లా ఆయురారోగ్య; ఐశ్వర్య భోగ భాగ్యములన్ని – లౌకిక పదార్థాలన్ని; చెప్పి నేటికి – అన్నీకూడ మనకు **"ఆధ్యాత్మికముగా – అంతకంటే, ఎక్కువ సుఖము–సంపదవుంది కాబట్టి – దాన్ని ఒప్పుకోవచ్చు."**

ఎందుకంటే, కందార్థము వ్రాసినప్పుడు – వెనుక ప్రక్క రెండు పేజీలు చూసినాడాంట **"పండితారాధ్యులు";** చూడుమామ అని ఇస్తే – చూచేసి బయట పారేసినాడట ఆ గ్రంథాన్ని. యాల మామ అట్ల పారేసినావు అంటే? **"ఫలశృతి లేకపోతె ఎవరు చదువుతారు ఈ గ్రంథాన్ని?"** దీంట్లో ఏమిటిదివుంది? ఏంది చివరలో ఇట్ల వ్రాసినావే?

" యెరుకను యెరుంగని బయలులో – గురుడును శిష్యుడు వారి గొడవయు; నేను మీకెరిగించినవన్ని మీరెరిగినవన్నియూ; మీరు నేను వుళ్ళుక్కి; వుళ్ళుక్కి తాను ఎప్పుడూ వుళ్ళుక్కి; మరి ఇంక మాటాడ మాటే లేదాయను; సరిపోతె సరిపోయ సరి; "

అని వ్రాసినావు. ఏమిటిది? దీన్ని ఎవుడురా సదువుతాడు అన్నాడంట !

"మామ! నీవు స్వర్గము వస్తాది! ఇంక వైకుంఠము వస్తాది! అని వ్రాసినావే? నీవు ఏమన్న చూసినావా!? వాళ్ళకి ఇచ్చినావా!?" ఆ అపద్ధపు కూతలు వ్రాసేదానికంటే – ఈ నిజము మంచిది కాదా అని! మల్లా పారేసిన

గ్రంథమును ఎత్తుకొచ్చినాడంట ఈయన". "నీవు వ్రాసినావుగాని నిజములేదు కదా! ఫలశ్రుతిలో!" మరి "నేను నిజము వ్రాస్తే నీకెందుకింత బాధ! నీయట్లా జ్ఞానికి ఇంత బాధైతే ఎట్లా అని అన్నాడాంట!?" అట్లా- ఆ రకముగా ఫలశ్రుతిని ఎట్లా అన్వయము చేసుకోవాలాంటే, ఇట్లా చేసుకోవాలి.

## గ్రంథకర్తస్థితి

106. సీ॥ శ్రీకరలోకప్రసిద్ధుడై పరశురా । మాన్వయాంభోధి హిమాంశుడైన । కూలంకషజ్ఞాన కోటీశ్వరునకు శ్రీ । సుబ్బమాంబకు నేను సుతుడనయ్యు। నరసింహదాసుండ నని పేరు విలసిల్లి । యమల కంభాలూరి యప్పగురుని । కరుణకటాక్షంబు గలిగి వేదాంతార్థ । సారము లెస్సగా సంగ్రహించి । ॥ గీ ॥ భరితముగా నూటయెనిమిది పద్యములను ప్రేమతో జెప్పి మీకు నర్పించినాను ॥ రమ్య ॥

ఈయన యొక్క జన్మ వృత్తాంతము:- శ్రీ కోటేశ్వరుడు సుబ్బమ్మ దంపతులకు కుమారుడుగా పుట్టి; కంబాలూరి అప్పయ్య మంత్రికి శిష్యుడుగావుండి, వేదాంతవిద్యను బాగ లెస్సగా సంగ్రహించి దాన్ని - ఈ గ్రంథముగా చెప్పితిని అని చెప్పుతున్నారు. అందుకే, "దీన్ని కంఠమాలగా ధరించి పెట్టుకోవాలని మనందరికి చెప్పినారు".

## కంఠమాల

107. సీ॥ ఇంపుగాజెప్పిన ఈ నూటయెనిమిది మహనీయపద్యముల్ మౌక్తికములు । ప్రాస మిశ్రమములు బంగారు కొలుకులు కూర్మి శబ్దంబులు గూర్చుటంబు । పరమ తత్వార్థము పచ్చల పతకంబు మీయంకితంబును మేరుపూస । ఈ రీతి మౌక్తికహారంబు జేసినే ముదముతో నర్పించి మ్రొక్కినాను ॥ గీ ॥ కంఠమందున ధరియించి ఘనత మెరసి । నన్నురక్షించు నినుసదా నమ్మినాను ॥ రమ్య ॥ .

అంటే, "రామనిను నమ్మినాను - నన్నురక్షించయ్యా - ఇది నీ

కంఠములో మాలగా వేసుకో అని చెప్పి". అంటే, రామునికి తెలియని పద్యాలు భీముడు చెప్పినట్లువుంటుంది కదా ! కాని వాస్తవికముగా "ఈ మీరు" అంటే, "చదివినటువంటి మీరందరూ;" "విన్నటువంటి మీరందరూ కూడ" - దీన్ని కంఠస్తముజేసి - కంఠమాలగా వేసుకోండి. అట్లా వేసుకొంటే, ఎట్లావుంటుదంటే? నన్ను రక్షించినవాళ్ళు అవుతారు - అంటే, "నేను" అనేటువంటి "యెరుకను" - ఇంక "జనన-మరణ ప్రవాహము అనే బంధనములో పడకుండ రక్షించినవారవుతారు" కాబట్టి "మీరు కంఠమాలగా వేసుకోమని చెప్పినారు కాబట్టి - ప్రతి ఒక్కరూ కూడ ఈ సాంప్రదాయములో"- అతి సులభమైన పదములు ఇవి. కఠిన పదాలు లేవు - మంచి తెలుగు భాష - బాగవుండేటువంటి దానిని "చక్కగా కంఠమాలగా వేసుకోవాలని చెప్పమని గ్రంథకర్త కోరాడు" - ఇంక:

## మహామంగళ హారతి

## మంగళం

108. సీ॥ దశరథ సుకుమార దానవసంహార మందర నగధీర మంగళంబు। నీరజదళనేత్ర నీలతోయదగాత్ర మౌనిజనస్తోత్ర మంగళంబు। భానుజవర్ధన భక్తజనార్ధన మారీచమర్దన మంగళంబు। కమలామనఃఖేల కాంచన మయచేల మహనీయ కులశీల మంగళంబు ॥ గీ ॥ మన్మథాకార రఘువీర మంగళంబు। మాధవానంద గోవింద మంగళంబు। రమ్యగుణధామ భద్రాద్రిరామ పరుశు। రామ నరసింహదాస సంరక్షితాహ్వా ॥ రమ్య ॥

ఇట్లా - అనేక సుగుణములను కూర్చి - ఇక్కడ మంగళహారతి చెప్పినారు కాబట్టి ఈ భద్రాద్రిరామ శతకాన్ని మనము - ఐదు పూటలైంది ఇప్పటికి' ఐదు పూటలకూ ఒక శతకము అయింది. ఇది మనము అనేక చోట్ల చెప్పడమువల్ల వినేవారికి

సులభోపాయముగా; కొందరికి పునరుక్తిగా – మరి మరి వినడమువల్ల ఇంతే కదా అన్నట్లువుండవచ్చు – దీన్ని, కేవలము ఇంత తక్కువ కాలములో తక్కువ దృష్టితోనే కాకుండ **"రాబోయే భావితరాల వారలకూ కూడ శతకమైతే"** – అంత శతకములో పద్యాలు వ్రాశాడు. మనము చేయవల్సింది **"సమన్వయ భావము"** – ఎక్కడనుండి ఎక్కడ మారతాది – "మరి నిరాకారమైన, నీయొక్క భావము సృష్టికి ఎట్లావచ్చింది?" "సృష్టిని అనుభవించి అనుభవించీ; దానియొక్క గుణగణాల్లో బాధలుపడిన తర్వాత – దానినుంచి తప్పించికోవాలనే గుణము ఎట్లా వస్తాది? వచ్చినప్పుడు మరలా వెనక్కు ఎలా ప్రయాణము చేయాలి? మరలా ఈ స్వరూపాన్ని ఎట్లా పొందాలి? ఇట్లా రాకపోకలు కలిగినటువంటు, ఈ యొక్క సృష్టిని జయించాలంటే, మూల బీజమైన వస్తువు ఏది? ఆ వస్తువును పూర్తిగా తీసేయాలి."

ఎందుకంటే, "మనము ఒక్క వృక్షముయొక్క విత్తనము భూమిలో వేసినాము. విత్తనము వృక్షముగా మారుతుంది; ఆ వృక్షము మారినప్పుడు, ఈ విత్తనము ఎక్కడవున్నదో ఎవరికీ తెలియబడదు. అది వృక్షము బాగ ఎదిగిన తర్వాత పెద్దగా అయ్యి – కొమ్మలు; ఆకులు; పూవులు అయిన తర్వాత కాయలైతాయి; కాయలైన తర్వాత పండుగా మారుతుంది – పండుగా మారితే, ఇక్కడ వృక్షమైన విత్తనము – మరల అక్కడ కనబడుతుంది". మరలా అక్కడ విత్తనముగా కనబడినప్పుడు **"అది ఒక్క విత్తనము చెడి – కోట్ల విత్తనాలు తయారైతాయి. ఇలా అవ్యయ శక్తిగా, ఈ సృష్టిని – ఇలా ప్రకాశింపచేసుకుంటూ పోతుంది".**

ఇలాగే, ఈ మార్గాలన్నీ "ఈ సృష్టిలోవుండే, మార్గాలంతా కూడ – వృక్షముగా మారడము; తర్వాత విత్తనాలుగా మిగలడమువుందికాని **"ఇందులో, బీజరహితమయ్యే సిద్ధాంతము ఎక్కడ కనబడదు."** బీజము మిగిలిస్తావుంటారు; బీజము నిలబడుతుంది. దాని కొరకే, అందరూ ఆరాటపడుతూ వుంటారు! ఇప్పుడు బీజమువున్నంతవరకూ – ఈ వృక్షము అయ్యేది – మరలా బీజమైనటువంటి గుణము మారనే మారదు". అందుకు, సృష్టిలోవుండే, బోధలన్నీ కూడ ఈ **"భూజబీజ" న్యాయమే తప్ప** – ఈ **"భూజబీజ" న్యాయమును అతిక్రమించి చెప్పినటువంటిది కాదు.** అందుకే, **శ్రీ కృష్ణదేశిక ప్రభువు**

అన్నట్లుగా:

" ఏ వస్తువు చేతను తాను ఆవిర్భవమందు దేహమను తరువరయ్యేన్; ఆ వస్తువే దానికి విత్త్తైపెలయను; దాన్నే సాక్షి ద్రష్టని కనుమి; యెరుక ఇదే స్పష్టము వినుమి; భావించి చూడు మీ బట్టబయలను భూమి; యావిత్తు చెట్టువున్నద అరయదు; విత్తునే ద్రష్టని కనుమి యెరుక ఇదే స్పష్టము వినుమి" అని చెప్పని:

"ఇది ఏ వస్తువు చేత – ఈ దేహము అనే వృక్షము పుట్టుతూవుందో – ఆ వస్తువే సాక్షి ద్రష్టయి; మళ్లా విత్తనముగానే మిగులుతూ వుంది. దీన్ని తీర్చి దిద్దేదానికే; దీన్ని లేకుండ చేసేదానికే; **ఈ "పూర్ణబోధ"** కావల్సివచ్చింది. సృష్టిలో, ఇంక ఎన్ని బోధలున్నా; సిద్ధాంతములున్నా వుండనీ – ఈ **"యెరుక"** "అనేటువంటి ఆవరణ లోపలనే – అక్కడ వుండాయిగాని, దానిని వదిలిపెట్టి ప్రక్కకు రాలేదు". అన్నీకూడ దానికే మ్రొక్కాల. అందుకే, **శంకరరావుగారు అన్నారు;** ఈ ఒక్క **"మహాద్వారానికే"** మ్రొక్కుతా వుండారయ్య – **"జీవేశ్వరైక్యమని మబ్బు పెట్టేసి" – ఈ "జీవుడు"– "ఈశ్వరునిలో" కలవాలని;** దాన్ని అక్కడ **"దేవుడు" జేసి;** ఇక్కడ **"జీవుని" జేసి** – ఈ వాదోపవాదాలుజేసి; ఇక్కడ బాగుండాల – ఇంక పుట్టేటువంటి మతాలు; ఇప్పుడు **"మనకు కొత్తమతాలు – ఎన్నిపుట్టినా కూడ! దీన్నె, "గాలిని పట్టుకో! కన్నులన్నా పట్టుకో! చెవులన్నా పట్టుకో! ఇంక ఇక్కడే వుంటాయి". " నాదం వినమని; శ్వాసమీద ధ్యాస పెట్టమని; చిత్కళలు చూడమని; యోగము చేయమని" – "ఎన్నిజేసినా! ఇది పోయేది పోతానేవుందిగాని – నిల్చేది ఏమిలేదు."**

ఏమంటే? "ఆ బాధవచ్చినప్పుడు – ఏదో ఉపశమనము అన్నట్లుగా – బాధవచ్చినప్పుడు, హితవాక్యాలన్నట్లుగా – చెప్పేకిపనికి వస్తావుందేగాని పూర్ణవిచారణ కాదు". కాబట్టి, మనము **"పరిపూర్ణమైన విచారణ జేసి – సందేహరహితులు అయ్యుండేటువంటి స్థితిని పొందాలని చెప్పి కోరుతూ – మరి ఈ శతకాన్ని శ్రద్ధగా చదివి మననము చేసుకొనిన మీ అందరికీ కూడ**

సద్గురు కృపాకటాక్షాలు కలగాలని చెప్పి కోరుతూ”- సమాప్తి చేస్తున్నాము.

" జై సద్గురు ప్రభు మహారాజుకి జై "

<u>జై శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్య ప్రభు మహారాజుకి జై</u>



# తత్వములు

## తత్వము – 1

1. ఇంద్రా కీలాద్రినివాసా । సచ్చిదానంద శ్రీవెంకటేశ అందముగా రామసింహ్వా మందిరమందు । పొందుగా భక్తులకు పూర్ణబోధను దెల్పి । సందియము లేకాను మది కానందముగ । దృఢపరచి దెల్పిన । డెందమలరగ । పాతపీఠ । మానందముగ ఏర్పరచి నట్టి ॥ ఇంద్రా ॥

2. శరణాసభక్తజనులనూ । మీరుకరుణతో రక్షించేరిలనూ అరమర లేకాను । పరగ ధర్మముదల్పి । సరిగాను సాధన సంపత్తి బోధించి । నిరతము శ్రీ సాధుజన । సహవాసము జేయూచు ధరలో మరువకను శ్రీగురుని మంత్రము । మురయుచును జపియుంచు మనిరీ ॥ ఇంద్రా ॥

3. నంచితముగా పంచీకరణి । పంచి వచ్చి చాటించిరీ ధరణి । పంచి యిరుపై ఐదు । యించి లయము జేసి । మించున్న భూమాను గాంచుమని జూపించి । నంచితంబుగ అండపిండ బ్రహ్మాండమంతయు వుండబోదని । అంచు స్వప్నజాలవత్తుగ । ఎంచుమని భోధించినట్టి ॥ ఇంద్రా ॥

4. అష్టాంగ యోగములానూ । మీరు స్పష్టముగా జూసినారిలనూ । అష్టదళపద్మమున ద్రుష్టదర్శన ఆర్య । దృష్టినిలువుమాని । దృఢముగా బోధించి । అష్టమంత్రయోగములచే । కష్టములు ప్రాప్తించుగాన, కష్టమునులేకాను । పరమును స్పష్టముగ కనజేసినట్టి ॥ ఇంద్రా ॥

5. సత్యమైన బయలులోనూ ఎపుడూనిత్యముగాదూ జగమనెనూ । నిత్యనిరాకారా । నిర్మల నిర్గుణ । సత్యమైన పదవీసౌజ్ఞచే జూపించి సత్తు చిత్తానందములనూ వుత్తదేనని మేలుకొనిన సత్తా మాత్రము లేక స్వతహాసిద్ధమై యున్నది కనుమనె ॥ ఇంద్రా ॥

6. ద్వాదశి షోడషి బోధా । మీరు పొదుగా దెల్పిరీ । మేదా గాదాలు లేనట్టి బోధాను వినుపించి వాదాము వద్దాని మేదిని లోపాల నాదినేనన వాదమాడె । బాధగురువులచెంత జేరక । అది శ్రీ బృహద్వాశిష్టము । యాది మరువక చదువుమనిన ॥ ఇంద్రా ॥

7. శివరాంమదీక్షితా ప్రభులూ । వారు సిద్ధాంత అచలబోధకులూ, స్థిరముగప్పయమంత్రి । సిద్ధాంతమును వినీ । సరగున శ్రీ సీతారామస్వామికి దల్పి, సిద్ధముగ భాగవత కృష్ణస్వామియూ । బోధార్థమెరిగి పీలుఖానాలక్ష్మణవినుమని । ప్రీతిగా బోధించిరంటిరి ॥ ఇంద్రా ॥

8. సాకార నిరాకారములనూ । లేకయున్న పారంపరూలిలనూ ప్రాకటముగ సచ్చిదానందస్వామియూ । జోకతో శ్రీ గద్దె వెంకటార్యులకు దెల్ప । వేగమే శ్రీ ఆల్తి అప్పలస్వామియూ బోధార్థ మెరిగి । యెరుక మరుపులు లేని పరమును యెరిగి దెల్పిన పరమ తత్వము ॥ ఇంద్రా ॥

"జై బోలు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర స్వామి సద్గురు ప్రభు మహారాజుకీ జై"

## తత్వము - 2

1. ఏ తావునురా నిలకడమీకూ । సంతని పెదకూదు గురుదేవా । సాకార మాధవ సాధన మీదను ॥ నళినదళేక్షణ నా గురుదేవా ॥ భౌతిక మనసునా భవములన్నో బయలై; భ్రమలై భవమై; భయమాయే! ॥ ధాతవిదించిన కర్మము । నీచేత తుడుచుటే ధర్మమూ । పులివాత పడిన మేకపిల్లవలే ।నా రాత నీకు దక్కినేవినేవని ॥ఏ తావునురా నిలకడమీకు॥

2. జేసితి జపములు । జేసితి తపములు । జేసితి దానము । జేసితి ధర్మము ॥ భాసుర వేదాంత । ప్రజ్ఞాన నిధినియ్యివేసితి । వేషములు మోసములుగాగ ॥ ఈషణాత్రయములు । వాసనత్రయములు । ఆశ పాశం అహం పదార్థము । వీసమైన విడలేనుగాని । నీ ధ్యాసలేశమైన విడలేను ప్రభు ॥ ఏ తావునురా నిలకడమీకూ ॥

3. మనసే మూలము । మాయ జగమునకు । మనసే యెరుకాయెరా । ఈ మనసును వీడ అమనస్క బోధరా । ఈ యెరుకను విడ అమనస్క బోధరా ॥ మనసును గెలిపించు । మరుగ గురు మరగు ॥ ఏ తావునురా నిలకడమీకూ ॥

4. మనసును గెలిచిన మాయ । మాయమగుప్ మనసు జయించిన జనుడే సుజ్ఞాని । మనసు చంద్రుడు అని । మరుగు యెరుగును విజ్ఞాని । వినుము జగము కలను అనుచుదానిలో । కనిన దృశ్యములపై । భ్రమచెందక । అనవ్రతము తను తాసరిగి । ఆత్మను పరిపూర్ణుడని । అచలమనియున్నా ॥ మనసే మూలము । ఈ మాయ జగమునకు ॥ ఏ తావునురా నిలకడమీకూ ॥

## "జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై"

## గురుప్రార్థన - 3

1. గురుదేవ శ్రీ గురుదేవా । మీచరణము నమ్మితి మహాదేవా ॥ పల్లవి ॥

2. తరదీసీ మేసెరుకను దృంచి । స్థిరము జూపితిరి హరదేవా ॥ గురుదేవ ॥

3. పరమ పావన పరమాత్మ । సుస్థిరముగ దలచెద పరిపూర్ణ ॥ అరమర లేకను నను బ్రోవుము । శ్రీ అమృత సుగుణ జయ సంపూర్ణ ॥ గురుదేవ ॥

4. పంచ భూతముల । పంచ కర్తలకూ । మించినవల పరమేశడువు ॥ అంచితముగ భవనాశ స్థితుల । నిజమెంచనేమి లేనీశుడువు ॥ గురుదేవ ॥

5. అష్టతనువుల శూన్య పరుడువు । వ్యష్టి సమిష్టికతీతుడవు ॥ సృష్టి స్థితి లయ మావల గురుపర । మేష్టి వరయ నిజ దేవుడవు ॥ గురుదేవా ॥

6. నాలుగు నాల్గులా నెన్నిన యెరుక । మూలము లేనిది నాలీలా ॥ నాలుగు ముప్పిరి గనుగొన నిలనా । జాలము రహితము జయపాలా ॥ గురుదేవా ॥

7. రాగ రహిత వర వెంకటేశ । శ్రీ రాజయోగ బుధనుతలోలా ॥ ఆగమ నిగమాతీ సుధాజయు । భూమానంద సుపరి పాల ॥ గురుదేవా ॥

## "జై శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై"

## తత్వము - 4

1. ఎండమావులవంటి బొమ్మ । నిండుజలధిల బుగ్గరా ॥
వుండదెప్పటికైన దేహము । వుత్త స్వప్నము భ్రాంతిరా ॥

2. కండలెముకలు కీళ్ళుగల్గిన । కల్మశంబిది కుండరా ॥

దండి కసరును పొట్టనుండి । గుండ జలములనుండిరా ॥

3. యెండ మావులవంటి బొమ్మ । నిండుజలధిల బుగ్గరా ॥
వుండదెప్పటికైన దేహము । వుత్త స్వప్నము భ్రాంతిరా ॥

4. గండ్ల తొర్రలు పచ్చి మాంసము । మెండు మూత్రము మలమురా । పండ్ల
కావల పుర్రెలోపుల । నుండి పులుగుల మెదడురా ॥ యెండమావుల ॥

5. ఆడుచున్నది గండ్ల మధ్యన । నాడిగుండ గాలిరా । ఆడుచుండిన
గాలిపోతె । అణగిపోవును తనువురా ॥ యెండమావుల ॥

6. చూడ సుందరమైన దీనిని । కడగకుండిన గబ్బురా । పాడు
కాయములోన బారును । చూడ రక్తము చీమురా ॥ యెండమావుల ॥

7. ఈడగల్గిరి తల్లిదండ్రులు । చూడమొదలున లేరురా । నీడ అద్దములోన
చందము । నీవు ఎవ్వరొ తెలియరా ॥ యెండమావుల ॥

8. త్రాడు సర్పము భ్రాంతి సర్వము । ఏడచూచిన లేదురా । పోడిమీగ
నారాయణాఖ్యుని । పూర్ణబోధను కానరా ॥ యెండమావుల ॥

" జై బోలు శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జై "

## గురుప్రార్థన - 5

1. జయ జయ గురుదేవా । గురువర । జయ జయ గురుదేవా ॥
శుభకరా । సద్గురువర । గురుదేవా ॥

2. నీ పాదములను...। మరువుకా... నేను । నిరతము మధిలో ।
స్మరియించెదను ॥ జయ జయ ॥ ఆ...హో.... హో.... హో.....

3. విశ్వాధార విశ్వము నీవనీ । మునులు ఋషులును ।

కీర్తించిరిగా ॥ జయ జయ ॥

4. పరమ మునీంద్రులు । సుఖయోగీంద్రులూ ॥ ఆహో... హో.... హో.... ।
పరమ మునీంద్రులు । సుఖయోగీంద్రులు । నిరతము మదిలో ।
స్మరియించిర నీ ॥ జయ జయ ॥

5. గురువాక్యంబును । నమ్మినవారికి । మరణము జననము ।
లేనే లేదు గా ॥ జయ జయ ॥ ఆ... హో.... హో....

"జై బోలు శ్రీ సద్గురు ప్రభు మహారాజుకి జై "

## 6. శ్రీ శ్రీ శ్రీ మహద్గురు బండారు వివేకానంద సుబ్బయ్య ఆర్యుల ఉదయము మరి వాళ్ళ జన్మవృత్తాంతము.

ఇంద్రుండు నీకంటే నధికుండునంటిమా .................
మేనెల్ల యోనిలైయ్యె...... వెలుగుచుండె ............
భానుండు నీకంటే .... ఘనుడని యంటిమా..........ఆ...
ఉదయాస్తమయంబుల నొందుచుండె ..............
సోముండు నీకంటే.... శ్రేష్టుడని అంటి మా..........

వృద్ధిక్షీణంబులు పొందుచుండే......హే............
ఆదిశేషుండే - అధికుండు అంటిమా...............
భూభారమంతా - పొందియుండే....................
అవని బరికింప - సద్గురోత్తమ.... నీకంటే...హే...
అధికలెవరయ్యా.... గురుదేవా..............అమర
వినుతా...........భ్రాంతి భవబంధములను ద్రుంచు
భవ భయహరణ **..........శ్రీ శ్రీ శ్రీ** వివేకానంద
**మహద్గురు శ్రీ సుబ్బయ్యార్యా......హో.....హో.........**

ధర్మావరంబులో ధర్మంబు బోధింప బండారు వంశమున
భానుడవై..............హే...........హే..........................

పెద్దసుబ్బన్న బాలమ్మకు పేర్మికుమారుండై.............
పుడమినుదయించి పూజ్యుడయ్యె..........................

దీక్షిత సిద్ధాంత దివ్య బోధను దెల్పి, మరణ – జననంబు బాపు జనకుడయ్యె.......................................................

ఆశ్రయించిన భక్తులకు అవనియందు, సంశయంబులను తీర్చు సద్గురుడయ్యె............హే.....................................

దేహమోహంబులను బాపు దేశికుండూ......పరమ పదమును జూపేటి ఈ పరమ గురుడూ......మహిని వివేకానందులై వెలసిన మద్గురుండూ....సదానంద యనుచు దీవించిన సద్గురుండూ............

## తత్వము - 7.

1. 'ఓ' నామాలు చదువినందుకు । 'ఓ' కు వం పెరిగించరా । ఓ కు వం పెరిగించరా । 'ఓ' నామాలులో 'నా' కు నడ్డి । మానగానిది దెల్పరా ॥ 'ఓ' నామాలు ॥

2. జ్ఞానియైతే మాకు మర్మము । మానకిప్పుడు దెల్పరా। జ్ఞానియైతే మాకు మర్మము మానగిప్పుడు దెల్పరా ॥ ఓ నామాలు ॥

3. స్వానుభవమిది మూటికర్థము । దానిమూలము జూపరా । దానిమూలము జూపరా । ॥ ఓ నామాలు ॥

4. వేద పాఠకుడైతె తనువున వేదమును జూపించరా । వేదశబ్దము బిందు కళలను నాదిలోనెటువచ్చరా । నాదిలోనెటవచ్చురా ॥ ఓ నామాలు ॥

5. అక్షరంబుకు అర్థమెరిగితె । నక్షరంబుమీమౌనురా । కూక్షుకుండిన క్షరముగానిది అక్షయంబది జూపరా । అక్షయంబది జూపరా ॥ ఓ నామాలు ॥

6. తన్ను అద్దములోను జూచిన మన్ను రూపమది జడమురా । తన్ను తానే జూసి మురిసిన । తన్ను జూజినది యెరుగురా । తన్ను జూచినది యెరుగురా ॥ ఓ నామాలు ॥

7. పేరులన్నిటికి వున్నవి । తనపేరుదేనికి దెల్పరా । పేరుతోనిను పిలువ పలికినవారు ।

ఎవ్వరు జూపరా । పిలవ పలికినవారు ఎవ్వరు జూపరా ॥ ఓ నామాలు ॥

8. నామముంటే రూపముండును । స్వామి ఎవ్వరు జూపరా । భూమిశ్రీ నారాయణాఖ్యుని పూర్ణమౌ గురు మాటరా ॥ ఓ నామాలు ॥

## తాత్పర్యము - 8

1. " ఓ నామాలు చదువినందుకు । ఓ కు వం పెరిగించరా "

ఎందుకంటే, అందురూ **"ఓనామాలు"** చదువుతావుండాము. **'ఓ' కు 'వంపు'** ఎట్లా వచ్చింది? అనేటువంటి విషయాన్ని తెలుసుకోవడము కష్టమైంది. పెద్దలు ఏమి చెప్పినారంటే, **'ఓ' లో** వుండేటువంటి **'వంపులను'** నీవు అర్థము చేసుకొంటేనే, ఓనామాలు చదివినందుకు ఫలితము అన్నారు. **'ఓ'** అనేటువంటిది దానియందున **'అ' కారము' 'ఉ' కారము 'మ' కారము** – అనేటువంటి **"మూడు అక్షరాలు పుట్టినవి". 'అ' – కారము చేత – బ్రహ్మ; 'ఉ' కారము చేత – విష్ణు; 'మ' – కారము చేత – మహేశ్వరుడు (శివుడు) పుట్టి, 'అ' కారము చేత – "సృష్టి"; 'ఉ' కారము చేత – "స్థితి"; 'మ' కారము చేత – "లయము";** జరుగుతావుంది. మరి ఈ **"ఓంకారము"** పరిణామము చెందినటువంటి విషయాన్ని – నీవు తెలుసుకోకుండ, నీవు **"ఓనామాలు"** చదివితే ప్రయోజనమేముంది? కాబట్టి ఈ ఓంకారములో వుండేటువంటి నిజార్థాన్ని ఇట్లా తెలుసుకోవాలని.

2. 'నా' కు నడ్డి మానగానిది దెల్పరా?

ఇంక **'నా' కు** నడ్డి – ఈ **'నా'** కు నడ్డి ఎట్లావచ్చింది? – అంటే, **"ఈ లేని అహంకారానికి గొప్ప తనము వచ్చింది".** ఈ **'నా'** అనేటువంటి విషయాన్ని బాగ విచారించి చూస్తే, **"పరిపూర్ణ పరబయలందు"** లేకపోయిన కూడ, అదే జగత్తుకు ఆధారభూతమైనటువంటి అహంకారముగా పరిణమించి, ప్రతి దానికి **"నేను" "నేను"** అని చెప్పి ఇది అంటావుంది. ఈ మధ్యలో వచ్చినటువంటి – ఈ **'నా'** కు వచ్చిన నడ్డినే, నీవు అర్థము చేసుకొనివుండావా అని అర్థము.

3. ఇంక - మరి ఈ "**తనువు లోపుల మాకు మర్మము**" - "**జ్ఞానియైతే మాకు మర్మము మానగిప్పుడు దెల్పరా**"

అన్నాడు. "**మా**" అంటే, నిజముగా లేనిది. '**అ**' '**ఉ**' '**మ**' అనేటువంటి '**ఓ**' '**నా**' '**మ**' - అనేటువంటిదానికి, దీనియొక్క స్వరూపాన్ని బాగ తెలుసుకోవాల అన్నప్పుడు - '**మ**' అనేటువంటి పదాన్ని - '**మాయని**' నిర్దేశించి చెప్పుతూవుంది. మరి "**వున్న నిజవస్తువుని తెలిసి - మాయని తెలిసి - విడచిపెట్టినటువంటి వానికే, ఈ మూడు అక్షరములయొక్క నిజార్థము తెలుస్తాదని చెప్పి అని అన్నారు**".

4. "**వేద పాఠకుడైతె తనువున వేదమును జూపించరా**" - **అన్నాడు;**

నీవు "**వేదము చదివినావు కదా!**" మరి ఈ తనువులో వేదాన్ని జూపించు అన్నాడు. మనకు ఋగ్వేదము; యజ్ఞుర్వేదము; సామవేదము; అథర్వణవేదము; అని చెప్పి - ఎప్పుడో, ప్రాచీనులు వ్రాసినటువంటి గ్రంథాల పేర్లుచెప్పుకొంటామే కాని ఇప్పుడు, నీ వేదముయొక్క లక్షణాన్ని - నీవు అర్థము తెలుసుకొనివుండావా అవి - చెప్పమని అంటారు.

5. ఇంక - "**వేదము**" అంటే, "**జ్ఞానము**" అని అర్థము. ఈ "**జ్ఞానస్వరూపమైన**" సకల వేదాలకు "**మూలపురుషుడునై**" - అన్ని వేదములను ఎలా తయారుచేసినారో - ఆ రహస్యాన్ని తెలుసుకొనివుంటే, నీవు చెప్పు. ఎందుకంటే, వేదములు అన్నిటికీ కూడ పుట్టుక స్థానము ఎక్కడవుంది? అంటే - ఈ "**జ్ఞానమే**" - అందువల్ల, ఈ తనువులోపల వేదము ఎక్కడవున్నది? అది "**గురుకరుణ**" చేత - మరి "**మహాకారణ శరీర స్వరూపుడై**" హృదయ స్థానములో సహస్రారమందున, "**స్వయంప్రకాశ బ్రహ్మై**" - ఈ వేదసృష్టినంత చేస్తావుంది. కాబట్టి, ఈ "**జ్ఞానము**" "**వేదమందున నాల్గు శరీరాలయొక్క ధర్మాలు**

**తెలియజేస్తావుంది"** కాబట్టి ఈ నాల్గు వేదాలయొక్క ధర్మాన్ని జ్ఞానిష్ఠత తెలుపు అన్నాడు.

6. "అక్షరంబుకు అర్థమెరిగితె – నక్షరంబుమేమౌనురా"

**"క్షరము – అక్షరము"** రెండు పదాలు వుండావి మనకు – దీంట్లో:

శ్లో॥ ద్వావిమౌ పురుషాలోకే । క్షరశ్యా క్షరయేవచ ।
క్షర సర్వాని భూతాని । కూటస్థ అక్షర వుచ్చతే ॥

ఈ శరీరములో రెండు – ఈ శరీరము అనే వృక్షము మీద, రెండు **"పక్షులు వున్నవి".** ఒక్కటి "క్షరపురుషుడు"; ఒక్కటి **"అక్షర పురుషుడు".** "క్షర స్వరూపమైనటువంటి పక్షి – మనో బుద్ధి, చిత్త; అహంకారములుతో – ప్రపంచమనే వృక్షంమీద తిరుగుతావుంటాది – అదే కూటస్థుడు". అంటే, **"ప్రత్యగాత్మ స్వరూపమైనటువంటి" –"అచల స్వరూపమైనటువంటి పక్షి సాక్షిగా చూస్తావుంటాది".** అంటే, ఈ **"జనన–మరణ"** రూపముగా, ప్రపంచంమీద విహరించేటువంటియొక్క **"మనోరూపమనేటువంటి పక్షిని ఇది చూస్తావుంటాది"** (అక్షర పురుషుడు). ఇది **"క్షర సంపర్కమీద తిరుగుతాది". "క్షర పురుషుడు"** అక్షర స్వరూపమైన **"ఆత్మ చైతన్య"** మీద ఆధారముపడివుంటుంది – అక్షరపురుషుడు. అందువల్ల, క్షరమైనటువంటి క్షేత్రములో **"అక్షరమనే"** పదానికి అర్థమేమి? **"నశించనటువంటిది అది".**

7. "మడి కుక్షికుండిన క్షరము గానిది – అక్షయంబది జూపరా అన్నాడు.

పిండ బ్రహ్మాండములుగా తోచే, ఈ అఖండ రూపమగు చైతన్యమనే – ఈ కుక్షి కుండిన క్షరముగానిది; పరిపూర్ణ పరబయలు – అనే క్షయముగాని అక్షయమును జూపరా;

ఇందులోవుండే, **"క్షర లక్షణాన్ని"** విచారించి విడిచిపెట్టితే, **"అక్షరము"** ఏమైతాది? అంటే, అక్షరమువుంటాది అనే భ్రాంతి మిగిలించినారు. కాని **"అక్షరము కూడ"** – ఈ **"క్షర అక్షరములు"** రెండూ ఏకముగా **"లేకపోవడమే"** **"అదే అక్షయమైన పరిపూర్ణము".** ఈ ఒక్క – దీనియొక్క **"సిద్ధాంతము".** అందువల్ల, ఇక్కడ ఏమి చెప్పుతావుండారు ఈయన :

8. "తన్ను అద్దములోన జూస్తే మన్ను రూపది జడమురా" అన్నాడు:

ఆర్యదర్పణమనే దీపము పెట్టి – నేత్రముల్ చూపించి – అదే ఆపోజ్యోతి అని చెప్పినప్పుడు, అది చూచి ఆనందములో మురిసిపోతారు. అది జడరూపము – దానిని జూచినటువంటిది ఏమో చూపమని అడుగుచున్నారు.

అద్దములో జూస్తే, ఏంది కనబడతావుంది? – **"జడరూపమైన శరీరము కనబడతాది".** కాని **"ఆత్మ స్వరూపమైనటువంటిది తెలియబడదు".** మరి అద్దములో చూసినటువంటి దానిని – కనపడినటువంటి శరీరాన్ని జూసి మురుస్తున్నావు – జూసినటివంటిది ఏదో దాన్ని నీవు తెలిసుకో; **"నీ స్వరూపము"** ఎట్లా వుంటాది? అంటే, ఈ శరీరాన్ని చూసేటువంటి నేత్రము కాదు – నేత్రములోవుండేటువంటి దానిని తెలిసుకోసేటువంటి **"ఆత్మస్వరూపమై – చైతన్యస్వరూపమై"** వుండాలి. అందుకే, "ఈ శరీరము నేత్రములకు దృశ్యము; నేత్రములు – మనస్సుకు దృశ్యము; మనస్సు – ఆత్మరూపమైన జ్ఞానానికి దృశ్యము." ఈ దృక్ దృశ్యాలు మూడు స్థానాలలో – బైట ప్రపంచము నేత్రానికి ఎట్లా దృశ్యమో – ఈ నేత్రము **"మనస్సు"** అనే

నేత్రానికి కనబడతావుంది. ఈ "మనస్సు" అనేటువంటి దృశ్యము **"ఆత్మ"** అనే నేత్రానికి కనబడతావుంది. కాబట్టి, **"నీవు బైట జూసి మురుస్తావుండావు - కాని లోపల వుండేదానిని తెలిసుకో అని చెప్పి – ఆయన అంటావుండాడు."**

## 9. "పేరులన్నటికి వున్నవి; తనపేరు దేనికి చూపరా; పేరుతో నిను పిలచిన పలికిన వారు ఎవరు?"

పేరులు అన్ని వున్నావి – ఈ శరీరములో. " ఏ భాగాన్ని జూపించిన, ఆ పేరువున్నది. కాలు చూపిస్తే, కాలు అంటావు; చెయ్యి జూపిస్తే చెయ్యి అంటావు; ముక్కు జూపిస్తే ముక్కు అంటావు; కన్ను జూపిస్తే: కన్ను అంటావు" – మరి ఇన్నిటికి ఇన్ని పేర్లువుండావి. **"పేరుతోనిను పిలువ పలికినవారు ఎవ్వరు జూపరా"** – మరి పేరుతో పిలిచితే పలుకుతావుండేది ఎవరు? అంటే, **"ఇన్ని అవయువాల లోపలవుండి ఏ వస్తువు ఐతే గుర్తెరుగుతావుందో, అది మాత్రమే పలుకుతావుంది. అందువల్ల, ఆ పలుకేటువంటి ఒక్క లక్షణాన్ని అర్థము జేసుకొంటే – నీయొక్క స్వరూపము బాగ తెలియ బడతాది"** – వేదము చదవడము ఎందుకంటే, తెలిసుకొనేకే తప్ప ఊరికే మొండిగా చదువేదానికి కాదు.

## 10. "నామముంటే, రూపముండును; స్వామి ఎవ్వరొ జూపరా"

రూపము వున్న నామముండును. నామరూపములు లేని స్వామిని జూపరా అని – అటువంటి నామరూపములు లేని స్వామిని జూపించి, నామరూప భ్రాంతిని బాపునటువంటి – శ్రీ భూమానంద నారాయనార్యుల – పూర్ణ బోధను తెలియరా అని బోధించినారు.

# జై శ్రీ శ్రీ శ్రీ పరమగురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యులు ప్రభు మహారాజుకి జై

## తత్వము - 9

1. దోచుకున్నాడే .......గురుడూ......మంచి । దాచుకున్న సొమ్ములన్ని దోచుకున్నాడే ॥

" మా గురుపరమాత్మ ఏమి దోచుకున్నాడు ? "

2. ఉచ్చ నీచ ద్రవ్యమంత । ఉపము చేత వదల దీసి ।
గాచి బ్రోచి కరుణాగుప్పి । సూచనేమో చెవులజేసి ।
॥ దోచుకున్నాడే ॥

3. కంటి కింపుల్ తీసినాడే......। కాళ్ళ కడియాల్ గుంజినాడే.......।
కంటిలోవున్న కుండలి పాప । కల్పనేమి లేక జేసి ॥ దోచుకున్నాడే ॥

4. పూస పోగు గుంజినాడే........ । బుద్ధి కుశలత జేసినాడే .......।
దాసిపై తను మన ధనమ్ములు । మోసమవి త్వరగ ఇమ్మని ।
॥ దోచుకున్నాడే ॥

5. రూపు మాపు జేసినాడే । చూపులోనే నిలిపినాడె ।
పాప రహితుని జేసినన్ను । పంచవింశతి పద్ధతి తెలిపి ।
॥ దోచుకున్నాడే ॥

6. తారకము త-లు-పు తెరసి । తత్వమంత బయలు పరిచి ।
కారణము చింతలణచే । మరుజన్మము లేకజేసి ॥ దోచుకున్నాడే ॥

" జై భోలో సద్గురు ప్రభుమహారాజుకి జై "

## తత్త్వము - 10

## శ్రీ శ్రీకరానంద పిన్నంశెట్టి రాజయోగి వేములవాడ వ్రాసిన తత్త్వం

1. అన్నలారా గురు బోధ విన్నారా । అర్థము దెలిసి మిన్నకున్నారా ।
నన్ను యెరిగి నడువండోయ్ ॥ తాసె తందాన ॥ నా పేరు మాయల
మారండోయ్ ॥ తాసె తందానా ॥ పల్లవి ॥

2. అవ్యక్తామహత్తంతయు నేనే । అహంకార మమకారము నేనే ।
కావ్య గద్యకథలన్నియూ నేనే । కంటిలోన మరుగైనది నేనే ।
॥ నన్ను యెరగి నడువండోయ్ ॥

3. రూపనామ క్రియలన్నియు నేనే । రూఢి పంచతన్మాత్రలు నేనే ।
పాపలలో వెలుగైనది నేనే । పంచమహా భూతంబులు నేనే ।
॥ నన్ను యెరగి నడువండోయ్ ॥

4. నేనే వేదముల్ వెదజల్లినాను । నేనే పురాణముల్లై య్యున్నాను ।
నేనె శాస్త్ర శృతి స్మృతుల్లైనాను । నేనీతిహాసము లెరిగియున్నాను ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

5. తల్లిదండ్రి జీవేశులు నేనే । యెల్లబాషలేర్పరచినదీ నేనే ।
కల్లజగంబని బల్కిన నేనే । కార్య కారణ కర్తను నేనే ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

6. నేనే యెరుక మరుపై యున్నాను । నేనే యేమి లేదనుచున్నాను ।
నేనే అన్నిటినెరిగియున్నాను । నేనే పురుష ప్రకృతుల్లైయున్నాను ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

7. మంత్ర తంత్రముల మహిమలు నేనే । యంత్ర సూత్ర పరమాణువు నేనే ।
తంత్రములకు తగు శక్తిని నేనే । తారతమ్యముల తపసిని నేనే ।
॥ నన్ను యెరగి నడువండోయ్ ॥

8. నేనే బ్రాహ్మణుడనైయ్యున్నాను । నేనే క్షత్రియుడనై వెలసినాను ।
నేనే వైశ్య వ్యాపారమైనాను । నేనే శూద్ర సుఖ దుఃఖమైనాను
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

9. దేహాకారము నేనే యై నా । దేహేంద్రియంబులు నేనే యై నా ।
అహంభావము నేనే యై నా । అండపిండ బ్రహ్మాండములైనా ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

10. సప్త చక్రముల యందున నేనే । సప్త ద్వీపములందున నేనే ।
సప్తచక్రాది పతుడాను నేనే । సప్తఋషుల సాంగ్యత్యము నేనే ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

11. నేనే మతములను కల్పించాను । నేనే మితములను ఏర్పరచాను ।
నేనే వ్యధలనుగొనుచున్నాను । నెనె వ్యర్ధుడనౌచున్నాను ।
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

12. భజనలు జేసేటి భక్తుడు నేనే । అజహరాదులను గెలిచేది నేనే ।
త్రిజగమంతటను దిరుగుదు నేనే । తీరు తీరైన చిత్రము నేనే
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

13. సంకల్పాది వికల్పములూ నేనే । సర్వసంగ పరిత్యాగము నేనే ।
వంకలుబొంకుల పరసయు నేనే । వదరుచుండేటివాడను నేనే
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

14. నేనే ఆత్మానాత్మలనాను । నేనే జడాజడములైనాను ।

నేనే విరాట్ రూపమైనాను । నేనే మహా విశ్వరూపమైనాను
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

15. మూలము లేకను వచ్చిన నేనే । మూలమున్నదని మురిసితి నేనె ।
ముందు జన్మ లేదంటిని నేనే ॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥

16. "అన్నియు నేనై యున్నాననుకొని । అచలంబును రాజార్యుచె కనుగొని ।
సున్నై పోయెను చెన్నయ్యాపని । సూటిబాట యిదే సరిచూడండని
॥ నన్ను యెరిగి నడువండోయ్ ॥"

"జై బోలో సద్గురు ప్రభు మహారాజుకి జై "

తత్వము - 11

1. బయలులోనే బొమ్మ లేదురా । అయమాత్మ బ్రహ్మము లేదురా ।
బయలులోనే బొమ్మాలేదు । అయమాత్మ బ్రహ్మము లేదు ।
నియమితమైన గురువూ లేడు । నయమైన శిష్యుడు లేడు ॥ బయలు ॥

2. లింగములు గట్టిన లేదు । పంగనామాల్ పెట్టిన లేదు ।
వంగి వంగి దండములు లేవు । సంగీతాలు మొదలే లేవు ॥ బయలు ॥

3. పూజా లేదు బాజాలేదు । సృజనంటె మొదలే లేదు ।
అజరుద్రాహరులూ లేరు । నిజములో రవ్వంతే లేదు ॥ బయలు ॥

4. అష్టసిద్ధులనిన లేరు । కష్టనిష్టూరములు లేవు ।
దృష్టదర్శన దృక్కులేదు । యిష్టమన్న మొదలే లేదు ॥ బయలు ॥

5. సచ్చిదానందము పొందాలేదు । చిదానందము లేనే లేదు ।
సంకల్ప వికల్పము లేదు । సద్గురుపూజా వుండేలేదు ॥ బయలు ॥

## తత్వము - 12.

**కాదంటావా బయలు లేదంటావా । యెరుక పోదంటావా**
**మరియేమంటావు । నిజముగాదంటావా ॥ కాదంటావా ॥**

1. మిన్న మన్నుల మధ్య । యెన్నో జన్మము లెత్తి । ఉన్నదానిజాడ కన్నుగానక
తిరిగి ॥ **కాదంటావా** ॥

2. అండ పిండాండ బ్రహ్మాండంబు నంతటా । నిండి పరిపూర్ణమై ।
దండిగా ఉన్నాది ॥ **కాదంటావా** ॥

3. ఆత్మనాత్మలుగాక । స్తోత్రమన్నదిలేక । నేత్రమధ్యన వెలిగె ।
సూత్రాతీతం స్థిరం ॥ **కాదంటావా** ॥

4. క్షరమక్షరంబులా । సరళి షోడశియెరుకా ।
గురుకృపచేదీయు । పరము అనంతాము ॥ **కాదంటావా** ॥

5. బట్టబయలులో । యరుకా పుట్టానేలే । దానిగుట్టుదెలియముల్లు ।
పెట్టసందులేంది ॥ **కాదంటావా** ॥

6. వాదబేధములేని । వారిచె యెరుకాదిలే దాని । తెలిసితే
ద్వాదశి అచలాము ॥ **కాదంటావా** ॥

7. మతములు పార్టీలు మితము ఏర్పరుచుకా । గతిగానలేకాను ।
మతిజడి సత్యాము ॥ **కాదంటావా** ॥

8. ధరలో నేండ్రగంటి వరహన్నమ్మయార్యుల కరుణ వడసిన ।
ఆకవరవు రామయ్యమాట ॥ **కాదంటావా** ॥

## "జై బోలో సద్గురు ప్రభు మహారాజుకి జై "

## తత్వము – 13.

1. **కల్లగాదు నిజము నిజమురా । సద్గురుని కరుణా మళ్ళీ జన్మ బాధలేదురా ।**
కల్లగాదు గురుని కరుణ । వల్లదన్ను తెలుసుకొన్నా । మళ్ళీ జన్మ బాధ
సున్నా । మహిమగన్నవారలకు ॥ **కల్లగాదు నిజము నిజమురా** ॥

2. అందరాని చట్టు పండురా । సద్గురుని కరుణ । అందరికి దొరకబోదురా ।
ఇందిరముల రాశిలోన । చందమామ పెలగుచుండు । ముందు మూడు
కళలు గడచి । ముక్తిగన్న వారలకును ॥ **కల్లగాదు నిజము నిజమురా** ॥

3. మట్టితనువు నాటకంబురా । సద్గురుని కరుణ పట్టిదాయే బూటకంబురా ।
ముట్టు గలిసిన సట్టిలోన । గుట్టు తెలిపె గురునికృపచే । బట్టబల్లైన ఆ పర
బ్రహ్మగన్నవారలాకు ॥ **కల్లగాదు నిజము నిజమురా** ॥

4. ఐదు అక్షరముల చదువురా । సద్గురుని కరుణా । ఐదు ఐదు ఇరుపైదురా ।
ఐదు అండ పిండ బ్రహ్మాండమైన విధము సెరగి । ఐదు గడచి ఆర్గురుని ఖైదు
చేయువారులాకు ॥ **కల్లగాదు నిజము నిజమురా** ॥

5. ఇమ్మహీలో గురుని పాదమురా । సద్గురుని కరుణ । నమ్మియున్న
సుబ్రహ్మణ్యామురా । నన్ను నిన్నుగన్నదెరుక । వున్నదచల మనుచు సెరగి ।

సున్నజేసి యెరకనిపుడు । సూక్ష్మరహితమైన బయలు ॥ కల్లగాదు నిజము నిజమురా ॥

"జై బోలో సద్గురు ప్రభు మహారాజుకి జై "

## తత్వము – 14.

1. తత్వములు చదువగానే ధన్యులైనారా । మీ తామసాది గుణములెల్లా తరిమివేశేరా ॥ తత్వ ॥

2. భజనలు బహు చేయగానే భక్తులైనారా । మీ బండ గుణములెల్లా చెండివేశేరా ॥ తత్వ ॥

3. నామములు దిద్దగానే స్వాములైనారా । మీ కామక్రోధ గుణములన్ని కాల్చివేశేరా ॥ తత్వ ॥

4. జడలు గడ్డాలు పెంచగానే జ్ఞానులైనారా । మీ జార చోర గుణములెల్లా చంపివేశేరా ॥ తత్వ ॥

5. వ్రతములు బహు చేయగానే గతులుగన్నారా । మీరు పతిత పావనమైన నిత్యపదముగన్నారా ॥ తత్వ ॥

6. యాత్రలు బహు చేయగానే పవిత్రులైనారా । గొప్ప సూత్రమును కన్నులారా చూచివున్నారా ॥ తత్వ ॥

7. మప్పుగా వీభూతిపూసి అప్పలైనారా । మీ తప్పులన్ని సాక్షితోడ ఒప్పుకొన్నారా ॥ తత్వ ॥

8. పూజలు బహు చేయగానే పుణ్యులైనారా । మీరు పూజజేసి గురుని

మహిమా దెలసిగొన్నారా ॥ తత్వ ॥

9. వేదములు చదువుగానే సాధులైనారా । మీరు సాధనంబులు లేని నిజగురు బోధగన్నారా ॥ తత్వ ॥

10. ముద్రలు సాధించగానే ముక్తిగన్నారా । మీరు భద్రమైన బయలు దెలసి పలక కున్నారా ॥ తత్వ ॥

11. వేషములు వేయగానే వేత్తలైనారా । మీ ఆశాపాశ బంధములను కోశివేశారా ॥ తత్వ ॥

12. కల్లు సారాయి భంగి త్రాగి భంగపడుతారా । మీరు సారమైనదాన్ని త్రాగి వళ్ళుమరిచారా ॥ తత్వ ॥

13. కోరి కోరి పేరుకొరకు గురువులైనారా । గొప్పవారివద్ద చిలుక పలుకుల వదులుకొన్నారా ॥ తత్వ ॥

14. హనుమనార్యుడు వ్రాసినాడని అలిగిపోతారా । మీరు ఘనుల చేరి నిజము తెలిసి కలుసుకుంటారా ॥ తత్వ ॥

"జై బోలో సద్గురు ప్రభు మహారాజుకి జై "

************

ఓం

"శ్రీ గురుభ్యో నమః"

# భ్రాంతిరహిత శ్లోకములు

మరియు

# మనకుకావలసిన అమృత వాక్యములు

1. శ్లో ॥ యావత్కాలం భవేత్కర్మ । తావత్తిష్ఠంతి జంతవః ।
తస్మిన్ క్షీణే వినశ్యంతి । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> :- ఎంతవరకు కర్మముండునో, అంతవరకూ జీవజంతువులు బ్రతికియుందురు. కర్మము నశించిన వెంటనే, శరీరము నశించును. అది సహజముగానుండగా మనమేల దుఃఖించ వలయును !

2. శ్లో ॥ ప్రాప్త యామీవమేళనం । తు కర్మణై కత్ర్ర దేహినః ।
కర్మక్షయే వియుజ్యంతే । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> : - కర్మమువల్లనే జీవులు తల్లిగర్భమున భూమిలో బుట్టుచు. భార్య బిడ్డలు మొదలగు సంసారముతో గూడియుందురు. కర్మము క్షీణింపగనే వారు వారు వేరుగా పోదురు. కాబట్టి మనమేల దుఃఖించవలయును !

3. శ్లో ॥ ఋణానుబంధ రూపేణ । పశుపత్ని సుతాలయః ।
ఋణ క్షయే క్షయాయంతి । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> :- ఋణమువల్లనే మనకు పెండ్లాము; బిడ్డలు; గృహము; గోవులు; మొదలైనవి గలుగుచుండును. ఆ ఋణము తీరిన తక్షణమే వారు వారు చెప్పక వేరుగా విడిచిపెట్టి పోదురు. కాబట్టి మనమేల దుఃఖింపవలయును !

4. శ్లో ॥ పక్వాని తరుపర్ణాని । పతంతిక్రమ శోయథా ।
తద్దైవ జంతువః । కాలే కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> : – ఆయాకాలములందు చెట్లయందలి పండ్లు, కాయలు, పూవులు, ఆకులు – ఎట్లు పడిపోవుచున్నావో – అట్లనే కాలము సమీపించినంతనే, జంతువులు మరణించును. కాబట్టి మనమేల దుఃఖించ వలయును !

5. శ్లో ॥ ఇదం కాష్ఠమిదం కాష్ఠం । నద్యాం వహతి సంగమంః ।
సంయోగాశ్చ వియోగశ్చ । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> : – ఒక నది ప్రవాహమై పారుచుండుగా, ఎట్లు ఒక దేశము నందుండు చెట్లను కట్టెలూను కొట్టుకొనివచ్చి – మరియొక దేశమునందుండు చెట్లతో కట్టెలతో చేర్చుచున్నదో, అట్లనే కర్మము – ఒక చోటనుండువారిని మరియొక చోట నుండువారితో సంబంధము చేయించును. ఇది సహజముగాన – అందుకు మనమేల దుఃఖించవలయును !

6. శ్లో ॥ యేక వృక్ష సమారూఢాః । నానా జాతి విహంగమా ।
ప్రభాతే విదిశోయాంతి । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> : – రాత్రి కాలమునందు ఒక చెట్టుమీద అనేక పక్షులు గుంపులు గుంపులుగా చేరుచూ – మరల తెల్లవారగానే, ఆ చెట్టువిడచి అవన్నియూ నానా దిక్కులకు పోవుచుండునట్లు – కర్మవశమున జీవులు ఒక్కటిగాగూడి సంసారముచేయుచుందురు. కర్మము క్షీణించినంతనే వారు చెప్పకనే పారి పోదురు కాబట్టి – మనమేల దుఃఖించ వలయును !

7. శ్లో ॥ మృణ్మయానిచ భాండాని । బహూని వివిధానిచ ।
భిన్న భాండ పరిత్యజ్య । కాతత్రా పరివేదనా ॥

<u>తాత్పర్యము</u> : – మట్టికుండలు తీసుకోని పోవునప్పుడు, ఒకటి జారి క్రింద పడితె – ఆ మంటి పెంకులను పారవేయునట్లు – ఈ జీవుడు వెళ్ళిపోయిన తర్వాత – ఈ

దేహమును దహించుతురు. ఇది ఎల్లవారికి సహజము – అందుకు మనమేల దుఃఖించ వలయును !

## భ్రాంతి రహిత శ్లోకములు

1. శ్లో ॥ భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమేణోపాసకాజనాః ।
భ్రమేణేశ్వర భావత్వం । భ్రమమూలమిదం జగత్ ॥

<u>తాత్పర్యము</u> : – భ్రమచేతనే నేనును–నీవును; భ్రాంతి చేతనే – ఈశ్వరోపాసన జేయునట్టి జనులునూ; భ్రాంతిచేతనే ఈశ్వర భావమునూ గలుగుచున్నది. ఈ జగత్తు భ్రాంతి చేతనేయున్నట్లు దోచుచున్నదేగాని – నిజముగా లేనేలేదు.

2. శ్లో ॥ త్యజ ధర్మమధర్మంచ । ఉభేసత్యానృతే త్యజవుభౌ ।
సత్యానృతే త్యక్త్వా । ఏనత్యజసి తత్యజః ॥

<u>తాత్పర్యము</u> : – ధర్మాధర్మములనూ; సత్యాసత్యములను విడువుము. ఇది ధర్మమని ఇది అధర్మమని; ఇది సత్యమని; ఇది అసత్యమని – దేనిచేత తెలుసుకొన్నావో, మరియు విడచుచున్నావో – అట్టి యెరుకనూగూడ విడువుము.

3. శ్లో ॥ గురుణావరణ త్యాగః । అనావరణముత్తమం ।
పరిపూర్ణం పూర్ణమేవ । పూర్ణాచల సముద్రవత్ ॥

<u>తాత్పర్యము</u> : – నరుడు సద్గురునికృపచేత దేహేంద్రియాది సమస్త వృత్తులను గలిగియుండిన ప్రకృతి పురుషులనెడి, శరీర – ఆత్మలను దీసివేయబడినవాడై; పరిపూర్ణమునూ – శ్రేష్ఠమునూ; ఆవరణరహితమైన అచలపరిపూర్ణుడై చలనములేని మహాసముద్రమువలె (విస్తారముగా సముద్రమువలే) అఖండ స్వరూపమేయగుచున్నాడు.

4. శ్లో ॥ అబీజం వృక్ష సంపన్నం । శాఖాపల్లవ వర్జితః ।

పుష్పం నాస్తి ఫలం నాస్తి । సంపూర్ణ వృక్షవర్జితః ॥

<u>**తాత్పర్యము**</u> : – అవ్యక్తమూ; మహత్తు; అహంకారము; పృథ్వి; ఆపః ; తేజస్సు; వాయువు; ఆకాశము ఈ ఎనిమిది విధములైన మహాప్రకృతియే, బ్రహ్మాదిస్తంభ పర్యంతముగానుండడు సమస్త ఆకారాములాయెను. ఈ ఆకారముల నడు బీజరహితమైన వృక్ష సమృద్ధి; కొమ్మలు; చిగురు; పుష్పము; ఫలములులేనిదై శరీరమాత్మలనెడు వృక్ష ములేనిదైయుండినను భ్రాంతివలన వున్నట్లు తోచుచుండును. వున్నది "**పరిపూర్ణ అచల పరబ్రహ్మమే**" – ఇది తప్ప ఏమియును లేదు.

5. శ్లో ॥ సర్వశూన్యం మయారూపం । జన్మశూన్యం స్వభావతః ।
జన్మాభావే నమృత్యశ్చ । పరిపూర్ణం స్వభావతః ॥

<u>**తాత్పర్యము**</u> : – అచల పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క స్వరూపము – ఆకాశాది సమస్తవస్తువులులేక సర్వశూన్యమైనదియు. సహజముగా జన్మము లేనిదియు; జనన మరణములులేని స్వభావముతో, సర్వత్రానిండిన అచల పరిపూర్ణ పరబ్రహ్మమేయున్నది.

6. శ్లో ॥ జన్మాభావే కర్మం నాస్తి । కర్మాభావే ఫలం నహి ।
ఫలాభావే భయం కుత్ర । భయా భావేన సంశయః ॥

<u>**తాత్పర్యము**</u> : – జన్మము లేనిచో కర్మములేదు. కర్మలేనప్పుడు కర్మఫలమున్ను వుండజాలదు. కర్మఫలములేనప్పుడు భయమెందుకుయుండును. యెట్టి భయమూ లేనప్పుడు అభయ స్వరూపము – అసంశయముసైన పరిపూర్ణ పరబ్రహ్మమే స్వతః సిద్ధము.

7. శ్లో ॥ ఇంద్రజాలమిదం సర్వం । యధామరు మరీచికా ।
అఖండితమనాకారం । వర్తతే కేవలం శివం ॥

**తాత్పర్యము** : – ఇంద్రజాలక మాయామయమైన – ఈ దృశ్యరూప సమస్త ప్రపంచమూ – మరుభూమియందుదోచును. యెండమావులవలనే తోచుచున్నది. పరిపూర్ణమూ; నిరాకారమూ; మంగళస్వరూపమూయగు అద్వితీయమైన అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే తోచుచున్నది.

8. శ్లో ॥ శుద్ధే సుషుప్తావివచ । తస్మిన్నాహం కదాచన ।
తద్వత్సదాపి యస్యాస్తి । ప్రపంచం నాస్తి తస్యవై ॥

**తాత్పర్యము** : – నిర్మలమైన అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు – సుషుప్త్యాది అవస్థలయందుండెడు నేను – ఎప్పుడునూ లేనే లేదని, ఎవడు తెలుసుకొనుచున్నాడో – అట్టి పుణ్యపురుషునకు యీ చూడబడే ప్రపంచము నిజముగా లేదనిభావము.

9. శ్లో ॥ యథా నాహం తథా శుద్ధం । తస్మాత్ శుద్ధేన నిర్ణయః ।
జగదస్తీతి కోవేద । నాస్తికోనచ నిర్ణయః ॥

**తాత్పర్యము** : – నేను నేననే అహంకారుడు, ఏ ప్రకారముగా నున్నాడో – అదే ప్రకారముగా యుండునేగాని అచల పరిపూర్ణ పరబ్రహ్మమెన్నటికిని కాజాలడు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము యిట్టిదని నిర్ణయించుటకు ఎవరికినీ సాధ్యముగాదు. ప్రపంచము లేనే లేదని ఎవడు తెలుసుకొనుచున్నాడో – అట్టియచలస్వరూపుని నిర్ణయించుటకు అలవిగాదు.

10. శ్లో ॥ ఆత్మాతీతం కేవలాత్మ । దేహా నాస్తి కదాచనా ।
అస్తి నాస్తీతి కోవేద । నిర్ణయో నాస్తి సర్వదా ॥

**తాత్పర్యము** : – అజరము అమరమూనగు అచల పరిపూర్ణ పరబ్రహ్మము ప్రకృతిద్వయముగల బ్రహ్మముకు అతీతమైనది – అట్టి కేవలాత్మకు శరీరాత్మలు లేనేలేదని – ఎవడు తెలుసుకొనునో – అట్టి అచల స్వరూపునకు ఏర్పాటులు లేదని భావము. రాక పోకలు లేవు అని తెలియవలయును.

11. శ్లో ॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం । బుద్ధేచలన కారణం ।
ఉపదేశార్థతే బుద్ధ్వా । రమతే సర్వకర్మసు ॥

తాత్పర్యము : – శాస్త్రజ్ఞానము మిగుల దుఃఖములకు హేతువుగానూ – బుద్ధిచాంచల్యమునకు కారణముగానున్నది గనుక గురూపదేశమువలన బుద్ధి సమస్త కర్మములందునూ కర్తృత్వ రహిత బుద్ధిచే ఆచరింపవలయును.

12. శ్లో ॥ ఉల్కాహస్తోయథా కచ్చిద్ర । వ్యమాలోక్యతాం త్యజేత్ ।
జ్ఞానేనజ్ఞేయమాలో । క్యపచ్చాత్ జ్ఞానం పరిత్యజేత్ ॥

తాత్పర్యము : – ఒకానొకమనుజుడు హస్తమునందు దీపమును పట్టుకొని – తాను గోరిన వస్తువును పెదకి కనుగొనిన తర్వాత – ఆ దీపమును ఎటు విడు చుచున్నాడో – అటులనే జ్ఞానమను యెరుకచేత జ్ఞేయమగు అచల పరిపూర్ణ పరబ్రహ్మమునుగాంచి, అనంతరము జ్ఞానమను – యెరుకను విడువవలయును.

13. శ్లో ॥ జ్ఞానమజ్ఞానినం దృష్ట్వా । ద్వయోస్త్య జతి నిశ్చయం ।
ద్వయోస్త్య జతియత్ జ్ఞానం । తత్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥

తాత్పర్యము : – జ్ఞానము అజ్ఞానముగలవానిని జూచి, జ్ఞానమునందలి నిజమును విడచుచున్నది. జ్ఞానాజ్ఞానములనెడు ద్వంద్వ పదములన్నియూ అబద్ధములని " ఏ జ్ఞానము తెలుసుకొనుచున్నదో – అట్టి సుజ్ఞానమును కూడ విడిచి పెట్టవలయును".

14. శ్లో ॥ విద్యాంతం బ్రహ్మవిద్యాంతం । వార్తికాంతమగోచరం ।
పూర్ణబోధ ప్రవక్ష్యామి । శ్రుణు శిష్య మహాత్మమం ॥

**తాత్పర్యము** : – వేదములవల్లనూ; వేదాంతమువల్లనూ; వార్తికమువల్లనూ – పరిపూర్ణ పరబ్రహ్మము అగోచరముగా నుండను. సద్గురుని కృపచేత పూర్ణబోధపడసిన శిష్యునకు, "పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షమగును – ఇదియే మహోత్తమమైన మార్గము."

**శు॥ గురోపదేశానంతరం** – నమోహం । నదేహం । నహారంభణం । నతూష్ణీభావం । నకర్తవ్యం । నభోక్తవ్యం । నశ్రవణాపేక్ష । నమననాపేక్ష । నధ్యానాపేక్ష । నసమాధిః । సర్వకాల సర్వావస్థేషు జ్ఞానం నాస్తి । పంచభూతాధికం నాస్తి । ప్రజ్ఞానం బ్రహ్మ నాస్తి । అయమేవ నిశ్శబ్ద సమాధి వాచ్యవాచకాయా నాస్తి । నాస్తిజ్ఞానం సదానహి । తదేవ సిద్ధ్యత్వం విద్ధి ఇదమహం నాస్తి । నిరుపాధిక ఆదిమధ్యాంతరహిత పర శివోతిష్ఠతి । అస్మిన్నర్థేన సందేహో నభవః ॥

శ్లో ॥ ఫకారో ఫలజ్ఞానస్య । లకారోలయముచ్యతే ।
విద్యావిద్య ద్వయం నాస్తి । తదేవ పరమం ఫలం ॥

## మనకు కావలసిన అమృత వాక్యములు

శ్లో ॥ గురుం పరాత్పరంధేయం । నిత్యమానంద కారకం ।
హృదయాకాశ మద్ధ్యస్థం । శుద్ధస్ఫటిక సన్నిభం ॥

సుగుణమునాత్మలోపలను సన్నుతిజేయక । భక్తినిల్చునే జగమున । నిట్టివారలకు సజ్జన సంగతిగానక నిల్చునే సగుణము । మీది మానసము సంతత చింతయొనర్చ కున్న । న్యాయగణితమైన మోక్షపద మందగనేగతివచ్చు వేమనా ॥

జీవిలోనుండు సిద్ధునిగానక । తిరుగన స్థిరంబు ।
వరుసనమ్మి స్థిరమునస్థిరమును । దెలియజీవికి ముక్తి ॥ విశ్వ ॥

పుట్టుపూర్వము శివుని గుట్టుదెల్పెదనంటే తల్లిదండ్రులెవ్వరో తెలియరాదు । కులగోత్రములు రెండు గురుతెకగెదనంటె, ఏ జాతివాడొట యెరుగరాదు । యిందెందుగలడో నేనెందుపెదకెదంటె అందుగలడిందు లేడనగరాదు । గట్టిగాచెంగున గట్టిపేసెదనంటె పట్టుగానెవరికి పట్టరాదు । ఇంతవాడని మది నుతియింపరాదు । యతనిరూపెన్ననజునికి నలవిగాదు । వనిత నీపేగి శ్రీశైలవాసుడైన మల్లికార్జుని తేగదే మధురవాణి ॥

మతములెన్నియైన సతములైయుండవు । వున్నదొకటి మతము ।
జగములోన అన్నిమతము విడువ । నరయనొక్కడు లేడు ॥ విశ్వ ॥

జాతి మతము విడిచిచను యోగియే మేటి । జాతి తోడనున్న
నీతిలెస్స మతములన్ని । భావు మనుజుడొక్కడలేడు ॥ విశ్వ ॥

బూటకము పుట్టిచచ్చుట । భూమియందు నాటకంబగు బ్రతుకుల ।
సాణ్యములను చోటుగుర్తింప గురిజేసి । చూడవలెను మాటవిడరాక
పరతత్వమందు వేమా ॥

ఒక్కయింటిలోన పెక్కుకుండల నిల్పి । వన్నియలన్ని రూపులనలరుచుండు ।
అవియు దొలగెనేని । ఆ యిల్లు బయలౌను ॥ విశ్వ ॥

తానసెడివాడెవ్వడో తానెరుగలేక । మీదిమాట తలచుట తగునా ।
తానీయచలము లోపల । తానేలేకుండపోయి తప్పకగనుమా ॥

శ్లో ॥ నిరంజనం నిష్ప్రతిమం నిరీహం । నిరాశ్రయం నిష్కళం అప్రపంచం ।
నిత్యధ్రువం నిర్విషయ స్వరూపం । నిరంతరం రామమహం భజామి ॥

నిరతమాత్మ చిదానంద నిలయమందు । సరవితోడుత పరిపూర్ణ సౌఖ్యమెరిగి ।
యరిటియగు బయల్ దెలియుటేయనుభవంబు । విమలగుణ రాజయోగీంద్ర
వేమనార్య ॥

సర్వమత ధర్మమర్మముల్ నంతరించి । సకలయోగంబులను మించి ।
సమ్మతముగ బట్టబయలును । దెలియుటే బ్రహ్మవిద్య ॥ విశ్వ ॥

సాధన చతుష్టయంబుల సామ్యమెరిగి । వింతలన్నియు మదిలోన
విడిచినప్పుడే । మంతనంబగు గురుభక్తి మహిమయగును ॥ విశ్వ ॥

కేవలాత్మనెరుగని యర్థముల్ వ్యర్థముగను । చెప్పుచుందురు లోకుల
చెరచు కొరకు । నిజము నిష్ఠూరమాయే । కల్ల నిజములాయె ॥ విశ్వ ॥

గురువనగా పరమాత్ముడు । పరగంగా శిష్యుడనగ పటుజీవుడగున్ ।
గురుశిష్య జీవసంపద గురుతరముగ । గూర్చునతడె గురువగు వేమా ॥

సాధనంబు లేక సమకూడదెప్పుడు । బోధలేని విద్యపొందదెపుడు ।
పాదుకొల్పిమదిని । భావించి చూడరా ॥ విశ్వ ॥

అద్వైత భావమెరుగక । విద్వాంసులమనుచు । ఆత్మవేత్తలవలెనే
యద్వాతద్వాదము లాడుచు । సద్వర్తన మెరుగరన్న సంపంగిమన్న ॥

తుదిమొదలరుగక బ్రహ్మంబిదియని । యెరుగంగలేక । నేర్పడసభలన్
వదరుచు । తిరిగేకొయ్యల చదువులు । పసలెన్న సున్న సంపంగిమన్న ॥

ఆశవిడకగాని పాశముక్తుడుగాడు । ముక్తుడైనగాని మృతుడుగాడు ।
మృతము బడయకున్న । క్షితిమోహ మిడువడు ॥ విశ్వదాభిరామ
వినురవేమ ॥

ఆశయనెడి త్రాటి । కోసివేయగ లేక । మోహబుద్ధివలన మునిగినారు ।
కాశివాసులైన । గనబోరు మోక్షంబు ॥ విశ్వదాభిరామ వినురవేమ ॥

ఆశయే ఇహపర సుఖ వినాశము । భవబంధములకు నాధారంబై ।
రఃశునిగనుగొన జేయదు । ఆశవినాశంబే పరము అవనినివేమా ॥

శ్లో ॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం । బుద్ధేచలన కారణం ।
ఉపదేశార్థరే । బుద్ధ్యారమతే సర్వకర్మసు ॥

రతియునర్పబుాని సతినివీడినయట్లు । మతినివీడి పరమ మరుగుదలిసి ।
గతినిగోరడపుడు । ఘనపురుషుడిలలోన ॥ విశ్వదాభిరామ వినురవేమా ॥

వైరాగ్యంబు దృఢంబుజేసి । పరతత్వ జ్ఞానమార్జించి । సర్వారంభో పర మంబు గైకొని
తురీయంబొంది । ఈ రీతి యోగారూఢుండగు । వానికిం గల్గునే యాగామీయున్ ।
సంచిత ప్రారబ్ధంబులున్ సంతత । పరబ్రహ్మాత్ముడై యుండగాన్ ॥

శ్లో॥ మనోబుద్ధ్యహంకార చిత్తాదినాహం । నచ శ్రోత్ర జిహ్వేనచ ఘ్రాణ నేత్రం ।
నచవ్యోమ భూవిర్న తేజోన వాయుః । చిదానందరూపః శివోహం శివోహం ॥

శ్లో॥ నమృత్యుర్నశంకా నమేజాతిభేద । పితానైవ మేనైవ మాతాచ జన్మ నబంధు
నమిత్రం గురుర్నైవ । శిష్యా చిదానందరూపః । శివోహం శివోహం ॥

శ్లో ॥ నహి ప్రమాణం । జంతూనాముత్తరక్షణ జీవితం ।
చరమశ్వాస వేళాయాం । యత్కృతం తత్సదాకురు ॥

కం ॥ భ్రూమధ్య దేశమందున । నేమారక చూడ చూడ నిర్గుణమగు । నానేమము
మదిలోనుంచగ సామిప్యానంద మొదవు సరుగున వేమా ॥

తే ॥ భ్రాంతిచేతనుభృత్యులు భక్తివిడువ । భయదమౌ పుట్టుచావులు ప్రాప్తమయ్యె
నిట్టినరులకు కష్టంబులెట్లు తీరు ॥ విశ్వ ॥

వీరుడైన లేదు । విద్యనేర్చిన లేదు । చదువులందు లేదు । సకలాన లేదు

జన్మఫలమేగాని । జపియించినాలేదు ॥ విశ్వ ।

ఆదిసరుగలేని అల్పుండుతామరి । చెప్పలేడుగాని
తప్పు బట్టు త్రోయ సేర్చుకుక్క । దొంతులు బేర్చునా ॥ విశ్వ ॥

పృథ్వి కుదకమేగ । పృథ్వి పై మొలకెత్తె । మొలక పృథ్వికేగె
ముగుడె సుతుడు । ధరణి జనులకెల్ల । తల్లియే పెండ్లాము ॥ విశ్వ ॥

సూక్ష్మమరయనీకు సుఖతత్వభావంబు । పుట్టు చావులేని పురముదారి
మానసంబునంటి మరువక చూడరా ॥ విశ్వ ॥
అల్పుడెపుడుబల్కు ఆడంబరముగాను । సజ్జనుండు బల్కు చల్లగాను ।
కంచుమ్రోగునట్లు । కనకంబు మ్రోగునా ॥ విశ్వ ॥
యెరుక మరుపులందు ఏమేమి దోచినా । సరికి గురియుగాదు సత్యమునకు ।
పరమ నిర్గుణంబు పాటించిగనవలె ॥ విశ్వ ॥
హరిహరాదులకైన కేవలాత్మ । విద్యగురు కృపలేనిదే గురుతుపడదు ।
పరమ పరిపూర్ణభావంబు బయలుగాదె ॥

సి ॥ గురుపదాంభోజముల్ గొలువక కల్గునే । ప్రవిమల వైరాగ్య భాగ్యమహిమ ।
గురుపాదతీర్థంబుగ్రోలక । కల్గునే జ్ఞాన విజ్ఞాన యోగానుభవము ।
గురుసుప్రసాదంబు గొనకున్నగల్గునే । ప్రతిలేని చిత్తోపరతి సుఖంబు ।
గురుతత్వమాత్మ గన్గొనకున్న గల్గునే । నిరతిశయంబైన పరమ పదము ।
అట్లుగావున విద్యార్థియైన యోగి । వినయభయ భక్తులెదలోన బెనగొనంగ ।
నలచతుర్విధ శుశ్రూషలాచరించికొనుచు । ననిశంబు గురువును గొలుచుననగ ॥

<u>ఋభుమహరుషి తన ఋభుగీతలో త్రివిధ బ్రహ్మంబులని వ్రాసియున్నారు. ఆ త్రివిధ బ్రహ్మములనిన :</u>

1. సగుణ బ్రహ్మంబనియు.
2. నిర్గుణ బ్రహ్మంబనియు.
3. నిష్ప్రతియోగిక బ్రహ్మంబనియు త్రివిధము.

1. <u>సగుణ బ్రహ్మంబు</u> : – సగుణ బ్రహ్మంటె ఎంతవరకనిన తురీయమునందు ఆత్మ సాక్షాత్కార మగువరకు. దీనినే సగుణ బ్రహ్మమనెదరు.

2. <u>నిర్గుణ బ్రహ్మంబు</u> :– నిర్గుణ బ్రహ్మంబు సహితరహితములు; సంగాసంగముల్; తురీయా తురియాతీతములు.

3. <u>నిష్ప్రతియౌగిక బ్రహ్మంబు</u> :– సగుణనిర్గుణములు మొదలగు ద్వంద్వ ములకు అతీతము. ఇదియే నిష్ప్రతియౌగిక బ్రహ్మము. దీనిని యెరిగి యెరుకను రహితపరచు కొన్నవాడె అశరీరుడు.

శ్లో ॥ సాకారంచ నిరాకారం । నిర్గుణంచ గుణాత్మకం ।
తత్వం తత్పరమం బ్రహ్మ । ఇతి వేదాంత డిండిమః ॥

శ్లో ॥ అవిద్యోపాధికో జీవో । మాయోపాధి ఈశ్వరః ।
మాయా విద్యా గుణాతీతో । ఇతి వేదాంత డిండిమః ॥

నరజన్మమెత్తినందుకు । గురుసేవను భక్తిమించి । తొందరపడకన్
స్థిరమార్గంబూని బుద్దిని । పరితుష్టిని బొందువాడే । భక్తుండిలలోన్ ॥

ధార్మికునకుగాని ధర్మంబుగనరాదు । కర్మజీవికెట్లుగాన బడును ।
నీరుచొరక లోతు । నిజముగా దెలియదు ॥ విశ్వధాభిరామ వినురవేమ ॥

శ్లో ॥ దుర్లభో విషయ త్యాగో । దుర్లభో తత్వదర్శినః ।
దుర్లభో సహజావస్థ । సద్గురో కరుణాం వినః ॥
శ్లో ॥ అనంత జన్మ సంప్రాప్తే । కర్మబంధ విదాహినే ।
జ్ఞానానల ప్రభావేన । తస్మైశ్రీ గురువే నమః ॥

అచ్చపు చీకటింబడి । గృహవ్రతుల్తై విషయ ప్రమత్తుల్తై । చచ్చుచు పుట్టుచున్ ।

మరలజర్విత చర్వణులైనవారికిన్ । జచ్చెరబుట్టునే పరులు చెప్పిన నైన । నిజేచ్ఛ నైన నేమిచ్చిననైన గానలకు । నేగిననైన హరి ప్రబోధముల్ ॥

పచ్చిచర్మపు తిత్తి । పసలేదు దేహంబు లోపలనంతట రోయ రోత । నరము శల్యములు నవరంధ్రములు । రక్తమాంస ఖండంబులు మైలతిత్తి । బలుపైన యెండవానల కోర్వదెంతైన । తాళలేదాకలి దాహములకు । సకలరోగముల సంప్రాప్తమై యుండు । నిలువదస్థిరమైన నీటిబుగ్గ । బొందిలోనుండి ప్రాణముల్ పోయినవెనుక । కాటికేగాని కొరగాదు గుడ్డిగవ్వకైన । భూషణవికాస శ్రీ ధర్మపురనివాస । దుష్టసంహార నరసింహదురిత దూర ॥

దేహమున్నదినాలు మోహసాగరమందు । మునుగుచుందురు శుద్ధమూఢజనులు । సలలితైశ్వర్యములు శాశ్వతంబనుకోని । గురుని కారుణ్యంబు గోరుకొనరు । సర్వకాలము మాయ సంసారబద్ధులై । అరిషడ్వర్గంబులు మానలేరు । జ్ఞాన భక్తి విరక్తులైన పెద్దలను జూచి । నిందజేయక పోతె నిలువలేరు మత్తులైనట్టి దుర్జాతిమనుజులంత । యుగములు గడచిన గురుకృపబడయలేరు । ॥ భూషణవికాస శ్రీ ధర్మపురనివాస । దుష్టసంహార నరసింహదురిత దూర ॥

కాయమెంత భయాన కాపాడినాగాని । ధాత్రిలో నదిజూడ దక్కబోదు । ఏ వేళనే రోగమావరించునో । సత్వమొందగ జేయునే చందమునను । ఔషధంబులు మంచి వనుభవంచినగాని । కర్మక్షీణం బైతేగాని విడదు । కోటి వైద్యులు గుంపుగూడి । వచ్చినగాని మరణమయ్యేడి వ్యాధి మాన్పలేరు । జీవునికి పయన కాలము సిద్ధ మైతె । నిలచునా దేహమిందొక్క నిమిషమైన । భూషణవికాస శ్రీ ధర్మపురనివాస । దుష్టసంహార నరసింహదురిత దూర ॥

కం ॥ తనలో సర్వంబుండగ । తనలోపల వెదకలేక । ధరలో వెదకే తనువును । మోసెడి ఎద్దుల మనమున । దెలుపంగవశమే మహిలో వేమా ॥

పెన్నచేతబట్టి వివరంబుదెలియక । ఘృతము నడిగినట్టి యతనిభంగి । తాను దైవమయ్యు । దైవంబుదలచురా ॥ విశ్వ ॥

కం ॥ తనుదా దెలియగసేర్చిన । ఘనయోగీశ్వరుల చరణ కమలంబులకున్ ।
మునికొని మొక్కగసేర్చిన । జనవర్యుడు పూజ్యుడగును జగతిజూడన్ ॥
శ్రీయొప్పు నీసుబోధము । గాయకమగు దేశభాష మాటలచేతన్ ।
రోయక చదివినవారికి । బాయక దర్పణము రీతి ప్రత్యయమబ్బున్ ॥

## పరిపూర్ణ బోధకు నాల్గు దీక్షలుగలవు – అవియేవనగా :

1. నిశ్చల సమయ దీక్ష.
2. నిరామయ నిర్వాణ దీక్ష.
3. అద్వయామల దీక్ష.
4. నిరంజన తూష్ణి భూత పరిపూర్ణ దీక్ష.

శ్లో ॥ అగ్నిదగ్ధం యదాబీజం । శాఖపల్లవ వర్జితం ।
జ్ఞానదగ్ధం తదాయోగి । పునర్జన్మ నవిద్యతే ॥

కం ॥ పరతత్వమందిన మరుజన్మము రాదుగాన । మనుజుల కల్లన్ గురుచరణ కమల సేవయే । దురిత హరణంబైన దారి దొరికేదె యరుదూ । దుర్మదులలో బరిగితె నిలదూ । యురమున గురిగను యుపము సెమ్మది నిలిపి । స్థిరబుద్ధి సమకొల్పి సేవింపదొరికేను । పరమ నిర్గుణ భావుడై । పట్టిజూపును యరుకదోలును ।కరణముల ఖండించి సెమ్మది పరబ్రహ్మంబసెడి గోప్యము । దొరికేదే యరుదూ ॥ దుర్మదులలో బరిగితె నిలదూ ॥

కం ॥ వినవలె పెద్దల మాటలు । వినసేరక పెతలుజెంది వినశ్యాత్మకుడై । పెనుపెంట దిరుగుచుండెడి మనుజునకీ బోధజెప్ప తగదు మాయయ్యా ॥ దుర్బుద్ధికి పెగటగునయ్యా ॥

అగచాట్లసెంచాక నవృతములాడుచు । నిగురోత్తగోరునునీలు పర్యంతాము । జగతిలోనగు పుట్టుచావుల జాడలెరుగని మూర్ఖచిత్తుడు । తగరుసామ్యము సంభ్రమించచు దగలుకొను । ధీవివశునకునిది తగదూ మాయయ్యా ॥ దుర్బుద్ధి పెగటగునయ్యా ॥

మరణము దాపగుచున్నది । పురచింతలు మానుమింక । పూర్తిగమది సుస్థిర బుద్ధిని గీలంచిన స్మరణమే । సర్వోత్తమంబు సలుపూము జీవా । ఇది దెలియ కున్న వున్నాదే త్రోవా ॥

గురునామ కీర్తన గావించి । భయంబుదక్కి ఖట్వాంగధరిత్రీవిభుడు । సూరి గొనియను కైవల్యముదొల్లి రెండు ఘడియలు లోనన్ ॥

ఆ ॥ తానుబుట్టు చోటు తాజూచి పలికినా । తానుబుద్ధి తిరుగు జగతిలోన । తాను పుట్టు చోటు తత్వంబు తలపోయ ॥ విశ్వ ॥

అచల పరిపూర్ణమనగ అనుభవగమ్యంబు । చెప్పి చూపగరాదు సూక్ష్మమదియే । మదికి థోచుగాని మర్మమెన్నగరాదు ॥ విశ్వ ॥

ఎట్టివానికైన పుట్టును మోహంబు । పుట్టు మోహమెల్ల పూనిద్రోక్కి । గట్టుజేసి జూడ గనిపించు బ్రహ్మంబు ॥ విశ్వ ॥

మాయలోనే పుట్టి । మాయలోనే పెరిగి । మాయదెలియ లేని మనుజుడేల । మాయదెలియునతడే । మహిలోనదేవుండు ॥ విశ్వ ॥

సర్వధర్మమర్మంబులెల్లను సన్యసించి । బ్రహ్మభావంబు మదినెంచి భ్రాంతడించి యున్నభక్తుండు ముక్తుండు । యుర్విలోనయోగ మాధుర్య రాఘవయోగివర్యా ॥

సర్వధర్మమర్మముల్ సంతరించి । సకలయోగంబులను మించి । సమ్మతముగ బట్టబయలును దెలియుటే బ్రహ్మవిద్య ॥ విశ్వ ॥

ఆ ॥ తనయులు పరివార తగుతంత్రములెరింగి । పరగకానివాని పారద్రోలి । హితవరులనుజేరి । ఇల్లు నిల్పినవాడు ముక్తికాంతకతడు మొగుడు వేమ ॥

ఆత్మయందెప్పుడును బుద్ధియంటియున్న । సుస్థిర ప్రజ్ఞులకు దాని సుఖము దెలియు । అన్యులెరు గంగజాలరీయచలవిద్య । యోగమాధుర్య రాఘవ యోగివర్యా ॥

వంధ్యలకు పుత్రులుండరు । వసుధయందు గగనమందున । పుష్పంబు గనుటలేదు । తెలియు వీరీతి విశ్వంబు ధృవముగాదు । యోగ మాధుర్య రాఘవ యోగివర్యా ॥

గీ ॥ నిత్య శుద్ధ నిరామయ నిర్వికల్ప । మజమనామయవమృతం బటంచుసెరిగి । తన్నుభజియింపుచుండును తత్వవేత్త । యోగమాధుర్య రాఘవయోగివర్యా ॥

నిర్మలంబైన కేవలాత్మనిజమెరింగి । ధ్యానమునరించు చుండును ధన్యుడరయ । నట్టివానికి మరుజన్మమవనిలేదు । యోగమాధుర్య రాఘవయోగివర్యా ॥

చిన్నది యలప్ప్రియంబున గన్నది పతిలేక । సుతునికడు విచిత్రముగా సెన్నడు । రతి కేళెరుగదు చన్నియ్యక జగతి పెంచె చూడర వేమా ॥

చిత్ర మంత్ర మహిమ సిద్ధికి । చిన్నది పూర్వము సుతునిగసెను భూమియందు । తండ్రిలేని సుతుడు ధాత్రిని సేలెరా ॥ విశ్వ ॥

కం ॥ పులిపాలు దెచ్చియిచ్చిన నలవడగా । గుండెగోసి యరచేయిడినన్ । తలపొడుగు ధనము బోసిన । వెలయాలికి కూర్మిలేదు వినరా సుమతీ ॥

కం ॥ వెలయాలు చేయు బాసలు వెలయగ మగనాలిపొందు । వెలమలచెలిమిన్ కలలోన కన్నట్టి కలిమియు । విలసితముగ నమ్మరాదు వినరా సుమతీ ॥

## వివేకచూడామణి

శ్లో ॥ **తపోభి క్షీణపాపానాం । శాంతానాం వీతరాగిణాం ।**
**ముముక్షూణ మపేక్ష్యోయ । మాత్మబోధో విధీయతే ॥**

**తాత్పర్యము** : – తపస్సు పూజాధ్యానాదులనుండి పాపములను । పోగొట్టుకొని సహనము గలిగియుండి । శాంతుడై రాగద్వేషరహితుడై । నిరాసక్తుడై కేవల మోక్షాపేక్షయున్నవారికి । ఈ ఆత్మ బోధను చెప్పుచున్నానని శ్రీ శంకరాచార్యులవారనిరి ॥

శ్లో ॥ ఇదంతే న తపస్కాయ । న భక్తాయ కదాచన ।
నచ శుశ్రూషవే వాచ్యం నచ । మాంయోభ్యసూయతి ॥

**తాత్పర్యము** : – ఈ గీతా రహస్యమును తపస్సు చేయనివానికి, భక్తిలేని వానికి, శ్రద్ధలేనివానికి, నాయందు అసూయ గలవానికి – ఉపదేశము చేయరాదు (ఉపదేశింపతగినది కాదు).

పరమ వైరాగ్య యోగమే ప్రముదితంబు, పరమ నిర్గుణ ధ్యానమే
బట్టబయలుయాత్మ పరతత్వ – సంధాన మనుభవంబు యోగ
మాధుర్య రాఘవ యోగివర్యా ॥

"జై బోలో సద్గురు ప్రభు మహారాజుకి జై "

* * * * * * * * * * * *

## పుట్టినటువంటి యెరుక గిట్టునా గిట్టదా! యెరుకనగానేమి? యెరుకను విమర్శించవలెను అలాగే విమర్శించుమా.

1. ప్రశ్న : ఓ యెరుకా! నీకు నివాసమెక్కడ ?
   ఉ : **"బయులు"**

2. ప్రశ్న : నీకు తల్లి ఎవరు ?
   ఉ : నా తల్లి దేహమనుకున్నాను.

3. ప్రశ్న : నీకు తండ్రి ఎవరు ?
   ఉ : తండ్రి కూడ దేహమేననుకున్నాను.

4. ప్రశ్న : అనుకోవడమేకాని, నీకు బాగా తెలియదా ?
   ఉ : తెలియదు.

5. ప్రశ్న : నీకు చుట్టాలు ఎవరు?
   ఉ : కలలో పుట్టినవారు చుట్టాలు.

6. ప్రశ్న : నీకు భార్య ఎవరు ?
   ఉ : కలలో శరీరము భార్య కావలెను.

7. ప్రశ్న : నీకు సంతానమెంతమంది గలరు ?
   ఉ : కలలో అనేకులు పుట్టినారు.

8. ప్రశ్న : అందరు బాగా వున్నారా ?
ఉ : అందురు అప్పుడే నశించినారు.

9. ప్రశ్న : ఒకరైనా లేరా?
ఉ : ఒక్కరైనా నిలచినవారు కారు.

10. ప్రశ్న : నీకు యింటి మొదలు యేమీలేదా?
ఉ : యేమి లేదు.

11. ప్రశ్న : ఎవరినైనా పెంచుకున్నావా?
ఉ : నేనెవరిని పెంచుకొనలేదు.

**12.** ప్రశ్న : నీకు ఎన్ని సంవత్సరములు?
ఉ : ఎన్ని సంవత్సరములు అయినది యెరుగను. నా మూలము నాకు తెలియదు.

13. ప్రశ్న : నీ వియ్యాలవారు ఎవరు?
ఉ : స్వప్న దేశస్థులు.

14. ప్రశ్న : స్వప్నదేశస్థులనగా? ఆ స్వప్నదేశము ఎక్కడనున్నది?
ఉ : నాలోనేయున్నది.

15. ప్రశ్న : నీవు ఎక్కడనున్నావు?
ఉ : నేనంతట నిండియున్నాను.

16. ప్రశ్న : నీకు రూపము కలదా?
ఉ : నాకు రూపము కలదు.

17. ప్రశ్న : నీ కులమేమి?
ఉ : నా కులము యెరుకకులము.

18. ప్రశ్న : నీవు యెరుక చెప్పెదవా?
ఉ : నేను యెరుక చెప్పుచునేయున్నాను.

19. ప్రశ్న : నీవు చెప్పిన యెరుక నిజమేనా?
ఉ : నిజము చెప్పితె నిజమే.

20. ప్రశ్న : అయితే అబద్ధముకూడ చెప్పెదవా?
ఉ : యేమి చెప్పుచునేయున్నాను.

21. ప్రశ్న : అబద్ధము యెందుకు చెప్పవలెను?
ఉ : నేను మంచిదాననని అనిపించుకొనుటకు అబద్ధము చెప్పు చున్నాను సుమా.

22. ప్రశ్న : అయితే నిజమునే చెప్పి మంచిదానవని అనిపించుకొనరాదా?
ఉ : నేను నిజము చెప్పితే యెవ్వరికిని తెలియనే తెలియదు.

23. ప్రశ్న : ఎందుచేత దెలియదు?
ఉ : మమత వదలనందుచేత.

24. ప్రశ్న : మమత వదలక తెలియకపోవడమేగాని, ఆ మమతను వదలితే తెలుసునా?
ఉ : తెలుసును. సందేహములేదు.

25. ప్రశ్న : నీకు మమత వదిలినదా?
ఉ : నాకు మమతెయే దేహమాయెను. దేహమున్నంత మట్టుకు

మమతగలదు. దేహము లేకపోతేగాని మమతలేకపోదు. **మమత** [**ATTACHMENT**] నాకు స్వభావమైయున్నది.

26. ప్రశ్న : ఈ మమత యేలాగున లేకపోవును?

ఉ : సద్గురూపదేశమువలన మమత లేకపోవును. మమత యీలాగున గూఢముగానున్నది.

## జై బోలో శ్రీ సద్గురు ప్రభు మహారాజుకి జై

# భగవద్గీత

శ్లో ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజ ।
అహంత్వాం సర్వపాపేభ్యో । మోక్షయిష్యామిమా శుచః ॥

**తాత్పర్యము** : – హే మనుష్యుడా! సమస్తమైన ధర్మాధర్మాలుగల యెరుకనే **“అహంకారాన్ని”** సమూలంగా ఆచార్యకటాక్షంచేత (గురువు చేత) – **"పరిత్యజ్య"** – పరిత్యాగం చెయ్యుమావొక్క అహంకారంలేని – **"మాం"** – నన్ను గురుమూలంగా – **"శరణం వ్రజ"** – **“నాకంటే అన్యులులేరని నమ్మటమే శరణుసుమా”** – అహంకారములేని నీను – త్వాకారమైన; చిద్రూపమైన నిన్ను విడిపిస్తాను –**"మా శుచః”** లేకపోతావు అని దుఃఖపడవద్దు సుమా!



# అచల బోధ సిద్ధాంతం

## మొదటి ఉపమానం

గు ॥ మంచిది నీకు ఆలాగ అయ్యి – పుట్టని చావనిది – సూర్యుడు వున్నాడో లేడో అని అనుమానం లేనట్టు వున్నది.

శి ॥ అదియేమి స్వామి? **"సాయంకాలానికి యేమిలేదు – యిది అచలం."**

## రెండవ ఉపమానము

గు ॥ చంద్రుడు వున్నాడో లేడో అని! అనుమానంలేనట్టు – రాకడ పోకడ లేనిది. వున్నది.

శి ॥ అదియేమి స్వామి? **"తెల్లవారీ యేమీలేదు – సర్వకాలం ఒక్కతీరే."**

## మూడవ ఉపమానము

గు ॥ భూమి ప్రత్యక్షంబుగా వున్నట్లు – మొదలుకొన లేనిది వున్నది.

శి ॥ ఈ భూమికి మొదలు – కొనవున్నది. తనకుతానే స్వతఃసిద్ధమైవున్న దానికి మొదలు యెవ్వరూ చూడలేదు – కొన యెవ్వరూ చూడలేదు – ఈ శరీరంవంటివే యివి అన్ని.

## నాల్గవ ఉపమానము

గు ॥ పుట్టనిది చావనిది – నిప్పు ప్రత్యక్షంబుగా వున్నట్లు వున్నది.

శి ॥ ఆలాగే వున్నది గాని – "కట్టె లేకున్నా – పిడక లేకున్నా యేమి లేదు. పుట్టని చావనిదానికి – రెండవది యేమి లేదు."

## ఐదవ ఉపమానము

గు ॥ పుట్టని చావనిది – శరీరం ప్రత్యక్షంబుగా వున్నట్లు వున్నది.

శి ॥ "శరీరం వున్నప్పుడూ వుండదు – శరీరం లేకుంటే లేకపోదు సర్వకాలం యేమిలేదు" – "మూలం లేని యీ గుర్తెరిగే శరీరం"

## ఆరవ ఉపమానము

గు ॥ పుట్టని చావనిది - సర్వకాలం ముందర పెద్ద గట్టు వున్నట్లు వున్నది.

శి ॥ "గట్టుయెక్కడవుంటే అక్కడనే వున్నది - పుట్టనిచావనిది." **"సకలదే శాలయందు - సకల కాలాలయందు వున్నది."**

## శ్రీ భగవద్గీత

శ్లో ॥ అవినాశితుతద్విద్ధి । యేన సర్వమిదంత తం ।
వినాశమవ్యయస్యాస్య । నకశ్చిత్కర్తు మరహతి ॥

<u>తాత్పర్యము</u> : - దేనిచేత ఈ సకల ప్రపంచమును వ్యాపింపబడినదో **"అట్టి కేవలాత్మ నాశము లేనిదని తెలియుము."** "నాశము లేని యీ కేవలాత్మకు నాశముగలించుట ఎవరికిని శక్యము గాదు (యీ శ్లోకము బ్రహ్మతత్వమును గూర్చినదని శంకరభాష్యము)."

## ఏడవ ఉపమానము

గు ॥ కనుక యీ పుట్టని చావనిదీ – పెద్ద చెట్టు వున్నట్లు వున్నది.

శి ॥ "చెట్టువంటిది కాదు – పుట్టనిచావనిది; గొడ్డండ్లచే
భేదింపబడదు; నిప్పు చేతకాలంది; నీళ్ళలో మునగనిది;
ఎండచేత ఎండనిది; గాలిచేత తోయబడనిది.

## శ్రీ భగవద్గీత

శ్లో ॥ నైనంచిన్దన్తి శస్త్రాణీ । నైనందహతి పావకః ।
నచైనం క్లేదయన్త్యేప । నశోషయతి మారుతః ॥

**తాత్పర్యము :** – యీ కేవలాత్మను ఆయుధములు నరుకజాలవు – అగ్నిదహింప జాలదు – నీళ్ళు తడుపజాలవు – వాయువు కదలింపదు – యెండింపజాలదు.

శ్లో ॥ అచ్ఛేద్యోయ మదాహ్యోయ । మక్లేద్యో శోష్య ఏవ చ ।
నిత్యః సర్వగతః స్థాణు । రచలోయం సనాతనః ॥

**తాత్పర్యము :** – ఈ కేవలాత్మ భేధింపనలవిగానిది; దహింపనలివిగానిది; దడుపనలి

విగానిది; యెండింపనలివిగానిది; నాశములేనిది; అంతట వ్యాపించి యుండునది; స్థిర రూపమగునది; చలించనిది; అనాదియైనది.

॥ సత్యమేవ జయతి నానృతమ్ ॥

యదా యదా హి ధర్మస్య । గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య । తదాత్మానం సృజామ్యహమ్ ॥

పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ । సమ్భవామి యుగే యుగే ॥

## జై బోలో శ్రీ సద్గురు ప్రభు మహారాజుకి జై

"జై శ్రీశ్రీశ్రీ సద్గురు వివేకానంద బంఢారు సుబ్బయ్యార్యులు ప్రభు మహారాజుకి జై "



ఓం
శ్రీ సద్గురవే నమః

## గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయము చేసిన గురువులు; గురు పుత్రులు; మరియు గురుభక్త జనులు:

### మహారాజ పోషకులు

శ్రీఅ॥ ప॥ అద్వయానంద వెంకటరమణార్య
యోగీంద్రుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ నిజ గురు గోప్యానంద
శ్రీనివాసార్యులు వీరి ధర్మపత్ని శ్రీమతి
రత్నమ్మ – అచల గురుపీఠ సేవా సమాఖ్య
రాష్ట్ర అధ్యక్షులు
కర్నాటక.

శ్రీ జగత్ గురు వివేకానంద బండారు
సుబ్బయ్యార్యుల, ప్రియ శిష్యులు



ద్వైతాద్వైత రహిత సిద్ధాంతం ।
పూర్ణబోధోపదేశికం । శ్రీ బోధానంద
సపార్ రామమోహనర్యం । సద్గురుభ్యో
నమో నమః । సతీమణి
శ్రీమతి సపార్ లక్ష్మిబాయి

శ్రీ జగత్ గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు



మహారాజ పోషకులు

శ్రీమతి అ॥ ప॥ జయలక్ష్మమ్మ

శ్రీమతి లతా .ఎమ్., శ్రీ ఆనంద.సి.,

శ్రీ చంద్రప్ప. జి.

శ్రీ అ॥ ప॥ అద్వయానంద వెంకట-రమణార్య యోగీంద్రుల ప్రియ శిష్యులు



రాజ పోషకులు

శ్రీ అ॥ ప॥ గురు శ్రీ సత్యానంద క్రిష్ణారెడ్డి –వీరి ధర్మపత్ని శ్రీమతి అంకమ్మగారు.

## రాజ పోషకులు

శ్రీ అ॥ ప॥ నిజగురు గోప్యానంద శ్రీనివాసార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ జ్ఞానానంద సంతోజియార్యులు, వీరి ధర్మపత్ని అంబూబాయి.



శ్రీ అ॥ ప॥ గుండపనేని ఎరుకలయ్య నాయుడు.

## శ్రీ అ॥ ప॥ నిజ గురు గోప్యానంద శ్రీనివాసార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ క్రిష్ణా రెడ్డి – వీరి ధర్మపత్ని
ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మ.



శ్రీ అ॥ ప॥ కె. చిన్నప్ప – వీరి
శ్రీమతి ఇంద్రాణి.



శ్రీ అ॥ ప॥ ఎస్. యల్లప్ప – వీరి ధర్మపత్ని
శ్రీమతి కనకమ్మ.



శ్రీ అ॥ ప॥ నారాయణప్ప – వీరి ధర్మపత్ని
శ్రీమతి పాపమ్మ.

శ్రీ అ॥ ప॥ గురు భోదానంద గొపాలార్యుల ప్రియ శిష్యులు

శ్రీ॥అ॥ప॥ గురు సమరసానంద వెంకటేశార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ గురు కృపానంద నరసింహయ్యార్యులు.



శ్రీ అ॥ ప॥ నిర్మలానంద రామయ్యార్యులు, వీరి ధర్మపత్ని శ్రీమతి గౌరమ్మ.

శ్రీ అ॥ ప॥ గురు బోధానంద గొపాలార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ సత్యానంద నంజాచారి - వీరి ధర్మపత్ని

శ్రీ అ॥ ప॥ గురు బోధానంద గోపాలార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ డి. ఎన్. ఆంజనేయప్ప.

శ్రీ అ॥ ప॥ నిర్మలానంద రామయ్యార్యుల ప్రియ శిష్యులు



శ్రీ అ॥ ప॥ శ్రీ నారాయణస్వామి – వీరి ధర్మపత్ని శ్రీమతి విజయ.

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి – శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య – అఖిల భారత అధ్యక్షులు, శ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు



శ్రీమతి వెంకటమ్మ, శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యగారి అక్కగారు.



శ్రీమతి గౌరమ్మ శ్రీ మంజునాథ్ మరియు కొడుకు కుమార్, కోడలు కు. ఎన్.వి. భాగ్యలక్ష్మి,

సభా సామ్రాట్ అచల బోధ వాచస్పతి - శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య - అఖిల భారత అధ్యక్షులు, శ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు



శ్రీ వెంకటేశ్ - వీరి ధర్మపత్ని
శ్రీమతి రూప.



శ్రీ లోకనాథ రెడ్డి - వీరి ధర్మపత్ని
శ్రీమతి మంగళ



శ్రీ నాగరాజు - వీరి ధర్మపత్ని
శ్రీమతి నాగరత్న.



శ్రీ నారాయణ స్వామి - వీరి ధర్మపత్ని
శ్రీమతి విజయలక్ష్మి.

ఓం

"శ్రీ సద్గురవే నమః"

## గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయము చేసిన గురువులు; గురు పుత్రులు; మరియు గురుభక్త జనులు:

### మహారాజ పోషకులు

1. అ॥ ప॥ అద్వయానంద వెంకటరమణార్య యోగీంద్రుల ప్రియ శిష్యులు శ్రీ అ॥ ప॥ నిజ గురు గోప్యానంద శ్రీనివాసార్యులు – వీరి ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారు – శ్రీ శివరామ దీక్షిత అచలగురు రాజయోగ సేవా సమాఖ్య, కర్నాటక రాష్ట్రాధ్యక్షులు, దొడ్డూరు, బంగారు పేట తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – C. No. 9343450024 – 5,012-00

2. శ్రీ జగత్ గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల, ప్రియ శిష్యులు – శ్రీ బోధానంద సవార్ రామమోహనార్యులు, వీరి సతీమణి శ్రీమతి సవార్ లక్ష్మిబాయి, పి.ఆర్.టి. స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్. – 5,012-00

3. శ్రీ సద్గురు వివేకానంద బండారు సుబ్బయ్యార్యుల ప్రియ శిష్యులు – శ్రీ అ॥ ప॥ చంద్రప్ప. జి., శ్రీమతి జయ లక్ష్మమ్మ, శ్రీ అ॥ ప॥ శ్రీ ఆనంద. సి., శ్రీమతి లతా. ఎమ్., నం. 391, హిరండహళ్ళి, విర్గోనగర పోస్ట్, బెంగళూరు పూర్వ తాల్లూక, బెంగళూరు – 560 049, కర్నాటక – 5,001-00

5. శ్రీమతి వెంకటమ్మ,
శ్రీ ఎన్.వి. వీరభద్రయ్యగారి అక్కగారు ,
నడవత్తి, బెం.గ్రా. జిల్లా – కర్నాటక – 10,012-00

6. శ్రీమతి గౌరమ్మ శ్రీ మంజునాథ్ మరియు
కుమారుడు కుమార్ – కోడలు ఎన్.వి. భాగ్యలక్ష్మి,
సొరక్కి, బెంగళూరు జిల్లా – కర్నాటక – 5,001-00

* * * * * * * * * * * *

ఓం

"శ్రీ సద్గురవే నమః"

## రాజ పోషకులు

1. శ్రీ సత్యానంద క్రిష్ణారెడ్డి స్వాముల వారు C/o శ్రీ శివరామదీక్షిత అచలగురు శ్రీ అద్వయానంద వెంకటరమణార్య యోగీంద్రుల ఆశ్రమము, సత్యం వీధి, మునేశ్వర బడావణ, మున్నేకోళాల, మారుతహళ్ళి పోస్ట్, బెంగళూరు – 560 037, కర్నాటక – 3,012-00

2. శ్రీ అ|| ప|| జ్ఞానానంద సంతోజీయార్యులు, శ్రీ శివరామ దీక్షిత అచల గురు రాజయోగ సేవా సమాఖ్య అనుబంధ పీఠము, శ్రీ నిజగురు గోప్యానంద శ్రీనివాసయార్యుల ఆశ్రమము, బందలూరు, చన్నసంద్రం పోస్ట్, వేపన పల్లే హోబిళి, క్రిష్ణగిరి తాల్లూక, తమిళనాడు – 3,012-00

3. శ్రీ అ|| ప|| గుండపనేని ఎరుకలయ్య నాయుడు, శ్రీ శివరామ దీక్షిత అచలగురు రాజయోగ సేవా సమాఖ్య అనుబంధ పీఠము, శ్రీ నిజగురు గోప్యానంద శ్రీనివాసయార్య ఆశ్రమము, సాదర మంగల, కాడుగోడి రోడ్, కృష్ణరాజపుర హోబళి, బెంగళూరు పూర్వ తాల్లూక, కర్నాటక ఫోన్.నం. 65630651 – 3,012-00

4. శ్రీ అ|| ప|| క్రిష్ణారెడ్డి, కావేరి లేఔట్, 10వ క్రాస్, తులసి థియేటర్ రోడ్, మల్టి ప్లస్ వెనక, బెంగళూరు – 560 037 – 3,012-00

5. శ్రీ అ||ప|| క.చిన్నప్ప, కావేరి లేఔట్, 1 క్రాస్, తులసి థియేటర్ మైన్ రోడ్, మారుతహళ్ళి, బెంగళూరు – 560 037, కర్నాటక – 3,012-00

6. శ్రీ అ॥ ప॥ ఎస్. యల్లప్ప, మారుతి నగర,
3rd క్రాస్, ః H.No. 1013, మారుతహళ్ళి పోస్ట్,
బెంగళూరు – 560037 – కర్నాటక – 3,012-00

7. శ్రీ అ॥ ప॥ నారాయణప్ప, అశ్వత్థ నగర, వర్తూరు
ముఖ్య రస్తే, H. No. 352, మారుత హళ్ళి పోస్ట్,
బెంగళూరు – 560 037 – కర్నాటక – 3,012-00

8. శ్రీ అ॥ ప॥ గురుకృపానంద నరసింహయ్యార్యులు, నం. 168,
13th మైన్ రోడ్, హెచ్.ఎ. ఎల్. 2nd స్టేజ్, ఇందిరా నగర,
బెంగళూరు –560 008, పోన్ నం. 25263465 – కర్నాటక – 3,001-00

9. శ్రీ అ॥ ప॥ సమరసానంద వెంకటేశార్యుల శిష్యులు శ్రీమతి
గౌరమ్మ శ్రీ నిర్మలానంద రామయ్యార్యులు, శెట్టుపల్లి, సేవా
సమాఖ్య అధ్యక్షులు, మాలూరు తాల్లూక, కోలార జిల్లా
కర్నాటక – 3,001-00

10. శ్రీ అ॥ ప॥ నిర్మలానంద రామాయ్యార్యుల ప్రియ శిష్యులు,
శ్రీ అ॥ ప॥ శ్రీమతి విజయ శ్రీ నారాయణస్వామి, బెంగళూరు,
కర్నాటక – 3,001-00

11. శ్రీ అ॥ ప॥ శ్రీమతి శ్రీ సత్యానంద నంజాచారి, చిక్క
కుంతూరు, మాలూరు తాల్లూక, కోలార జిల్లా – కర్నాటక – 3,001-00

12. శ్రీ అ॥ ప॥ డి. ఎస్. ఆంజనేయప్ప, దళసనూరు, శ్రీనివాస
పుర తాల్లూక, కోలార జిల్లా – కర్నాటక – 3,001-00

13. శ్రీమతి రూప శ్రీ వెంకటేశ్, నారాయణకెరె, హొసకోటె
తాలూకా, బెంగళూరు గ్రామాంతర జిల్లా, కర్నాటక – 3,001-00

14. శ్రీమతి మంగళ శ్రీ లోకనాథ రెడ్డి, నారాయణకెరె,
హొసకోటె తాలూకా, బెంగళూరు గ్రామాంతర జిల్లా, కర్నాటక– 3,001-00

15. శ్రీమతి నాగరత్న శ్రీ నాగరాజు, నారాయణకెరె, హొసకోటె
తాలూకా, బెంగళూరు గ్రామాంతర జిల్లా, కర్నాటక – 3,001-00

16. శ్రీమతి విజయలక్ష్మి శ్రీ నారాయణస్వామి,
అగర, బెంగళూరు – కర్నాటక – 3,001-00

17. శ్రీమతి శారదమ్మ శ్రీ మునిరాజు,
ఇచ్చంగూరు, బెంగళూరు, కర్నాటక – 3,001-00

## పోషకులు

1. శ్రీ అ॥ ప॥ జి. మునికృష్ణప్ప, హెడ్ మాస్టర్ వుడదేపల్లి,
మాలూరు తాలూకా, కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

2. శ్రీ అ॥ ప॥ వెంకటస్వామి, చెంబె – మాలూరు తాలూకా,
కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

3. శ్రీ అ॥ ప॥ వెంకటగిరియప్ప, మలియపన హళ్ళి,
మాలూరు తాలూకా, కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

4. శ్రీ అ॥ ప॥ ఈశ్వర రెడ్డి, బంగార పేట తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

5. శ్రీ అ॥ ప॥ చలపతి, ఎస్. కోటె, బంగార పేట తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

6. శ్రీ అ॥ ప॥ సత్యానంద రామరెడ్డి, ఎచ్. హొసకోట, మాలూరు తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 1,001-00

7. శ్రీ అ॥ ప॥ నంజుండార్యులు, బుసనపల్లి – శ్రీ శివరామ దీక్షిత అచలగురు రాజయోగ సేవా సమాఖ్య – కర్నాటక ఉపాధ్యక్షులు, కోలార జిల్లా, కర్నాటక. – 1,001-00

8. శ్రీ అ॥ ప॥ మునివెంకటప్ప, బంగార పేట తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 501-00

9. శ్రీ అ॥ ప॥ గిడ్డప్ప, మాలూరు తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 501-00

10. శ్రీ అ॥ ప॥ వెంకటమునియార్యులు, దేశహళ్ళి, బంగార పేట తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 501-00

11. శ్రీ అ॥ ప॥ పూజప్ప, టేకల్, మాలూరు తాల్లూక, కోలార జిల్లా, కర్నాటక – 501-00

12. శ్రీ అ॥ ప॥ రంగప్ప, కల్లహళ్ళి, మాలూరు తాల్లూకు, కోలార జిల్లా, కర్నాటక – 501-00

13. శ్రీ అ॥ ప॥ ంామయ్య్య, నడవాడ,
నల్లూరు జిల్లా - ఆంధ్ర ప్రదేశ్. - 512-00

14. శ్రీ అ॥ ప॥ బాలకృష్ణ శ్రీమతి సరోజమ్మ,
మారుత హళ్ళి, బెంగళూరు - కర్నాటక - 512-00

15. శ్రీ అ॥ ప॥ కృష్ణమూర్తి శ్రీమతి విజయలక్ష్మి,
సంజయ నగర, బెంగళూరు - కర్నాటక - 512-00

16. శ్రీ అ॥ ప॥ మునిరాజు శ్రీమతి శంకరమ్మ,
సెరిగ, సర్జాపుర హోబళి, కూగూరు పోస్ట్, ఆనేకల్
తాల్లూక, బెంగళూరు - కర్నాటక - 512-00

<u>ఈ ద్రవ్యమును భవిష్యత్తు గ్రంథములు ముద్రించుటకు మరియు అచల గురు సాంప్రదాయ సెవా సమాఖ్య కార్యక్రమములకు వినియోగింపబడును.</u>

************

ఓం

"శ్రీ సద్గురువే నమః"

## ఈ గ్రంథములు వలయువారు

1. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర – శ్రీ నిజగురు గోప్యానంద శ్రీనివాసార్యుల ఆశ్రమము, సాదరమంగల, కాడుగోడి రోడ్, కృష్ణరాజపుర పోబళి, బెంగళూరు పూర్వ తాల్లూకు, కర్నాటక.

2. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర - శ్రీ నిజగురు గోప్యానంద శ్రీనివాసార్యుల ఆశ్రమము – బందలూరు, చన్నసంద్ర పోస్ట్, వేపనపల్లి పోబళి, క్రిష్ణగిరి తాల్లూక, తమిళనాడు.

3. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర ఆశ్రమము – ముదిరెడ్డిపల్లి, హిందూపురం మండలం, అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

4. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర – శ్రీ నిర్మలానంద ఆశ్రమము, ఎన్. ఎస్. గేట్. చిక్కనపల్లి మండలం, అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

5. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర – శ్రీ భాగవత కృష్ణదేశికుల గురు మందిరం, కార్వాన్, విశ్వేశ్వర నగర్, హైదరాబాద్, ఆంధ్ర ప్రదేశ్.

6. శ్రీ శివరామ దీక్షిత అచల గురు పరంపర – శ్రీమత్పిల్లాన లక్ష్మణదేశిక అచల గురుమందిరం ఇ.నం. 11-1-134 To 140 సీతాఫల్ మండి, సికింద్రాబాద్ – 500 061, ఆంధ్ర ప్రదేశ్.

************